Reg. No. M. *Annual Subscription Re. 1-8-0*

SRI

# VAIDIKA DHARMA SAMVARDHANI

# శ్రీ వైదిక ధర్మ సంవర్ధని.

EDITED BY
ORUGANTI NEELAKANTHA SASTRI
SRI SADANAM, GUNTUR.

Vol. I. | JANUARY, 1935 | No. I.

SUPREME DICTATES :—

శ్రుతిః :—ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత॥
సత్యం వద ధర్మం చర స్వాధ్యాయాన్మాప్రమదః॥

స్మృతిః :—స్థాపయధ్వమిమం మార్గం ప్రయత్నేనాపి హేద్విజాః
స్థాపితే వైదికేమార్గే సకలం సుస్థితం భవేత్॥

*RATES OF SUBSCRIPTION*:

| | |
|---|---|
| Directors Rs. 10 per annum.<br>Patrons Rs. 5 per annum. | Subscribers Re. 1-8-0 per annum. |

N. B:—All subscriptions should be sent direct to the Editor per M. O. and no V. P. system is adopted.

Printed at the Andhra Grandhalaya Press, Bezwada and

శ్రీః

# వైదిక ధర్మ సంవర్ధని.



నారాయణసమారంభాం విద్యాశంకరమధ్యమామ్,
కల్యాణానందపర్యంతాం వందే గురుపరంపరామ్.

1. వైదికధర్మసంవర్ధని "వైదికధర్మానుయాయు లగు చాతుర్వర్ణ్యములవారలకు నుచితమగు క్రమమున శ్రుతిస్మృతి సదాచారప్రమాణసిద్ధమగు వైదికధర్మమును బ్రచారము చేయుటయే" ముఖ్యోద్దేశ్యముగాఁ గలిగియున్నది.

2. శ్రుతి యన సంహిత, బ్రాహ్మణము, ఉపనిషత్తులు నను మూఁడు భాగములతోఁ గూడిన ఋగ్యజుస్సామాథర్వణ వేదములు నాల్గును.

ఈ వేదములయొక్క యర్థమును గ్రహించుటయందు శ్రీవిద్యారణ్యులవారికిఁ బ్రాచీనులగు మహనీయులయొక్క వ్యాఖ్యానములును, శ్రీవిద్యారణ్యులవారి వ్యాఖ్యానమును సాధనముగా గ్రహింపఁబడును.

3. స్మృతి యనఁ బ్రధానములగు మను యాజ్ఞవల్క్య గౌతమ స్మృతులు, నాపస్తంబాది మహనీయులస్మృతులు నభిప్రేతములగుచున్నవి.

4. సదాచార మన నాసేతుశీతనగమధ్యవర్తియగు భారతభూమి యందుఁ దెలియవచ్చెడి యష్టాదశకులములందును శ్రుతిస్మృతుల కనుగుణముగ వ్యవహారమం దుండిన యాచరణవిశేష మని యభిప్రాయము.

5. శ్రుతిస్మృతులయొక్క యర్థమును విచారించుటయందుఁ బూర్వోత్తరమీమాంసాన్యాయము లుత్తమప్రమాణములుగా నంగీకరింపఁబడును.

6. ప్రస్థానత్రయ మను పేర నలరారుచున్న యీశాద్యుపనిషద్దశకమును శ్రీకృష్ణద్వైపాయనవేదవ్యాసభగవత్పాదప్రణీతమగు వేదాంతమీమాంసాదర్శనమును శ్రీకృష్ణార్జునసంవాదరూపమగు భగవద్గీతలును వైదికధర్మమునకుఁ బరమప్రమాణముగావున నీప్రస్థానత్రయముచే బోధింపఁబడుజ్ఞానమునకు విరుద్ధమగు నే యర్థము నించుకేనియుఁ బ్రమాణముగాఁ దలంపఁబడదు.

7. వైదికధర్మము కర్మనిష్ఠ యనియు, జ్ఞాననిష్ఠ యనియు రెండు విధముల నలరారుచు నధికారితారతమ్యముచే బ్రహ్మచర్యాద్యాశ్రమచతుష్టయముగా నలరారుచున్నది.

8. ఉపాసన యనునది కర్మనిష్ఠయందలి యుత్తమవిశేష మగుచు జ్ఞాననిష్ఠకుఁ దగునధికారము నొందించు నవాంతరసాధనముగా నెన్నఁబడి శుభాగమములయం దుపదేశింపఁబడినవిధమున గ్రహింపఁబడును.

133

శ్రీః

# వైదికధర్మసంవర్ధని.

సంపుటము 1 ]  జనవరి, 1935  [ సంచిక 1

## స్వవిషయము.

నారాయణసమారంభాం విద్యాశంకరమధ్యమామ్।
కల్యాణానందపర్యంతాం వందే గురుపరంపరామ్॥

"ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్య వరాన్నిబోధత!"

శ్రీమన్నారాయణుం డీ జగంబును సృజించి యద్దాని బరిపాలింప నిచ్ఛచేఁ దొలుత మరీచ్యాదిప్రజాపతులకు వేద విహితంబగు ప్రవృత్తిధర్మము నుపదేశించెను. ఆ తీరుననే సనకసనందనాదులకు వేదవిహితమగు నివృత్తిధర్మము నుపదేశించెను. నాఁటినుండి నేఁటివఱకు నీరెండుధర్మములును జగత్తుయొక్క స్థితికారణ మగుచు 'వైదికధర్మ' మనుపేర వన్నెకెక్కినవి. ప్రాణులకు నభ్యుదయనిఃశ్రేయసహేతు వగు నీ వైదికధర్మము శ్రేయోభిలాషులగు బ్రాహ్మణాదివర్ణముల వారిచేత, నాశ్రమస్థులచేత ననుష్ఠింపఁబడుచునే యున్నది. కాని దీర్ఘకాలవశమునఁ దాత్కాలికదేశకాలపరిస్థితులచేత

నీధర్మము బలువిధములగు పరివర్తనములఁ బొందుటయేగాక యనుష్ఠాతలయందు నర్థకామేచ్ఛ జనించుటచేఁ గ్రమక్రమముగా జ్ఞానవిజ్ఞానములు నశింప నధర్మముచే ధర్మ మావరింపఁబడి యధర్మ మభివృద్ధి నొందుచున్నది.

ఇది యటుండ, దేశకాలపరిస్థితులచేఁ బలువిధములగు మతములు క్రమక్రమముగా బయలువెడలి నేఁటికి వైదిక ధర్మమునకుఁ బ్రతిపక్షములుగ ననేకమతములు బయలు వెడలి వైదికధర్మమునకు గ్లానిని గల్గించుచున్నవి. ఏది యెట్లున్నను నొకింతకాలమునుండి ద్వైతవిశిష్టాద్వైతాద్వైతములనుపేర మూఁడుమతములును, వీనితోఁబాటితరమతములును సామరస్యమును జెందియుండ భారతజాతియందు మతవిద్వేషము లస్తమించి భారతభూమి యొకింత శాంతముగ నుండెడిది. ద్వైతవిశిష్టాద్వైతాదిమతములవార లన్ననో తమతమ సిద్ధాన్తములం దెట్టిభిన్నాభిప్రాయములను గలిగియున్నను బవిత్రమగు వర్ణాశ్రమధర్మమందుఁ బ్రమాణభావమును గల్గియే వర్తించుచున్నారు. ఒకవేళ వర్ణాశ్రమధర్మవిదూరులచే నెద్దియేని యొత్తిడి గలుగ, సర్వమతములవారు తమచేఁ బవిత్రముగాఁ దలంపఁబడు వర్ణాశ్రమధర్మసంరక్షణమునకై యన్యోన్యసాహాయ్యముచే మిత్రభావము నొంది వ్యవహరించుచున్నారు. ఇంతియ కాదు, వేదము ప్రమాణ మనియు వర్ణాశ్రమధర్మము పవిత్రమనియు విశ్వసించువార లందఱును, భిన్నసిద్ధాన్తములను దలపెట్టుచున్నను, సకలప్రదేశంబులందు సర్వసామాన్యముగ మిత్రభావముతోఁ జరించుచునేయున్నారు.

ఇది యిట్లుండ, సుమారు ఆరేడు వత్సరములక్రిందటి నుండియు భారతభూమియం దొకయపూర్వము బయలువెడలి నది. ఎట్లన, ద్వైతమతమునకు గురువులుగాఁ దలంపఁబడెడివార లలో నొకరగు 'ఉత్తరాదిమఠాధీశు' లనెడి, శ్రీ సత్యధ్యాన తీర్థులవారు శిష్యసంచారము చేయుటలో నొకింత యతిశయ మును గాంచి యద్దానిచే నొకింత యుద్రేకపూరితులై యనాద్య విచ్ఛిన్నసద్గురుపరంపరాక్రమమున శ్రీమన్నారాయణునితోఁ బ్రారంభమయి నేఁటివరకు నవిచ్ఛిన్నముగా వచ్చుచున్న వైదికసంప్రదాయమగు నద్వైతసంప్రదాయమును 'అవైదిక' మనియు, 'బౌద్ధ' మనియు దూరుచుండుటయేగాక తత్సంప్రదా యమున వన్నెకెక్కిన మహనీయులనుగూర్చి యనృతోక్తుల నశ్లీలోక్తుల నిచ్చవచ్చినటుల వ్రాసి పలువిధములగు మార్గ ములఁ బ్రకటించుచు దేశమునందు వైషమ్యములఁ బురికొల్పు చున్నారు. ఇట్టితరుణమునఁ బవిత్రతమంబగు వైదికధర్మము నీ సత్యధ్యానతీర్థులవారియొక్క దుర్నయమునుండి కాపాడు కొనవలసిన బాధ్యత యద్వైతసంప్రదాయమునకు జెందిన ప్రతిమానవుని దైయున్నదని వేఱ చెప్పనక్కఱలేదు. కావున మే మిట్టిదుర్నయమునుండి వైదికధర్మమును సంరక్షింపవలయు నని శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీవిద్యాశంకరపదమూలస్వదేశ ప్రకాశిత జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ మహంతాచార్య స్వాములవారిని మాకుఁ జేయూత నీయవలయునని ప్రార్థింప, శ్రీ వారు నారాయణస్మరణపూర్వకముగ మమ్ముల ననుగ్ర హింప శ్రీవారియనుగ్రహముచే నీ 'వైదికధర్మసంవర్ధని'

యను మాసపత్త్రికామూలమునఁ బవిత్రమగు వైదికధర్మము నాంధ్రలోకమున వ్యాపింపఁజేయ సమకట్టియున్నారము. ఈ సంవర్ధనీపత్త్రికయందు స్వమతస్థాపనాపురస్సరముగఁ బరమత నిరసనముగూడ దేశకాలపాత్త్రానుసారముగఁ జేయఁబడుచు న్నది. ప్రకృతమున శ్రీ సత్యధ్యానతీర్థులవారిదుర్నయముచే ధర్మానుయాయులందుఁ గలిగిన తాపము నుపశమింపఁజేయు టకుఁగాను "మధ్వమతభంజని" అను శీర్షికక్రింద నపూర్వము లగు వ్యాసములు, క్రమముగాఁ బ్రకటింపఁబడును. అందుఁ దొలివ్యాసము, "ద్వైతము మతమా?" అనునదియు నీ పత్త్రికయందుఁ జూడనగును.

ఇఁకఁ గ్రమముగ రాఁబోవువ్యాసములు:—

(2) పాంచరాత్రము ప్రమాణమా? (3) దాసవేషము (4) జగత్తు సత్యమా? (5) 'విశ్వం సత్యమ్' అననేమి? 6 ఆత్మ దృశ్యమా? (7) ఆగమము ప్రమాణమా? (8) విష్ణువునందే సర్వాగమములకుఁ దాత్పర్యమా? అనునవి. ఈమొదలుగాఁ గల విషయములు క్రమముగా నిందుఁ బ్రకటింపఁబడును.

స్వమతస్థాపనముతో సంబంధించిన విషయములు యథోచితముగఁ బ్రకటింపఁబడును.

ఇట్లు వైదికధర్మతత్త్వరత్త్వమున మాచేఁ బ్రారంభింపఁ బడిన యీయుద్యమమునకు స్వమతగౌరవమును గాపాడుకొనఁ దలఁచు పవిత్రజన్ములందఱును సర్వవిధములఁ దోడ్పడి వైహి

కాముష్మికనిఃశ్రేయసములఁ బొందుదురని తలంచుచున్నారము.

ఇందుఁ బ్రకటింపఁబడు వ్యాసము లద్వైతసంప్రదాయమునకుఁ జెందిన యుత్తమవిద్వాంసులనుండి స్వీకరింపఁబడి ప్రకటింపఁబడుచున్నవి. ఇందుఁ బ్రచురింపఁబడు వ్యాసములు మృదుమధురమగు శైలితో నొప్పుచు వైదికధర్మప్రబోధమే పరమతాత్పర్యముగాఁ గలిగియుండును.

కావున, నీయుద్యమమునందు విద్వాంసులు వ్యాసముల సంపుటచేతను, సంపన్నగృహస్థులు ద్రవ్యసాహాయ్యము చేయుటచేతను ధర్మానుయాయు లీపత్రికలఁ జదివి తద్ధర్మములఁ బ్రచారముచేయుటచేతను మాకు సర్వవిధములఁ దోడ్పడుదురుగాక!

"స్థాపయధ్వ మిమం మార్గం ప్రయత్నేనాపి హే ద్విజాః!
స్థాపితే వైదికే మార్గే సకలం సుస్థితం భవేత్."

శ్రీః.

# వైదికధర్మము.

ఆసేతుశీతనగవ్యాప్తంబగు వైదికకథ భరతఖండంబున సృష్ట్యాదినుండి నేఁటివఱకు నవిచ్ఛిన్నపరంపరాక్రమమునఁ జాతుర్వర్ణ్యవిభాగంబుచే నలరారుచున్న ప్రజాబాహుళ్యముయొక్క పవిత్రతమంబైన మతమునకు 'వైదికధర్మ'-మని పవిత్రమగు సార్థకనామము. వైదికధర్మ మన వేదముచే బోధింపఁబడు ధర్మమని యర్థము. శబ్దవ్యుత్పత్తి నాలోచింప నయ్యది 'దత్త ఇతి ధర్మః' 'ధ్రియత ఇతి ధర్మః' అని తెలియవచ్చుచున్నది.

ఇట్టి వ్యుత్పత్తి ననుసరించి బుధులు "ధారణా ద్ధర్మ మిత్యాహుః ధర్మో ధారయతి ప్రజాః" అని నిర్వచించియు న్నారు. ధర్మము ప్రజలను ధరించుచున్నదన, సర్వజనుల యొక్క శ్రేయోభివృద్ధికై ప్రవర్తించుచున్నదని యభిప్రాయము. ధర్మమువలనఁ బ్రజలు శ్రేయోఽభివృద్ధిఁ జెందు చుండుటచే నీధర్మశబ్దము భారతజాతీయమతమునకు సార్థక నామమై వరఁగుచున్నది. ధర్మలక్షణము మన్వాదులచే నిట్లు నిరూపింపఁబడుచున్నది.

"విద్వద్భిస్సేవిత స్సద్భిర్నిత్యమద్వేషరాగిభిః,
హృదయేనాభ్యనుజ్ఞాతో యో ధర్మ స్తంనిబోధత" (2-1)

అని.

వేదవేత్తలును ధార్మికులును రాగద్వేషశూన్యులును నగు మహాశయులచే శ్రేయస్సాధనముగఁ దలంపఁబడి యాచరింపఁబడునది ధర్మము. ఇట్టిధర్మము ప్రమాణగౌరవమునుబట్టి వైదికధర్మ మని చెప్పఁబడుచున్నది. భారతభూమియందు సృష్ట్యాదినుండి నేఁటివఱకును మత మీ ధర్మశబ్దముచేతనే సర్వసామాన్యముగ వ్యవహరింపఁబడుచున్నది. అందులకుఁ బెక్కు తార్కాణములు గలవు. శ్రుతి "ధర్మం చర" అని శాసించుచున్నది. గౌతమాదిస్మృతికర్తలుగూడ "వేదో ధర్మమూలమ్, అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః" అని ప్రతిజ్ఞ జేసియున్నారు. మీమాంసకాగ్రేసరుఁడగు జైమినిమహర్షి "అథాతో ధర్మజిజ్ఞాసా" అని స్మరించెను. ఇందుఁ బురాణములుగూడ —

ధర్మః శ్రేయ స్సముద్దిష్టం శ్రేయోఽభ్యుదయలక్షణమ్,
సతు పంచవిధః ప్రోక్తో వేదమూలస్సనాతనః.

అని నిర్వచించుచున్నవి.

ఇట్లు శ్రుతిస్మృతిపురాణేతిహాసములఁబట్టి భారతభూమియందు మతము 'వైదికధర్మ' మను నామముతో వ్యవహరింపఁబడుచు సార్థకతఁ జెందుచున్నటులఁ దేటతెల్లమగుచున్నది.

### హిందుమత మనుట పంగనామము.

వైదికధర్మమను సార్థకనామమునకు మాఱుగ 'హిందుమత'మను నామ మీ మతమునకుఁ గ్రైస్తవమతప్రవర్తకు

లచే నారోపింపఁబడి కాలక్రమమున నజ్ఞజనమధ్యమునఁ బుష్కలమగు ప్రచారమును గనుచున్నది. ఈనామ మెద్ది యేని యొకయర్థమును గల్గియుండినచో నొకింతయైన ప్రయోజనమును బడయవచ్చును. కాని, యట్లు కానిచో నిట్టి నామముచే నానందముఁ జెందుట యున్మత్తజనవిలసితం బగు. కావున నందలి దోషము నొకింత గుర్తెఱుంగుట యుచితము. మతములకు సార్థకములగు నామములు ముత్తెఱంగులఁ బఱగు చుండును. అందు గ్రంథనామముల ననుసరించుట మొదటి సరణి. ఇందులకు లక్ష్యములు–శ్రౌతము, స్మార్తము అనునవి.

సిద్ధాన్తనామముల ననుసరించుట రెండవసరణి. ఇందు లకు ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము, అనునవి లక్ష్య ములు.

మతప్రవర్తకులనామముల ననుసరించుట మూఁడవ సరణి. శాంకరరామానుజమాధ్వము లిందులకు లక్ష్యములు.

శైవము, వైష్ణవము, సౌరము నని దేవతానామముల ననుసరించుట నాలవసరణి యను శంక వాటిల్లునుగాని యయ్యవి సిద్ధాన్తనామములతరగతిలోఁ జేరుటచే మతనామంబులు ముత్తెఱంగు లగుటయె సమంజసము.

ఇఁక హిందుమతశబ్దము నొకింత విచారింతము. ఇచట 'హిందు' శబ్దము గ్రంథనామమా? లేక సిద్ధాన్తనామమా? లేక ప్రవర్తకనామమా? యని యోజించినచో నెద్దియుఁ గాక పంగనామ మగును. దానంజేసి యీశబ్ద మొకప్పుడు

బుద్ధిమంతులచే సాధింపఁబడినను నర్థసాధుత్వమును గనుట కల్లయె. వాస్తవముచే నీ హిందుమత మను నామ మొక పంగనామము (Nick name; misnomer). లోకములో నజ్ఞానముననో, యుపహాసముననో యొకని కొక కునామము నీయ నయ్యది కాలక్రమమునఁ బ్రచారమునకుఁ గడఁగి వాస్తవమును గప్పిపుచ్చునటుల నీపంగనామము ప్రచారమును గనుచున్నది. అట్టిప్రచార మనర్థహేతువు గావున నట్టిప్రచారమునకు నవకాశ మీయకుండ భారతీయు లెల్లరును వ్యవహరింతురుగాక!

శ్రీః

# వైదికధర్మప్రమాణము.

వైదికధర్మ మను నామము మతమునకుఁగల ప్రమాణ గౌరవమును గాపాడి ప్రమాణజ్ఞానము నెల్లప్పుడును బుద్ధికి గోచరింపఁజేయును. హిందుమత మనినచో నెట్టిజ్ఞానమును గలుగకపోవుట యటుండఁ గొంతకాలమునకుఁబ్రజలుప్రమాణజ్ఞానశూన్యులై భ్రంశముఁ జెందుటకు నించుకేనియు సందియ ముండదు. ఇట్టియుద్దేశ్యముతోడఁ క్రైస్తవమతప్రచారకులీనామము నారోపించి వ్యవహరించుచున్నటుల నూహింపనొప్పును. దానంజేసి, యించుమించుగ నట్టివ్యవహారమునకులోనైనవారలు ప్రమాణజ్ఞానశూన్యులై రనుటకు నించుకేనియు సందియము లేదు. నామగౌరవమును గ్రహింపఁ జేయుటకుఁబ్రమాణజ్ఞాన మవసరంబుగాన వైదికధర్మప్రమాణంబు నిరూపింపఁబడుచున్నది.

"వేదోఽఖిలో ధర్మమూలం స్మృతిశీలేచ తద్విదామ్
ఆచారశ్చైవ సాధూనా మాత్మన స్తుష్టి రేవచ. 2-6
శ్రుతిస్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రం తు వై స్మృతిః
తేసర్వార్థేష్వమీమాంస్యే తాభ్యాంధర్మోహినిర్బభౌ. 2-10
వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియ మాత్మనః
ఏతచ్చతుర్విధం ప్రాహు స్సాక్షా ద్ధర్మస్య లక్షణమ్. 2-12

అర్థకామేష్వసక్తానాం ధర్మజ్ఞానం విధీయతే
ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః 2-13
—మనుస్మృతి.

పై శ్లోకములయర్థము దిలకించిన నిఖిలవేదమును ధర్మమునకుఁ బ్రమాణమనియు నద్దానికిఁ దోడుగ వేదవిదులగు మన్వాదిమహానీయులయొక్క స్మృతిధర్మములును, బ్రహ్మణ్యతాదిరూపంబగు శీలంబును, ధార్మికులయాచారమును, దదనుగుణంబులగు వైకల్పికంబులందు స్వీయమనస్సమాధానమును, బరమప్రమాణంబు లని తెలియవచ్చెడిని. అందుఁ బరమప్రమాణము శ్రుతి. శ్రుతియన వేదమే. వేదము ననుసరించి యితరప్రమాణములకు నాధిక్యము గల్గుటంజేసి వేదమే పరమప్రమాణముగాఁ గలిగి యీధర్మము వ్యవహరింపఁబడుచున్నది. కావున వైదికధర్మ మనుశబ్దము సాభిప్రాయంబును సార్థకంబు నగు మతనామముగఁ బఱఁగుచున్నది. ఇట్టిధర్మజ్ఞానమువలని ప్రయోజనమును బడయఁగల యధికారమును గడపటిశ్లోకము నిరూపించుచున్నది. ఎట్లు లనిన నర్థకామములందు లిప్సలేనివారలకు ధర్మజ్ఞానము విధింపఁబడుచున్నదనుటచే నర్థకామములే పరమపురుషార్థములుగాఁ దలంచు చార్వాకసదృశుల కీ ధర్మము ప్రయోజనమును బోధింపక ధర్మమోక్షములే పరమపురుషార్థములుగాఁదలంచువారలకు మనోజ్ఞముగ నుండునని తేటతెల్ల మగుచున్నది.

ప్రకృతమునఁ దెలియవచ్చినదేమన: భారతజాతియొక్క మతము వైదికధర్మము; అద్దానివలనఁ బ్రయోజన మభ్యు

దయనిఃశ్రేయసములు; అందుల కధికారు లర్థకామలిప్సలేనిధర్మ మోక్షాసక్తులను ననుబంధత్రియము. దానంజేసి, ఋూమతము శాస్త్రయుక్త్యనుభవసిద్ధంబగు లక్షణముతో నొప్పుచున్న టులఁ దెలియనగును. ఇట్టి వైదికధర్మమునకుఁ బరమప్రమాణము (శ్రుతి) వేదమనియు, స్మృతులు, సదాచారము, స్వీయ తుష్టియుఁగూడఁ బ్రమాణంబు లనియును దెలియవచ్చెడిని. అట్టి ప్రమాణవిశేషస్వరూపంబు సక్రమంబుగ నిరూపింపఁ బడును.

శ్రీః

# మధ్వమత భంజని

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.
శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహమ్
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే.
కామేశ్వరీం పరా మీడే కాదిహాదిస్వరూపిణీమ్
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్.

## ద్వైతము మతమా?

ప్రకృతమున నాసేతుశీతనగమధ్యవర్తియగు భారతభూమియందు ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతమునను నామములతో మూఁడు మతములు సుప్రసిద్ధవ్యవహారమును గనుచున్న వెల్లరకును దెలిసినవిషయమే. కాని 'యీ మూఁడు నామములతో వాడఁబడుచున్న మతము లనునవి యెవ్వి? వానిస్వరూప మెయ్యది?' యను విశేషవిషయ మొకప్పుడు ప్రాజ్ఞులకుఁగూడఁ బలువిధములగు సందియములను గల్గించుచు నిర్ణయము నగమ్యముగాఁ జేయుచున్నది. ఇంతియ కాదు. ఎల్లరకు నెద్దియో యొకతీరునఁ గొన్ని నామములు మతనామములట్లు తెలియవచ్చుటయు నట్టినామములచే నెద్దియో

యొకటి శంకింపఁబడి యిచ్చవచ్చినట్లు ప్రసంగములఁ గావించుటయు సర్వజనసామాన్య మైయున్నది. ఏది యెట్లున్నను, బ్రకృతకాలమునఁ బ్రజలయందు మతభావములు క్షీణించుచు వ్యావహారికభావములు ప్రబలుటంజేసి మతములు నామమాత్రావశేషము లైయున్నవి. అట్లున్నను బ్రజలు మాత్రము మతద్వేషములతో నొప్పారక యొకింత సామరస్యముతో నెల్లెడల మెలఁగుచున్నారు.

ఇట్లుండ నొకింతకాలమునుండి మధ్వ సంప్రదాయమునకుఁ జెందిన శ్రీసత్యధ్యానతీర్థు లను నుత్తరాదిమఠాధీశులు భారతభూమియందు శిష్యసంచారమును జేయుచు 'నద్వైతమవైదికము, ప్రస్థానత్రయముచే సిద్ధించునది కాదు, ప్రస్థానత్రయ విరుద్ధము, బౌద్ధమతసదృశము; ద్వైతము వైదిక వైష్ణవ మనియు, నాస్తిక వైదిక మనియు, వైదిక మనియు' కృత్రిమోపన్యాసముల నలుపుచుఁ గృత్రిమపత్రికలను వెదఁజల్లుచుఁ బ్రజలలో నన్యోన్యవైషమ్యములను గలుగఁజేయుచుండుట సార్వజనీనమగు విషయమే.

ఇట్టివిషయమున నొకింత తీర్థులవా రతిశయముగఁ దలంచు ద్వైత మన నేమియో లోకమునకుఁ దెలియకుండుటంజేసి, యద్దానిస్థితిగతుల నొకింత లోకమునకు సువిదితముగాఁగ 'ద్వైత మన నేమి' యను నీవిషయమును జిజ్ఞాసువులయుపయోగమునకుఁ బ్రదర్శించుచున్నారము.

ద్వైతమనునపూర్వనామముచే నీభారతభూమియందొక మతము బయలువెడలుటకుఁ గారణము మధ్వరాయ లనుసుప్ర

సిద్ధవ్యవహారముగలిగిన ఆనందతీర్థు లనునొకపరివ్రాజకుఁడు. ఈ
మధ్వరాయుల జననకాలము క్రీ. శ. 1118 వ వత్సరమని నిశ్చ
యింపఁబడుచున్నది. దానంజేసి, యంతకుఁబూర్వ మీద్వైత
మను పేరు భారతభూమియందుఁ బ్రచారమును గనుటలేదని
నిశ్చయము. కాని, విశిష్టాద్వైత మను పేరు ప్రచారమునకుఁ బ్రా
రంభమయినది. ఏలయన, రామానుజులు పరమపదమును జేరిన
కాలము క్రీ. శ. 1132 వ వత్సరము. దానంజేసి విశిష్టాద్వైత
మను నామముఁగూడ క్రీ. శ. 1100 సంవత్సరములకుఁ బూర్వము
నిర్ణయమును గనియుండలేదని నిశ్చయింపనొప్పును. ఏది యెట్లు
న్నను విశిష్టాద్వైత ద్వైతము లనునామములు రెండును మత
నామములుగా భారతభూమియందుఁ బ్రసరించుట క్రీ. శ. 1100
ప్రారంభమున నని నిస్సందేహము. నాఁటంగోలె నేఁటివఱకు
నీ రెండునామములును గతానుగతికముగ "దయ్యాలమఱ్ఱి
చెట్టు" అనునట్లు పుష్కలప్రచారమును గనుచున్నవి. వాస్త
వముచే విశిష్టాద్వైతమన్నను, ద్వైతమన్నను నద్వైతిదృష్టికి
ద్వైతములే యగుచున్నవి. ఏలయన, విశిష్టాద్వైతిద్వైతులిద్దఱు
నద్వైత మయుక్తమని తమతమమతములఁ బ్రవర్తింపఁజేసిన
వారలే.

అద్వైత మనుచోఁ న + ద్వైత మనువిగ్రహము బఱఁగుచు
న్నది. ద్వైతమన భేదమని యర్థము. భేదమన్ననో సజాతీయ
మును, విజాతీయమును స్వగతము నని మూఁడువిధములు. ఇట్టి
మూఁడువిధములగు భేదములలో నెట్టిభేదముతోఁ గూడుకొనని
స్వరూపముతో నొప్పు పదార్థవిశేషమును జగత్కారణముగా

ప్రతిపాదించుమతమని యద్వైతశబ్దముచే సువ్యక్తమగునర్థము. అట్టిపదార్థమును వేదాంతము లను పేరఁ బఱగు నుపనిషత్తులు బ్రహ్మమని యుపదేశించుచున్నవనియు నట్టి బ్రహ్మము విజ్ఞానానందస్వరూప మనియు ముల్లోకములకును బోధింప శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసభగవానులు వేదాంతమీమాంస యనియు బ్రహ్మసూత్రము లనియు వ్యవహరింపఁబడుచున్న "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రమాదిగాఁ గలిగినట్టియు "అనావృత్తి శ్శబ్దా దనావృత్తి శ్శబ్దాత్" అను సూత్రమంతముగాఁ గలిగినట్టియు సూత్రనిచయమును రచియించిరి. ఈ గ్రంథరాజమును శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసభగవానులు లోకముల కనుగ్రహించుటకుఁబూర్వ మీ భారతభూమియందు వైదికము లనియు నవైదికము లనియు రెండువిధములగు తంత్రములు వెలువడియున్నవనియు, నందు వైదికతంత్రములు వైశేషికము, న్యాయము, సాంఖ్యము, యోగము, పూర్వమీమాంస, యను సుప్రసిద్ధనామములతో నలరారుచున్నవి. అవైదికతంత్రములన్ననో చార్వాకబౌద్ధజైనాది తంత్రము లనియు నిర్దేశింపఁబడుచున్నవి. ఆయాయితంత్రములచేఁ దెలియవచ్చెడి విశేషము లన్నియు సర్వవిధముల నిరసింపఁబడి యుపనిషదర్థము శ్రీకృష్ణద్వైపాయనులచేఁ బుష్కలముగ నిరసింపఁబడుటవలన నీ కృష్ణద్వైపాయనదర్శనముచే సువ్యక్తమగు తత్త్వ మాయాయితంత్రములకంటె నత్యంతవిలక్షణమగు నర్థముచే బోధింపఁబడుచుండుటంజేసి యా సాంఖ్యాదితంత్రముల నాశ్రయించినవారీ కృష్ణద్వైపాయనదర్శనము నద్వైతదర్శన మనియు,

నుపనిషద్దర్శన మనియు, వేదాంతదర్శన మనియుఁ జెప్పఁబడుచుఁ
డిమతము ముఖ్యగ్రంథములయందు గ్రహించుచున్నారు. దానం
జేసి యీ బ్రహ్మసూత్రము లుపనిషదర్థ మద్వైతమని బోధిం
చుటకు ననుగ్రహింపఁబడిన పవిత్రగ్రంథమని వైదికధర్మాను
యాయులందఱచే నంగీకరింపఁబడుచున్నది. ఈకృష్ణద్వైపాయన
దర్శనమును బూర్వపక్షకోటియందు గ్రహించుతంత్రవాదు
లందఱు సర్వసామాన్యముగ ద్వైతవాదు లను నామముచే
వ్యవహరింపఁబడుచున్నారు. ద్వైతమన భేదమని యర్థ మిది
వఱలో నిర్వచింపఁబడెనుగదా! ద్వైతు లన భేదవాదులని
యర్థము. దానింబట్టి, ద్వైతమన భేదవాదము- అనఁగా నద్వై
తమునకు భిన్నమగువాద మని యర్థము. అంతియే కాని,
ద్వైత మనునామ మొకమతవిశేషమునకుఁ బ్రత్యేకనామ
ముగా నలరారుటకుఁ దగుయోగ్యతను గల్గియుండలేదు. దానం
జేసి, ద్వైత మని యొకమతమును బ్రత్యేకముగా నూహిం
చుటకుఁగాని నిరూపించుటకుగాని చెప్పుకొనుటకుఁగాని సమం
జస మెంతమాత్రమునుగాదు. ఏలయన, భేదవాదము లన్నియు
నన ద్వైతము లన్నియు నొక్కతీరున నెందును దెలియరావు.

ఇఁక వైశేషికాదితంత్రముల నాశ్రయించినవార
లన్ననో తమతమద్వైతవాదములను దమయుక్తినైపుణ్య
మున కనుగుణముగ వ్యవస్థ చేసికొని స్వతంత్రతంత్రములను
బ్రాశ్రయించుచున్నారు. దానింబట్టి, యాయాయిద్వైతములకు
వైశేషికమని, న్యాయమని, సాంఖ్యమని, యోగమని, మీ
మాంస యనియుఁ జార్వాకము, బౌద్ధము, జైనము, క్రైస్తవము

మహమ్మదీయము నని పలువిధములఁ బరఁగుచున్నవి. కాని, ప్రత్యేకము ద్వైత మను నొకమతి మెచ్చటను జెప్పఁబడుట యనుచితమే యగుచున్నది.

అందుచేఁ గాఁబోలు, ఇదివరకుమధ్వసంప్రదాయమువా రందరును దమమతమును 'ద్వైతము ద్వైత'మని చెప్పుకొను చుండ నానామమును ద్రోసిపుచ్చి వైదికనైష్ఠనము, ఆస్తికవైదికము, వైదికము నని క్రొత్తపరువు లిడ మొదలిడిరి.

తీర్థుఁవారిస్థానమునుబట్టి తీర్థులవారు మధ్వరాయ సంప్రదాయమువా రనియు నట్టియభిమానముచేతనే యద్వైతమును దూషించుచున్నారనియు సర్వవిధముల సువ్యక్తము. కావునఁ దీర్థులవారిగురుమతమగు మధ్వరాయమతమెట్టిద్వైత మని యొకింత విమర్శింతుము.

మధ్వరాయలు స్వతంత్రముగాఁ దమమతమును లోకమునకు వెల్లడిచేయఁ బదిప్రకరణములను రచించియున్నట్లు సువిదితమే కదా! అయ్యవి యెవ్వి యన—1 ప్రమాణలక్షణము, 2 కథాలక్షణము, 3 ఉపాధిఖండనము, 4 మాయావాదఖండనము, 5 ప్రపంచమిథ్యాత్వానుమానఖండనము, 6 తత్త్వసంఖ్యానము, 7 తత్త్వవివేకము, 8 తత్త్వోద్యోతము, 9 కర్మనిర్ణయము, 10 విష్ణుతత్త్వవినిర్ణయము.

ఈపదిప్రకరణములసరణిఁ జూడ నీమధ్వద్వైతతత్త్వము సువ్యక్తమగును. ఈ పదిప్రకరణముల నామూలాగ్రముగ నొకింతశ్రద్ధతోఁ దిలకించిన నిందు మధ్వరాయలయొక్క ద్వైత

నిరూపణమటుండ, మధ్వరాయలచే నద్వైతమతముగాఁ దెలిసికొనఁబడిన విశేషమెద్దియో యొకతీరున నిరసింపఁబడె నని లోకమును భ్రమింపఁజేయఁ జిత్రించినచిత్రలేఖన మని ప్రాజ్ఞులు సుకరముగ గ్రహింపఁగలరు. మధ్వరాయలు గ్రహించినయద్వైతమంతయు నొక్కయర్ధశ్లోకములో నిమిడి యున్నది. అదెద్దియన—

"బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాఽపరః" అని.

ఈ యర్ధశ్లోకముతోఁబాటు నైష్కర్మ్య మను నొక మాట యద్వైతులు ప్రబలముగ వాడుదు రనికూడఁ దెలిసి యున్నట్లు స్పష్టముగఁ దెలియుచున్నది. ఈ యర్ధశ్లోకము నందు మొదటఁ దెలియవచ్చెడి 'బ్రహ్మ సత్యమ్' అనునాల్గక్షరములతోఁ గూడిన రెండుపదములనుమాత్రము సర్వవిధముల నిరీక్షింపఁజాలక యుపేక్షించి 'జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ నాఽపరః, నైష్కర్మ్యమ్' అను వాక్యములను మాత్రమే యద్వైతముగ గ్రహించి యావాక్యములో నొక్కొక్కదాని నెద్దియో యొకతీరున నిరసించి యొక్కొక్కతత్త్వము నుపదేశించుచున్నట్లు ప్రకరణములఁ జిత్రించియున్నారు. ఎట్లన?

1. జగత్తు మిథ్య యని చెప్పబడుచున్నది. అది యుక్తము గాదు. కనుక జగత్తు సత్యము.

2. జీవేశ్వరుల కభేదము చెప్పఁబడుచున్నది. అది యుక్తముగాదు. కావున జీవేశ్వరులకు భేదమునే గ్రహింప వలయును.

3. నైష్కర్మ్యము బోధింపఁబడుచున్నది. అయ్యది యుక్తముకాదు. కావునఁ గర్మ చేయవలయును.

4. బ్రహ్మము బోధింపఁబడుచున్నది. కావున నందఱును విష్ణువునే సేవింపవలయును.

ఇయ్యదియే మధ్వరాయలద్వైతము. ఇద్దానినే రాయలవారి శిష్యులగు తీర్థులవారు విష్ణుదాసాచార్యరూపమును దాల్చి సంయమనీపురం హైకోర్టు ప్లెయింటులో నాలవవిషయమున వైదికమతతత్త్వము లని యుపక్రమింపఁబడిన a, b, c, d అను నాల్గు విషయములనుగాఁ బ్రదర్శించియున్నారు. అవెవ్వియన—

"(a) బ్రాహ్మణాదివర్ణములు, బ్రహ్మచర్యాద్యాశ్రమములు, యజ్ఞాదిక్రియలు, దేవతలు, వేదములు, గంగాదితీర్థములు, స్వర్గాదిలోకములు, ఈలోకము ఇవి మొదలైన సమస్తజగత్తు నిజమైనది.

(b) విష్ణువు: సర్వోత్తముడు, సర్వజ్ఞుడు, సర్వకర్త, అనంతకల్యాణగుణపూర్ణుఁడు.

(c) పరమాత్మ: జీవునికంటె (వేరైనవాఁడు)భిన్నుఁడు.

(d) పరమాత్మ : సర్వోత్తముఁడు, సర్వకర్త. జీవునికంటె భిన్నుఁడను జ్ఞానమే మోక్షసాధనము."

మధ్వరాయలచేఁ బ్రదర్శింపఁబడినవిషయములుగాని తీర్థులవారిచేఁ బ్రదర్శింపఁబడినవిషయములుగాని వారికిని, గారిదానవర్గమునకును ద్వైతముగాఁ దోఁచినను, శ్రీకృష్ణ

ద్వైపాయనవేదవ్యాసమహర్షిప్రణీతమగు వేదాంతదర్శనమం దీవిషయ మించుకేనియు స్మరింపఁబడకపోవుటచేతను శ్రీకృష్ణ భగవానులచే నుపదేశింపఁబడిన భగవద్గీతయందుఁగూడ నించుకేనియు స్మరింపఁబడకపోవుటచేతను నియ్యవి యత్యంతము ప్రస్థానత్రయవిరుద్ధము లగుటంజేసి వీరిద్వైతమును వైదికవైష్ణవమని కాని ఆస్తికవైదిక మనికాని వైదికమనికాని యనుట కెంతమాత్రమును వీలులేదు. ఇఁక నేమనవలయును?

ఇతి నారాయణస్మృతిః

# BOOK POST

Reg. No. M.

*Annual Subscription Re. 1—8—0*

వైదిక ధర్మసంవర్ధని.

---

To

..............................................................................................................

..............................................................................................

.......................................................................

.....................................................

---

*From* **The Editor, Vaidika Dharma Samvardhani,**

Sree Sadanam, GUNTUR.

శ్రీః

# వైదిక ధర్మ సంవర్ధని.

సంపుటము 1 ] ఫిబ్రవరి, 1935 [ సంచిక 2

శ్రీః.

—♦ శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీవిద్యాశంకరం భజే ♦—

నారాయణసమారంభాం విద్యాశంకరమధ్యమామ్।
కల్యాణానందపర్యంతాం వందే గురుపరంపరామ్॥

## మధ్వమతభంజని

### ఉపన్యాస సారావళి.

శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ విద్యాశంకరపదమా౽౽వేశప్రకాశితజగద్గురు శ్రీకల్యాణానందభారతీమహాంతాచార్య స్వామిపాదులవారు ఉత్తరాదిమతస్థులగు శ్రీ సత్యధ్యానతీర్థుల వారిచే రచింపఁబడి, స. కృష్ణాచార్యులచే నాంధ్రీకరింపఁబడి మధ్వసిద్ధాన్తాభివృద్ధికారిణీ సభవారిచేఁ బ్రకటింపఁబడిన "సంయమనీపురం హైకోర్టు, సివిల్ కేసు" పై ఖండనముఁ గావించి, యందుఁ దీర్థులవారిచే వ్రాయఁబడిన విషయము లన్నియు

సత్యేతర ప్రసంగములని నిరూపించుచు నొక బహిరంగ శ్రీముఖ పత్రికను దీర్థులవారికి తే 25-11-34 న పంపించియున్నారు. అందు జగద్గురు శ్రీ కల్యాణానందభారతీమాంతాచార్యస్వామి పాదులవారు తీర్థులవారి నుద్దేశించి ప్రతిజ్ఞాపూర్వకముగఁ జేసిన యధిక్షేపసంగ్రహము :

"మీ మతమును, మీ వ్రాఁతల నీదిగువఁ జెప్పఁబడిన విధమున నధిక్షేపించుచున్నారము. కావున మీయొక్క మతమును నిలువఁబెట్టుకొను బాధ్యతను వహించి మీరు యథోచితవిధమునఁ బణనిర్ణయపురస్సరముగ నీ శ్రీముఖము నందుకొనిన పదునైదుదినములలో సంసిద్ధులు కాఁగలరని నమ్ముచున్నారము."

"తీర్థులవారిమతమును మే మధిక్షేపించుచున్నారము. కావునఁ దీర్థులవారిం దుదాహరించిన తమమతము నిం దుదాహరించిన ప్రమాణములమూలమున రుజువుచేసి లోకమును మెప్పింపవలయును. లేనిచో వీరిమతము లోకమునకు దూరమగును."

"తీర్థులవారి నుద్దేశించి శ్రీవిద్యాశంకరభగవత్పాదాచార్యానుగ్రహమున నీదిగువ ప్రతిజ్ఞను జేయుచున్నారము. ప్రతిజ్ఞాస్వరూప మెట్టి దనిన—

I. తీర్థులవారిచే స్వీయమతతత్త్వములుగ నెన్నఁబడిన-

"(a) బ్రాహ్మణాదివర్ణములు, బ్రహ్మచర్యాద్యాశ్రమములు, యజ్ఞాదిక్రియలు, దేవతలు, వేదములు, గంగాదితీర్థ

ములు, స్వర్గాదిపరలోకములు, ఈలోకము, ఇవి మొదలైన సమస్త జగత్తు నిజమైనది.

(b) విష్ణువు సర్వోత్తముడు, సర్వకర్త, సర్వజ్ఞుడు, అనంతకళ్యాణగుణపూర్ణుడు.

(c) పరమాత్మ, జీవునికంటె (వేరైనవాఁడు) భిన్నుఁడు.

(d) పరమాత్మ, సర్వోత్తముఁడు, సర్వకర్త, జీవునికంటె భిన్నుఁడనుజ్ఞానమే మోక్షసాధనము.'

అను నీనాల్గుతత్త్వములు స్వకపోలకల్పితములును నిరర్థకములును నిష్ప్రమాణకములును నగుటంజేసి శశవిషాణతుల్యంబులు కావున సర్వథా హేయంబులు.

2. వేదములు, వేదార్థనిర్ణాయకము లగు బ్రహ్మసూత్రములు, భగవద్గీతయుఁ, బై విషయముల నెంతమాత్రము బోధించియుండలేదు. ఇంతియకాదు; మతప్రవర్తకులుగాఁ బఱఁగిన రామానుజ మధ్వరాయ శ్రీకంఠ యామున యాదవప్రకాశ భాస్కరాదులలో నెవ్వరునుగూడ నీతీర్థులవారియొక్క పై నిరూపింపఁబడిన మతమును దమగ్రంథములయందుఁ జెప్పియుండలేదు. కావున నీతీర్థులవారిమతము వైదికమునుగాదు; అనాదికాలమునుండియును రాలేదు. ప్రకృతము ననీమతము విష్ణుదాసాచార్యరూపమును ధరించిన తీర్థులవారి ధ్యానమాత్రముచే బయలు వెడలిన పెడమతమే యగుచున్నది. కావున నిపుడే యీమతముయొక్క యుత్పత్తి యని తప్పక

యంగీకరింపవలయును. కావున నియ్యది ప్రాచీనమత మెంత మాత్రము గాదు.

**3.** ప్రైతత్త్వము సర్వవిధములఁ గ్రైస్తవ మహమ్మదీయ మతతత్త్వములతోఁ దుల్యమగుటంజేసి యీ తీర్థులవారిమతము ప్రచ్ఛన్న మహమ్మదీయ క్రైస్తవ మను నామముచేఁ గొనియాడఁబడుటకుఁ దగు యోగ్యతను గల్గియున్నది.

**4.** కావునఁ దీర్థులవారిమతము వైదికవైష్ణవ మని కాని, యాస్తికవైదికమని కాని, వైదికమని కాని చెప్పుట కెంతమాత్రము వీలులేదు.

ఇట్టియధిక్షేపములను సర్వవిధముల నిర్వహించుటకుఁ గాను యథోచితమగు సభాస్థలినిఁ దీర్థులవారి కభిమానమగు సమయమును నిర్ణయించినచో మేము సర్వవిధముల సంసిద్ధులుగ నున్నారము.

కావునఁ దీర్థులవారు మా యధిక్షేపములనుండి స్వమతమును రక్షించుకొన నచిరకాలములో సంసిద్ధులయ్యెదరని తలంచుచున్నారము. అట్టిసంసిద్ధిని దీర్థులవారి శ్రీముఖము సందుకొనిన పదునైదుదినములలో యథోచితవిధినిఁ దెలియఁబరచి యందులకుఁ దగుప్రయత్నములకు వెనుదీయరని నమ్ముచున్నాము."

ఇట్టిప్రతిజ్ఞతోఁ గూడిన తే 26-11-34 సం॥గల బహిరంగ శ్రీముఖపత్రికను దీర్థులవారికిఁ బంప సందులకుఁ దీర్థులవారు తమ దివాన్ పాండురంగి జయాచార్యులుగారిచే 4-12-34 వ తేదీని వ్రాయించిన ప్రత్యుత్తరవిశేషము:

"తమకోరిక ననుసరించి వేదాంతవిచారణ "సివిల్ కేసు" పుస్తకములలో నిరూపించిన ప్రకారముగా నద్వైత మతము అవైదికము, ప్రస్థానత్రయముచే సిద్ధించునది కాదు; ప్రత్యుత, ప్రస్థానత్రయవిరుద్ధము అనునది సభయందు స్థాపించుటకు మా శ్రీ స్వాములవారు సంసిద్ధులై యున్నారు. ఆవిషయమై తిరుపతిసమీపమున చిరుతానూరులో 20-12-34 తేదీ మొదలుకొని వాదము ముగియునంతవరకు సభ జరుపుటకు నిశ్చయింపబడినది." అని యున్నది.

పిమ్మట వైదికధర్మసంవర్ధనీసభవారు 7-12-34 వ తేదీని వ్రాసి పంపించిన బహిరంగలేఖ విశేషములు:

"సకలమతావతంసముగఁ బరిగణింపఁబడుచున్న యద్వైతమత మవైదిక మని, యద్వైతప్రవర్తకుల నిందాపురస్సరముగఁ జేయఁబడుచున్న దూషణమును స్వమతస్థాపనాపురస్సరముగ స్థిరపరచుకొనవలయు బాధ్యత శ్రీమత్సత్యధ్యానతీర్థులవారియందే సర్వవిధముల నున్నది. అట్టి వాదమునఁ బాల్గొనుటకు జగద్గురు శ్రీకల్యాణానందభారతీమాంతాచార్యస్వామిపాదులవారెల్లప్పుడును సంసిద్ధులే.

"మీరు తెలియఁజేసినప్రత్యుత్తరమునుబట్టి యద్వైతదూషణమే యీ సభయొక్క ముఖ్యోద్దేశముగాఁ గన్పట్టుచున్నది. కాని యీ సభ తీర్థులవారిస్వమతస్థాపనకొఱకుద్దేశింపఁబడినట్లు లేదు. అంతియకాదు; సభానియమములను గాని, తత్త్వనిశ్చయకారుల నెన్నుకొనుమార్గమునుగాని మీరు తెలియఁజేసియుండ లేదు.

"కావునఁ దీర్థులవారియభిమతమున నద్వైత మెద్దిరోతా యయ్యది స్పష్టముగ నిరూపించి, యయ్యది ప్రస్థానత్రయవిరుద్ధ మెట్లగునో యద్దానిని ముందుగా నిరూపింపవలయును.

"అంతియకాదు; తీర్థులవారు సంయమనీపురం హైకోర్టు ప్లైంటులో విష్ణుదాసముఖమున వెలిఁబుచ్చిన ద్వైతమతము ప్రస్థానత్రియసమ్మతమని సిద్ధాన్తము చేయవలయును.

"ఇట్టిరెండుకార్యములను దీర్థులవారు చేయఁదలఁచి నచోఁ దీర్థులవారు నిర్ణయించినపణమునే యంగీకరించి సభ యందుఁ దీర్థులవారి నెదుర్కొనుటకు జగద్గురు శ్రీకల్యాణా నంద భారతీమాంతాచార్యస్వామిపాదులవారి కెట్టి యభ్యంత రమునుగూడ లేదు." అని యున్నవి.

పై బహిరంగలేఖకు 14-12-1934 తేదీగల పాండు రంగి జయాచార్యులుగారి ప్రత్యుత్తరవిశేషము:

"శ్రీ మధ్వాచార్యులవారిగ్రంథముల ననుసరించి విష్ణు దాసాచార్యులు చెప్పిన ద్వైతమతమే వైదిక మనియు, వేదాంతవిచారణ సివిల్ కేసు పుస్తకములలో సవిస్తరముగను సశాస్త్రీయముగను నిరూపింపబడియేయున్నది.

కనుక తిరిగియు దానినే సమర్థించుకొను బాధ్యత ప్రథ మమున నేవిధముగను మా శ్రీస్వాములవారియం దుండజాలదు. అద్దానిని 'సత్యేతరప్రసంగములు' అని పూర్వపక్షులు సభా ముఖమునందు శాస్త్రీయముగా ఖండించినచో నప్పుడు మా త్రమే తమ పుస్తకములోని విషయములను సమర్థించుకొను

బాధ్యత మా శ్రీస్వాములవారియం దుండును. అట్టి నిర్వాహణమునకు మా శ్రీస్వాములవా రెప్పటికప్పుడే యెచ్చటనైనను సంసిద్ధులుగ నుందురు.

ప్రస్థాన త్రయాధారముచేత చెప్పఁదగినభారము శ్రీ కల్యాణానంద భారతీస్వాములవారి కేర్పడినది గనుక ఆవిషయమునం దుభయసమ్మతులైన మధ్యస్థులను, దత్త్వనిర్ణయకారులను, మరియు సభాకాలమును, దేశమును, బణమును యావత్తును శ్రీకల్యాణానంద భారతీస్వాములే యేర్పరుపవలసినదిగా నున్నది.

పైచెప్పినప్రకారము వ్యవస్థ చేయక యథాపూర్వముగనే పత్రికాలేఖనలతో కాలయాపనము చేయనెంచినచోనిఁక మే మిట్టిప్రతిలేఖలకై కాలమును వ్యయపరచము." అని.

పై బహిరంగప్రత్యుత్తరమునకు వైదికధర్మసంవర్ధనీ సభవారు 20-12-34 తేదిని వ్రాయించి పంపించిన బహిరంగ ప్రత్యుత్తరముయొక్క యుపసంహార మిట్లున్నది:

"అయినను ఉభయసమ్మతులైన మధ్యవర్తులను దత్త్వ నిర్ణయకారులను, మఱియు సభాకాలమును, దేశమును, బణమును మా శ్రీస్వామిపాదులవారినే యేర్పాటుచేయవలయునని మీరు కోరియున్నారు. కావునఁ దదనుసారముగ గుంటూరుపట్టణమును సభాస్థలిగ నిర్ణయించి విష్ణుదాసమతమును సప్రమాణముగ శ్రీసత్యధ్యానతీర్థులవారు స్థాపించుటకు శ్రీకల్యాణానందభారతీమాంతాచార్యస్వామిపాదులవారాహ్వానము చేయుచున్నారు. ఇందులకు మీ రంగీకరించిన

యెడల నితరవిషయము లేర్పాటుచేయఁబడును. మీ ప్రత్యుత్తర మందలి యితరవిషయములు తిరిగి ప్రస్తావయోగ్యములుగాఁ గన్పడకపోవుటచే నవ్వానిని మేము విచారింపఁదలంచలేదు.

దీనికి మీరు సదుత్తర మీయక పత్రికాలేఖనముతోఁ గాలక్షేపము చేయఁదలంచినచో మేముకూడ నిఁకమీఁద ప్రత్యుత్తర మీయఁదలంపలేదు. విష్ణుదాసమతమును స్థాపించుకొనుటకు మీరు సంసిద్ధులు కారనియు మేము నిశ్చయింపగలము.'' అని.

పై బహిరంగప్రత్యుత్తరమునకు నెట్టిప్రత్యుత్తరము నీయక యుత్తరాదిమఠస్థులగు శ్రీసత్యధ్యానతీర్థులవారు సర్వవిధముల పుష్కలమగు మౌనముద్రను ధరించియున్నారు.

దానంజేసి, తీర్థులవారు తమ దగు విష్ణుదాసమతమును సమర్థించుకొనుటకు నించుకేనియుఁ దలపెట్టలేదని సర్వజనవిదిత మగుచున్నది. కాని యంతటితో నుపేక్షించుట యుచితము కాదని యెంచి జగద్గురు శ్రీకల్యాణానంద భారతీమహాంతాచార్యస్వామిపాదులవారు లోకసంగ్రహమునకై తే **15-1-35** మొదలు తే **3-2-35**వఱకు వైదికధర్మప్రదర్శన పురస్సరముగ మధ్వమతఖండనము శ్రుతియుక్త్యనుభవములచే ఖండించుచు మహోపన్యాసములఁ గావించియున్నారు. అట్టిమహోపన్యాసములయొక్క సార మీ దిగువఁ బొందుపఱచుచున్నారము.

శ్రీః.

1. ఉపన్యాసము.........1. బ్రహ్మసూత్రములు.

వేదములయొక్క యర్థనిర్ణయము వేదాంతములయందుఁ బ్రదర్శింపఁబడియున్నది. వేదాంతముల యర్థనిర్ణయమునకై బ్రహ్మసూత్రములు (శ్రీ) కృష్ణద్వైపాయన వేదవ్యాసభగవానులచే రచింపఁబడినవి. కావున నీ బ్రహ్మసూత్రములకు వేదాంతమీమాంస యని శిష్టవ్యవహారము. దానంజేసి, యీ సూత్రములకు మూలము వేదాంతము లనెడిపేరుతో నలరారు నుపనిషత్తులు. అందు ముఖ్యముగ ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండ, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకము లనెడి పది యుపనిషత్తులు ప్రధానముగఁ జేకొనఁబడి యీసూత్రములు రచింపఁబడియున్నవి. కావున నీ సూత్రములచే వేదాంతవాక్యములే యుదాహరింపఁబడి యర్థము నిర్ణయింపఁబడవలెనని శిష్టసమ్మతి.

ఇఁక మధ్వ యన్ననో "తదర్థనిర్ణయాయ బ్రహ్మసూత్రాణి చకార" వేదార్థమును నిర్ణయించుటకు వేదవ్యాసభగవాను లీ బ్రహ్మసూత్రములను రచించె ననియు నిర్వచించి యున్నారు. కాని సూత్రార్థమును బ్రతిపాదించుటలో నసంబద్ధము లగుశ్రుతివాక్యములను సామాన్యముగను, పురాణవాక్యములను మెండుగను నుదాహరించి యపార్థకల్పనమును జేసియున్నారు.

బ్రహ్మసూత్రమునందు మొదటియైదధికరణములచే నిర్వచింపఁబడిన విషయమే యుత్తరగ్రంథమంతటిచేతను నిరూ

పింపఁబడుచున్న దని మధ్వయాశయము. కావున నీదైదధి కరణములవిమర్శచేఁ దత్త్వము సువ్యక్త మగును.

2. ఉపన్యాసము.........2. జిజ్ఞాసాధికరణము.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రమునకుఁ దైత్తిరీయోపనిషదంతర్గత మగు భృగువల్లియందలి "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" అను ననువాదములతోఁ గూడిన 'తద్వి జిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ' అనువాక్యము విషయవాక్యము. "బ్రహ్మ దాప్నోతి పరం" "బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి" "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" అను శ్రుతులచే బ్రహ్మజ్ఞానము పరమ పురుషార్థసాధన మని యుపదేశింపఁబడుటవలన ముముక్షువు బ్రహ్మమును జిజ్ఞాసచేయవలయును - అనఁగా శ్రోత్రియుఁ డగు బ్రహ్మనిష్ఠునివలన వేదాన్తవాక్యములయొక్క యర్థము నుపదేశము నొందవలయునని శిష్టులయభిప్రాయము. మధ్వయన్ననో "యతో నారాయణప్రసాదమృతే న మోక్షః, న చ జ్ఞానం వినాఽత్యర్థప్రసాదః, అతో బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా" అని నిర్వచించెను. అనఁగా నారాయణుని ప్రసాదము లేనిదే మోక్షము కలుగదనియు, జ్ఞానములేక యత్యర్థప్రసాదము కలుగదనియుఁ గావున బ్రహ్మజిజ్ఞాస చేయవలయు నని భావము.

ఇంతియకాదు; "బ్రహ్మశబ్దశ్చ విష్ణావేవ" అనఁగా బ్రహ్మశబ్దము విష్ణుపరమే. ఏలనన—"యమంతస్సముద్రే కవయో వయన్తి, యదక్షరే పరమే ప్రజాః, యతః ప్రసూతా జగతః ప్రసూతీ, తోయేన జీవాన్వ్యససర్జ భూమ్యామ్" ఇత్యు

క్త్వా "తదేవ ర్తం తదు సత్యమాహు స్తదేవ సత్యం పరమం కవీనా"మితిహి శ్రుతిః, తన్నో విష్ణు రితివచనాద్విష్ణు రేవహి తత్రోచ్యతే" అని యొకశ్రుతి నుదాహరించియున్నారు. ఇయ్యది యసంబద్ధము నప్రకృతప్రశంసయును. ఏలయన, 'జన్మాద్యస్య యతః' అను రెండవసూత్రముచే సూత్రకారు లే జిజ్ఞాస్యమని యా సూత్రముచేఁ బ్రతిజ్ఞచేయఁబడిన బ్రహ్మలక్షణమును బ్రతిపాదించుచుండ నిచట బ్రహ్మశబ్దము విష్ణుబోధకమని చెప్పుట సాహసమగు నపార్థకల్పనము.

### 3. ఉపన్యాసము......3. జన్మాద్యధికరణము.

"జన్మాద్యస్య,యతః" అను సూత్రమునందు 'తత్, బ్రహ్మ' అను పదముల నధ్యాహారము చేసినచో నీ సూత్రము బ్రహ్మముయొక్క లక్షణప్రమాణములను బోధించుచున్నదని శిష్టసంమతి. ఈ సూత్రముచే సూచింపఁబడిన విషయవాక్య మన్ననో "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, ఆనందేన జాతాని జీవంతి, ఆనందం ప్రయంత్యభిసంవిశంతి" అను నిర్ణయవాక్య మంతముగాఁ గల్గి "యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయ న్త్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ" అనునుపదేశవాక్య ముపక్రమవాక్యముగాఁగల్గిన పై భృగువల్లియందలి ప్రకరణమంతయు నని శిష్టసంమతి.

మధ్వయన్ననో "ఉత్పత్తిస్థితిసంహారానియతిజ్ఞానమావృతిః। బంధమోక్షౌచ పురుషాద్యస్మాత్సహరి రేకరాట్" అను స్కాందవచనమును బ్రధానముగా గ్రహించి "యతో వా

ఇమాని...తద్బ్రహ్మేతి" అను వాక్యమునుమాత్రమే గౌణముగ విషయవాక్యముగా నుదాహరించియున్నారు.

4. ఉపన్యాసము......4. భృగువల్లి.

పై రెండుసూత్రములును బ్రహ్మసూత్రములలో నగ్రగణ్యములై బ్రహ్మసూత్రార్థమునంతను సూచించుచున్నవి. ఇట్టి రెండుసూత్రములును భృగువల్లి యనెడి తైత్తిరీయోపనిషత్ప్రకరణమే యాధారముగాఁ గల్గి స్మరింపఁబడుటంజేసి యీ భృగువల్ల్యర్థమే సకలవేదాంతసారభూత మనియుఁ దదనుగుణముగనే సకలవేదవేదాంతములయొక్క యర్థమును గ్రహింపవలయు ననియు నద్దానికి విరుద్ధమగు నర్థమును సర్వవిధములఁ ద్రోసిపుచ్చవలయుననియు శ్రీకృష్ణద్వైపాయనవేదవ్యాసభగవానులయాశయ మని శిష్టసమ్మతి.

ఇఁక మధ్వయభిప్రాయమన్ననో పైస్కాందపురాణాంతర్గతశ్లోకముచే సకలవేదవేదాంతములును దుడువవలయు నని.

5. ఉపన్యాసము...5. శాస్త్రయోనిత్వాధికరణము.

"శాస్త్రయోనిత్వాత్" అను ఈ సూత్రము తంత్రముచే నుచ్చరింపఁబడుటంజేసి యీసూత్రమునకు బ్రహ్మలక్షణపరముగను బ్రహ్మప్రమాణపరముగను రెండువిధములగు వ్యుత్పత్తిభేదముచే నర్థమును గ్రహించుట శిష్టసమ్మతి.

లక్షణపరముగ సూత్రార్థమును గ్రహించినచో బృహదారణ్యకమునందలి మైత్రేయీబ్రాహ్మణ మీసూత్రము

నకు విషయ మగుచున్నది. ఇంతియకాదు; మైత్రేయీబ్రాహ్మణమునందు నాత్మకు లక్షణముగాఁ జెప్పఁబడిన శాస్త్రయోనిత్వముఁగూడ బ్రహ్మమునకుఁగూడ లక్షణముగా సూత్రకారులచే స్మరింపఁబడుటంజేసి బ్రహ్మాత్మల కైక్యము-అనఁగా నభేదము సూత్రకారులయొక్క పరమాశయ మని సువ్యక్త మగుచున్నది.

ఇఁకఁ బ్రమాణపరముగ నీ సూత్రమునకు నర్థమును గ్రహించునపుడు "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" అను శాకల్యబ్రాహ్మణము విషయవాక్యమగుచున్నది. ఈబ్రహ్మసూత్రములచే జిజ్ఞాస్య మని ప్రతిజ్ఞ చేయఁబడిన బ్రహ్మము వనిషదేకవేద్య మన వేదాంతైకవేద్య మని తెలియవచ్చుటం జేసి యుపనిషదితరవాక్యములు బ్రహ్మమునుగూర్చి విచారణీయములు కావని తెలియవచ్చుచున్నది.

ఇఁక మధ్వయన్ననో లక్షణపరమగు వ్యుత్పత్తిని దోసి పుచ్చి "శాస్త్రం—యోనిః = ప్రమాణమస్యేతి= శాస్త్రయోనిః" అని ప్రమాణపరముగ మాత్రమే యర్థమును గ్రహించి స్వాభిమతమగు శాస్త్రమును—

"ఋగ్యజుస్సామాథర్వాశ్చ భారతం పంచరాత్రకం,
మూలరామాయణం చైవ శాస్త్రమి త్యభిధీయతే.
యచ్చానుకూలమేతస్య తచ్చశాస్త్రం ప్రకీర్తితమ్,
అతోఽన్యో గ్రంథవిస్తారో నైవశాస్త్రం కువర్త్మతత్."

"సాంఖ్యం యోగః పాశుపతం వేదారణ్యకమేవచే" త్యారభ్య వేదపంచరాత్రయో రైక్యాభిప్రాయేణ పంచరాత్రస్యైవ ప్రామాణ్యముక్తమ్" అని నిర్వచించియున్నారు. దీనినిబట్టి పంచరాత్ర మనుగ్రంథ మొకటియే వేదార్థబోధకమనియు, నద్దానినిమాత్రమే పరమప్రమాణముగఁ జేకొనవలయు ననియు నిర్వచించుచున్నట్లు దెలియవచ్చుచున్నది. పంచరాత్రమన్ననో వేదబాహ్యమగు తంత్రమని శిష్టసమ్మతి. ఏలయన నందు విధింపఁబడిన తప్తశంఖచక్రాద్యంకనము శ్రుతిస్మృతివిరుద్ధ మగుటంజేసి యవైదికమును, సదాచారసంపత్తికలవారలకు హేయము నని.

6. ఉపన్యాసము......6. సమన్వయాధికరణము.

పై మూఁడుసూత్రములచే సూచింపఁబడిన యుపనిషత్ప్రకరణములవలనఁ దెలియవచ్చెడి పరమతాత్పర్యమే సకలవేదాంతములయొక్క పరమతాత్పర్య మనియు, దానంజేసి సకలవేదములయొక్క పరమతాత్పర్య మనియు "తత్తు సమన్వయాత్" అను సూత్రముచే సకలపూర్వపక్షనిరసనపురస్సరముగ శ్రీకృష్ణద్వైపాయనవేదవ్యాసభగవానులచే మహాప్రతిజ్ఞ యొకటి గావింపఁబడుచున్నదని శిష్టసంమతి.

మధ్వకూడ నిట్టిశిష్టసంమతి ననుసరించియే పైమూఁడధికరణములయభిప్రాయమందును ప్రామాణ్యమును గలిగియున్నట్లు "ఉపక్రమాదితాత్పర్యలింగై స్సమ్యఙ్నిరూప్యమాణే తదేవ శాస్త్రగమ్యం" అని నిర్వచించుచున్నారు. కాని యీసూత్రమందలి తుశబ్ద మశేషపూర్వపక్షనిరాససూచక

మని నిర్వచించియుండలేదు. ఇంతియకాదు; అశేషపూర్వ
పక్షోపలక్షకముగా నలరారుచున్న యుత్తరాధికరణమగు
నీక్షత్యధికరణమునకు శిష్టపరిగృహీతార్థమును ద్రోసిపుచ్చి
యపార్థమును గల్పించెను. ఇట్టి యపార్థకల్పనము సర్వ
తంత్రవిరుద్ధము.

7. ఉపన్యాసము.........7. ఈక్షత్యధికరణము.

ఈ యధికరణమునందు, "ఈక్షతే ర్నాశబ్దమ్" "గౌణ
శ్చే న్నాత్మశబ్దాత్" "తన్నిష్ఠస్య చ మోక్షోపదేశాత్"
"హేయత్వావచనాచ్చ" "స్వాప్యయాత్" అను సూత్రము
లచే ఛాందోగ్యషష్ఠప్రపాఠక మగు శ్వేతకేతూద్దాలకసం
వాదముయొక్క యర్థనిర్ణయము ప్రధానమల్లనిబర్హణన్యాయ
ముచే సాంఖ్యమతముయొక్క నిరసనపురస్సరముగ చేయఁ
బడుచున్నది. ఈ ప్రకరణమునందు జగత్కారణముగ విన
వచ్చెడి సచ్ఛబ్దవాచ్యము తైత్తిరీయశ్రుతియందు వినవచ్చెడి
బ్రహ్మమే యని నిర్వచింపఁబడుచున్నది. అట్టి బ్రహ్మముకంటె
భిన్నముగఁ దంత్రాంతరములయందు జగత్కారణముగ
వర్ణింపఁబడిన ప్రధానము మొదలుగాఁ గల కారణాంతరము
లన్నియు జగత్కారణము లెంతమాత్రము గావని నిరసింపఁ
బడుచున్నవి. దానంజేసి, యాగమములయందు వర్ణింపఁబడిన
శివవిష్ణ్వాదికారణత్వముగూడ నిరసింపఁబడినదే యగుటంజేసి
మధ్వ కభిమత మగు విష్ణుకర్తృత్వముగూడఁ ద్రోసివేయఁ
బడుచున్నది. ఏలయనఁ దైత్తిరీయమున జగత్కారణముగ
వర్ణింపఁబడినబ్రహ్మము నీ ఛాందోగ్యమున వర్ణింపఁబడినసత్

దార్థమును, జగత్తునుగూర్చి యభిన్ననిమిత్తోపాదానకారణ మని "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాన్తానుపరోధాత్" "అభిధ్యోపదేశాచ్చ" "సాక్షాచ్చోభయామ్నానాత్" "ఆత్మకృతేః పరిణామాత్" "యోనిశ్చ హి గీయతే" అను నైదుసూత్రము లతోఁ గూడిన సమన్వయాధ్యాయమునందలి యుపాన్త్యాధికరణముచే సూత్రకారులే నిర్వచించియున్నారు.

ఇఁక మధ్వయన్నతో తన యణుసూత్రార్థమునందు మొదటిపాదముయొక్క యర్థమునంతను.

"విష్ణురేవ విజిజ్ఞాస్యః సర్వకర్తాఽఽగమోదితః।
సమన్వయా దీక్షతేశ్చ పూర్ణానందోఽన్తరః ఖవత్॥
ప్రాణో జ్యోతిరిత్యాద్యైః ప్రసిద్ధైరన్యవస్తుషు ।
ఉచ్యతే విష్ణురేవైకః సర్వైస్సర్వగుణత్వతః॥"

అని నిర్వచించెను.

ఇఁక "గతిసామాన్యాత్" అను సూత్రముచే సర్వవేదాంతములును, జేతనమగు బ్రహ్మమునే జగత్కారణముగ బోధించుచున్నవని సూత్రకారు లొకమహాప్రతిజ్ఞనుగూడఁ జేసియున్నారు.

ఇఁక "శ్రుతత్వాచ్చ" అను సూత్రముచే జగత్కారణము సర్వజ్ఞ మనుటకు శాఖాంతరమందలిశ్రుతులనుగూడ సూచించియున్నారు.

ఇట్లీ యేడుసూత్రములతో నొప్పు నీక్షత్యధికరణము, ఛాందోగ్యషష్ఠప్రపాఠకమునకు నర్థనిర్వచనమును జేయు సూత్ర

కారులచే నిర్దేశింపఁబడియున్న దని శిష్టసమ్మతి యుండ నట్టిశిష్ట సమ్మతిని మధ్వ యుల్లంఘించి "నను- యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ" 'అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథాఽరసం నిత్యమగంధవచ్చ యత్' "అవచనేనైవ ప్రోవాచ" "యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే, యచ్ఛ్రోత్రేణ శృణోతి యేన శ్రోత్రమిదం శ్రుత మిత్యాదేర్న తచ్ఛబ్దగోచరం" నేత్యాహ "ఈక్షతే ర్నాశబ్దమితి" "స ఏతస్మాజ్జీవఘనా త్పరాత్పరం పురిశయం పురుషమీక్షతే, ఆత్మన్యేవాత్మానం పశ్యేత్" "విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీతే"త్యాది వచనై రీక్షణీయత్వాద్వాచ్యమేవ, ఔపనిషదత్వా న్నావచనే నేక్షణమ్" అని బ్రహ్మమునకు-అన నాత్మకు, దృశ్యత్వము నీయధికరణము బోధించుచున్నదని తత్పరముగ నర్థమును గావించెను.

## 8. ఉపన్యాసము ......8 ఆత్మ దృశ్యమా?

దేహాత్మవాదు లగు చార్వాకులలో నేకదేశులగు కొందఱుతక్క యాత్మవాదులందఱు నాత్మ యెంతమాత్రము దృశ్యమని యంగీకరించియుండలేదు. ఆత్మ దృశ్యమే యగుచో నాత్మయొక్క స్వరూపము ఘటపటాదులవలెఁ దెలియవచ్చును. అట్టి విషయమున నాత్మవిషయకము లగు విప్రతిపత్తులు గలుగుట కవకాశములేదు. ఆత్మనుగూర్చి పలువిధము లగు విప్రతిపత్తులును, వాదములును సుప్రసిద్ధముగఁ దెలియవచ్చుచుండ నాత్మ దృశ్యమనుట యవివేకవిలసితము.

9. ఉపన్యాసము...9. ఛాందోగ్యషష్ఠప్రపాఠకతాత్పర్యము.

ఛాందోగ్యషష్ఠప్రపాఠకమునందు జగత్కారణము 'సత్' అనియు, నయ్యది 'ఏకమేవాద్వితీయ' మనియు నుపదేశింపఁబడి యున్నది. పిమ్మటఁ దదర్థబోధనకొఱకుఁ గొంత ప్రకరణము గడచిన వెనుక నపూర్వదృష్టాన్తపూర్వకముగ "ఐతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో!" అని తొమ్మిదిపర్యాయము లొకేతీరున నుపదేశము చేయబడి యున్నది. ఇట్టి యుపదేశము సదాత్మలకు నైక్యము నన నభేదమును బోధించుచున్నదని శిష్టసమ్మతి. ఇట్లు జీవేశ్వరులకు వాస్తవభేదమునుదలంచునాశ్మరథ్యులును, దేహపాతానంతరమే పరమాత్మైక్యరూపమగు ముక్తి కలుగునని తలంచు నౌడులోమియు, నిర్వికారచిన్మాత్రమగు పరమాత్మయే యీ జీవభావమునఁ దెలియవచ్చుచున్నాఁడను కాశకృత్స్నుడును గూడ నీవాక్యములు జీవేశ్వరుల కభేదమునే బోధించుచున్న వని ప్రతిపాదించియున్నట్లు సూత్రకారులు వాక్యాన్వయాధికరణమున "ప్రతిజ్ఞాసిద్ధేర్లింగ మాశ్మరథ్యః" (1-4-20), "ఉత్క్రమిష్యత ఏవంభావాదిత్యౌడులోమిః" (1-4-21), "అవస్థితేరితి కాశకృత్స్నః" (1-4-22) అని స్మరించియే యున్నారు. అభిప్రాయభేద మెటులున్నను వాక్యార్థముమాత్ర మభేదమే యని నిర్వచింపఁబడినట్లు సుస్పష్టమే యగుచున్నది.

ఇంతియకాదు; మధ్వకూడ నీ తత్త్వమస్యాదివాక్యము లభేదబోధకములే యని యానందమయాధికరణమున "భేద వ్యపదేశాచ్చ" అను సూత్రవృత్తియందు "తే యే శతం

ప్రిజాపతే రానందాః, అదృశ్యేఽ నాత్మ్యేఽనిరుక్తేఽనిల యనేఽభయం ప్రతిష్ఠాం విందతే, అథ సోఽభయం గతో భవతి సయశ్చాయం పురుష” ఇత్యాదిభేదవ్యపదేశాత్। నచ తత్త్వమస్యహం బ్రహ్మాస్మీత్యాది శ్రుతివిరోధః। నామాని సర్వాణి యమావిశంతీతి తత్తచ్ఛబ్దవాచ్యత్వోక్తేః” అని నిర్వ చించి తన కభిమతమగు భేదమును బ్రకారాంతరమున సాధిం పఁజూచెను. ఇంతమాత్రముతో విరమించిన యుక్తమే; కాని యింతటితో నాఁగక స్వకీయమగు దశప్రకరణములలో దశమ ప్రకరణమగు విష్ణుతత్త్వవినిర్ణయమున—

“నచాభేదే కశ్చిదాగమః। సంతి చ భేదే సర్వాగమాః తథాప్యతత్త్వమసీతి నవకృత్వోపదేశ స్సదృష్టాన్తకః। న చాయ మభేదోపదేశకః।”

అని యీ శ్రుతియందు “అతత్త్వమసి” అని వినఁబడు చున్న శ్లోకయుపార్థమును గల్పించెను. ఇయ్యాది స్వవచన వ్యాఘాతదోషములలో నగ్రగణ్యము.

10. ఉపన్యాసము... 10. ఉత్తరగ్రంథ తాత్పర్యము.

ఇట్లీ వైయి దధికరణములయర్థమును నిర్ణయించి మధ్వ “తమేవ సమన్వయం ప్రకటయత్యానందమయోఽభ్యాసా దిత్యాదినా సమస్తే నాధ్యాయేన ప్రాయేణ” అని యుత్తర గ్రంథతాత్పర్యమును నిర్వచించెను. ఇట్టియభిప్రాయము శిష్టసమ్మత మగు నభిప్రాయమైనను మధ్వతాత్పర్యము మాత్రము శిష్టసమ్మతముగాదు. ఏలయున, పూర్వగ్రంథముచే న శేష వేదాంతములును బ్రహ్మమునందు సమన్వయము

చేయఁబడినవి గావున నుత్తరగ్రంథమునకుఁగూడ బ్రహ్మము నందే పరమతాత్పర్యమని శిష్టసమ్మతి. విష్ణువునందుఁదాత్పర్య మని మధ్వమతము. కావున మధ్వమతము ధ్వాంతమత మనుటకుఁ దగు యోగ్యతను గల్గియున్నది.

### 11. ఉపన్యాసము...... 11. భగవద్గీతలు.

మధ్వ, భగవద్గీతనుగూర్చి యిట్లు గీతా భాష్యప్రస్తావమునఁ జెప్పెను: "వేదానధికారిణాం స్త్రీశూద్రాదీనాం చ ధర్మజ్ఞాన ద్వారా మోక్షో భవేదితి కృపాళుః...మహాభారత సంహితా మచీక్లుపత్."

"తత్ర చ సర్వభారతార్థసంగ్రహం వాసుదేవార్జున సంవా దరూపాం భారతపారిజాతమధురూపాం గీతా ముపనిబబంధ."

దీనినిబట్టి యీ భగవద్గీత వేదమునం దధికారము లేని స్త్రీశూద్రాదులను గూర్చి యుపదేశింపఁబడినట్లు మధ్వ యభిప్రాయమైనట్లు తెలియవచ్చుటంజేసి వేదమునం దధికార ముగల ద్విజులకు ననుపయోగ మని మధ్వ తలంచిన ట్లరసిద్ధ మగుచున్నది. శిష్టులన్ననో ఈశ్వరస్మృతి యగుటంజేసి బ్రహ్మ సూత్రములట్లు ద్విజులకుఁ బ్రమాణ మని తలంచుచున్నారు. వేదాంతములయొక్క యర్థమును బ్రహ్మసూత్రము లెట్లు బోధిం చుచున్నవో యా తీరుననే ఈభగవద్గీతకూడ బోధించుచుండు టంజేసి బ్రహ్మసూత్రములట్లే ప్రమాణమని శిష్టసమ్మతి.

### 12. ఉపన్యాసము... 12. గీతాతత్త్వనిర్ణయము.

గీతాతత్త్వమంతయు మొదటి రెండధ్యాయములలోఁ బుష్కలముగ వర్ణింపఁబడియున్నది.

అందు "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః," అన్న నర్ధగీతమే తత్త్వనిర్ణాయకము. ఈ యర్ధగీతము నకు 'అసతః భావః న విద్యతే, సతః అభావః న విద్యతే' అను నర్థము శిష్టసమ్మత మగుచున్నది.

"అసతః - కారణస్య, సతో - బ్రహ్మణశ్చ, అభావో న విద్యతే" అని మధ్వనిర్వచనము. ఈప్రకరణమున దేహి, దేహ మను రెండువిషయములు ప్రకృతము లగుచు, నారెండు 'సత్, అసత్' ,అను శబ్దములచే నుద్దేశింపఁబడి యారెండిఁటి తత్త్వము నిర్వచింపఁబడుచుండఁగ నసత్తనఁ గారణ మనియు, నయ్యది యాత్మతోఁ బాటు నిత్య మనియు నొకయపార్థము మధ్వచేఁ గల్పింపఁబడుచున్నది.

ఇచ్చట సచ్ఛబ్దముచే దేహి యుద్దేశింపఁబడుచున్నాఁడు. సచ్ఛబ్దముచే ఛాందోగ్యషష్ఠప్రపాఠకమున బ్రహ్మ మభిప్రేత మగుచున్నది. అట్టిబ్రహ్మమునకు, నీదేహికి నైక్య మన నభేదమును బోధించుటకై యీ యర్ధగీత మిందు స్మరింపఁబడియున్నది. ఇచట సచ్ఛబ్దముచే బ్రహ్మము బోధింపఁబడుచున్న దను మధ్వవచనము సమంజసమే కాని, యసచ్ఛబ్దముచేఁ గారణము గ్రహింపఁబడుచున్నదనియు, నాకారణము నిత్య మనియు జెప్పు మధ్వోక్తి దురుక్తిమాత్ర మగుచున్నది.

## 13. ఉపన్యాసము... ...13. సత్స్వరూపము.

"అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్." అని దేహి యత్తగు సత్తు నిత్యమును సర్వవ్యాపకము నద్వితీయము

ననియు బోధింపఁబడుచున్నది. ఈ గీతమునకు మధ్వనిర్వచ నము తెలియఁబడదు.

**14. ఉపన్యాసము...... 14. అసత్స్వరూపము.**

"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ?"

అను భగవద్వచనముచే సద్భిన్నమగు నసత్తు మిథ్య యని యాశయము. కావున మధ్వయొక్క జగత్సత్యత్వవా దము దుష్టవాద మని స్పష్టమగుచున్నది. ఈ గీతమునకు నుధ్వార్థము తెలియరాదు.

**15. ఉపన్యాసము...... 15. సాంఖ్యయోగములు.**

సాంఖ్యము, యోగము అనునవి కపిలసాంఖ్యముగాని, పతంజలియోగము గాని కావు. ఇయ్యవి శ్రీ భగవానులచేఁ దలంపఁబడు సాంఖ్యము, యోగము నను బ్రహ్మనిష్ఠయందలి యవాంతరభేదములు. అందు యోగము సాంఖ్యమునకు సాధ నము. సాంఖ్యము బ్రహ్మజ్ఞానసాధనము. బ్రహ్మజ్ఞానముచే బ్రాహ్మిస్థితి లభించును. ఈ బ్రాహ్మిస్థితియే బ్రహ్మనిర్వాణ మను ముక్తి యని,

"ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి.

అని చెప్పఁబడుచున్నది. దీనినిబట్టి జీవపరమాత్మ భేదజ్ఞానము మోక్షసాధన మను తీర్థులవారి కల్పన యపకల్పన మని సువ్యక్త మగుచున్నది.

16. ఉపన్యాసము .........16. మాయావాదము.

"అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్,"
అపరస్పరసంభూతం కిమన్య త్కామహైతుకమ్.

అను గీతముచే నభిప్రేత మగు వాదము మాయావాదమనియు, నయ్యదియే శ్రీగౌడపాదాదిమహనీయులవాదమనియు నుచ్ఛృంఖలముగఁ బల్కు మధ్వాదులవాదము దుర్వాదము. ఏలయన, పై గీతముచే నభిప్రేత మగు నభిప్రాయము చార్వాకమతాభిప్రాయము, కాని బ్రహ్మవాదులగు గౌడపాదాచార్యాదిశిష్టులయొక్క వాద మెంతమాత్రమును గానేఱదు.

17. ఉపన్యాసము .........17. విష్ణుస్వరూపము.

మధ్వచే "బ్రహ్మశబ్దశ్చ విష్ణావేవ" అని బ్రహ్మసూత్రములందలి బ్రహ్మశబ్దము విష్ణుశబ్దపర్యాయపద మని చెప్పఁబడుచున్నది. శబ్దములు పర్యాయపదము లైనచో నయ్యవి యేకార్థములు కావలయును. సూత్రములందలి బ్రహ్మశబ్దమున కభిప్రేత మగు నర్థముయొక్క స్వరూపమును, మధ్వచే విష్ణువునకుఁ దలంపఁబడు స్వరూపమును, నొక్కటియే యైనచో నా రెండుశబ్దములును బర్యాయపదములుగా నొప్పును. సూత్రమునందు స్మరింపఁబడిన బ్రహ్మశబ్దముచేఁ దెలియవచ్చెడి స్వరూపమన్ననో సత్యజ్ఞానానందస్వరూపము. అయ్యది సజాతీయ విజాతీయ స్వగతభేద రహితము. మధ్వ తలపెట్టు విష్ణురూప మన్ననో క్షీరోదశాయి యగు కరచరణాద్యవయవవిశిష్టరూపము.

ఇఁక బ్రహ్మశబ్దముచేఁ బురాణములందు విష్ణువవలెఁ దెలియవచ్చెడి బ్రహ్మయన్ననో సత్యలోకమం దుండు చతుర్ముఖుఁడు. ఆ చతుర్ముఖుఁడగు బ్రహ్మయు, నీ క్షీరోదశాయియగు విష్ణువు నొక్కఁడే యనుట యసమంజసము గదా? కావునఁ బౌరాణికములగు శివవిష్ణ్వాదిరూపములలో నేరూపముల నుద్దేశించియు సూత్రములందు బ్రహ్మశబ్దము స్మరింపఁబడియుండలేదు. కావునఁ బురాణములందు ప్రసిద్ధమగు శివవిష్ణ్వాదినామముల కీబ్రహ్మశబ్దము పర్యాయపద మెంతమాత్రమును గాదు. కావున "బ్రహ్మశబ్దశ్చ విష్ణావేవ" అను మధ్వోక్తి దురుక్తి యని తెలియవలయును.

## 18. ఉపన్యాసము......18. పంచరాత్రము.

"వేదపంచరాత్రయో రైక్యాభిప్రాయేణ పంచరాత్రస్యైక ప్రామాణ్య ముక్తం" అని మధ్వచే నిర్వచింపఁబడినది. శ్రుతిస్మృతిసదాచారవిరుద్ధమగు దాసవేషము నే యాపుస్తకము ప్రధానముగా బోధించుటవలన హేయమని శిష్టసమ్మతము. ఒకానొకవేళఁ బ్రమాణమని యెంచినను మధ్వచే నెన్నుకొనఁబడినను నందలితత్త్వకథనము సర్వవిధముల మధ్వమతమునకు బాధకమే యగుటం జేసి పంచరాత్రము మధ్వమతసాధక మెన్నఁడును గానేఱదు. ఇంతియకాదు; అందు వర్ణింపఁబడిన దాసవేషమునకు మధ్వవేషము విరుద్ధ మగుటచేఁ గూడఁ బంచరాత్రము మధ్వమతమునకుఁ బ్రమాణమనుట కల్ల.

19. ఉపన్యాసము.........19. సింహావలోకనము.

మధ్వమతము పవిత్రప్రమాణమగు ప్రస్థానత్రయ విరుద్ధ మగుటయే గాక మధ్వచేఁ బ్రమాణముగా నంగీక రింపఁబడిన పంచరాత్రప్రమాణవిరుద్ధముగూడ నగుటంజేసి స్వకపోలకల్పిత మగుచుఁ గ్రైస్తవ మహమ్మదీయాది మత తుల్యము, నవైదికము నగుచున్నది గావున వైదికధర్మాను యాయుల కెంతమాత్రమును గ్రాహ్యము కాదు.

20. ఉపన్యాసము......... 20. వైదికధర్మసంగ్ర హోపాయములు.

అధీతి, బోధ, ఆచరణ మనునవి మూఁడును ధర్మసంగ్ర హోపాయములు. అధీతి యనఁ బ్రస్థానత్రయమును సద్గురు ముఖమునఁ జక్కఁగఁ జదువుకొనుట. బోధయనఁ దదర్థము నందు నిశ్చయజ్ఞానమునుబడయుట. ఆచరణమనఁ దద్ధర్మమును యథాశక్తిఁ దా నాచరించుచు నొరుల నాచరింపఁజేయుట.

విశేషము:—

ఇట్టియుపన్యాసము లెచ్చటనైన నవసర మని తలఁ చిన వైదికధర్మానుయాయు లందులకుఁ దగు నేర్పాటులఁ గావించి శ్రీవారి నాహ్వానము జేసిన నవకాశముకొలఁది శ్రీవా రట్టియుద్యమమును నెఱవేర్ప సంసిద్ధులై యున్నారు. కావున భక్తవర్యు లట్టియవకాశమును దీసికొని యైహికాముష్మిక నిఃశ్రేయసములఁ బడయుదురుగాక!



శ్రీః

# శ్రుతి.

వైదికధర్మమునకు శ్రుతి పరమప్రమాణము గావున నద్దానిఁగూర్చి యొకింత వివరించెదము. "శ్రుతిస్తు వేదో విజ్ఞేయః" అను నభియుక్తోక్తివలన శ్రుతియన వేదమని తెలియవలయును. వేదమన జ్ఞానము. ఈజ్ఞానము సుకరముగాఁ దెలియవచ్చెడి జ్ఞానము కాదు. ఏలయన లోకమున జ్ఞానమునునది సర్వసాధారణంబుగాఁ బ్రత్యక్షానుమానంబు లను ప్రమాణములచేఁ గలుగుచుండును. ప్రత్యక్ష మనఁ బురుషునియొక్క యింద్రియములకు సిద్ధమగు విషయములతో సంబంధము కలుగుటచే జనించు జ్ఞానము. అట్టిప్రత్యక్షము తెలియఁవచ్చెడి విషయములనుమాత్రము ప్రకాశింపఁజేయుటచే ధర్మమునందు బ్రమాణము కాదని మీమాంసకులు సిద్ధాంతించియున్నారు. అనుమాన మన్ననో సంబంధము దెలిసికొనిన పురుషునికి నేకదేశమును జూచుటవలన నసన్నికృష్ట మగు నేకదేశాంతరమందలి జ్ఞానము. ధర్మముతో సంబంధించినలింగము తెలియఁబడకపోవుటవలన ననుమానముగూడ ధర్మమునందుఁ బ్రమాణము కాదని మీమాంసకులు నిర్ణయించియున్నారు. వేదమన్ననో ప్రత్యక్షానుమానములచేఁ దెలియుటకు నవకాశము లేని ధర్మమందుఁ బ్రమాణ మని వేదవిదు లప్రతిహతముగ వక్కాణించియున్నారు. ఇట్టియభిప్రాయములను వెల్లడించు లక్షణవాక్యములఁ బెక్కింటిని బుధు లీ వేదమునుగూర్చి నుడివియున్నారు.

ఇఁక బ్రహ్మశబ్దముచేఁ బురాణములందు విష్ణువవలెఁ దెలియవచ్చెడి బ్రహ్మయన్నను సత్యలోకమం దుండు చతుర్ముఖుఁడు. ఆ చతుర్ముఖుఁడగు బ్రహ్మయు, నీ క్షీరోదశాయియగు విష్ణువు నొక్కఁడే యనుట యసమంజసము గదా? కావునఁ బౌరాణికములగు శివవిష్ణ్వాదిరూపములలో నేరూపములనుద్దేశించియు సూత్రములందు బ్రహ్మశబ్దము స్మరింపఁబడి యుండలేదు. కావునఁ బురాణములందు ప్రసిద్ధమగు శివవిష్ణ్వాది నామముల కీ బ్రహ్మశబ్దము పర్యాయపద మెంతమాత్రమును గాదు. కావున "బ్రహ్మశబ్దశ్చ విష్ణావేవ" అను మధ్వోక్తి దురుక్తి యని తెలియవలయును.

## 18. ఉపన్యాసము......18. పంచరాత్రము.

"వేదపంచరాత్రయో రైక్యాభిప్రాయేణ పంచరాత్రస్యైకప్రామాణ్య ముక్తం" అని మధ్వచే నిర్వచింపఁబడినది. శ్రుతిస్మృతిసదాచారవిరుద్ధమగు దాసవేషమునే యీపుస్తకము ప్రధానముగా బోధించుటవలన హేయమని శిష్టసమ్మతము. ఒకానొకవేళఁ బ్రమాణమని యెంచినను మధ్వచే నెన్నుకొనఁబడినను నందలితత్త్వకథనము సర్వవిధముల మధ్వమతమునకు బాధకమే యగుటం జేసి పంచరాత్రము మధ్వమతసాధక మెన్నడును గానేరదు. ఇంతియ కాదు; అందు వర్ణింపఁబడిన దాసవేషమునకు మధ్వవేషము విరుద్ధమగుటచేఁ గూడఁ బంచరాత్రము మధ్వమతమునకుఁ బ్రమాణమనుట కల్ల.

19. ఉపన్యాసము .........19. సింహావలోకనము.

మధ్వమతము పవిత్రప్రమాణమగు ప్రస్థానత్రయ విరుద్ధ మగుటయే గాక మధ్వచేఁ బ్రమాణముగా నంగీకరింపఁబడిన పంచరాత్రప్రమాణవిరుద్ధముగూడ నగుటంజేసి స్వకపోలకల్పిత మగుచుఁ గ్రైస్తవ మహమ్మదీయాది మత తుల్యము, నవైదికము నగుచున్నది గావున వైదికధర్మానుయాయుల కెంతమాత్రమును గ్రాహ్యము కాదు.

20. ఉపన్యాసము......... 20. వైదికధర్మసంగ్రహోపాయములు.

అధీతి, బోధ, ఆచరణ మనునవి మూఁడును ధర్మసంగ్రహోపాయములు. అధీతి యనఁ బ్రస్థానత్రయమును సద్గురుముఖమునఁ జక్కఁగఁ జదువుకొనుట. బోధయనఁ దదర్థమునందు నిశ్చయజ్ఞానము నుబడయుట. ఆచరణమనఁ దద్ధర్మమును యథాశక్తిఁ దా నాచరించుచు నొరుల నాచరింపఁజేయుట.

విశేషము:—

ఇట్టియుపన్యాసము లెచ్చటనైన నవసర మని తలఁచిన వైదికధర్మానుయాయు లందులకుఁ దగు నేర్పాటులఁ గావించి శ్రీవారి నాహ్వానము జేసిన నవకాశముకొలఁది శ్రీవారట్టియుద్యమమును నెఱవేర్ప సంసిద్ధులై యున్నారు. కావున భక్తవర్యు లట్టియవకాశమును దీసికొని యైహికాముష్మిక నిఃశ్రేయసములఁ బడయుదురు గాక!



శ్రీః

# శ్రుతి.

వైదికధర్మమునకు శ్రుతి పరమప్రమాణము గావున నద్దానిఁగూర్చి యొకింత వివరించెదము. "శ్రుతిస్తు వేదో విజ్ఞేయః" అను నభియుక్తోక్తివలన శ్రుతియన వేదమని తెలియవలయును. వేదమన జ్ఞానము. ఈజ్ఞానము సుకరముగఁ దెలియవచ్చెడి జ్ఞానముకాదు. ఏలయన లోకమున జ్ఞానమనునది సర్వసాధారణంబుగఁ బ్రత్యక్షానుమానంబు లను ప్రమాణములచేఁ గలుగుచుండును. ప్రత్యక్షమనఁ బురుషునియొక్కయింద్రియములకు సిద్ధమగు విషయములతో సంబంధము కలుగుటచే జనించు జ్ఞానము. అట్టిప్రత్యక్షము తెలియవచ్చెడి విషయములనుమాత్రము ప్రకాశింపఁజేయుటచే ధర్మమునందు బ్రమాణము కాదని మీమాంసకులు సిద్ధాంతించియున్నారు. అనుమాన మన్ననో సంబంధము దెలిసికొనిన పురుషునికి నేకదేశమును జూచుటవలన నసన్నికృష్ట మగు నేకదేశాంతరమందలి జ్ఞానము. ధర్మముతో సంబంధించినలింగము తెలియఁబడకపోవుటవలన ననుమానముగూడ ధర్మమునందుఁ బ్రమాణము కాదని మీమాంసకులు నిర్ణయించియున్నారు. వేదమన్ననో ప్రత్యక్షానుమానములచేఁ దెలియుటకు నవకాశము లేని ధర్మమందుఁ బ్రమాణ మని వేదవిదు లప్రతిహతముగ వక్కాణించియున్నారు. ఇట్టియభిప్రాయములను వెల్లడించు లక్షణవాక్యములఁ బెక్కింటిని బుధు లీ వేదమునుగూర్చి నుడివియున్నారు.

అవెవ్వియన—"అజ్ఞాతజ్ఞాపకం వాక్యం శ్రుతిః। అనధిగతాబాధితార్థబోధకో వేదః। ఇష్టప్రాప్త్యనిష్టపరిహారయోరలౌకికోపాయబోధకో వేదః" అను మొదలగునవి. నిఖిలజనాభ్యుదయనిఃశ్రేయసహేతువగు నీయపూర్వజ్ఞానము వేద మనఁబడుచున్నది. ఈవేదము సృష్ట్యాదియందుఁ బరమేశ్వరముఖము వలన నప్రయత్నముగాఁ బురుషనిశ్వాసమట్లు వెలువడి బ్రహ్మర్షులకుఁ గర్ణగోచరమగుటంజేసి దీనికి శ్రుతియను పేరు కల్గెను. శ్రుతియనఁ వినఁబడినది. ఇత్యాది పరమేశ్వరముఖము నుండి వెలువడినటుల "అస్యమహతో భూతస్య నిశ్వసితమేవైతద్యదృగ్వేదో యజుర్వేద స్సాను వేదః" అను శ్రుతివాక్యమే ప్రమాణము. వేదము ఋగ్యజుస్సామాథర్వలక్షణము. ఇయ్యది మంత్రమనియు, బ్రాహ్మణమనియు ద్వివిధము. బ్రాహ్మణము కర్మప్రతిపాదకము, జ్ఞానప్రతిపాదకము నని మఱల ద్వివిధము. కరప్రతిపాదకబ్రాహ్మణము చోదనారూపమునర్థవాదరూపము నని మరల రెండువిధములు. జ్ఞానప్రతిపాదకభాగ ముపాసనము, జ్ఞానము నని రెండువిధములు. కర్మప్రతిపాదకబ్రాహ్మణమును బ్రాహ్మణమనియు, జ్ఞానప్రతిపాదకబ్రాహ్మణము నుపనిషత్తనియు బుధులు సామాన్యముగ వ్యవహరించుచున్నారు. చోదనారూపము విధి, ప్రతిషేధ మని రెండు తెఱఁగులు. అర్థవాదమన్ననో గుణవాదము, అనువాదము, భూతార్థానువాదము నని మూఁడు తెఱఁగులు. చోదనారూప మనిన వేదమునందుఁ గన్పట్టెడి లిఙ్లోట్తవ్యప్రత్యయాంతశబ్దఘటిత వాక్యము లని సామాన్యముగఁ దెలియునగును. నఙ్ ఘటితము లగు లిఙ్

లో ట్ప్రత్యయాంతశబ్దములతోఁ గూడియున్న వాక్యములకుఁ బ్రతిషేధవాక్యము లనియు, నఞ్ రహితవాక్యములకు విధివాక్యము లనియును వ్యవహారము. విధివాక్యములు కర్తవ్యమును బోధించును. ప్రతిషేధవాక్యము లకర్తవ్యమును బోధించును. కర్తవ్యము శ్రేయస్సాధనము, నకర్తవ్యమనర్థదాయకము నగుచున్నవి. ప్రతిపురుషునకును శ్రేయమునందుఁ బ్రవృత్తియు ననర్థమునందు నివృత్తియు సహజధర్మం బగుటంజేసి వేదము నందలి బ్రాహ్మణము విధిప్రతిషేధముల రెండిటినిఁ బురుషునకుపదేశించుచున్నయది. దానంజేసి, వేదమునకుఁ బ్రవృత్తినివృత్తిబోధకమను ప్రయోజనము తెలియవచ్చెడిని. అర్థవాదములన్ననో విధులప్రాశస్త్యమును బోధించుటంజేసి యర్థవాదములకు విధిప్రాశస్త్యబోధకత్వ మన విధిస్తావకత్వము పరమప్రయోజనమని వేదవేత్తలు తలంచుచున్నారు. బ్రాహ్మణమువలనఁ గర్తవ్యాకర్తవ్యములును, వానియొక్క గుణదోషములును తెస్సఁగా బోధింపఁబడుటంజేసి సకలప్రాణిశ్రేయోదాయకమైనజ్ఞాన మలవడుచున్నది. బ్రాహ్మణమన బ్రహ్మచేనన నా పరమేశ్వరునిచేఁ బ్రదర్శింపఁబడిన వ్యాఖ్యాన మని యభిప్రాయము. బ్రాహ్మణము వ్యాఖ్యాన మగుచో మూలగ్రంథ మెద్దియన మంత్రభాగ మని యెఱుఁగునది. మంత్రభాగముయొక్క యర్థ మనినఁ బ్రయోజనమని యభిప్రాయము. మంత్రము లెల్లెడలను గ్రియలను, దత్సాధనములను స్మరింపఁజేయును. సకలప్రాణిశ్రేయస్సాధనంబులగు కర్తవ్యాకర్తవ్యంబులను బోధించు బ్రాహ్మణమే లేనిచో, అనఁగా వేదభాగమే

లేనిచో నర్థరహితశబ్దములట్లు మంత్రములు నిరుపయోగము
లును, నిరర్థకములునై పడియుండవలసినదే? మంత్రముల ప్ర
యోజనమును సర్వవిధముల బోధించు వ్యాఖ్యానరూపంబగు
బ్రాహ్మణమును వేదముగా సరకుగొనక పురుషబుద్ధిప్రణీత
ములుగా నిరసించు మూర్ఖులకుఁ గార్యాకార్యవివేక మెట్లు
కలుగునో బుధులు గుర్తెఱుంగవలసిన విషయము. కార్యా
కార్య వివేచనమునందు శాస్త్రము ప్రమాణమని శ్రీకృష్ణ
భగవానులు—

“తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి.”

అని వచించియున్నారు. కార్యాకార్యవివేచనమున
శాస్త్రమును శరణ్యముగా శాసించిన శ్రీకృష్ణభగవానుల
తాత్పర్యము విధ్యర్థవాదరూపమగు బ్రాహ్మణమా? లేక కర్త
వ్యాకర్తవ్యములను బోధించు వాక్యములకుఁ జిహ్నములగు
లిఙ్లోట్తవ్యప్రత్యయఘటితశబ్దంబు లెచ్చటను గానరాని మం
త్రభాగమా? యని ప్రాజ్ఞులు యోజించి తెలిసికొందురుగాక!
దానంజేసియే వేదార్థకోవిదులగు జైమిన్యాచార్యులును,
శ్రీవేదవ్యాసులును వేదార్థమును బోధించునపుడు బ్రాహ్మ
ణమునుమాత్రము చేకొనిరి. మంత్రములకు వినియోగము
నందే ప్రాధాన్యమును శిరసా వహించిరి. వేదములనుండి
బ్రాహ్మణములఁ దోసివేసినచోఁ గర్తవ్యాకర్తవ్యజ్ఞానము
శూన్య మగును. దానంజేసి సకలపురుషులు జ్ఞానశూన్యులు
కావలసినదే. కావున శ్రేయోఽభిలాషు లెల్లరును బ్రాహ్మ

ణములను బరమప్రమాణమగు శ్రుతియని సర్వవిధముల విశ్వ
సించి మనియెదరుగాక !

బ్రాహ్మణమునఁ గన్పట్టెడు లిఙ్లోట్తవ్యప్రత్యయఘటిత
శబ్దంబులతో నొప్పు వాక్యములచే వ్యక్తమగు విషయము
ధర్మమని జైమిన్యాచార్యులు తన వేద మీమాంసయందుఁ
బ్రథమమున "అథాతో ధర్మజిజ్ఞాసా" "చోదనాలక్షణార్థో
ధర్మః" అని రెండుసూత్రములచే నిరూపించియున్నారు.

ఇఁక బ్రాహ్మణములం దున్న జ్ఞానప్రతిపాదక గ్రంథ
ము పాసనమును, జ్ఞానమును బోధించుచున్నటుల శ్రీవేదవ్యా
సులు తమ వేదాంతమీమాంసచే లోకమునకు బోధించు
చున్నారు. దానంజేసి వేదము కర్మకాండము, జ్ఞానకాండమునని
రెండుభాగములుగఁ బరఁగుచున్నదని యెల్లరకును దెలిసిన
విషయమే. వేదముచే నీ రెండువిధములగు జ్ఞానము బోధింపఁ
బడుచున్నదని శ్రీకృష్ణభగవానులు—

"లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ!
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్."

అని కంఠోక్తిగఁ జెప్పుచున్నారు. ఇట్టి జ్ఞానయోగ కర్మ
యోగములకుఁ బుట్టినిల్లగు బ్రాహ్మణమునే వేదమునందుఁ
బరమప్రమాణముగ వేదమూర్తు లగు మహనీయు లందఱును
సృష్ట్యాదినుండి నేఁటివఱకు నొక్కవిధముననే తలంచుచున్నా
రు. కాని యించుమించుగ నొకయేఁబదిసంవత్సరములనుండి
యు మంత్రభాగ మొక్కటియే వేదమనియును బ్రాహ్మణమం
తయుఁ గల్పితమును గృత్రిమము నగుటంజేసి హేయమనియు

నొక యపూర్వవాదము బయలువెడలి భారతభూమి నల్లక ల్లోలము చేయ యత్నించుచున్నది. ఆహాహా ఏమి వెర్రి! వేద మందలి మంత్రభాగము పరమేశ్వరలబ్ధమఁట! తద్వ్యాఖ్యాన మగు బ్రాహ్మణము పౌరుషేయమఁట! పరమేశ్వరలబ్ధమగు మంత్రముల యర్థ మెటులఁ దెలియనగునో బుధులు గమనిం తురుగాక! పరమేశ్వరవాక్కులకు నర్థమును బరమేశ్వరుఁడే పలుకవలయును గాని వేఱొక రెట్లు చేయఁగలరు?

పరమేశ్వరుఁడు మూలమును, వ్యాఖ్యానమునుగూడ స్వయ ముగనే యుపదేశించె ననినచోఁగల హాని యెద్దియో పూర్వ పక్షులు పలుకుదురుగాక! అట్లుపదేశింపఁ బరమేశ్వరునకు సామర్థ్యము లేకుండునా? సరియే, పూర్వపక్షులు తలంచు నట్లు బ్రాహ్మణములు కల్పితములు గావునఁ ద్రోసివేయుదము. అప్పుడు కర్మజ్ఞానయోగములు కర్తవ్యాకర్తవ్యములు, నెట్లు మంత్రమూలమున లభించునో వివేకులు నిర్వచింతురుగాక!

ఇది యంతయుఁ దుష్టావహాసనంబును గుత్సితజనవిలసి తంబునుదక్క వేఱొండు కాదు. ఇట్టి నిఖిలప్రాణిశ్రేయస్సాధ నం బగు వేదమును గామధేను వని శ్రీకృష్ణభగవానులు—

"సహాయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽ స్త్విష్టకామధుక్."

అని స్తుతించియున్నారు. వేదవిహితధర్మ శాస్త్రమును సర్వ జ్ఞుఁడగు మనువు—

"శ్రుతిస్మృత్యుదితం ధర్మ మనుతిష్ఠన్హి మానవః,
ఇహ కీర్తి మవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్."

అని కొనియాడియున్నాఁడు. ఐహికాముష్మికనిరతిశయ సుఖంబులకు మూలము ధర్మము. అట్టిధర్మమునకు మూలము వేదము; గావున నీవేదము మానవకోటికి మహాధనము.

వేదాధిక్యము.

వేదములు నిత్యములు, నపౌరుషేయములును స్వతః ప్రమాణములు ననంతములు నని సకలవేదార్థకోవిదులు నిరూపించియున్నారు. ఇట్టి నిరూపణమునకు మూలభూతం బగు శ్రుతి "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనునది. ఇందలి బ్రహ్మ శబ్దమును వేదపరముగా గ్రహించినచో వేదాతిశయము సుస్పష్ట మగును. ఏలయన, బ్రాహ్మణజాతియందు జీవుని యందుఁ జతుర్ముఖబ్రహ్మయందు వేదమునందు బ్రహ్మలోకమునందుఁ బ్రయోగమును గనుచున్న దని నిఘంటువులు పలుకుచున్నవి. సత్య మనఁ, ద్రికాలాబాధ్య మని యర్థము. అనఁగా నిత్య మని భావము. జ్ఞానమన స్వతఃప్రమాణము. అనఁగా జ్ఞానాంతరనిరపేక్షము. నిత్యజ్ఞానస్వరూపమగుటచే నపౌరుషేయము. సకలజ్ఞానాకర మగుటచే ననంతము. "అస్య మహతో భూతస్య నిశ్వసితం" అను శ్రుతిచేఁ బరమేశ్వరముఖమునుండి యప్రయత్నముగా నిశ్వాసమట్లు వెలువడిన దని తెలియవచ్చుటవలన నద్దానికిఁ బరమేశ్వరుఁడు ప్రవర్తకుఁడుగాని కర్తకాఁడని బుధులు సిద్ధాంతించుచున్నారు. దానంజేసి వేదము లపౌరుషేయము లగుచున్నవి.

# వైదిక ధర్మసంవర్ధని.

సంపుటము 1] మార్చి 1935 [సంచిక 3

## స్మృతి.

ధర్మమునకుఁ బ్రమాణముగ స్మృతియని యొకొ్కండు చెప్పంబడియెను. అద్దానిస్వరూపమును గొంచెము నిరూపించుచున్నాము. "ధర్మశాస్త్రం తు వై స్మృతిః" అని చెప్పఁబడుటచే ధర్మశాస్త్రము స్మృతియని తెలియవచ్చెడిని. ధర్మశాస్త్రమన ధర్మమును శాసించునది యని యర్థము. వేదము శాస్త్రమనియు నద్దానిచే శాసింపఁబడునది ధర్మమనియు నిదివఱకు శ్రుతిప్రస్తావమునఁ జెప్పఁబడియెను. ప్రకృతమున స్మృతియన ధర్మశాస్త్రమనియుఁ జెప్పబడుచున్నది. ఇందలి విశేషమేమని సందియము కలుగును గావున నొకింత విచారింతము. శ్రుతియును ధర్మశాస్త్రమే; స్మృతియును ధర్మశాస్త్రమే. కాని శ్రుతిస్మృతుల రెండిఁటికి నుత్పత్తిచే భేదము గలదు. దానంజేసి శ్రుతికి వేదమనియు, స్మృతికి ధర్మశాస్త్రమనియు వ్యవహారము గలిగెను. శ్రుతియందు ధర్మములే కాక పురుషబుద్ధికి నగోచరములగు నితరవిషయములు పెక్కులుకూడ బోధింపఁబడియున్నవి. అవియన్నియు జ్ఞాన మను సామాన్యనామముచే నొప్పుటంజేసి శ్రుతికి వేద మను పేరు గలిగెను. ధర్మశాస్త్రమన్ననో వేదైకదేశమగుధర్మమును మాత్రమే బోధించును.

ఇదియే సామాన్యభేదము. ఇంక రెండింటికిగల విశేషభేద మును శ్రుతిస్మృతు లను నామములే బోధించుచున్నవి. శ్రుతి యన వినఁబడినది. స్మృతి యన స్మరింపఁబడినది. శ్రుతియనఁ బ్రత్యక్షముగాఁ బరమేశ్వరునిముఖమునుండి వినఁబడిన జ్ఞాన మని యర్థము. వినినదానిని స్మరించుటచేఁ గలిగినది స్మృతి. పరమేశ్వరముఖమునుండి వినినదానిని మననముచేసి తదర్థ మును లోకసంగ్రహమునకై మన్వాదిమహర్షులు స్మరించిన గ్రంథములు స్మృతు లని చెప్పఁబడుచున్నవి. ఇయ్యవి వేద విహితధర్మముయొక్క సంక్షేపకథనంబులు, వేదస్మారకంబులు, పురుషప్రణీతములు, వేదజ్ఞానజన్యసంస్కారజన్యంబులు గావున వీని కీపేరు గలిగెను. వేదమన్ననో యపౌరుషేయము స్వతఃప్ర మాణము నిత్యము. స్మృతులన్ననో పౌరుషేయములు, పరతః ప్రమాణములు. భారతభూమియందు స్మృతియను నామంబుచే నపౌరుషేయమగు వేదమునుండి పౌరుషేయగ్రంథములు వేఱుచేయఁబడుచున్నవి. ఇట్టి భేదముచేఁ గ్రమక్రమముగ వేదార్థప్రతిపాదకములగు పురుష ప్రణీతగ్రంథము లన్నియు స్మృతులుగ దలంపఁబడుటవలన స్మృతివైపుల్యము గలి గినది. మనుస్మృతికాలమునాఁటి కింకను పెద్దకాలము గడచు నప్పటి కిది స్మృతి యన ధర్మశాస్త్రములే పరిగణింపఁబడుచు వచ్చుటంజేసి స్మృతియన ధర్మశాస్త్ర మను సామాన్యవ్యవ హారము గలిగెను. ఇట్టిధర్మశాస్త్రములు ప్రణేతలయొక్క భేదముచేఁ బలువిధములుగఁ బరిణమించినను, అన్నిఁటికిని మూలభూతము మనుస్మృతి యనునది యొక్కటియే. మను

స్మృతియొక్క యతిశయమును

"యత్కించ మను రవద త్తద్భేషజమ్."

"యః కశ్చిత్కస్యచి ద్ధర్మో మనునా పరికీర్తితః,
స సర్వోభిహితే వేదే సర్వజ్ఞానమయో హి సః."

అను మొదలుగాఁగల స్మృతులు వక్కాణించుచున్నవి.

మనువు సర్వజ్ఞానమయుండు గావున నాతనిచే లెస్సగఁ బ్రతిపాదింపఁబడిన విషయమంతయును వేదమునఁ బ్రతిపాదింపఁబడినదే 'యని పై శ్రుతిస్మృతుల తాత్పర్యము. మనువు చెప్పిన జ్ఞాన మంతయు వేదమునందుఁ జెప్పఁబడి యుండుటచే నయ్యది వేదమువలెఁ బరమప్రమాణముగ యోజింపఁబడుచున్నది. మనువు వేదజ్ఞానసంపన్నుఁడు గావున సర్వజ్ఞుఁ డనియుఁ దలంపఁబడుచున్నట్లు తెలియవచ్చుచున్నది. దీనింబట్టి మనువునకుఁ గాని మనుస్మృతికిఁ గాని వేదము ననువదించుటచేతనే గౌరవము గల్గెను గాని వేఱొండు కారణ మించుకేనియుఁ గానరాదు. 'మనువు చెప్పెను విన వలయు'ననుట సహేతుకముగాని నిర్హేతుక మెంతమాత్రము గాదు. ఆతీరుననే సృష్ట్యాదినుండి నేఁటివఱకు వేదమునందలి జ్ఞానము నుపదేశించినపురుషుఁడే యుత్తమగు నతిశయమును గాంచుచున్నాఁడు. వానివాక్యములే సరకుఁగొనఁబడుచున్నవి. వేదము నెప్పు డనువదింపఁడో, వేదమున కెప్పు డెదురు తిరుగునో, యప్పు డా పురుషుఁడు నాస్తికుఁడుగఁ దలంపఁబడి భారతభూమియం దిసుమంతయు నతిశయమును గనక

పోవుట యటుండఁ దుష్టుఁడుగఁ దలంపఁబడు నను విషయ మును బుధు లిదివరకే వ్యక్తీకరించియున్నారు. ఎట్లన—

"యోఽవమన్యేత తే మూలే హేతుశాస్త్రాశ్రయాద్ద్విజః
స సాధుభి ర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః." అని.

అనఁగా నేద్విజుఁడైనను శుష్కతర్కముల నాశ్రయించి ధర్మమూలములగు శ్రుతిస్మృతుల నవమానించునో యట్టి వేదనిందకుఁడును, నాస్తికుఁడు నగువాఁడు సాధుజనులచే నవవేదవిదులచే బహిష్కరింపఁబడవలయును; లేనిచో వానివలన భారతభూమికి సర్వవిధముల నుపద్రవము గలుగుననియుఁ దెలియవచ్చెడిని- అని.

అనఁగా శ్రుతిస్మృతిప్రమాణవిముఖుఁడు వైదికధర్మద్రోహి యని తెలియవచ్చెడిని యని భావము.

---

## ఉత్తరాదిమఠస్థులైన శ్రీ సత్యధ్యాన తీర్థుల
# పలాయనము.

ప్రకృతకాలమునందలి పరిస్థితులను బరికింపఁగా ఆస్తిక మతముల కెచటను దావు కన్పడదు. కావున నిక్కాలమున వైదికమును యథాశక్తిగ కాలము ననుసరించి మతాచార్యులును వైదికమతావలంబులును వ్యాపింపఁ జేయవలసియున్నది. ఇట్టి తరుణమున ఉత్తరాదిమఠాధీశులగు సత్యధ్యానతీర్థులవారర్థసంపత్తి మిక్కుటమగుటచేఁ గాఁబోలు, వైదిక మతమగు నద్వైతముపై దాడివెడలుచు "సంయామసీపురం హైకోర్టు వేదాంత విచారణ సివిల్ కేసు" అనుపేర నాల్గుపుస్త

కముల నచ్చొత్తించి ప్రకటింపఁ జేసిరి. ఇట్టి వ్యాపారములవలన నీకాలమున క్షీరద్వైతము నణఁగద్రొక్కి ధ్వాంతద్వైతము నుద్ధరింతురఁట! వారల నడుగగ 'మతాచార్యులకృత్యము పరమత దూషణమే' యని సమాధానము చెప్పిరట! ఇది యిట్లుండ. పై గ్రంథములలో నొకవ్యాజ్యము జరిగినట్లు బోధించుచు నందు ముఖ్యమగు వాది ప్రతివాది న్యాయవాది న్యాయాధికారి రూపములఁ దామే తాల్చి వారికిచ్చవచ్చినటులఁ బాత్రపోషణమును గావించిరి. స్వకపోలకల్పితములగు గ్రంథముల నన్ని పాత్రములును దామే యగుటచే వ్యాజ్యమున ముఖ్యమగు ప్లైంటును దమ కనువగు రీతిని బ్రకటించి దాని కనురూపముగనే ప్రతివాదియొక్క స్టేటుమెంటునుగూడఁ బ్రకటించిరి. కాలక్రమమున నీ పై పుస్తకముల నాధారముగాఁ గావించుకొని తీర్థులవారు మతద్వేషములను బెచ్చుపెరగఁ జేసిరి.

ఇట్టి తరుణమున నూరకుండిన విషమమగుపరిస్థితులు సంభవించునను తలంపున మేము పై పుస్తకముల విమర్శింపఁ దలఁచి తొలుతనందు ముఖ్యమగుస్టేటుమెంటునుదీసి తీర్థులవారే ప్రతివాదిరూపమును దాల్చి నిర్వచించుటవలన నయ్యది సరి కాదనియు, సరియగుస్టేటుమెంటును మేము ప్రదర్శింతుమనియు నద్దానిని సరిచేసి, శ్రీ తీర్థులవారు తమ మతమును నిలువఁ బెట్టుకొన నొకవారముదినములలో సంసిద్ధులు కావలయు ననియు నట్లుకానిచోఁ దీర్థులవారు తమ మతమును నిలువఁ బెట్టుకొనలేరని తలంచి మాకుఁ దోఁచిన యేకోర్టులోనైన నీ Statement ను దాఖలుచేయుదు మనియు శ్రీ తీర్థులవారికిఁ దెలియఁబరచితిమి.

అట్టి మా స్టేటుమెంటునందు మాచే నిర్వచింపఁబడిన ముఖ్యమగు విషయముల నిం దుదాహరించుచున్నారము.

"1. × × × ×

2. × × × ×

3. వాదియొక్క యర్జీలో మూఁడవకలమునందు వాది చెప్పుకొనినట్లు వాదియొక్క మతము ఆస్తికమగు వైదికమతము కాదు. వాది యొకప్పుడు తన మతమును వైదికవైష్ణవ మనియు, వేఱొకప్పుడా స్తికవైష్ణవమనియు, మఱియొకప్పుడు వైదికమనియు,నిప్పుడు ద్వైతమనియు నిట్లొకమాటకు వేఱొక మాటకు సంబంధము లేకుండ, బలుకుటవలన వాది యే మతమునకుఁ జెందినదికూడ నిర్ణయింప శక్యము గాదు. కావున వాదికి నేమత మున్నట్లును దెలియరాదు.

4. (a) వాదియొక్క యర్జీలో నాలవకలమున "వైదిక మతతత్త్వములు" అని చెప్పఁబడియున్నది. అదంతయు నబద్ధము. ఏలయనఁగా: వాది తనయర్జీ యయిదవకలములో "ఈ తత్త్వములు వేదములయందును, వేదార్థనిర్ణాయకములగు బ్రహ్మసూత్రములందును మఱియు భగవద్గీతయందును జెప్పఁబడియున్న"వని యుదాహరించియున్నాఁడు. "వేదార్థనిర్ణాయకములగు బ్రహ్మసూత్రము" లనుటలోనే వాదియొక్క మతము సిద్ధింపనట్లు సుస్పష్టము.

(b) బ్రహ్మసూత్రములయందలి "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రమువలన బ్రహ్మజ్ఞానము మోక్షసా

ధనమని ప్రతిజ్ఞ చేయఁబడియున్నది. కావునఁ 'బరమాత్మ సర్వోత్తముఁడు; సర్వకర్త; జీవునికంటె భిన్నుఁ డను జ్ఞానమే మోక్షసాధన' మను వాదియొక్క వాదము నెంతమాత్రము బ్రహ్మసూత్రములు పోషింపఁజాలవు. ఇంతియకాదు; భగవద్గీతలయందు—

"ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి."

అని బ్రహ్మనిర్వాణమగు మోక్షము బ్రాహ్మీస్థితి వలనఁ గలుగునని చెప్పఁబడినది. కాని జీవపరమాత్మభేదజ్ఞానముచేఁ గలుగునని చెప్పఁబడలేదు; వేదమన్ననో "బ్రహ్మవిదాప్నోతి పరం" బ్రహ్మవేత్తయుత్కృష్టపురుషార్థము నొందునని బ్రహ్మవిత్త్వమును బ్రశంసించుచున్నది.

ఇట్లు వేదములు, భగవద్గీతయు, బ్రహ్మసూత్రములును బ్రహ్మజ్ఞానము మోక్షసాధనమని తెలుపుచుండ, జీవపరమాత్మభేదజ్ఞానము మోక్షసాధనమని చెప్పుట వాదియొక్క కల్పనమే కాని ప్రమాణసిద్ధ మెంతమాత్రము గాదు.

(c) కావున వాదియొక్క మతతత్త్వములు వాదిమైదవకలమందుదాహరించిన వేదములయందును వేదార్థనిర్ణాయకములగు బ్రహ్మసూత్రములయందును,భగవద్గీతయందును నెంతమాత్రము చెప్పఁబడలేదు గావున వాదియొక్క మతము వైదికజనమున కేరికిని గ్రాహ్యము కాకయున్నది. కావున

వాదిమతమున నేతత్సిద్ధాంతములు వేదసమ్మతములని రుజువుచేసికొను బాధ్యత వాదియందే యున్నది.

**5.** అర్జీ 4 వ కలమునఁ జెప్పఁబడిన తత్త్వములు వాదియొక్క స్వకపోలకల్పితములు. కావున వాదితోడనే బయలు వెడలిన వగుటంజేసి యివ్వాని యవైదికములును, నాధునికకల్పితములు నగుచున్నవి. ఒకవేళ వాది యీతత్త్వములు మధ్వాచార్యులవారిగ్రంథముల ననుసరించిన ద్వైతమునతత్త్వములే యని చెప్పుకొనినను, క్రీ. శ. 12 వ శతాబ్దమున లెక్కింపఁబడిన మధ్వాచార్యులవారికాలమునుండియే వచ్చినవని చెప్పనగును. అట్లైనచో నీతత్త్వములను వైదికమతతత్త్వము లనుటకంటె 'మాధ్వద్వైతతత్త్వము' లని చెప్పిన నొప్పిదముగా నుండును. అట్లైనఁ బ్రత్యేకముగా నివి మాధ్వద్వైతతత్త్వము లగుటంజేసి యవైదికములగు ద్వైతమతతత్త్వములలో నొకమతతత్త్వమైనఁ గావచ్చును. అంతియు కాని ప్రస్థానత్రియముచే సిద్ధించుతత్త్వములుమాత్రము కావు. కావున వైదికమతతత్త్వము లెంతమాత్రముగాక, యవైదికములే యగుచున్నవి.

6. వాదియొక్క తత్త్వములు నిష్ప్రమాణకములు స్వకపోలకల్పితములు, నాధునికములును, వివాదాధ్యాసితములగు ద్వైతాంతర్భూతములు నగుటంజేసి "ఇదమిత్థం" అని నిర్ణయించుటకుఁదగు నావకాశము లేదు గావున నివ్వానికుతత్త్వములే యని సుస్పష్టము. ఇట్టికుతత్త్వములను యథార్థములనియుఁ, బ్రస్థానత్రియప్రమాణసమ్మతము లనియు వాది

సర్వవిధముల రుజువుచేసికొనునంతవఱకు వాదిమతమున కెంత మాత్రము వైదికత్వము సిద్ధింపనేఱదు. ఇట్టిస్థితిలో వాదిచే ననాద్యవిచ్ఛిన్న సద్గురుపరంపరాప్రాప్తజ్ఞానులగు శ్రీ గౌడ పాదాచార్యులనుగూర్చియు, శ్రీవిద్యాశంకరభగవత్పాదాచార్యులవారినిగూర్చియు 7వ కలమునందుఁ జేసిన నిందచే వాది యనృతవదనాశ్లీలకీర్తనాదిదూషణలకుఁ బాల్పడుచు నందులకుఁ దగు శిక్షకు నర్హుఁడగుచున్నాఁడు. మఱియు సర్వలోకపూజ్యులగు మతకర్తలగ్రంథరాజములయర్థమును గ్రహించుటకు దగుసామర్థ్యము వాదికి లేకపోవుటయేకాక దుర్జనత్వమును నవజ్ఞతయును బ్రకటించుచున్నాఁడు.

7. అర్జియెనిమిదవకాలమునందుఁ బ్రతివాదు లగు నద్వైతులు చెప్పుచున్నటుల వ్రాయఁబడిన నాల్గు విషయములు వాదిస్వకపోలకల్పితములులేకాని నిజమగు నద్వైతమత తత్త్వబోధకములుగావు. మఱియు శాస్త్రసిద్ధములును సంప్రదాయసిద్ధములునుగూడ నెంతమాత్రముకావు. సంప్రదాయ రహితులును సంప్రదాయ జ్ఞానశూన్యులు నెద్దియో యొక తీరునఁ జేయు కుశంకలకుఁ దగు సమాధానముల నీయఁబ్రయత్నించుట సత్సంప్రదాయధర్మవిరుద్ధము గావునఁ బ్రకృతమా యసంగతములను వారించుటకుఁ బ్రతివాదు లెంతమాత్రము దలపెట్టరు. ఇంతియ కాదు - వాదికి స్వమత మేదియో స్పష్టపడుటలేదు. స్వమతజ్ఞానసంపాదన మేగ్రంథములవలన లభించునో వాదికి స్పష్టముగా దెలిసినట్లును గన్పట్టదు.

8. ఇఁక వాదియొక్క మతతత్త్వములను, వాదివాశ్రిత లను లెస్సఁగా విచారించిన నాధునికములగు క్రైస్తవమహమ్మదీయ మతములయొక్క తత్త్వముల ననుసరించియున్నట్లు కనుపట్టక మానదు." అని.

ఇట్టి మా స్టేటుమెంటుకు శ్రీతీర్థులవారు వారముదినములకే కాదు నేఁటికిఁగూడ సరియగు సమాధానము నిచ్చి తమ మతస్థాపనమును గావించుకొనక మౌనముద్రను ధరించుట చాల శిష్టవిదూరవ్యాపారమై యున్నది. ఇద్దానిఁబట్టి శ్రీ తీర్థులవారు పరమతదూషణము నెట్టులో చేతురుగాని స్వమతనిర్వహణమున కుంఠితగమనము గలవారై మంథరప్రవృత్తు లగుచున్నారని తలంపనొప్పును. కావున నిఁక నీ విషయమునఁ దీర్థులవా రతీతమార్గమునకు సుముఖులై పలాయనమును గావించుచున్నా రని మేము నిశ్చయించుచున్నారము. పై పుస్తకములలోని ప్రథమాంశవిమర్శనము ననే యిట్లు నిరుత్తరము కలుగ నిక గ్రంథవిమర్శనము చేయ ననవసరమని మేముకూడ నింతటితో విరమింపఁదలంచితిమి.

ఇట్లు,

శ్రీసదనము
గుంటూరు
20-3-35

వ్యాకరణవిద్యాప్రవీణ: ఓరుగంటి నీలకంఠశాస్త్రి
ఉభయభాషాప్రవీణ: ఆకెళ్ల మల్లు సోమయాజులు
వేదాంతపారీణ: పోతుకూచి శ్రీరామమూర్తి
సిద్ధాన్తి: పోలూరు వేంకటసుబ్బయ్యశాస్త్రి

# పంచరాత్రము

జగద్గురు, శ్రీ కల్యాణానందభారతీ మహాంతాచార్య స్వామిపాదులవారిచే 'మధ్వమతభంజన'మను శీర్షికతో జరుపఁబడిన యుపన్యాసావళిలో 18 వ యుపన్యాసము

[ఇంతకుపూర్వము జరుపఁబడిన యుపన్యాసము లుభయమతసాధారణములగు గ్రంథముల నాలవాలముగాఁ జేసికొనఁబడి యీయఁబడినవి. ఇయ్యది యన్ననో, అద్వైతమతమునకుఁ బ్రమాణము గానట్టియు మధ్వమతమునకు ముఖ్య మగు ప్రమాణరాజముగా నలరారుచున్నట్టియుఁ 'బంచరాత్ర'మను గ్రంథము నాలంబనముగాఁ జేసికొనబడి యుపన్యసింపఁబడినది గావున నీ యుపన్యాసము ముఖ్యముగా నలరారుచున్నది. కావున పాఠకులు శ్రద్ధతో గమనింతురుగాక!]

మధ్వాచార్యులవారు "వేద పంచరాత్రయో రైక్యాభిప్రాయేణ పంచరాత్రస్యైవ ప్రామాణ్య ముక్తమ్" "వేదాదపి పరం చక్రే పంచమం వేద ముత్తమం, భారతం పంచరాత్రంచ" అనియుఁ జెప్పుచుఁ బంచరాత్రమునకు వేదముకంటెకూడఁ బ్రామాణ్యమును గల్పించుటచే నీ పంచరాత్రమను పేరిట నీ యుపన్యాసమును గావింపవలసి వచ్చినది. ఇంతియకాదు, "పంచరాత్ర మఖాఖిలం ప్రమాణం" అనియు నచ్చటచ్చటఁ జెప్పుచుండుటచే నీ పంచరాత్రము వారిమతమున కెక్కుడు ప్రమాణగ్రంథమని తెలియవచ్చుచున్నది. కావున.

నిద్దానియందు వారిమతతత్త్వము లెట్లు చెప్పఁబడియున్నవో విచారింతము.

నారాయణుఁడు లక్ష్మికిఁ జెప్పెనని బ్రహ్మ నారదాది మహామునులకుఁ జెప్పుచున్నట్లో పంచరాత్రి ప్రస్థానము బయలుదేరినది. ఇందుఁ దొలుత నారదాదిమహామునులు బ్రహ్మను సందర్శింప నిచ్ఛగలవారలై యెచ్చటను గానక యెట్లో మందరపర్వతము జేరి యందొక గుహాయందు వైష్ణవ రూపమును ధరించి మౌనమును దాల్చిన బ్రహ్మను గాంచి నట్లును, అట్లు వారు బ్రహ్మను గాంచి కడు నాశ్చర్యము దోఁప "కిమిదం ధార్యతే రూపం కిమిదం మౌన మాశ్రితమ్?" అని ప్రశ్నించినట్లు నుపక్రమింపఁబడినది. ఇట్లు బ్రహ్మ ప్రశ్నింపఁబడినవాఁడై నారదాదుల నుద్దేశించి—

"అనుసంధానసిద్ధ్యర్థం దాసవేషో మయా ధృతః,
సంసృతోఽహం సముత్పాద్య విష్ణునా ప్రభవిష్ణునా.
అధీతవేదోఽపి పురా..."

అని సమాధానము చెప్పెను. ఇందు తపశ్చరణమునకు యోగ్యస్థానమగు తన సత్యలోకమును వీడి త్రిలోకసృష్టి కర్తయగు బ్రహ్మ,రహస్యముగ మందరద్రోణియందు మారు వేసమును దాల్చి డాఁగియుండుటను గనిపెట్టి నారదుఁడు తనమనంబున నెద్దియో యొకయనుమానము దోఁప "కిం జపన్ ఇహ తిష్ఠసి" అని ప్రశ్నించెను. ఇంతియకాదు, తాఁ త్రిలోకసంచారియైనను, అట్టి రూపము నెచ్చటను గాంచక

పోవుటచేతనో లేక యా రూపము వే రెవ్వరికైన విధింపఁ
బడుటచేతన్నో కాని నారదుఁ డాశ్చర్యముతో బ్రహ్మ నుద్దేశించి
"కిమిదం ధార్యతే రూపం?" అని ఆతురతతోఁ బ్రశ్నించెను.
శిష్టాగ్రేసరుఁడగు నారదున కట్టిరూప మాశ్చర్యమును గొల్పు
టంజేసి, యయ్యది శిష్టులు ధరింపనిరూప మని సుస్పష్టమయ్యె
డిని. అయ్యదియే దాసవేషము.

దాసవేషలక్షణము:

'యేతు సంశ్రద్ధయా సమ్యక్సంతాప్యదహనే భుజే
దక్షిణే ధారయిష్యంతి స్యాత్తేభ్యః పరమా గతిః."
'శ్వేతం పీతం తథా రక్తం ద్రవ్యంతు త్రివిధం మతం
పుండ్రాణాం ధారణే విప్ర! మయైవ ప్రకటీకృతమ్."

అను మొదలగు శ్లోకములచేఁ ద్రిపుండ్రధారణము
తప్తశంఖచక్రధారణము నని సుస్పష్టమగుచున్నది. ఇందు
సాధారణముగా విధింపఁబడినరీతిని మిగిలిన పంచరాత్ర
ప్రమాణవాదులు భుజమూలములయందే శంఖచక్రధారణము
చేయుచుండ నీమధ్వమతానుయాయులు తద్భిన్నదేశముల
యందుఁగూడ వేఱొక రెండు ముద్రలను ధరించుట యేటి
శాస్త్రసమ్మతమో తెలియరాకున్నది.

ఇంతియకాదు. పంచరాత్రమునే ముఖ్యప్రమాణ
ముగాఁ జెప్పుకొనుచు నిమధ్వసంప్రదాయానుయాయులు
అందుఁ జెప్పఁబడిన శ్వేతపీతరక్తాత్మకమగు త్రిపుండ్రధారణ
మును జేయక తద్విరుద్ధముగ దీర్ఘమగు ధూమ్రరేఖవంటి
పుండ్రమును రాహుగ్రసితచంద్రాకారముగల యొకముద్ర

ను ప్రధానముగ ముఖమున ధరింతురు. దీనివలన దాస భావమున ముఖ్యమగు శంఖచక్రాంకన త్రిపుండ్రధారణముల యందీ మధ్వ లెంత ప్రామాణ్యమును బంచరాత్రమునకుఁ గల్పించిరో బుద్ధిమంతు లూహింతురుగాక!

ఇట్టిదాసవేషమును జెప్పి ముక్తికి సాధనముగా—

ధృత్వా పుండ్రాణి గాత్రేషు బ్రహ్మాహ మితిభావినః,
విముక్తా యాంతి మద్భావం శాశ్వతం హేయవర్జితమ్.
3-10-130.

అని చెప్పెను. దీనినిబట్టి "అహం బ్రహ్మ" అను జ్ఞానము మోక్షసాధనమో, లేక మధ్వచెప్పినరీతిగా జీవబ్రహ్మల కుండు భేదజ్ఞానము మోక్షసాధనమో ప్రజ్ఞావంతు లూహింపఁ గలరు. ఇంతియకాదు; ముక్తిసాధనము భేదబుద్ధిదూషణపూర్వకముగ నిరూపింపఁబడినది. ఎట్లన—

"దేహా దహంకృతిం హిత్వా మమత్వ మితరేషుచ,
కేవలం బ్రహ్మభావత్వమాత్మనో హ్యనుభావయేత్.3-3-9

బ్రహ్మాహమితి యో బ్రూయా ద్బ్రహ్మాభ్యేతి విచక్షణః
దేహోఽయమితి భావేనయథామాయాముపైతిహి3-3-10

"బ్రహ్మైవాహం న సంసారీ నిత్యముక్తో న శోకభాక్.
అచ్యుతోఽహమనంతోఽహ మవ్యయోఽస్మిస్వరూపతః॥4-1-96
ఇతి వేదోపనిషదా భావనా హ్యాత్మశోధినీ." 4-1-97

అని

ఇందు మమకారమును వదలి తనకు బ్రహ్మభావమును భావనచేసికొనుచు "బ్రహ్మోహం" అనుభావించువానికే బ్రహ్మభావరూపమగు ముక్తి ఘటించుననియు, వేఱొకవిధమగు భావనచేసిన మాయాపతితుఁ డగుననియు, నిత్యముక్తుఁడగు బ్రహ్మమునే నేనుగాని దుఃఖభాజనుఁడగు జీవుఁడు నేనెంతమాత్రముగాను, స్వస్వరూపముచే నవ్యయుఁడను, అనంతుఁడ నగుచున్నా ననునదియే యుపనిషత్సమ్మతమగు భావనయనియు సుస్పష్టముగఁ జెప్పఁబడియుండ, "పరమాత్మ జీవునికంటెభిన్నుఁడు (వేరైనవాఁడు) అనుజ్ఞానమే మోక్షసాధనము; ఈతత్త్వములే ప్రస్థానత్రయమునందును జెప్పఁబడియున్నవను తీర్థులవారివాదమును, "ఘాతయంతి హి రాజానో రాజాహమితి వదంతమ్" అను విష్ణుతత్త్వవినిర్ణయమందలి మధ్వాచార్యులవారిదృష్టాంతపూర్వకమగు నభేదనిందావాక్యమును వారికి ముఖ్యప్రమాణరాజ మగు పంచరాత్రమున కనుకూలింపక పోవుటయటుండ, ప్రత్యుత యత్యంతవిరుద్ధము లగుచున్నవి. అభేదభావనయే శ్రుతిసమ్మతమని తీర్థులవారిపంచరాత్రమునొక్క చెప్పుచుండఁ దద్విరుద్ధమగు భేదభావనయే శ్రుతిసమ్మతమను తీర్థులవారివచన మెంతప్రమాణమో తెలియనగును. దీనివలన మధ్వాచార్యులవారిప్రమాణగ్రంథమే వారిభేదబోధ కెంతమాత్ర ముపకరింపక సర్వవిధముల విరోధమునే యాపాదించుచున్నది.

ఇంతియకాదు; తీర్థులవారి జగత్సత్యత్వమునుగూడ నీ పంచరాత్రతంత్రము సర్వవిధముల దూరుచునే యున్నది.

పంచరాత్రిమున బ్రహ్మాభిన్నమగు నీ జగత్తంతయు మిథ్య యనియే చెప్పబడుచున్నది. ఎట్లనగా

"సర్వానందమయో నిత్య స్సర్వలీలానికేతనః,
సర్వావధిః సర్వశేషీ సర్వవేదాంతసమ్మతః. 1-7-21

తస్మాదన్యన్నైకరూపం మాయాకార్య మిదంజగత్,
అనిత్యం మృగతృష్ణాభం గంధర్వనగరోపమమ్. 1-7-22

ధన్యోఽయ మత్యజత్స్నేహ మనాత్మని విగర్హితే,
మమత్వం వనితాపుత్రధనోపకరణేషు చ. 4-37

మాయామాత్రమిదం జ్ఞాత్వా గంధర్వనగరోపమమ్,
అతిదుస్త్యజ మేతస్మిం ల్లోకే విషయసేవనమ్. 4-38

అని.

ఇద్దానివలన నానందమయుఁడగు పరమేశ్వరునికంటె భిన్నమును తుచ్ఛద్వైతభూయిష్ఠము నగు నీజగ మంతయు మాయాకార్య మనియు, సర్వశేషియు సర్వవేదాన్తవేద్యుఁడు నగు పరమేశ్వరుఁ డొక్కఁడే నిత్యుఁడు సత్యమనియు సుస్పష్టముగఁ దెలియవచ్చుచున్నది.

ఇంతియకాదు; ద్వైతనాశనము కాకుండఁగ సంసారమోక్షము కల్గి ముక్తి యెన్నటికిని సిద్ధింపనేర దని కూడ స్పష్టముగ,

ద్వైతం నాస్తీతి బోధేన మనసో ద్వైతనాశనమ్
ఏతదంతోహి సంసారో బ్రహ్మన్నేవం విచారయ.(2-2-27)

అని పంచరాత్రము ఘోషపెట్టుచున్నది. దీనిఁబట్టి ద్వైతబుద్ధి త్వ్యక ముముక్షువునకు నశింపవలయునని సుస్పష్టమగుచుండ ద్వైతబుద్ధియే మోక్షసాధన మను శ్రీమధ్వాచార్యులవారి వాక్యమును, తదనుయాయులయాలాపములను గూడ నేమనవలయునో తెలియరాదు.

ఇంతియ కాదు, అనుమానస్వరూపమును నిరూపించియుఁగూడఁ బంచరాత్రము జగత్తు మిథ్య (త్రికాలములలోను లేనిది) అనియు, నద్దానికిఁ గారణభూతమగు బ్రహ్మము అకర్తయనియు సుస్పష్టముగ—

"యద్యద్విలోక్యతే తుచ్ఛం సర్వం మిథ్యేతి గీయతే,
అతోఽస్య కారణం బ్రహ్మ హ్యకర్తేవ నిరూపితం." (4-8-21.)

అని మొఱవెట్టుచుండఁ బంచరాత్రప్రమాణంమన్యులగు మధ్వాచార్యులవారు ప్రపంచమిథ్యాత్వానుమానఖండన మను తమ ప్రకరణమున—

"విమతం మిథ్యా దృశ్యత్వాత్, యదిత్థం తత్తథా యథా సంప్రతిపన్నమ్" ఇత్యుక్తే జగతోఽభావాదాశ్రయాసిద్ధః పక్షః, అత్ర హేతుః ఆత్మనోఽపి దృశ్యత్వాదనైకాంతికః, జగతోఽభావేఽనుమానస్యాప్యభావ ఇతి తర్క-బాధితత్వేనాధ్యవసితః, ప్రత్యక్షాదివిరుద్ధత్వాత్కాలాత్యయాపదిష్టః, విమతం సత్యం ప్రమాణదృష్టత్వాత్, యదిత్థం తత్తథా - యథాఽఽత్మేతి ప్రయోగాత్సత్ప్రతిసాధనః, శుక్తిరజతస్యాప్యనిర్వచనీయత్వాభావాత్సాధ్యవికలో దృష్టాంతః" అనియుఁ,

ప్రమాణలక్షణమున "ప్రత్యక్షాగమాదిభి ర్జగత స్సత్య
త్వాత్, ఆత్మనోఽపిదృశ్యత్వాత్" అనియు నుపన్యసించుట
కడుంగడు నాశ్చర్యమును గలిగించుచున్నది. "యద్యద్విలో
క్యతే సర్వం తుచ్ఛం మిథ్యా" అని పంచరాత్రము ప్రబో
ధించుచుండ, దానిప్రక్కనే మధ్వాచార్యులవారు "జగత్స
త్యం దృశ్యత్వాత్, ఆత్మవత్" అని బోధించుట వారిప్ర
మాణగ్రంథములయందు వారికిఁ గలిగిన యప్రామాణ్యము
నంతను వేయినోళ్ళ వెలిబుచ్చుచున్నది. ఆత్మకూడ దృశ్య
మగుచో ఘటపటాదులరూపములయందు విప్రతిపత్తు లెవ్వరి
కిని లేనట్లు ఆత్మస్వరూపనిర్వచనమునందుఁగూడ విప్రతి
పత్తులే లేక యాత్మస్వరూపనిర్వచనమున బయలువెడలిన
యసంఖ్యాకములగు మతములు బయలువెడలుటకే కార
ణము లేకపోయెడిని. అంతియకాదు, దృశ్యములగు ఘటపటా
దులు నశించిన ట్లాత్మకూడ నశింపవలసియుండును. ఇట్టి
మధ్వాచార్యులవారియొక్క ప్రమాణవిరుద్ధవచనములఁబట్టి
తీర్థులవారు, లోకవంచనమును మధ్వాచార్యులవారు చేయు
చున్నారని వ్రాయుటకు మారుగ శ్రీవిద్యాశంకరభగవత్పా
దులవారు చేయుచున్నారని వ్రాసిరని తేటతెల్లమయ్యెడిని.
'సత్ + య' శబ్దార్థవిచారణచేతనే సత్యము నశ్వర మెంత
మాత్రము గాదని తెలియవచ్చుచుండ జగత్తు సత్యమును,
నశ్వరమును ననుట కడుంగడు విచిత్రము.

ఇంతియకాదు, బ్రహ్మవాదులగు నద్వైతులను మా
యావాదు లనియు, వైదికమతప్రవర్తకులగు గౌడపాద శం

శరభగనత్వాదులు నూతనముగ మాయావాద మను నొక వాదమును గల్పించి రనియు ధ్వాంతమతప్రవర్తకు లచ్చట చ్చట మోహితలను మోహించుట తత్ప్రమాణగ్రంథద్రష్టలకు నాశ్చర్యమును గల్గింపకపోదు. ఎందుచే ననఁగా: వారికిఁ బ్రమాణగ్రంథరాజమగు పంచరాత్రమునందే యిట్లు సుస్పష్టముగఁ జెప్పఁబడియున్నది -

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరంతి తే॥
3-1-22

అవ్యక్తా శాశ్వతీ సర్వబీజభూతా ప్రతిష్ఠితా।
కార్యానుమేయా ప్రకృతిశ్చిచ్ఛరీరతయా మతా॥ 3-1-24
స్వాశ్రయవ్యతిరేకేణ స్థాతుం గంతు మనీశ్వరా।
తచ్ఛరీరతయా సైవ తదాయత్తా గుణక్రియా॥ ,, 25
వ్యక్తా మాయా కార్యరూపా నైకరూపా ప్రజాయతే।
సర్వదా నైకరూపేయం పరిణామస్వభావతః॥ ,, 27
అనిత్యా హ్యసతీ మిథ్యా వస్తుభూతాపి దుర్గ్రహా।
దుస్తరా దుష్ప్రధర్షా చ దురూహా దుర్విచేష్టితా॥ ,, 28
మాయాయవనికాచ్ఛన్నో యథాఽహం కారితో యదా।
మాయాభోక్తా నరైర్విద్ధో మాయాగతి రనీశ్వరః॥
3-1-35

ఆబ్రహ్మభూత స్త్రిగుణో మలినో దుఃఖభాజనః।
జీవోఽయం మత్స్వరూపోఽపి సంసారే వ్యావసీదతి॥
3-1-36

మాయామాత్రమిదం సర్వం దేహం దేహానుగంచ యత్,
హేయబుద్ధ్యా న గృహ్ణీయా దాత్రిజన్నాత్మస్థితో నరః.
అహి. 4-7. 23.

ఇందు బ్రహ్మవాదులగు నద్వైతులు చెప్పెడి మాయాస్వరూపముకంటె వేఱుగ నొకింతయైన మాయాస్వరూపము చెప్పఁబడక బ్రహ్మవాదులు చెప్పినట్లే మాయాపతియగు పరమేశ్వరుఁడే సంసారమునందు మునిఁగి జీవవ్యవహారమును గనునుగాని పరమేశ్వరునికంటె నెంతమాత్రము జీవుఁడు వేఱుగాఁ డనికూడ "జీవోయం మత్స్వరూపోఽపి మాయయా సంసారే హ్యవసీదతి" అని చెప్పఁబడినది. కావున, నీమాయావాదము సర్వప్రమాణభూతములగు శ్రుతులయందేకాక వారికి ముఖ్యప్రమాణమగు పంచరాత్రమునందును శతవిధములఁ జెప్పఁబడియేయుండ మధ్వసంప్రదాయానుయాయులు, అద్వైతమతప్రవర్తకు లిద్దానిని నూతనముగ బయలు వెడలఁజేసిరని చెప్పుట వారిప్రమాణగ్రంథాపరిశీలనమువలనఁ గలిగినదోషమో, లేక లోకవంచనమునకైఁ బ్రవర్తింపఁజేసిన విషయమో, మఱియెద్దియో స్పష్టముగఁ దెలియరాకున్నది.

పై తత్త్వము లిట్లు పంచరాత్రమునఁ బ్రతిపాదింపఁబడి పరమరాద్ధాంతముగా నుపాసనావిధానమును, దత్స్వరూపమును సుస్పష్టముగ నిట్లు నిరూపింపఁబడియెను -

"బ్రహ్మార్పణం బ్రహ్మహవి బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్।
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥ 4-1-112

తులు జగన్మిథ్య యని చెప్పునది ప్రమాణవిరుద్ధము గావున సత్యమని నిర్వచింప సాహసించునా?

ఇంతియకాదు; రెండవపాదమున రెండవ యధ్యాయమును వీరించుకేనియుఁ జూచినట్లు తోఁపదు. చూచియుండినచో ద్వైతము సత్యమని పలుకుచు నద్వైతమును దూలనాడ సాహసింతురా? సాహసింపరు. ఈ రెండవ యధ్యాయమందలి నారాయణుని యుపదేశమునకుఁ బ్రకృతోపయుక్తమగు విషయమును బ్రదర్శించుచున్నారము. ఏమన—

సర్వాధారతయా బ్రహ్మన్ అహ మేకోఽద్వయః పరః।
మదేకాయనత స్సర్వ మహ మేవ న సంశయః॥
పా. 2. అ. 2-26.

ద్వైతం నాస్తీతి బోధేన మనసో ద్వైతనాశనమ్।
ఏతదంతో హి సంసారో బ్రహ్మ న్నేవం విచారయ॥
అని 2-27.

అని. అనఁగా సర్వజగత్తున కాధారభూతముగ నద్వితీయుఁడను పరుఁడనగు నే నొక్కఁడనే యున్నాను. ఈ పరిదృశ్యమానమగు జగం బంతయు నేనే యాధారముగాఁ గల్గి యుండుటవలన నీ జగం బంతయు నేనే యగుచున్నాఁడను. అందు సందేహములేదు. ద్వైతములేదను బోధచే మనస్సునకు ద్వైతజ్ఞానము నశించును. ఈసంసార మంతయు ద్వైతనాశనమే.

నీపంచరాత్రము వక్కాణించుచున్నది. కావున పంచరాత్ర ప్రమాణవాదులుగూడ జీవపరమాత్మభేదమును వీడినప్పుడే ముక్తిగాని యంతవఱకు ముక్తి యెంతమాత్రము ఘటింప నేరదని తెలియునది. ఇందు వేఱొక విశేషము గలదు. మధ్వాచార్యులవారు తాము బోధించెడిమార్గమునకుఁ బ్రతిబంధకము కలుగునేమో యను సందేహముతో గడుసాహసమును వహించి తమగ్రంథమున "స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" అనుచో "అతఏవ అతత్త్వమసీతి భేదస్య సవక్తృత్వోపన్యాసః సద్దృష్టాన్తకః; నచ శారీరపరాభేదే తాత్పర్యమ్" అని "అతత్త్వమసి" అని భేదమును గావించిరి. అయ్యదియు "బ్రహ్మాస్మీతి నసంసారీ తత్త్వమస్యాదివాక్యతః" అను పై పంచరాత్రవాక్యముచే దూషింపఁబడుచున్నది. పోనిందు, పంచరాత్రమునందేకదేశమే శ్రీమధ్వాచార్యులవారికిఁ బ్రమాణముగుటచే నీపై నుదాహరించినవి వా రంగీకరింప రందుమా, అట్లనుటకు "పంచరాత్ర మథాఖిలం ప్రమాణం" అను మధ్వాచార్యులవారి వాక్యముచేతనే వలనుపడకున్నది. పై శ్లోకములవలనఁ బంచరాత్రమే మనోబుద్ధ్యహంకారసంసారు లెంతమాత్రము జీవాత్మయొక్క వాస్తవస్వరూపము గాదనియు నయ్యది మాయాకల్పితమనియు, యథార్థముచే జీవుఁడు బ్రహ్మస్వరూపమే యనియు సుస్పష్టముగఁ దెలియఁజెప్పుచుండ నయ్యది యంతయు విజ్ఞానవిహీనతచే గ్రహింపక శంకరభగవత్పాదులే యట్లు చెప్పిరనుచుఁ జేయుచున్నున్మత్తనాట్యమునకును, నున్మత్తాలాపములకును వేఱు లెవ్వరు సమాధానముఁ జెప్పఁబూనుదురు? అట్టివారికి

సమాధానమును జెప్పఁ బూనిన శిష్యులు సమాధాత నాక్రో
శింపరా? కావున నో విద్వచ్ఛిరోమణులారా! మతగ్రంథము
లన్నిఁటి నామూలాగ్రముగఁ జదివి యుందలి గుణదోషము
లరసి యప్పుడు మతవిమర్శనఁ జేయఁబూనినచోఁ దమకోటి
వారల కయ్యది సంతోషావహ మగునుగాని వేఱొండు కాదు
గదా!

ప్రకృతము ననుసరింతము. ఇట్టి తత్త్వములను బంచ
రాత్రము చెప్పి చెప్పి తాఁ జెప్పినదానియందుఁ బ్రమాణముగ,

"ఏవం" బ్రహ్మవి దాప్నోతి పరమిత్యనుశాసనమ్,
బ్రహ్మవి ద్భవతి బ్రహ్మైత్యేషాచ పరా శ్రుతిః॥ 1-6-45

అని శ్రుతిని బ్రమాణీకరించెను. కావున మధ్వాచా
ర్యులవారికి ముఖ్యప్రమాణగ్రంథ మగు పంచరాత్రమే యీ
తీరున మధ్వమతవిరుద్ధముగ బోధించుచుండ నీ మధ్వమత
ప్రవర్తకు లెందుకొఱకీ గ్రంథమును బ్రమాణముగ గ్రహించి
రనినచోఁ దమ కెట్లో యొకతీరున సంప్రాప్తమయిన యీ
తప్తశంఖచక్రాద్యంకనములు దానియందు ముఖ్యముగ విధిం
పఁబడుటయు నద్దానిని శ్రీ విద్యాశంకర భగవత్పాదులు
బహిష్కరించుటయు నిందుఁ గారణములుగాఁ దెలియవచ్చు
చున్నవి. ఇట్లు పంచరాత్రమును మధ్వమతానుయాయులు
గ్రహించుటయు నందుఁ దమ కభీష్టమగు దాసవేషమైనను సం
పూర్ణముగ లేకపోవుటయును జూడ—

"కాకమాంసం శునోచ్ఛిష్టం స్వల్పం తదపి దుర్లభమ్"
అను లోకోక్తి వన్నెకెక్కుచున్నది. ఈ శంఖచక్రాద్యంక

నము సర్వవిధముల శిష్టులయొక్క స్మృతులయందు నిషేధింపబడియున్నది.

బృహన్నారదీయమున—

"శంఖం చక్రం మృదా యస్తు కుర్యాత్తప్తాయసేన వా,
స శూద్రవద్బహిష్కార్యః సర్వస్మిన్ ద్విజకర్మణః.
శంఖచక్రాద్యంకనం చ నృత్యగీతాదికం తథా,
ఏకజాతే రయం ధర్మో నజాతు స్యాద్ద్విజన్మనః. అనియును

నిర్ణయసింధువునందు —

"తేన యే తప్తముద్రాది విధయ స్తే శూద్రవిషయాః"
అనియు,

స్మృత్యర్థచంద్రోదయమున—

"శివకేశవయో రంకాన్ శూలచక్రాదికాన్ ద్విజః,
న ధారయేత మతిమాన్ వైదికే వర్త్మని స్థితః."
అనియు, ఇంకను నిబంధనగ్రంథములయందు శిష్టస్మృతులయందును బరిపరివిధముల నీశంఖాద్యంకనములు, దూషింపఁబడినవి. ఇంతియకాదు, సూతసంహితయందు,

"స్వదేహే పరదేహేవా న కుర్యా దంకనం నరః,
యది కుర్యాచ్చ చక్రాద్యైః పతత్యేవ న సంశయః॥"

అని చెప్పఁబడినది. ఇట్టి నిషిద్ధవ్యాపారములను బోధించుటచేతనే పంచరాత్రము—

"ఏవం సంబోధితో రుద్రో మాధవేన మురారిణా।
చకార మోహశాస్త్రాణి కేశవోఽపి శివేరితః॥

కాపాలం లాకులం వామం భైరవం పూర్వపశ్చిమం।
పాంచరాత్రం పాశుపతం తథాన్యాని సహస్రశః ॥
చకు్రః ... ... ..." అని కూర్మపురాణమునందును,

స్కాందమున—

"పాంచరాత్రేచ కాపాలే తథా కాలముఖేపిచ।
శాక్తేచ దీక్షితాయూయం భవేయుర్బ్రాహ్మణాధమాః॥"
అనియు,

లింగపురాణమున—

పాంచరాత్రం ప్రశంసన్తి కేచిద్భాగవతం మునే।
కేచిత్కాపాల మిచ్ఛన్తి కేచిత్పాశుపతం మునే॥
కేచిద్బౌద్ధం ప్రశంసన్తి కేచిద్దిగంబరం మునే।
తాన్యేవ శ్రద్ధయా యుక్తాః పరిగృహ్య ద్విజాతయః॥
ఆచరంతిహి పాపాని .........." అనియు,

వాశిష్ఠమున—

పాంచరాత్రేచ కాపాలే పాషండే వ్యాఖలేషుచ।
దీక్షితాశ్చ భవిష్యంతి మనుష్యాః పాపకారిణః॥"

అనియు, నిట్లే యనేకగ్రంథములయందును బహువిధ ముల దూషింపఁబడినది. మధ్వమతప్రమాణగ్రంథములలోఁ జూడామణియగు నీపంచరాత్రతంత్రమే వారి కీరీతిగ ననుప యుక్తమగునప్పుడు మిగిలిన ప్రమాణగ్రంథము లెట్లు వారి మతతత్త్వములను బోధించునో విబుధులే యూహింతురుగాక!

— నీలకంఠశాస్త్రి.

శ్రీజగద్గురు శ్రీకల్యాణానందభారతీ మహాంతాచార్య మహాస్వామిపాదులవారిచే "మధ్వమతభంజని", అను శీర్షిక క్రింద జయప్రదముగ జరుపబడిన వింశత్యుపన్యాసముల యనంతరము గద్వాల పురీపౌరజనులచే శ్రీస్వామిపాదుల పాదారవింద సన్నిధియందు సమర్పించుకొనఁబడిన

# అభినందన పత్రిక.

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్యేత్యాది సకలబిరుదాంచిత శ్రీ విద్యాశంకరపదమూలవేశపత్రకాశిత శృంగగిరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధీశ్వర భారతీసంప్రదాయ

సార్వభౌమ జగద్గురు

శ్రీ కల్యాణానందభారతీ మహాంతాచార్య మహాస్వామిపాద

పాదారవిందసన్నిధేః,

అయి! పూజ్యపాదాః!

అనుగృహ్యతాం శ్రీమద్గద్వాలపురీపౌరజనై ర్వైదిక ధర్మానుయాయిభి స్సంపాదితా సవినయ మియం విజ్ఞాపనాపత్రికా.

వైదికమార్గప్రవర్తక సర్వతంత్ర స్వతంత్ర శ్రీమద్విద్యారణ్యస్వామిపాదై ర్విద్యానగరరాజధానీ కర్ణాటకసింహాసన మాస్థాపి తాధ్యాత్మికరాజ్యలక్ష్మీః సకల రాజన్యసమ్మానితాపి వికరాళకాలకబలితా సమ్మూర్ఛితేవ కతిపయ

కాల మకల్పయ దుత్కంఠితాం నిజభక్తజనహృత్సీమాను. అచిరమేవ శ్రీబోధానందభారతీ మాంతాచార్యస్వామిపాదై రతికృపాళుభి స్సాదరముద్ధృతా శ్రీచరణకరకమలసమర్పితా త్రయీమయీ వాగ్విలసితసారస్వతామృతేన సంజీవితా పున రపి తారుణ్య మాపద్య దిగంతవిశ్రాంత మాతనోతి కమపి నూతనశోభావిశేషమ్. సంతత మానందసంధాయినీ చాద్య సమారాధ్యతే అనన్యసాధారణ మనల్ప మాద్వైతికీన మన వద్యమద్యప్రతిభా వైశారద్య మార్యపాదా నాశ్రిత్యచరితార్థ తాం గమిత మియతా కాలే నేత్యత్యంతం మోదామహే; కిం చాశాస్మహే నిరూఢస్థితిస్సా సర్వస్య స్వాన్ముఖ్య మచిరేణైవ సంపాద్య సుస్థిరా భవిష్యతీతి.

శ్రీవిద్యాశంకరాధిష్ఠితాం భారతీసంప్రదాయపరంప రాగతాం వ్యాఖ్యానసింహాసనాధీశ్వరతా మనవద్యా మద్యా లంకుర్వాణానాం బ్రహ్మవిద్యాప్రవచన ప్రవీణానాం భవ తాం భారతీ సువ్యాఖ్యాతవతీ విరాజతే ప్రస్థానత్రయోప బృంహితాన్ సర్వా నౌపనిషదాన్ ధర్మా నిత్యత్యంత మను గృహీతోఽంతేవాసిలోకః.

సూక్తిసహస్రద్యోతితాత్మనా మత్రభవతా ముద్య త్పూర్వప్రభాభాసురాభి స్సర్వతోముఖశేముషీవిలసత్సూ యుక్తిరత్నప్రభాభి రంతరాళనిగూహిత మచిరంతనం సాంద్రం ద్వైతం తమః క్వాప్యభిద్రావితమ్. అణీయసీభి శ్చిరంతనబుద్ధిభి రున్మీలితపూర్వ మప్యఖండతయా తత్త్వ మప్రతిపాద్య ముప

పాదితవద్భి ర్వింశతిసంఖ్యాకై రుపన్యాసై ర్మహానేప న్యాసః పరావరే సమ్యక్కృత ఇతి కిం నోపకృత మార్యపాదైః. న కిమపి భవతా మాత్రేత్ర ఫలాభిసంధి ర్లోకకళ్యాణమంతరా. "లోకవత్తు లీలాకైవల్య" మితి బాదరాయణసూక్తి రేవాభివ్య క్తిం భవాదృశా మాచారమ్.

వయమ ప్యద్య భావత్కపదాబ్జప్రవణతా మాసాద యితు మహైతుకీ మవ్యాజామనన్యాం భక్తిం సమాశ్రితాః, నతు శక్తాస్తావకీనగుణగణాఖ్యానవిధిషు.

శ్రీమజ్జగద్గురో! అంతస్తోషవ్యతికరవశా దాఖ్యేయ మాఖ్యాతు మపర్యాప్తేయ మాస్మాకీ వాణీ, కుంఠితగమనా స్వైరం స్వైరం సంలపంతీ వినేయతా మాలంబతే.

కళ్యాణైకరసా కళాపరిచితి స్స్వానందసమ్పత్ప్రదా
స్వచ్ఛస్ఫాటికకాయకాంతివిలసచ్ఛైలాత్మజాప్రాభవా
త్రయ్యంతప్రతిపాద్యతత్త్వనిరతా బోధైకలభ్యాఽనిశం
ద్వైతధ్వాంసవిశుద్ధచిత్తఫలకే బాభాతు వో భారతీ!

ఇత్థం, విజ్ఞాపయితారః,

5-2-35,
గుంటూరు.

వైదికధర్మానుయాయినో,
గర్తపురీ పౌరజనాః.

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్యేత్యాదిసకల
బిరుదాంచిత శ్రీవిద్యాశంకరపదమాఽఽవేశప్రకాశిత
శృంగగిరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధీశ్వర భారతీసంప్రదాయ
సార్వభౌమ జగద్గురు శ్రీకళ్యాణానందభారతీమహాంతా
చార్య మహాస్వామిపాద పాదారవిందసన్నిధిని భక్తి
పురస్సరముగ సమర్పించుకొనిన

# రత్నపంచకము.

సీ. శ్రీరాజితుండా దినారాయణపదమ్ము
నందు సంభూతిభాగ్యంబు నొంది
సర్వజ్ఞశంకరాచార్యమాఖ్యావలంబ
మున సర్వతోముఖాభోగ మంది
ప్రీతి విద్యారణ్య శ్రీధరపూజ్యప్ర
దస్థాపితంబయి సుస్థితిఁ గని
అద్వితీయులగు బోధానందసుధగీర
థోక్తివిశేషమం దొదిగి మెదిగి

గీ. ఆత్మవిద్యామృతప్రవాహంబు నేఁడు
భరతఖండమందు త్వదీయభవ్యపావ
నాజ్ఞలను వెల్లువలు గట్టునట్టి దయ్యె
శృంగగిరివిరూపాక్షపీఠాంగ దేవ!

సీ. వైదికధర్మసస్యోదయమ్మునకు శ్రా
వణవార్షుకాభ్రవైభవము లుండు

ద్వైతకాంతారసంతానమ్ము భస్మసా
త్కృతి సేయు దావాగ్నికీల లుండు
వాదియుల్లంబులో వల భల్లసం దూరి
పేటాడు బల్లెంబుపోటు లుండు
జిజ్ఞాసుజనములచేతులఁ గమ్మని
యనఁటిపం డొలిచిపెట్టినటు లుండు
గీ. కరుణతోడ బోధానందగురు లొసఁగిన
యట్టి వ్యాఖ్యానసింహాసనాధిరూఢు
లై తెలుపుచుండఁ దాము శ్రుత్యర్థములను
శృంగగిరివిరూపాక్షపీఠాంగ దేవ!

సీ. నేఁడుగా యద్వైతనిర్మలమతము స్వీ
యయశంబు నింపె దిగంతములను
నేఁడుగా డాఁగియుండిన తత్త్వము ప్రసిద్ధ
మయ్యె వింశత్యుపన్యాసములను
నేఁడుగా తావకాంతేవాసిహృదయసం
భవసంశయము పటాపంచలయ్యె
నేఁడుగా యభివృద్ధినిం బొందె మా శ్రీజ
గద్గురుపీఠికాగౌరవంబు
గీ. తాము లోకకళ్యాణార్థమై మెలంగ
భారతీసంప్రదాయసర్వస్వతంత్ర
పరమహంసబోధానందగురుయతీంద్ర
శిష్యవర్య! కళ్యాణవిశిష్టనామ!
తే. తమపైని మాకు! గల యు
త్తమభక్తిం దెల్పఁగడఁగెదముగాక గురూ

త్తమ ! భవదీయసుగుణవా
రము లెక్కింబెట్ట మా తరం బది యగునే ?

ఉ. పరమంబౌ ధిషణాప్రభావగరిమన్ భాష్యత్రయంబున్ సుధీ
స్ఫురణం బొప్పఁ బఠింపఁ జేసితిరి మున్ శోధించియున్నాళ్ళుదు
ర్భరదీక్షన్ బరకీయదుర్మతము ద్రుంపంజాలినారార ! యే
కరణిన్ మీ ఋణ మీఁగనేర్తుము నమస్కారంబునంగా కిఁకన్ ?

5—2—35, గుంటూరు.

ఇట్లు విన్నవించు వైదికధర్మానుయాయులు,
గర్తపురీ పౌరులు.

---

## జోత — (నమస్సు)

ఓయొజ్జలమేల్బంతీ !

నడిగీము కొడుకునొడుదుడుకునుడుల
తడబాటుబాటల గీటున బుచ్చి సాటి
లేని మేటికీరితి పూరుబందిరి దచ్చి
కడల నింపి సొంపారితిరి.

ఓ కావిదాల్పుమానికమా !

తొలిమినుకుల తుదిరతనపునిగనిగలవెలుగు
జగముల మిగుల నెగయ బొదిగిన
నల్లదీవిబోడప్రోడ మేలినుడులతీరును
దీటుదల దీరిచిన మీమాటకారితనమును
మిగుల గొండాడ నెవరికి దరమగును?

ఓవక్కాణసింగపుగద్దియజేడా!

మీమ్మాటల యూవ గాటు
పోటరులగు పోటిగాండ్రు
కనుగొలుకులను
తెలివిగాండ్రి నోళ్లను
నీరూరించినది.

సామీ!

మీకు సినువులపై గల
నెనరుకలిమిబలిమి యెట్టిదో
మా కాఱుచట్టముల విద్దియ శేబరమునకు
లేమిడి వచ్చినది.
మీ వాకలో బరుసవేది లేకున్న
మా యెడందమకిల యడంగి
రంగారుబంగారగుట యెట్లు?
తాము తెలివిగఱపు తెఱగులో
దిరుగబోతకో యున్నను
రుచిలో దరుగు లేదు.
మీ వక్కాణపు విన్నాణము
తియ్యదనముతో వియ్యమాడినది
దిద్దుబాటుతో ముద్దులాడినది.

ఇట్లు,
అడకువ బత్తిగల
గద్దియయొద్ది పెరిమపుజట్టులు.

5-12-35.
గుంటూరు.

# వైదిక ధర్మసంవర్ధని.

సంపుటము 1] ఏప్రిల్ 1935 [సంచిక 4


ఉత్తరాదిమఠస్థులగు

## సత్యధ్యానతీర్థులవారి

# దుర్వాదనిర్వాపణము.

'మహామహోపాధ్యాయ'

బ్రహ్మశ్రీ తాతా సుబ్బారాయ శాస్త్రులవారు.

### ఉపోద్ఘాతము.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యేత్యా ద్యనేక గుణసంపన్నులయిన శ్రీమ దుత్తరాదిమఠ సంస్థానాధిపతి శ్రీమ త్సత్యధ్యానతీర్థులవారు "వైదికమత సిద్ధాన్త ప్రచార" మను నొకపుస్తకమును బ్రకటించి దానిని చర్చించుటకై విజయనగరములో 1932 వ సం॥ మార్చి 26, 27, 28 తారీఖులలో జరిగిన విద్వత్సభయందు నా గ్రంథము ననుసరించిన మఱికొన్ని యంశములను బ్రశంసించియున్నారు. వీరు వ్రాసిన పుస్తకములలోను వీరి ప్రసంగములలోను అద్వైతమతము వేదసమ్మతము కాదని నిరూపింపఁబడియున్నది. కాని నేను విమర్శించి చూచినపుడీగ్రంథకర్త లద్వైతమతమునుగూర్చి

యిచ్చిన బిరుదము అద్వైతమతమునకు సరిపడదనియు, నా
బిరుదము ద్వైతమతమునకే సరిపడుననియు నాకుఁదోఁచెను.
కాని, ద్వైతమతము వేదసమ్మతము కాదని నిరూపించుట
నా కవసరమగు ననిగాదు. ఒక మతమును దూషించిన నేమి
లాభము గలుగును ? అంతమాత్రమునఁ దన్మతావలంబు
లద్దానిని విడనాడరుగదా! అద్వైతమతము వేదసమ్మతము
కాదని, వీరుపన్యసించినదంతయు శ్రుతిలోని కొన్ని భాగము
లను నితర ప్రమాణగ్రంథములలోని కొన్ని భాగములను
మరుగుపరచి, యుపన్యసించినదే కాని సత్యము నెంతమాత్ర
ము వ్యక్తపఱచినదిలేదు. ఈ విషయము సామాన్యజనుల
కందఱకుఁ దెలియఁబఱచుటకై నే నీ యుపన్యాసమును వ్రాసి
తిని. ఆయాప్రమాణసందర్భముల నెఱిఁగినవారికిఁ దెలియ
పఱచు నవసరమే లేదు. వారి కందఱకు నే నుపన్యసించెడి
యంశములకంటె నెక్కుడు నంశము లిదివఱకే తెలిసియున్నవి.

## సామాన్యదృష్టి.

సామాన్యముగఁ బక్షపాతములేని గ్రంథకర్తలందఱు
నద్వైతము నుపనిషన్మతమనియు వేదాంతమత మనియు
వాడుచు వచ్చిరి. మిగిలిన మతముల నిట్లు వాడుటలేదు. ఉప
నిషత్తులు వేదమని యంగీకరించినవా రందఱు నద్వైతమతమే
వేదసమ్మతమని యొప్పుకొనక తప్పదు. అందులో నంతయుఁ
గాని, కొంతకాని వేదముకాదు, ప్రమాణముకా దనిచెప్పిన,
వారు చెప్పినమాటలను నమ్మవచ్చునా? ఉపనిషత్తులు వేద

మనియుఁ బ్రమాణమనియు నంగీకరించువారు అద్వైతమతము
వేదసమ్మతము కాదని యనఁజాలరు. ఈ యంశము నాయీ
యుపన్యాసములోఁ గొంతవఱకు స్పష్టము కాఁగలదు. ఇందలి
మంచిచెడ్డలను నిష్పక్షపాతబుద్ధిగల ప్రాజ్ఞులు గ్రహింతురని
నమ్ముచున్నాను.

## ఉపనిషత్తాత్పర్యము.

వీరి గ్రంథము ప్రత్యక్షాది ప్రమాణసిద్ధమైన భేద
మును, అట్టిభేదము ననుసరించి యనువదించినశ్రుతులను నాధా
రముగఁ జేసికొని వానికి విలక్షణముగనున్న శ్రుతుల కపార్థ
మును గల్పించి ప్రవర్తించినది. అద్వైతులు ప్రత్యక్షాది
ప్రమాణసిద్ధభేదమును వ్యవహారములో నిరాకరింపరు. అద్వై
తులమతమున మాయోపాధికమైన చైతన్యమీశ్వరుఁడనియు
నవిద్యోపాధికమైన చైతన్యము జీవుఁడనియు సోపాధికులగు
జీవేశ్వరులు భిన్నులే యనియు నుపాధివినిర్ముక్తమగు చైతన్య
మేకరూపమే యనియు నంగీకరింపఁబడినది. ఎచటనైన జీవేశ్వ
రులకు భేదము చెప్పఁబడినచో నయ్యది సోపాధికుల కనియు,
నైక్యమును బోధించినచో నయ్యది యుపాధివినిర్ముక్త శుద్ధ
చైతన్యతాత్పర్యక మనియు, వ్యవస్థను జేసి భేదబోధకశ్రుతులకు
గాని యైక్యబోధకశ్రుతులకుఁగాని క్లిష్టార్థకల్పన మక్కఱ
లేకయే సరళముగ శ్రుతిసమన్వయ మగునని యద్వైతులు
తలంచిరి. అద్వైతులే యననేల? బ్రహ్మసూత్రములకుఁ దమ
తమ యభిప్రాయముల ననుసరించి విభిన్నార్థములవ్రాసినవారు
తప్ప మిగిలిన యాస్తికదర్శనానుయాయులు, నాస్తికదర్శనాను

యాయులును గూడ నుపనిషత్తు లద్వైతమతమునే సరసముగ బోధించు ననుతలంపుతో నద్వైతుల నౌపనిషదు లనియు వేదాంతు లనియు వాడుచు వచ్చిరి. వ్యాసనూత్రములకు నితరాభిప్రాయములను వ్రాసి తదభిప్రాయానుకూలముగ శ్రుతుల నేదో యొకవిధమున సమన్వయింపఁబూనిన ద్వైతమతావలంబులను ఔపనిషదులు, వేదాంతులు అనుపేరుపెట్టి యెచటను వాడలేదు. వ్యాసనూత్రములకు భిన్నాభిప్రాయములను వరించి పరస్పరము స్పర్ధచేయుచున్నవారిలో నెట్టి వాదుకలను జేసి కొనినను వైయాసికమతాభిమానులు కానట్టి యితరసిద్ధాన్త కర్తలీవాదమునఁ దటస్థులై యుండి యద్వైతమతము నుపనిషన్మతమనియు వేదాంతమతమనియు వాడుచు నితరమతముల నటుల వాడకుండిరిగదా! అట్టి పక్షపాతము వారి కేల యుండవలయును? మఱియు వైయాసికసిద్ధాన్తమున నవాంతరశాఖలలోఁ జేరిన యేకొంతమంది విద్వాంసులో తప్ప తక్కిననిరభిమానులైన సర్వసిద్ధాన్తకర్తలు ఉపనిషత్తు లద్వైతపరములే యని యొప్పుకొనియుండఁగా స్వమతాభినివేశముచేఁ గొంతమంది యొప్పుకొనకున్న నద్వైతమున కేమిలోపము? సూర్యప్రభ సర్వవస్తుప్రకాశక మని యెల్లరు నంగీకరించుచుండ, దివాంధ మంగీకరింపకపోయినచో సూర్యప్రభ కేమిలోపము?

## ద్వైతుల యభినివేశము:

ఈగ్రంథముపై నేమి విమర్శించి వ్రాయుదమన్నను, దానికిఁ జూపిన ప్రమాణము లన్నియుఁ బ్రక్షిప్తము లనియుఁ

గల్పితము లనియును జెప్పెదరు. అట్టివారి కేవిధము నైన సంతుష్టిని గల్గించుట కష్టమే! ఐనను మా ప్రయత్నము నితరులకుఁ దెల్పుటకుఁగాని "తాఁబట్టిన కుందేటికి మూఁడేకా" ళ్లనునట్లు పట్టుపట్టి తమకుఁ బ్రతికూలమని తోఁచిన యుపనిషదాది గ్రంథములు ప్రమాణములు కావనుటకు సాహసించి ద్వైతిమతము బ్రతిష్ఠితము చేయువారికొఱకుఁగాదు. కాని, వారుకూడ ముఖ్యముగ నొకవిషయమును గమనింపవలసియున్నది. వీరి మతమునకుఁ బ్రథమప్రవర్తకులగు నానందతీర్థులవారు తమ గ్రంథములలోఁ బ్రస్తుతము లోకములోఁ బ్రసిద్ధముగ వాడఁబడుచున్న యష్టోత్తరశతోపనిషత్తులుగాక మఱికొన్ని యుపనిషత్తులను వాడుక చేసియుండిరి. వీరివలెనే తక్కినవా రివి యప్రమాణము లనుటకు సాహసించియుండు రేని వీరిమతమునకు మూలభూతములైన యానందతీర్థీయభాష్యములే నిర్మూలము లగును. ఈసంగతిని వీరు గమనింపకుండుట చదువరుల కాశ్చర్యజనకము కాకపోదు.

## జీవేశ్వర భేదహేతువు.

పైని మేము చెప్పిన జీవేశ్వరభేదము మాయాకృతమని నృసింహోత్తరతాపిన్యుపనిషత్తులో స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. ఈ యుపనిషత్తును విశిష్టాద్వైతమతప్రవర్తకు లగు రామానుజాచార్యులవారు తమ భాష్యములో నుదాహరించియుండుటచే నది ప్రమాణ మనుటలో మా కా పెద్దసాక్ష్యమే చాలును. ఆ యుపనిషద్వాక్యములఁ జూడుఁడు.

"ఏవ మేవైషా మాయా స్వావ్యతిరిక్తాని పూర్ణానిక్షేత్రాణి దర్శయిత్వా జీవేశా వాభాసేన కరోతి, మాయయా చావిద్యాచ స్వయమేవ భవతి, సైషా చిత్రాసుదృఢా బహ్వాంకురా స్వయంగుణభిన్నా" ఇత్యాది. ఆభాసకల్పిత మజ్ఞానావస్థలో సత్యముగనున్నను, నిజస్థితికి వచ్చినపుడు సత్యము కానే ఆమగదా! ఆ పారమార్థికసత్యముఁ దెలియకున్నంతవఱకు నిదియే సత్య మని వ్యవహరింపకతీరదు. పారమార్థిక సత్యమును దెలిసికొనినవారికిఁగూడఁ దరింపవలయునన్న నాసత్యమును దెలిసికొనుట యావశ్యకముగనుక దానికి సాధనములుగ నధికారానుగుణముగఁ గర్మలు, ఉపాసనములు నేర్పరుపఁబడినవి ఈ యవస్థలలోనే యుపాస్యోపాసకభావము, జ్ఞేయజ్ఞాతృభావము, ధ్యేయధ్యాతృభావము, నియమ్యనియామకభావము, మొదలగునవి యేర్పడినవి. నియమ్యనియామక భావమిట్టి జీవేశ్వరులకే యని పై యుపనిషత్తులోని "అభిమంతా జీవః, నియంతా ఈశ్వరః" అను మున్నగు తదుత్తర వాక్యములలోఁ జూపఁబడినది.

## జీవేశ్వరైక్య హేతువు.

పైని వ్రాయఁబడినవి పరమార్థావస్థలో నుండెడి యైక్యమున కెట్లు ప్రతిబంధకము లగునో తెలియకున్నది. అట్టి యైక్యమునుగూడ నీ యుపనిషత్తులోని తదుత్తర వాక్యములు స్పష్టపరచుచున్నవి. చూడుఁడు!

"సవా ఏషభూతా నీంద్రియాణి విరాజశ్చ దేవతాః కోశాంశ్చ సృష్ట్వా ప్రవిశ్యామూఢో మూఢ ఇవ వ్యవహర న్నాస్తే. మాయయైవ తస్మాదద్వయ ఏవమాత్మా సన్మాత్రో నిత్యశ్శుద్ధో బుద్ధస్సత్యో ముక్తో నిరంజనో విభు రద్వయా నందః పరః ప్రత్యగేకరః" అని.

స్థూలదృష్టితోఁ జూచిన భేదమే తోఁచునుగాని కొం చెము సూక్ష్మదృష్టితోఁ జూచినచో నైక్యమే గోచరించును. స్థూలదృష్టి గలవారికి ఘటశరావాదులు భిన్నమనితోఁచినను సూక్ష్మదృష్టితోఁ గార్యకారణభావ విచారణా చతురులు చూచినచో నవి మృత్తికకంటె వేరుకాదేని వేరుకాదని గోచ రించును. ఈ యభిప్రాయమును "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యమ్" అను మున్నగు శ్రుతులు వ్యక్తపరచుచున్నవి. ఈ సిద్ధాన్తమునే "తదనన్యత్వ మారం భణ శబ్దాదిభ్యః" అను వైయాసికసూత్రము బోధించుచు న్నది. ఈ సిద్ధాన్తమునుబట్టి బ్రహ్మమునకు జగదుపాదాన కారణత్వము సిద్ధించుచున్నది. కావుననే శ్రుతిలోఁజెప్పఁబడిన యేకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము కలుగునను ప్రతిజ్ఞ సమంజస మగును. జీవుఁడు బ్రహ్మముకంటె సర్వవిధముల నత్యంతవిల క్షణుఁడైనచో నీ ప్రతిజ్ఞ కుదురదుగదా! జీవుఁడు బ్రహ్మో పాదానకుఁడుగానిచో బ్రహ్మవిజ్ఞానముచే జీవవిజ్ఞానము కలు గుటకు వీలులేదు గదా! సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞాకార్యములోని సర్వపదమునకు జీవాతిరిక్తపరముగ సంకోచమును జెప్పుట యుక్తము కాదుగదా! కావున నీ యద్వైతుల కేశ్రుతులు

విరోధింపవు. ద్వైతము మూలాజ్ఞానము నశించునపుడు నశించునది. మాయాతిరోధాన మున్నంతవఱకు భేదమే సత్యముగ భాసించును.

## మార్గభేదము.

ఇట్లు సత్యముగ భాసించెడి యవస్థలోఁ గ్రమముగఁ దరించుటకై మార్గము లధికారభేదముచే విభిన్నము లగుచున్నవి. ఈయధికారిభేదమునుబట్టియే వేదములోఁ గర్మకాండోపాసనాకాండము లుపదేశింపఁబడియున్నవి. కర్మకాండకంటె నుపాసనాకాండ ముత్తమాధికారుల కుపయోగించు ననునంశ మందఱికిని దెలిసినసంగతియే. కావుననేగదా కర్మకాండపరులగు గృహస్థులకంటె నుపాసనాకాండపరులగు సంన్యాసులు పూజ్యులుగ నెన్నఁబడుచున్నారు. ఈ రెండును సమానాధికారికములైనచో సంన్యాసులు గృహస్థులకంటె ఘనతగలవా రేల కావలయును? కావున నధికారభేదముచేత నీ యుపదేశభేదము చేయఁబడియున్నది యను విషయము నొప్పుకొనక తీరదు.

ఇంతయేల! అతిపామరజనము మొదలు ప్రాజ్ఞులవఱకును గలవారికి గ్రామదేవత మొదలు దహరాద్యుపాసనమువఱకు మన పురాణేతిహాసాదిగ్రంథములలో నుపదేశింపఁబడినది. ఆగ్రంథములలో మందమధ్యమాధికారులకు ననుభవసిద్ధమగు భేదపద్ధతి ననుసరించియే యుపదేశములు వ్రాయఁబడినవి. ఉత్తమాధికారులకును నుత్తమోత్తమాధికారులకును నీభేదపద్ధతి

యనుసరింపఁబడలేదు. ఈ యుత్తమోత్తమాధికారులసంఖ్య యీమిగిలినయధికారులసంఖ్యకంటె నత్యల్ప మని యందరు నొప్పుకొనకతీరదు. ప్రకృతము మనభారతవర్షములోనివసించి యున్న సుమారు ముప్పదియారుకోట్ల జనసంఖ్యలో బ్రహ్మజ్ఞానాధికారు లుండిన నేయిద్దరో ముగ్గురో యుందురు. కావున మిగిలినవారి కందఱకు నితరోపదేశము లే యావశ్యకంబులు. సర్వసంగపరిత్యాగము చేసితి మనుకొనిన సంన్యాసులలోఁ గూడ నహంకార మమకారములను విడిచి వైరాగ్యసంపద,శమాది సంపద గలవా రెంద ఱుందురో ప్రాజ్ఞులకు గోచరముకాకపోదు. ఇట్టి యధికసంఖ్యగల యధికారులకు నుపదేశమున కేర్పడిన ప్రమాణబాహుళ్యమును బట్టి యుత్తమోత్తమాధికారుల యుపయోగమున కేర్పడిన యద్వైతబోధకప్రమాణములు స్వల్పసంఖ్యగల వని ప్రకృతమున వ్యవహారసిద్ధమగు 'మెజారిటి మైనారిటి' పద్ధతిని దెచ్చిపెట్టి యద్వైతమతమున నేదియో యొక లోప మున్నదని బోధపరుపఁ బ్రయత్నించుట ప్రాజ్ఞులకు సరియగు మార్గముగఁ దోఁపదు. ఈ "మెజారిటీ మైనారిటీ" పద్ధతి యన్నింటిలోను దెచ్చిపెట్టుట మంచిదికాదని నా తలంపు. అట్లు తెచ్చిపెట్టినచో నసత్యమనకు 'మెజారిటీ', సత్యమునకు 'మైనారిటీ', దురాచారమునకు 'మెజారిటీ',సదాచారమునకు 'మైనారిటీ'యుఁ గలిగి; యసత్యము సత్యమును, దురాచారము సదాచారమును, దమతమ మెజారిటీ బలమును బట్టి త్రోసివేయవచ్చును. కావుననే మెజారిటీ మైనా

విచారణ పామరజనవిమోహమునకు నుపయోగించును గాని ప్రస్తుతస్థితిని సాధింపనేరదు.

## శ్రుతివిరోధ పరిహారము.

జీవేశ్వరభేదమును జెప్పెడి శ్రుతు లెన్నియున్న వన్నియు నాభాసకృతమగు జీవేశ్వరభేదము నాలంబనముగాఁ జేసికొని యుండుటచేఁ బారమార్థికాభేదమును దెలిపెడి శ్రుతులకు విపరీతార్థకల్పన చేయుటకు సహకారులు కానేరవు. సమాన సత్తాకభేదాభేదములు, విరుద్ధములుగాని యసమాన సత్తాకములు విరుద్ధములు కానేరవు. భేదశ్రుతు లన్నియు వ్యావహారిక భేదమును, అభేదశ్రుతులు పారమార్థికాభేదమును బోధించుటవలన వీనికి బాధ్యబాధక భావమును గల్పించుటకవకాశము లేదు. అట్టిస్థితిలో బాధకత్వభ్రమచే సరసముగ నభేదబోధకములగు శ్రుతులకుఁ గ్లిష్టార్థమును గల్పించి భేదవాదములో సమన్వయింపయత్నించుట ప్రాజ్ఞులమనస్సునకుఁ దృప్తికరము కానేరదు. సామాన్యముగ ద్వైతమును జెప్పుచోట్ల దానియందు మిథ్యాత్వమును దెల్పుటకై ఇవ శబ్దము శ్రుతులలోఁ బ్రయోగింపఁబడుచు నేయున్నది; "యత్రహి ద్వైతమివ భవతి" "ఇహ నానేవ పశ్యతి" అను మున్నగు వాక్యములనుజూడుఁడు! "నేహ నానాస్తి కించన" అను మున్నగువాక్యములవలన ద్వైతము స్పష్టముగ నిషేధింపఁబడుచున్నది, "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను మొదలగువాక్యములలో సజాతీయ విజాతీయ స్వగత భేదరాహిత్యము ప్రతిపాదింపఁబడుచున్నది. భేదము నంగీకరించినపుడు ద్వితీయవస్తువువలన భయ ముండు

వనియు ద్వైతము నివర్తించినచో భయనివృత్తి గలుగు ననియు "అథ, సోఽభయం గతో భవతి; యదా హ్యేవైష ఏతస్మిన్నుదర మంతరం కురుతే; అథ తస్య భయం భవతి" అను మున్నగుశ్రుతులు ఘోషించుచున్నవి. ఇట్లుండ నద్వైతమతము శ్రుతిసమ్మతము కాదనుటకు వీ రెట్లు సాహసించిరో తెలియకున్నది.

## ద్వైతుల యపార్థకల్పనము.

వీరిద్వైతము పారమార్థికమని స్థిరపరచుకొనుట కీశ్రుతుల కన్నింటికి విపరీతార్థకల్పన చేయుటకు వీరు సాహసించిరిగాని యియ్యది పండితగోష్ఠిలో నిలువఁజాలదు. "యత్ర హి ద్వైతమివ భవతి" అను శ్రుతిలోఁ జెప్పఁబడిన మిథ్యాత్వమునుఁ దొలఁగించుకొనుటకై "ఇవ" శబ్దమునకు లోకమునఁ బ్రసిద్ధము కానట్టి 'ఏవకారార్థము'ను జెప్పి యీవాక్యశేషములో నున్న "యత్రి సర్వమాత్మైవాభూత్, తత్కేన కం పశ్యేత్, కేన కం జిఘ్రేత్" అను మున్నగు వాక్యములను దర్కపరముగా యోజనచేసి యట్లుదర్శనాదులు మన కనుభవసిద్ధములుగనుక దానినిబట్టి ద్వైతమే యుండితీరవలయు నని యొక వింతకల్పనమును జేసిరి. ఈ కల్పనమును దర్కముయొక్క స్వరూప మెఱుఁగని పామరులు కొంత సత్యముగ నమ్మ నను దర్కస్వరూపమును గుర్తించినవా రెవ్వరును నమ్మఁజాలరు, సరిగదా, ఇచట తర్కము ఇష్టాపత్త్యాదిదోషదూషితమై యుండుటచేత హాస్యాస్పదముకూడఁ గాక మానదు. పండితలోకమును దృప్తినొందించుట వీరి కవసరము లేక

పామరులనుమాత్ర,మేదో విధమునఁ దృప్తి నొందించుటకై
వీ రిట్టి వ్రాతలను వ్రాసిరి. కాని యిట్టివిపరీతార్థముల కవకా
శముగలుగకుండ నీ వాక్యములతో సమానార్థకములై బృహ
దారణ్యకమునందలి యారవయధ్యాయమున "యత్ర వా
అన్యదివ స్యాత్ తత్రాన్యో అన్యత్పశ్యేత్ అన్యోఽన్య
జ్జిఘ్రేత్" అని ప్రారంభమై "సలిల ఏకో ద్రష్టా, అద్వైతో
భవతి" అని యిట్లు స్పష్టమైన వాక్యము లున్నను "వీని
నెవరుచూచెదరు? మన మెద్దానిఁ జెప్పిన దానినే వినెదరు"
అనుధైర్యమును బూని కాఁబోలు వీ రిట్లు వ్రాయసాహసించిరి.

ఇంకను మహావాక్యములకు వీరు చేసిన యర్థమును
గొంచెము గమనింపుఁడు. ఛాందోగ్యములోని "తత్త్వమసి"
అను మహావాక్య మభేదమును బోధించుచున్న దని య
ద్వైతుల యభిప్రాయము. ఈ వాక్యము భేదమునే బోధిం
చుచున్నదని కొన్ని వింతవింత యర్థములను ద్వైతులు వ్రాసిరి.
ఈ వాక్యము, లోకములోని "ఈమనుష్యుఁడు నాఁడు చూచిన
మనుష్యుఁడు" అను వాక్యమువంటిది. ఈలోకములోని వాక్యము
వలన నీ మనుష్యునికిని నాఁడు చూచిన మనుష్యునికిని భేద
మున్నట్లు గోచరించునో, యైక్యమున్నట్లు గోచరించునో యెవ
రికి వా రొంటరిగాఁ గూర్చుండి యాలోచింపవలయును. వారికి
గోచరించిన సంగతిని బైకిఁ జెప్పుమని నేను నిర్బంధింపను.
వారిలో వా రాలోచించుకొనినఁ జాలును. అప్పుడు వారి
మనస్సునకు సత్యము గోచరింపకమానదు. మఱియు వారు
చెప్పిన విపరీతార్థముల నన్నిఁటిని జూపి వానిని ఖండించిన గం

దరగోళ మగును. వానిని జూపునపుడు తర్క-వ్యాకరణాది పద్ధతుల ననుసరించి వ్రాయవలసివచ్చును. అవి యాయాయి శాస్త్రములయందుఁ బరిశ్రమ చేయనివారలకు సులభముగా బోధపడుట కష్టము. పరిశ్రమచేసినవారలకు నేను గ్రొత్తగాఁ జెప్పనవసరము లేదు. వాని నిచట వివరించిన గ్రంథవిస్తర మగును. అటు లగుటయేకాక ప్రకృతలోకమున కిది నిరుప యోగ మనికూడ విడచితిని. ఈ యద్వైతమతము నంగీకరింపని ఋషికల్పులగు శ్రీ రామానుజాచార్యులవారుగూడ "తత్త్వమసి"అను వాక్యములో నభేదబోధనే యంగీకరించిరి. ఆయభేదము శుద్ధాభేదమా? లేకవిశిష్టాభేదమా? యను విచార మా రెండుమతములవారికి నుండుగాక. అభేదబోధక మను నంశమున శ్రీ శంకరాచార్యులవారును, శ్రీ రామానుజాచార్యులవారు నేకాభిప్రాయము గలవారుగనే యున్నారు. ఇంక ను భేదమును సుస్పష్టముగాఁ జెప్పుటకు "స ఆత్మా తత్త్వమసి" అనుచోట "ఆత్మా - అతత్ - త్వం"అని పదములను విరిచి పరమాత్మభిన్నుఁడు జీవుఁడని యర్థము చేసిరి. ఇట్టి పదచ్ఛేదము ద్వైతులగ్రంథములలోఁ దక్క యితరుల యేగ్రంథములలోను గాన్పడదు. ఇట్లు పదచ్ఛేదము చేసినను దీనివలన లభించెడి భేదముగూడ నసత్యమను శంక రాకుండ తత్త్వతః' అను నొకపదము వీరి కవసరము కలుగుటచే ఆత్మాతత్త్వమసి అనుచోటనే "ఆత్మా-తత్త్వం; ఆత్మా- అతత్, త్వం"అని రెండు విధములగు పదచ్ఛేదమును జేసిరి. ఇట్లు చేయుటచే "తత్త్వం, అతత్ త్వం" అను మూఁడు పదములు వీరికి లభించినవి వీనిని

బట్టి సత్యముగ జీవుఁడు పరమాత్మభిన్నుఁడను నర్థమును స్థిర పరచుకొనిరి. ఈ పదచ్ఛేదము సభంగమై యుండుటచేఁ బదావృత్తికి వీలులేదు. అట్లు వీ రుండనిచోట రెండువిధములగు పదచ్ఛేదముచే సంపాదింపఁబడిన పదము లన్నింటి నొక వాక్యములోఁ జేర్చి యర్థము చెప్పుట యేభాషాసాంప్రదాయమో తెలియకున్నది. సంస్కృతభాషలోనే కాక యేభాషలో గూడ నిట్టి వాక్యరచన యుండదు. ఆయాభాషలలోఁ బండితులగువారీ యంశమును బాగుగా నాలోచించెద రని తలఁచెదను. మఱియు నీవాక్యమున కర్థము మఱికొన్ని యుపనిషత్తులలో స్పష్టపరుపఁబడియున్నది. కైవల్యోపనిషత్తులో నీయభిప్రాయమును వివరించిన వాక్యములను జూడుము.

'సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం తత్త్వమేవ త్వమేవ తత్' అని. ఇచట వీరు విపరీతార్థమును జేయుట కేమియు నవకాశములేదు. మఱియు శుకరహస్యోపనిషత్తు మున్నగు పదునెనిమిది యుపనిషత్తులు "తత్త్వమసి" అను వాక్యమునకు వ్యాఖ్యానరూపమున నున్నవి. ఈయుపనిషత్తులు చూచిన నీవాక్యమునకు నద్వైతులు చెప్పినదే యర్థముగాని వేఱొకటి యర్థము కాదని స్పష్టము కాకమానదు. అనూచానసిద్ధములగు నీయుపనిషత్తులన్నియుఁ బ్రమాణములు కావనుటకు వీరికి హక్కు లేదుగదా? అట్లు వీ రనినచో వీరిమాటలు ప్రామాణికు లెవ్వరు నంగీకరింపఁజాలరు. ఉపనిషత్తులే కాక యనేక పురాణములుగూడ నద్వైతమును బోధించుచు నాయవస్థలో ద్వైతము మిథ్యాభూతమని స్పష్టపరచుచున్నవి. ఈపురాణ

ములలో నిట్టిభాగములకు నప్రామాణ్యమును జెప్పుటకై కొన్ని
యద్వైతనిందాపరములగు నిందావచనములను వీరు చూపె
దరు. అట్టి వచనము లున్నవి. కాని యద్వైతనిందాపరము
లగునీవచనములనుబట్టి యద్వైతబోధకవచనముల కప్రామా
ణ్యమును జెప్పినచో నీయద్వైతబోధకవచనములను బట్టి నిం
దావచనములకును నప్రామాణ్యమును జెప్పుటకుఁ దుల్యయు
క్తిచేఁ బూర్తిగ నవకాశముగలదు. కాఁగా, వీనినిబట్టి యవి
యప్రామాణములు; వానిని బట్టి యివి యప్రమాణములు.
మొత్తముమీఁద పురాణము లన్నియు నప్రామాణములే
యని తేలును. నాస్తికులు వేదము లప్రామాణము లని చెప్పు
టకై కర్మకాండమునుబట్టి జ్ఞానకాండ మప్రమాణ మనియు,
జ్ఞానకాండమునుబట్టి కర్మకాండ మప్రామాణమనియుఁ జెప్పి,
తుదకు వేదమంతయు నప్రమాణమని స్థిరపరచిరి. మఱియు బౌ
ద్ధులు, ఉదితహోమ మానుదితహోమ సమయాధ్యుషితహోమ
విధులను మూఁడు హోమవిధులకు నిందాశ్రుతు లుండుటచేత
నప్రామాణ్యమును జెప్పిరి. వీరు అద్వైతనిందావచనములను
బట్టి యద్వైతశ్రుతుల కప్రామాణ్యమును జెప్పిరి. బౌద్ధ
వాక్యములనుబట్టి హోమపక్షములను విడనాడినవారు వీరివా
క్యములనుబట్టి యద్వైతమును విడనాడవచ్చును. ఆ బౌద్ధుల
వాదమునకు వీరివాదమునకు నీయంశమున నించు కంతయు
భేదము లేదు. కావున వీరు బౌద్ధమతము నవలంబించినటుల
సుస్పష్టమగుచున్నది. పురాణము లప్రామాణములని స్థిరపర
చుట యాస్తికుల కుచితకృత్యముకాదు. కావున పురాణము

లలో నన్నిభాగములకు బ్రామాణ్యమును జెప్పుటయే యుచిత
కృత్యము. అద్వైతుల్లు చెప్పుపద్ధతులలో నన్నిటికిఁ బ్రామాణ్య
మే సిద్ధించును. ద్వైతమును, అద్వైతనిందను జెప్పువచనము
లును, అద్వైతజ్ఞానమున కధికారులగు మందమధ్యమాధికా
రుల నుద్దేశించి యుపదేశింపఁబడినవనియు; ద్వైతమిథ్యాత్వ
మును జెప్పుచు నద్వైతమును బోధించువచనములు (బ్రహ్మజ్ఞా
నాధికారులగు నుత్తమాధికారులకు నుపదేశింపఁబడినవనియు
వ్యవస్థ చేసినచో నన్నిటికిని బ్రామాణ్యమే సిద్ధించును. అద్వైత
మును బోధించెడివచనములలో నద్వైతజ్ఞానము గలిగిన తరు
వాత ద్వైతము నివర్తించుననియు ద్వైతముండుట కవకాశము
లేదనియుఁ జెప్పఁబడియున్నది. కాని, ద్వైతమునకు నింద యెచ
టను లేదు. అట్లు నిందించుట కవసరమును లేదు. ద్వైతమున్నట్లు
గోచరించినపుడుగదా దాని కనుకూలమగు ప్రవృత్తి లేకుం
డుటకై నిందావచనము లుండవలయును? అద్వైతజ్ఞానముగల
వానికి ద్వైతము గోచరించినపుడు తదనుసారిప్రవృత్తి సంభా
వితము కాకుండుటచే నట్టి ప్రవృత్తి లేకుండుటకై ద్వైతనింద
యనావశ్యకముకదా! అద్వైతనింద యట్టిది కాదు. ఏల
యనఁగా నద్వైతజ్ఞానమున కనధికారులగువారు కర్మలచేతను
నుపాసనలచేతను గదా క్రమముగాఁ దరింపవలయును? అట్టి
వారు అద్వైతమును బోధించెడి కొన్ని వచనములను జదివి
వానివలనఁ గల్గిన మిడిమిడిజ్ఞానమును బట్టి "భేదమే లేదు. కర్మ
చేయువాఁ డెవఁడు? ఎవరిప్రీతికిఁ గర్మను జేయవలయును? ఉపా
స్యుఁ డెవఁడు ఉపాసకుఁ డెవఁడు? గతం మిథ్యా, పలాయనం

మిథ్యా" అని యీ విధముగ మెట్ట వేదాంతములను జెప్పి, తమచేఁ జేయఁదగు సత్కర్మలను విడనాడి స్వేచ్ఛావిహారులై భ్రష్టు లగుటకు నవకాశ ముండును గాని వానిని బైరీతి న ద్వైతజ్ఞానమునుండి మరలించి భేదనిబంధనమగు కర్మలయందు బ్రివర్తింపఁజేయుటకై వారి నుద్దేశించి యీ యద్వైతనింద నుపదేశింపవలసివచ్చినది. కనుక నవియు భేదదృష్టికలవారి కావశ్యకము లగుటచే భేదదృష్టియున్నంతవఱకు నవి ప్రమా ణపదవినొందగలవు. ఇటుల నధికారభేదములచే వ్యవస్థితములై యున్నియుఁ బ్రమాణము లని జెప్పుట కవకాశ ముండఁగా బురాణముల కన్నింటికి నప్రామాణ్యముల జేకూరుమార్గ మును ద్రొక్కుట యాస్తికులగు ప్రాజ్ఞులకు సరియగు మార్గ ముకాదు. ఇవి యన్నియు నప్రమాణము లని చెప్పుటకంటెను "అతత్త్వమసి" అని పదచ్ఛేదము చేయుటకంటెను దమ పాండిత్యప్రకర్ష చే నేవిపరీతలక్షణననో యాశ్రయించి తమ తమ మతముల కనుకూలముగాన ట్లర్థమును జెప్పుట కొంత మంచిదిగాని కేవలము మూలచ్ఛేదము చేయుట మంచిది కాదు. ఈ పురాణము లన్నియు నప్రమాణములనియు నుపని షత్తులలోఁ జాలవఱకు నప్రమాణము లనియుఁ జెప్పువారి మాటలను వారియందు భక్తిగల యే కొంతమందియో నమ్మ దురుగాని సామాన్యముగా నమ్మరనియే చెప్పవచ్చును. అట్లు నమ్మువారుగూడ వారి గృహములయందును వారి బంధువుల గృహములయందును నీ పురాణములును నీ యుపనిషత్తులును నున్నపుడు వాని నన్నిటని వీరిమాటలనుబట్టి పారవేయుదురో

లేక తాసముత్తాతలనుండి యున్నవను గౌరవముచే భద్రముగ దాచుదురో ప్రస్తుతము నిర్ణయించుట కవకాశము లేకున్నది. ఎవరికి వారే యీ నిర్ణయమును జేసికొనవలసియున్నది. "తత్త్వమసి" అనుచోట కొన్ని యుపనిషత్తులకు విరుద్ధముగా "అతత్త్వమసి" అను పదచ్ఛేదమును జేసి తమ మతమును స్థాపింపఁ బ్రయత్నించినను, ఇతరమహావాక్యములలో నిట్టి పదచ్ఛేదములచేత సమర్థింపనవకాశము గన్పడదు. ఈ యభిప్రాయమును వ్యక్తపఱచు శ్లోక మున్నది. ఆశ్లోకము ద్వైతులకును, అద్వైతులకును వాదము జరిగినప్పుడు మధ్యస్థులుగా నుండిన వేదాంతదేశికులవారు చెప్పినదని వాడుక గలదు. దానిని ముందుదాహరించెదను. మఱియుఁ బైయుపనిషత్తు మనకుఁ దెలియని యంశమును దెలుపుటకుఁగదా! "నీవు బ్రహ్మవు కావు" అనునది యెవరికి నుపదేశింపవలయును? "నేను బ్రహ్మము"నని యీ వ్యవహారావస్థలో ననుకొనునా? అట్లనుకొనునపుడుగదా "నీవు బ్రహ్మము కావు" అని చెప్పవలయును? ఈ వ్యవహారములో నట్లనుకొనువారు గాన్పింపరు గావున వారు చెప్పినయర్థములో నీ యుపదేశవాక్యము వ్యర్థమగు నని వారు గ్రహింపరైరి.

"అసినా తత్త్వమసినా పరజీవప్రభేదినా
విద్యారణ్యమహారణ్య మక్షోభ్యమునిరచ్ఛినత్"

అను నీశ్లోకములో "అతత్త్వమసి" అని పదచ్ఛేదము చేసి జీవబ్రహ్మములకు భేదము చెప్పినచో బృహదారణ్యకోపనిషత్తులోని "అహం బ్రహ్మాస్మి" అను మహావాక్యము

చెడిపోవును. దానికి నిక్కడవలె సీకొత్తవిరువు విరుచుటకు వీలులేదుగదా! కనుకనే యీ మహావాక్యమున కీగ్రంథకర్త లర్థమును జేయుటలోఁ గొత్తత్రోవ త్రొక్కిరి. అది యెంత వఱకు సరిగ నున్నదో చూడుఁడు. ఈ వాక్యమునకు వెనుకటి వాక్యములను ముందువాక్యములను జూడకుండునపుడు వీరు చేసిన యర్థము కొంత సరిపడునట్లున్నను వెనుక ముందు వాక్యములను జూచినప్పైన నయ్యది సరిపడదని స్పష్టము కాక మానదు. ఈ గ్రంథకర్తలు చెప్పినదేమనఁ జూడుఁడు! "అహం బ్రహ్మాస్మి" అను వాక్యము బ్రహ్మవాక్యమనియుఁ గనుక దీనియందు 'అహం' అను దానికి బ్రహ్మమే యర్థమనియు 'అహం=బ్రహ్మమైన నేను, బ్రహ్మాస్మి=బ్రహ్మనైతిని' అనునర్థము చేసి బ్రహ్మమగు నేను బ్రహ్మము నని చెప్పుట బాగు లేదని యాలోచించి బ్రహ్మపదమునకుఁ బూర్ణుఁడను నర్థమును జేసి యేదో యొకవిధముగా వారికి సరిపడినట్లు ముడి పెట్టిరి. ఇచటి యుపనిషద్వాక్యసందర్భమును జూడుడు.

"బ్రహ్మవా ఇద మగ్ర ఆసీత్, తదాత్మానమేవావేత్, అహం బ్రహ్మాస్మీతి। తస్మాత్తత్సర్వ మభవత్, తద్యోదేవానాం ప్రత్యబుధ్యత సఏవ తదభవత్, తథర్షీణాం తథామనుష్యాణాం, తద్ధైతత్పశ్యన్ ఋషిర్వామదేవః ప్రతిపేదే. అహం మను రభవం సూర్యశ్చేతి తదిదమప్యేతర్హి యఏవంవేద అహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి" అని.

"సృష్టికంటెఁబూర్వము ఇది (జీవుఁడు) బ్రహ్మముగా నుండెను. అది (జీవుఁడు) నేను బ్రహ్మమునని తన్నే తెలి

కొనెను. అందువలన సర్వస్వరూపుఁడయ్యెను. దేవతలలో
దాని నెవ్వరు తెలిసికొనెనో వారే యాదియయ్యెను. అట్లే
ఋషులలోను మనుష్యులలోను 'అహంబ్రహ్మాస్మి' అని
యెవఁడు తెలిసికొనెనో వాఁడే తత్స్వరూపుఁడాయెను.
పై యంశములఁ దెలిసికొని వామదేవర్షి నేను మనువునైతిని,
సూర్యుఁడనైతిని. సమస్తస్వరూపుఁడనైతిని యనెను. ఎవ్వరు
'అహంబ్రహ్మాస్మి'అని తెలిసికొనునో వాఁడీ సర్వప్రపంచ
స్వరూపుఁ డగును.'' ఇదియే పై శ్రుతి కభిప్రాయము. ఇచట
"దేవతలలోను ఋషులలోను మనుష్యులలోను, అహం బ్ర
హ్మాస్మిఅని తెలిసికొనెనో అనుచోట అహం అనునది బ్రహ్మ
మును బోధించునా? లేక దేవర్షి మనుష్యాదులను బోధించునా?
అను సంగతిని సాధారణముగా మాటలను దెలిసికొనువా రంద
రును దెలిసికొనలేకపోరు. మొదటి 'అహంబ్రహ్మాస్మి' అను
నదికూడ జీవవాక్యము. 'ఇదం' అను శబ్దము ప్రత్యక్షమగు
జీవునిగదా బోధించును? తచ్ఛబ్దముచే నదియేకదా పరా
మర్శింపఁబడును? ఇట్టిస్థితిలో నది బ్రహ్మవాక్య మెట్లగును?
వా రనుకొనునట్లు బ్రహ్మవాక్యమైనను దదినుండి 'అహం బ్ర
హ్మాస్మి' అను వాక్యము బ్రహ్మవాక్యమనుట కవకాశమే
మియు లేదుగదా! 'అహం బ్రహ్మాస్మి' అని తెలిసికొని
వానికి సర్వప్రపంచసిద్ధి యగుటచేత నేకదా వామదేవుఁడు
'మనురూపుఁడనైతిని, సూర్యరూపుఁడనైతిని, సర్వస్వరూ
పుఁడనైతిని' అని తెలిసికొనుట కవకాశము గల్గినది. ఈ గ్రంథ
కర్త లనుకొన్నప్రకారము జీవులకుఁ బరస్పరభేద మున్నచో

వామదేవుఁడు మనుసూర్యాది సర్వప్రపంచస్వరూపుఁ డగుట యెట్లు? ఈ యుపనిషత్తునందుఁ దుదివాక్యములలో 'యఏవం వేద స ఇదం సర్వం భవతి" అను వాక్యములో నేను బ్రహ్మము నైతి నని యెవ్వఁడు తెలిసికొనెనో వాఁ డీ సర్వస్వరూపుఁడగు నని స్పష్టమైన యర్థమున్నదిగదా! ఇచట యచ్ఛబ్ద తచ్ఛబ్దములచేత ననఁగా నేవఁడు, వాఁడు, అను శబ్దములచే బ్రహ్మము బోధింపఁబడుట కవకాశము లేదుగదా! ఇచటి యచ్ఛబ్ద తచ్ఛబ్దములచేతఁ దత్త్వజ్ఞానసంపన్నుఁడని యేకదా యర్థమును గ్రహింపవలయును? వారికి సర్వప్రపంచస్వరూపసిద్ధి బ్రహ్మైక్యము లేనిచో నెటుల సిద్ధించును? ఈవిధముగ జీవ బ్రహ్మైక్యము స్పష్టముగ బోధింపఁబడుచున్నపుడు పరమార్థావస్థలో జీవబ్రహ్మభేదమును సంపాదించుటకుఁ బ్రయత్నించుట, కుందేటికొమ్మును సాధింపఁ బ్రయత్నించుటయే యని యెల్లరకు విశదము కాకమానదు. ఈ గ్రంథకర్తలు 'అయమాత్మా, బ్రహ్మ' అను మాండూక్యవాక్యములోని 'అయమాత్మా' అను శబ్దమున కీశ్వరుడే యని యర్థము చెప్పినారు. అటుల చెప్పక 'అయమాత్మా' అను శబ్దములు జీవుని బోధించినచో నీవాక్యము జీవబ్రహ్మల కభేదమును బోధింపక తీరదు. కావున వీరు 'అయ మాత్మా' అను శబ్దములకు నీశ్వరపరముగ నర్థము చేసినారు గాని వీరట్లు లర్థము చేయుటకు దీని పూర్వోత్తర వాక్యము లవకాశము నీయవు. దీని పూర్వవాక్యము 'సర్వం హ్యేతద్బ్రహ్మ" అనునది. ఈసమస్తము "బ్రహ్మ" అని పై వాక్యమున కర్థము. ఇచట 'సర్వం' అను

శబ్దము సమస్తప్రపంచమును బోధించుచున్నది. "ఏతత్" అను శబ్దము సన్నికృష్టమైన దానిని జెప్పును. కాఁగా సన్నికృష్టశబ్దముచేఁ బరిదృశ్యమానమగు ప్రపంచ మని యర్థముఁ జెప్పకతీరదు. అప్పు డీప్రపంచమునకు బ్రహ్మాభేదము నీవాక్యము బోధించుటచే నద్వైతము (అనఁగాఁ బారమార్థికావస్థలో వేఱుప్రపంచము లేదనువిషయము) సిద్ధించుచున్నది. తరువాత 'అయమాత్మా బ్రహ్మ' అను వాక్యములోని 'అయమాత్మ' అనుశబ్దమునకుఁ బూర్వవాక్యసాహచర్యమును బట్టి జీవుఁ డనియే యర్థము చేయకతప్పదు. పూర్వవాక్యములో "సర్వం హ్యేతత్" అనునది కూడ నీశ్వరునే బోధించు ననియందురేమో! అటులైనచోఁ బై రెండువాక్యములు నొక యర్థమును జెప్పుటచేఁ బౌనరుక్త్యదోషము వచ్చును. ఆ దోషము సహించుదమన్నను దానికిఁ బూర్వవాక్యము నాలోచింపఁగా నటుల చెప్పుట కెంతమాత్రి మవకాశము గనుపింపలేదు. ఆపూర్వవాక్యవిషయమును జూడుడు. "ఓమిత్యేతదక్షరం ఇదం సర్వం తస్యోపవ్యాఖ్యానం భూతం భవద్భవిష్యదితి సర్వమోంకారఏవ" అను నీవాక్యములోని 'సర్వం' అనునది గడచినదానిని, వర్తమానమును, భవిష్యత్తును జెప్పుచున్నది. ఆసర్వశబ్దముచేతఁ జెప్పఁబడినదానినే "సర్వం హ్యేతద్బ్రహ్మ" అను వాక్యములోని సద్వైతచ్ఛబ్దములు పరామర్శించెను. పూర్వవాక్యములోని సర్వశబ్దము బ్రహ్మమును జెప్పఁజాలదు. నిత్యమగు బ్రహ్మమునందు భూతత్వ భవిష్యత్త్వములు (అనఁగా—గడచిపోవుట ముందురాఁబోవుట) సంభవింపవుగదా! అని

త్యమైన వస్తువునందే యీభూతత్వభవిష్యత్త్వము లుండును. భూతత్వ మనఁగా నిదివఱకుండి యిప్పటికి నశించుట, భవిష్యత్తనఁగా నిప్పటికి లేక ముందుఁబుట్టఁబోవుట. ఈనాశము పుట్టుక యనునవి యనిత్యవస్తువునకే గాని నిత్యవస్తువునకు సంభవింపవుగదా! కనుక నచట సర్వ మనుదానికి ననిత్యమైన ప్రపంచమనియే యర్థము చేయవలయును. అదియేగదా యీవాక్యములోని సర్వశబ్దముచేఁ జెప్పబడుచున్నది? అటులైనపుడు సర్వపదమున కీశ్వరుఁడను నర్థము చెప్పుట కవకాశ మెట్లున్నది?

మఱియు "అయమాత్మా బ్రహ్మ" అను నుపదేశము బ్రహ్మజ్ఞానము కలవానికా లేనివానికా? బ్రహ్మ జ్ఞానము కలవాని కందు రేని యీయుపదేశము వ్యర్థముగదా? లేనివాని కందు రేని వినుడు. ఆత్మశబ్ద మీశ్వరుని బోధించుటచే "అయ మాత్మా" అనుదానికి 'ఈయాత్మ' అని గదా యర్థము. ఈయాత్మ యనఁగాఁ బ్రత్యక్షసిద్ధమగు నాత్మ గదా? బ్రహ్మజ్ఞానము లేనివానికి 'ఆత్మా' అనుదానికి కీశ్వరుఁడను నర్థమును జేసినచో నీశ్వరజ్ఞానము లేకుండుటను 'ప్రత్యక్షసిద్ధము' అను నర్థముగల "అయం" అను విశేషణ ముండుట కవకాశ మెట్లుండును? కావున ఆత్మశబ్దమునకు నందరకుఁ బ్రత్యక్షమైన జీవుఁ డనియే యర్థము చేయక తప్పదు. అటులు జీవబ్రహ్మైక్యము నీ వాక్యము బోధింపకతీరదు. మఱియు ముందు వాక్యములలో "స్వయమాత్మా చతుష్పాత్" అని చెప్పఁబడియున్నది. ఇచట

"అయమాత్మా" అను నపుడు జీవుఁ డనియే యర్థమును జేయవలయునుగాని కేవలబ్రహ్మ మని యర్థమును జేయుటకు వీలులేదు. చూడుడు. "చతుష్పాత్" అను మాటచే దానికి నాలుగవస్థలు ఇట్లు చెప్పఁబడుచున్నది. ఆ యవస్థ లేవి యనఁగా జాగ్రత్స్వప్నసుషుప్తులను మూఁడును, తురీయమును నింకొకటియును గలవు. మొదటి మూఁడవస్థలు జీవునకుఁ జెప్పుట యుచితముగాని బ్రహ్మమునకుఁ జెప్పుట యుచితముగాదుకదా? జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను బొందువాఁడు జీవుఁడుగాని బ్రహ్మముగాఁడు. బ్రహ్మమునకుఁగూడ మనకువలె జాగ్రదవస్థను జెప్ప సాహసించినను స్వప్నసుషుప్తులను జెప్పుట యుచితముగాదు కదా? ఈ మూఁడవస్థలు సోపాధికుఁడగు జీవునికి సంభవించునుగాని నిరుపాధికమగు బ్రహ్మమునకు సంభవింపనేరవు. అవస్థాత్రియము నతిక్రమించిన తురీయావస్థ యన్ననో నిరుపాధికమగు బ్రహ్మావస్థయే. ఈ యవస్థను జెప్పునట్టి యుపనిషద్వాక్య మిట్లున్నది.

"నాన్తః ప్రజ్ఞం నబహిః ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం నప్రజ్ఞానఘనం నప్రజ్ఞం నాప్రజ్ఞం అదృష్ట మవ్యవహారం అగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్యం, ఏకాత్మప్రత్యయసారం ప్రపంచోపశమం శివమద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః" అని.

ఈ వాక్యములోని "ఏకాత్మప్రత్యయసారం; అద్వైతం, ప్రపంచోపశమం" అను పదములు తురీయావస్థలోనఁగాఁ బారమార్థికావస్థలోఁ బ్రపంచము ద్వైతము నేక

స్వరూపముగా నుండు నని స్పష్టముగా నున్నది. ఇటుల నీ మాండూక్యములోని యుపసంహారవాక్యము "ప్రపంచోపశమశ్శివోఽద్వైతఏవ" అనుచోట "తత్త్వమసి" అనుచో 'అతత్' అని భేదము చేసినట్లుగా శివః + ద్వైతః అని పదచ్ఛేదము చేయుదురేని ద్వైతముండునపుడు ప్రపంచముండుటంబట్టి ప్రపంచోపశమస్వరూపుండ నను విశేషణ ముండుటకు వీలగునా? ఉండునేని ప్రపంచయుక్తుడు ప్రపంచరహితుం డను నర్థము వచ్చును. ఇది వస్త్రమును ధరించినవాడు వస్త్రవిహీనుండను మాటవలె నుండును. ఇట్టి యున్మత్తప్రలాపము శ్రుతిలో నుండునా? ఉండెనేని యా శ్రుతి ప్రమాణ మగునా? ఓహో! మఱికొన్ని యుపనిషత్తులవలెనే యిదియు నప్రమాణ మనియందురేమో! వీరనవచ్చును గాని యీ ద్వైతమత ప్రవర్తకులగు శ్రీమదానందతీర్థులవారు మాత్రమీ మాండూక్యోపనిషత్తును బ్రమాణముగా నంగీకరించియున్నారు. మఱియు నీ మాండూక్యోపనిషత్తు యొక్క యభిప్రాయము గౌడపాదులవారు కారికారూపముగా వివరించియున్నారు. అందు ఆగమప్రకరణమనియు, వైతథ్య ప్రకరణమనియు, అద్వైతప్రకరణమనియు, అలాతశాంతిప్రకరణ మనియు నాల్గు ప్రకరణములు గలవు. ఆ నాల్గుప్రకరణములలోను అద్వైతము బాగుగా నిర్ధారణచేయ బడియున్నది. అది యంతయు వీరు ప్రమాణముగా నంగీకరింపరుగాని యుందలి యాగమ ప్రకరణములోని వన్నియు నుపనిషద్వాక్యములే యని యీ ద్వైతమతస్థు లంగీకరింతురు. ముందు వీ రేమందురోకాని

యీగ్రంథకర్త లీమధ్య తమతో ముఖస్థముగా మాటలాడి నపుడవి యుపనిషద్వాక్యములే యని యంగీకరింతు మని చెప్పిరి. ఇప్పుడు వేఱొకవిధముగా మాట్లాడ రని నానమ్మకము. అట్లు మాట్లాడవలయు నవసరము వారి కేమి యున్నది? సర్వసంగపరిత్యాగముచేసిన సంన్యాసులు వీరు. ఈ నమ్మకముతో నీ రెప్పటికి నాగమప్రకరణవాక్యము లన్నిటి నుపనిషద్వాక్యము లని యంగీకరింతు రనియే నా నమ్మకము. ఆ నమ్మకముతో రెండు మూఁడు వాక్యముల నిచటఁ జూపెదను. వానివి జూచినచో ద్వైతము మాయాకల్పితమనియు నద్వైతమే సత్య మనియు స్పష్టముగాక మానదు.

“అనాదిమాయయా సుప్తో యదాజీవః ప్రబుధ్యతే,
అజ మనిద్ర మస్వప్న మద్వైతం బుధ్యతే తదా.
ప్రపంచో యది విద్యేత నివర్త్యేత న సంశయః,
మాయామాత్ర మిదం ద్వైత మద్వైతం పరమార్థతః.
వికల్పో వినివర్తేత కల్పితో యది కేనచిత్,
ఉపదేశాదయం వాదో జ్ఞాతే ద్వైతం న విద్యతే.”

అను నీ వాక్యముల కర్థమును వ్రాయనవసరము లేదు. చూచినతోడనే యేమాత్రముజ్ఞానముగలవారికైనను ద్వైతము మాయామాత్ర మనియు నద్వైతమే సత్య మనియు నద్వైతజ్ఞానము గలిగినపుడు ద్వైతముండదనియు స్పష్టముగా దెలియఁగలదు. మఱియు ముండకోపనిషత్తునందు “బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి” అను వాక్యము బ్రహ్మజ్ఞానము గలవాఁడు బ్రహ్మమే యగుచున్నాఁడని చెప్పుచున్నది. దీనిని

బట్టి తత్త్వజ్ఞానము గలిగినతోడనే బ్రహ్మైక్యము సిద్ధించు ననియు నాయవస్థయందు భేద ముండదనియు స్పష్టమగుచున్నది. ఇచట నీ గ్రంథకర్తలు "బ్రహ్మైవ భవతి" అను వాక్యములో బ్రహ్మశబ్దమునకుఁ దరువాత నున్న ఏవశబ్దమును భవతి శబ్దము తరువాతచేర్చి తడకమడకలుగా "బ్రహ్మ భవత్యేవ" అను క్రొత్తవాక్యమును సృష్టించి యప్పటికిని వారికిఁ గావలయు నర్థము లభింపకుండుటనుబట్టి 'భవతి' అను శబ్దమునకుఁ బొందుచున్నాఁడను నప్రసిద్ధార్థమును వ్రాసి బ్రహ్మజ్ఞానము గలవాఁడు బ్రహ్మమును బొందుచున్నాఁడు. పొందఁడని సందియము లేదని యభిప్రాయమును వ్రాసిరి. ఇట్టి యర్థమును వ్రాయుటలో వీ రెన్ని కసర్తులు పడవలసి వచ్చినదో చూడుఁడు.

1. ఒకచోట నున్న ఏవకారమును వేఱొకచోటికి బదులు తెచ్చుకొనుట.

2. 'భవతి' అను దానికి అగుచున్నాఁడను ప్రసిద్ధార్థమును విడనాడి పొందుచున్నాఁడను నప్రసిద్ధార్థమును జెప్పుట.

3. పొందుట యను నర్థముగల 'భూ' ధాతువు చురాదిలోని దగుటవలనఁ బొందుచున్నాఁడను నర్థములో 'భావయతే' అను రూపమే "వైకల్పికేషు భావానుష్ఠానం ధర్మాధిక్యాయ" అను న్యాయము ననుసరించి యుండవలసియుండఁగా 'భవతి' అను దానికే యట్టి యర్థమును జెప్పుట.

4. 'ణిచ్' ప్రత్యయము వైకల్పిక మగుటచేఁ బూర్వోక్త న్యాయము నుల్లంఘించి 'ణిచ్' లేకుండ ప్రయోగ ముండ

వచ్చునని తలంచి యాధాతు వాత్మనేపది యగుటచే 'భవతే' అని కావలసియుండఁగాఁ గర్తరిచే 'భవతి' అని యుండ వచ్చునని చెప్పుట.

ఈ విధముగాఁ బెక్కు కర్తుల నంగీకరించి తమ కిష్టమగు భేదమును సరిపెట్టుటకై యీ డొంకతిరుగుడర్థములను వ్రాసిరి. ఈ యర్థము కొంత కర్తరితిగా నున్నదని వీరును గ్రహించియే యీ యర్థము కర్తరితిదియైనను దీనికిఁ బూర్వ శ్రుతినిబట్టి యిట్టి యర్థమును జెప్పవలె నని వీరు సాధించిరి. ఆ శ్రుతులను జూపెదను బరిశీలింపుఁడు.

"విద్వాన్ పరాత్పరం పురుష ముపైతి దివ్యం" అను నీ శ్రుతికి 'బ్రహ్మజ్ఞానము గలవాఁడు బ్రహ్మమును బొందుచున్నాఁడని యర్థమును జెప్పుటచే' 'బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి' అను వాక్యమునకుఁ గూడ దీనితో సమానముగా బ్రహ్మజ్ఞానము గలవాఁడు బ్రహ్మమును బొందుచున్నాఁడను నర్థమని వీరు తలఁచిరి. ఇచట నీ పూర్వవాక్యమునుబట్టి యుత్తరవాక్యములోని 'భవతి' అను దానికిఁ బొందుచున్నాఁడను నర్థమును జెప్పుట న్యాయమా? ఉత్తరవాక్యమును బట్టి పూర్వవాక్యమునకు బ్రహ్మజ్ఞానికి బ్రహ్మస్వరూప సిద్ధి యాయె నను నర్థమును జెప్పుట న్యాయమా యని ముఖ్యముగా నాలోచింపవలసియున్నది. ఇందు బ్రహ్మజ్ఞానికి బ్రహ్మ స్వరూపసిద్ధి యయినదని యర్థము చెప్పుట యతిసులభము. ఎట్లనఁగా—"ఊయలలో బిల్లను బెట్టి యూరెల్లఁ దిరిగిన" దను శ్లోకినిబట్టి యున్నస్థితిని మఱచినవాఁడు తిరిగి యయ్యది

జ్ఞాపకము రాఁగాఁ దన కయ్యది లభించె ననుకొనుట లోకములో స్వాభావసిద్ధమై యున్నది. ఒకరూపాయి నెచటనైనఁ బెట్టి యాపెట్టిన తావును మఱచి కొంతతడవు పోయిన దని విచారించును. మఱికొంతకాలమునకుఁ బోయినదని సంగతిని గూడ మఱచును. మఱియొకప్పుడు అది యిది తిరుగవేయుచుండఁగా నిదివఱకుఁ బోయిన రూపాయియే తనకు దొరికినను అది క్రొత్తఁగా దొరికిన దని సంతసించును. కాని నిజముగా నయ్యది క్రొత్తఁగా దొరకలేదు. ఇదివఱకు మనకు సిద్ధమగు రూపాయియే లభించినది. ఇట్టిచో రూపాయిని వాఁడు పొందెనను వాఁడుక లోకమున సహజసిద్ధమై యున్నది. అట్లే తన కిదివఱకున్న బ్రహ్మ స్వరూపమును మఱచియుండి కొంత కాలమునకు సద్గురూపదేశమువలనఁ దన కుండెడి మఱపు పోఁగా గ్రొత్తగా బ్రహ్మస్వరూపమును బొందిన ట్లనుకొనును. ఇట్టిదియే యిచట బ్రహ్మమును బొందుట. ఇట్టి యర్థము లోకవ్యవహారమున నందఱకు ననుభవసిద్ధమైనదే. ఇట్లు మొదటిశ్రుతి కర్థము చేసిన కక్కుర్తు లెవ్వియును లేవు. కావున 'బ్రహ్మము వేఱు తాను వేఱు; బ్రహ్మము పొందఁబడునది, తాను బొందువాఁడు. జీవబ్రహ్మములకు భేదమునే యీవాక్యము బోధించుచున్నది. దీని ననుసరించియే తరువాతి వాక్యము మన కెన్నికక్కుర్తులు వడియైన బ్రహ్మజ్ఞాని బ్రహ్మము నొందుచున్నాడను నర్థమును చేయకతీరదు" అని చెప్పుట సరిగాదుగదా! ఇంతియగాక- "పరాత్పరం పురుషముపైతి" అను వాక్యమునకుఁ బూర్వ మందున్న మఱియొక

వాక్యమును వీరు చూపియుండినచో నీవాక్యము జీవబ్రహ్మములకు జ్ఞానావస్థలో భేదమును బోధించుననని సామాన్యముగా నెవ్వరు ననుకొనరు. ఏదోవిధముగ స్వమతసిద్ధమగు భేదము శ్రుతిలోఁ జెప్పఁబడియున్నదని నమ్మించుటకై యీ వాక్యమును వీరు మఱుఁగుపఱచిరిగాని వీ రెఱుఁగనిదికాదు కావున నా వాక్యము నంతయు నిచటఁ జూపెదము. దానిపైని యిచట భేదమే బోధింపఁబడునో, యైక్యమే బోధింపఁబడునో యెవరి మట్టుకు వారే తెలుసుకొనఁగలరు. ఆవాక్యమును జూఁడుడు. "పరేఽవ్యయే సర్వ ఏకీభవంతి" అని బ్రహ్మముతో నేకీభావమునుజెప్పి దాని నందఱకుఁ దెలియుటకై సర్వదృష్టాన్తముగా "యథా నద్యః స్యందమానా స్సముద్రేఽ స్తంగచ్ఛంతి నామరూపే విహాయ, తథావిద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యం. సయోహా వై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" అని చెప్పబడినది.

అనఁగా నదులు సముద్రములో జేరునపుడు నామరూపములను విడిచి సముద్రముతో నేకీభావమును పొందినట్లు బ్రహ్మజ్ఞానము గలవాఁడు బ్రహ్మలో నేకీభావమును బొందునని తాత్పర్యము. ఇచట దృష్టాంతములో సముద్రములో బాగుగాఁ గలిసినతరువాత నదులకు సముద్రమునకు భేదమున్న ట్లెవరైన గ్రహింతురా? ఐక్యమునేగదా గ్రహింతురు? ఆ దృష్టాంతమునుబట్టి జీవునకు బ్రహ్మకు నెటుల భేదము గ్రహింపనగును? అట్లు భేదము గ్రహింపఁబడినచో నీదృష్టాంతము సరిపోవునా? ఆలోచింపుడు. దీనిలో మొదట "ఏకీభ

వంతి" అను నేకీభావమును జెప్పి దానిని స్థిరపఱచుటకు సముద్ర
మందు లయమగు నదిని దృష్టాన్తముగఁ జెప్పిరి. ఆదృష్టాంత
మునుబట్టి జీవబ్రహ్మైక్యమును శ్రుతి స్పష్టపఱచినది. ఇట్లుండ
నీశ్రుతులు భేదమునే చెప్పుచున్న వనుటకు వీ రెట్లు సాహసిం
చెదరో తెలియకున్నది. మఱియు వారు దృష్టాన్తమును జెప్పి
నంతవఱకు దిగనాడినను దరువాతవాక్యమును వ్రాయుటలోఁ
గూడ మధ్యనున్న పదములఁ గొన్నింటిని విడనాడి యీశ్రు
తులఁ జూపిరి. ఇదియే వీరు చేసిన గడుసుఁదనము. ఆపదము
లనుగూడఁ జేర్చినచోఁ దాము చెప్పిన యర్థము నందఱు తప్పని
తెలిసికొందు రని యాపదములను విడిచిపెట్టిరి. శ్రుతులలోఁ
"విద్వాన్నామరూపా ద్విముక్తః" అను పదములను మఱుఁగు
పఱచి "విద్వాన్ పరాత్పరం పురుషముపైతి దివ్యం" అని
చూపించిరి. ఆపదములను జూపించినచోఁ నామరూపవిముక్తుఁ
డగు నను నర్థము నందఱును గ్రహించి రేని వీరిమతములోఁ
జెప్పబడిన ముక్తులకు దివ్యమంగళవిగ్రహము లుండు నను
సిద్ధాన్తమునకు భంగము కలుగునని తలఁచి యాపదములను
విడిచిపెట్టిరి. వీరిగ్రంథములను జూచినవా రందఱు నా యుప
నిషత్తులోని యాపూర్వోత్తర సందర్భమును జూచెదరా? ఏదో
విధమున వీరిముఖాచ్ఛాదనము చేయవచ్చు నని వీరు చేసిన
గడుసుదన మిది. కాని దీనిలోని సత్యము తెలిసినపుడు మొదట
వీరి మాటలను నమ్మినవా రందఱు పిమ్మట నేమనుకొందురో
యను సందేహమువీరికి లేకపోయెను. తరువాత నెవ రేమను
కొనిన వీరి కేమి? తత్కాలమందు వీరియెడ గొందఱికి గౌర

వపరిపత్తులు గల్గినచో వీరిపనులు వీరికి సఫలము లగును గదా? కాని యెందులకీవ్రశంస —శ్రీశంకరాచార్యులవారు వ్రపంచమును మోసగించుటకై ఈ పన్నాగమును బన్నినారని దూషించునటు లొకరిని దూషించుట నాపనిగాదు. కాని శాంత సత్యమును లోకమునకు వెల్లడిచేయుట యవసర మని యెంచి యిట్లువ్రాసితిని.

## ద్వైతాచార్యులదురుక్తులు—

ఈవిధముగ వారు చూపిన శ్రుతుల కన్నింటికిఁ బూర్వోత్తర సందర్భముల నాలోచించినచో వారు చేసిన యర్ధము సరిగా లేదని యెల్లరకును వెల్లడిగాకమానదు. వాని నన్నిటిని జూపినచో గ్రంథము విస్తృతమగు నని విరమించుచున్నాను. మఱియొక సంగతి- వీ రేదియో యొకసంగతి వ్రాయుటయు నిదంతయు శంకరాచార్యులవారి గ్రంథమున నున్నదనియుఁ దలచుగ వీరువ్రాసిరి. అవ్వాని నన్నిటిని శంకరాచార్యులవారు పూర్వపక్షములుగ వ్రాసినారో లేక మాయాకల్పితమును సగుణమునైన బ్రహ్మ నుపాసించుటకై యుపదేశింపఁబడిన శ్రుతులవ్యాఖ్యాన సందర్భమున వ్రాసినారో యావివరణమును వీరు చూపకయే "యద్వైతమును శ్రీశంకరాచార్యులవారేయచ్చటచ్చట నిరాకరించినట్లు లోకమునకు వెల్లడియగునటుల వీరు కొన్ని వ్రాతల వ్రాసిరి. కాని వారి సిద్ధాంతమునకు విరుద్ధముగ వారెచటను వ్రాసియుండలేదు. పై యంశమునకు వీరు చెప్పిన దానిలో నొక యుదాహరణమును జూపెదను. "అథ రథాన్రథయోగా న్పథ స్సృజతే" అను నుప

నిషద్వాక్యమును జెప్పి స్వప్నపదార్థము సత్యమే యని చెప్పి శంకరభాష్యములో వ్రాయఁబడియున్నదని వీరు చెప్పిరి. కాని స్వప్నపదార్థము సత్యమే యని యొక పూర్వపక్షమును జేసినారు. అది సిద్ధాన్తవాక్యముకాదు. ఆ పూర్వపక్షమును నిరాకరించి "న తత్ర రథాస్సన్తి నరథయోగాః నపన్థానః" అను పై శ్రుతియొక్క పూర్వవాక్యమునుబట్టి "మాయామాత్ర మకార్త్స్న్యే నానవభాసనాత్" అని వ్రాసి సూత్రమునుబట్టియు స్వప్నపదార్థము మిథ్యాభూతమనియు సిద్ధాన్తమును జెప్పియున్నారు.

## ఉపసంహారము.

ఇటు లుండ నిచ్చటి వీరి సిద్ధాన్తమును దదనుకూలము లగు శ్రుతిసూత్రములను దాఁచిపెట్టి వారి పూర్వపక్షగ్రంథమును మాత్రము చూపి శ్రీ శంకరాచార్యులవారు స్వప్నపదార్థమును సత్యమని యంగీకరించిరని చెప్పుట న్యాయమా? అయినచో నీ పూర్వోత్తరసందర్భములను దెలిసికొనినవారు చాల తక్కువ - తెలియనివారు హెచ్చు. కనుక వీరికి 'మెజారిటీ' వచ్చును. ఇట్టి మెజారిటీని బట్టియే గదా లోకులచేఁ దమ వాదమును నమ్మించుట వీరిపని. ఈ విధముననే శంకరాచార్యులవా రంగీకరించినారని వీరు వ్రాసినవన్నియు నేదియో యొకలోపముతో నున్నవని పై యుదాహరణములనుబట్టి పాఠకులు గ్రహింపఁ బ్రార్థితులు. వాని నన్నింటిని వివరించుట కవసరము లేదు.

ప్రాజ్ఞుల కొకతప్పుఁ జూపినఁ జాలదా? చాలనిచో నెన్నితప్పులను జూపినను లాభము లేదు. లాభములేని పని చేయుట నాపనిగాదు. దిఙ్మాత్రముగా స్థాలీపులాకన్యాయమునఁ బాఠకులు తత్త్వమును గ్రహింపకపోరు. ఇంత యేల! మొత్తముమీఁద వీరిమాట లెటు లుండుననిన గాళిదాసుని మేఘదూతములోని మొదటిశ్లోకమున "కశ్చిత్కాంతా" అని వినినవెంటనే "కశ్చిత్" అనునది పుంలింగము, 'కాంతా' అనునది స్త్రీలింగము. కావున నీ రెండింటికి విశేషణ విశేష్య భావ ముండఁగూడదు, "కాచిత్కాంతా" అనియే యుండ వలయును అని చెప్పినటు లుండును.

నా యుపన్యాసములో మార్దవము తక్కువయని యెవ రికైనఁ దోఁపవచ్చునుగాని యద్వైతమతప్రతిష్ఠాపకులై జగద్గురువు లని ప్రతిష్ఠఁ గాంచిన శ్రీమచ్ఛంకర భగవత్పా దులవారిని గూర్చి యీ గ్రంథకర్తలు వ్రాసినయంశమును దగ్గరనుంచి సరిపోల్చి చూచినచోఁ బ్రాజ్ఞులకు నావ్రాఁత లతి సుకుమారములై యున్నవని తోఁచు నని నాకు దృఢవిశ్వా సము కలదు.

# వైదికధర్మసంవర్ధని.

సంపుటము 1 ] మే, జూన్ 1935 [ సంచికలు ౫, ౬

## వసంతనవరాత్రి మహోత్సవము

(శ్రీసదనము, గుంటూరు).

శ్రీజగద్గురు శ్రీ కల్యాణానంద భారతీమహాంతాచార్య మహాస్వాములవారు యువ సం॥ వైశాఖ శు ౫ జయవారము (ది7-5-35) మొదలు పూర్ణిమా స్థిరవారము (ది18-5-35) వఱకు శ్రీసదనమున శ్రీపీఠసన్నిధియందు వసంతనవరాత్రిమహోత్సవమును మహావైభవముతో జరిపిరి. పలు తావులనుండి శిష్యులు, పండితులును వచ్చి యుత్సవమును దర్శించి కృతార్థులయిరి. అందు 12-5-35 తే॥ మొదలు, 16-5-35 వఱకు వైదికధర్మసంవర్ధనీసభా తృతీయవార్షికోత్సవము జయప్రదముగా జరుపఁబడినది. 12-5-35 తేదీని శ్రీస్వామిపాదులవారుపక్రమోపన్యాసమును సర్వజనహృదయాహ్లాదకముగాఁ జేసిరి. శ్రీన్యాయవాదిప్రముఖులును, వేదాంతపారీణులు నగు రాయప్రోలు లింగనసోమయాజిగారు, శ్రీమహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయ శాస్త్రులవారికి స్వాగతపత్రమును సమర్పించిరి. 13-5-35 తే॥ సాయంకాలము మూఁడుగంటల కాలము శ్రీ మహామహోపాధ్యాయ, తాతా సుబ్బారాయ శాస్త్రులవారు "ధర్మశాస్త్ర పరిణామము" అను విషయ

మును గుఱించి యత్యద్భుతరీతిని శాస్త్రీయ రహస్యంబుల తోడ నుపన్యసించి, సభ్యుల సంతోషపరవశుల నొనర్చిరి. 14-5-35 తేది సాయంకాలము "దర్శనపరిణామము" అను విషయమును గూర్చి శ్రీశాస్త్రిలవారు మూఁడుగంటలకాలము పన్యసించి షడ్దర్శనముల పరిణామాదివిశేషములను సభ్యులకుఁ గరతలామలకము గావించిరి.

శ్రీ పీఠాధీశ్వరులు 16-5-35 తేది ఉదయమున శ్రీసుబ్బారాయశాస్త్రిలవారికి నభ్యంజనస్నానమును జేయించిపట్టుపీతాంబరములతో నలంకరించి మోటారుపై మంగళవాద్య విశేషములతో గ్రత్తపురీవీథులయందు నూరేగింపు మహోత్సవమును జేయించిరి. పిదప శ్రీపీఠసన్నిధియందు శ్రీ సుబ్బారాయ శాస్త్రిలవారిని భావగర్భితముగా నూతననిర్మితమై యలంకృతమగు వ్యాకరణసింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి, సువర్ణపట్టమును ఫాలభాగమునం గట్టి, వైదికమంత్రపురస్సరంబుగఁ బావనకలశోదకంబులతోడ మహాపండితులు, న్యాయవాదిప్రముఖులు మున్నగువారు కొలువుదీర్చ నవ్వారలయనుమతితో శ్రీపీఠాధీశులగు శ్రీమహాస్వామిపాదులవారు వ్యాకరణసామ్రాజ్యపట్టాభిషేకమహోత్సవంబును గావించి "వైయాకరణ సార్వభౌమ" అను బిరుదము నొసంగిరి.

అనంతరము పిఠాపుర వాస్తవ్యులగు బ్ర॥శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు తాము రచించిన "మునిత్రయచరిత్రము" అను కృతిని శ్రీసుబ్బారాయ శాస్త్రిల వారి కంకిత మొనర్చిరి. శ్రీ సుబ్బారాయ శాస్త్రిలవారు

కవితాసామ్రాజ్యలక్ష్మియగు కృతికన్యాపరిగ్రహము నొనరించి కృతికర్తలను బహూకరించిరి.

మృదుమధురశైలీసముపేతంబును ప్రాచీనకవితాప్రతిబింబంబు నగు నాకృతిని విని సంతోషపరవశులగుచు సభ్యులు తమ్ముఁ బ్రోత్సహింప శ్రీపీఠాధీశ్వరులు కృతికర్తలను నూతన వస్త్రాలంకృతులఁ జేసి "కవితాభూషణ" అను బిరుదము నొసఁగి నారాయణ స్మరణ పూర్వకముగ బహూకరించిరి. శ్రీస్వామిపాదులవారు పరిష్కృతోత్సవమున కంగముగ నాఁటి మధ్యాహ్నమున నొక గొప్ప విందు చేయించిరి. మధ్యాహ్నము శ్రీపీఠసన్నిధియందే 4 గంటలకు సభ ప్రారంభింపఁ బడినది. రాజమహేంద్రవరము, ఆంధ్రయువతీ కళాశాలా విద్యార్థినులు ఒకయరగంటకాలము చక్కగా వీణాగాన వినోదము జేసిరి.

పిదప న్యాయవాదిశిరోమణులును వేదాంత పారీణులు నగు ఎల్లేపెద్ది సాంబశివశాస్త్రిగారు వైదికధర్మసంవర్ధనీ సభాపక్షమున శ్రీసుబ్బారాయశాస్త్రిలవారికి నభినందన పత్రము సమర్పించిరి. న్యాయవాది ప్రముఖులును వేదాంత పారీణులును సంస్కృతాంధ్రభాషాపారంగతులు నగు రాయప్రోలు లింగసోమయాజిగారు 40 నిమిషములు పండితులచ్చెరువందునట్లు మృదుమధురశైలితో సంస్కృత భాషయందు శ్రీ శాస్త్రిలవారి మహిమాదులఁ బేర్కొనిరి. శ్రీ వల్లె పూర్ణప్రజ్ఞాచార్యులుగారు నూతన కల్పనములతోఁ దాము రచించిన సంస్కృత శ్లోకములను, పద్యములను జదివి

శ్రీ శాస్త్రిలవారిని బ్రశంసించిరి. పైయువతీకళాశాలోపాధ్యాయులగు వై. మల్లికార్జునరావుగారి పద్యములను వారి విద్యార్థినులు చదివిరి. తెనాలి సంస్కృత కళాశాలోపాధ్యాయులు సాహిత్యవిద్యాప్రవీణులు నగు జమ్మలమడక మాధవరామశర్మగారు శ్రీ సుబ్బారాయశాస్త్రిలవారి ధర్మశాస్త్రపారంగతత్వమును బ్రదర్శించి వారివద్దనుండి మనము గ్రహింపవలయు నుపదేశరహస్యములు పెక్కులు గలవని యుపన్యాసముఖమున నిరూపించిరి.

అనంతరము వ్యాకరణ సార్వభౌములు ప్రేమస్వరూపమును నిరూపించి ప్రేమవలన సాధ్యములు కాని కార్యములు లేవనియు, నాయీప్రేమచేతనే గర్తపురీ పౌరులు తమ్ము నాహ్వానించిరనియుఁ జెప్పుచుఁ బ్రశాంతగంభీరముగ నొక గంటకాలము ప్రత్యుత్తరముగ నుపన్యసించిరి.

మఱుచటి దినము శ్రీ శాస్త్రిలవారి శ్రేయోఽభివృద్ధికై శ్రీ పీఠాధీశ్వరులు శ్రీ పీఠప్రతాపభారతీరాజరాజేశ్వర్యర్చనమును మహావైభవముతో నొనర్చిరి. మఱుచటి దినమున శ్రీ వైదికధర్మపరిషత్సభ్యులకును శ్రీ శాస్త్రిలవారి శిష్యప్రశిష్యవర్గములకు నితరప్రేక్షకులకును శ్రీ పరమేశ్వరీభక్తులకును విం దొనరింపఁబడెను. సాయంకాలము 5 గంటలకు శ్రీ శాస్త్రిలవారిచే వ్యాకరణశాస్త్ర విశేషములఁ గూర్చి పండితమనోహరముగ నుపన్యసింపఁబడెను.

ఇట్టి మహోత్సవమునకు చిట్టిగూడూరు సంస్కృత కళాశాలాధ్యక్షు లగు శ్రీ తి. గు. వరదాచార్యులుగారును

బందరు కాలేజియం దుపన్యాసకులుగ నుండిన శ్రీ నరసింహా
చార్యులుగార్లును పిఠాపుర మహారాజాస్థాన విద్వాంసులగు
శ్రీ వేదుల సూర్యనారాయణశాస్త్రిగారు మున్నగు మహా
పండితులు విచ్చేసిరి. అనంతరము శ్రీ పీఠాధీశ్వరుల నారా
యణస్మరణములతో సభ ముగింపఁబడెను.

---

# స్వాగతోపన్యాసః.

అయి! ఆర్యమహాశయాః!

సుస్వాగతం వ్యాహరామో ఽత్రభవద్భ్యః శ్రీగర్త
పురీవిరాజమానవైదికధర్మసంవర్ధనీసభాయా స్తృతీయవార్షికో
త్సవావసరే ఽత్యంతకృపయా ఽత్రాగతేభ్యో ఽతిథిమహాశ
యేభ్యః. అనుగృహీతా వయ మధీతానేకశాస్త్రాణాం పండిత
ప్రకాండానాం సందర్శనే. కృతజ్ఞాశ్చ య న్మహాజనసమా
గమసంజనితసంతోషానుభవభాగ్యభాజతా మస్మాక మకల్ప
యన్ భవంతః. సువిఖ్యాతేయం గర్తపురీ సమ్య గర్హాతి
భవాదృశా మాదరణపాత్రతాం చ. అత్రైవ సమజని జని
మతాం వరిష్ఠః ఆంధ్రకవికులతిలక స్తిక్కనార్య ఇతి కింవ
దంతీ చకాస్తీతి భవతా మపి నావిదితపూర్వమేవ. అత్రైవా
వరీవృద్ధ్యంత బహవో వేదవేదాంగపారగాః పండితశేఖరాః
నిత్యకర్మానుష్ఠాననిరతాః బహుక్రతుసంతర్పితక్రతుభుజ స్సనా

తనధర్మాచరణచణా అగ్రజన్మానః. అద్యాపి దరీదృశ్యంతే ఽనేకే జిజ్ఞాసవో లౌకికా అపి వైదికమార్గబద్ధాదరణా స్సద్గురుసేవాసమర్పితశుద్ధమనసః. కృతకృత్యా వయం, యద్బహూకుర్వంత్యస్మాకం భవంతో మహతా కాయక్లేశేనాఽపి నిజసందర్శనసమాగమసంభాషణాదిభిః. సాదర మంగీక్రియతా మస్మాభి ర్వ్యాహృతం ప్రీతిప్రముఖవచనం స్వాగత మితి భృశం ప్రార్థయామహే. యౌష్మాకీణసపర్యాయా మనస్సతయా స్థీయతే ఽస్మాభి రపర్యాప్తై రపి భవతాం తోషణే చ స్పర్ధామహే ఽన్యోన్యం సుహృదోఽపి వయమ్.

తథాపి లోకవిదితైవాస్మి న్నగరే పూజాపరికరవిరళతా. అతర్కితపూర్వోఽయం కాలవేగవిపర్యయః, యద్వసంతసమయేపి గ్రీష్మర్తుధర్మః ప్రవర్త్యతే కాలపురుషేణ. న వహతి నవకిసలయమంజరీమంజులో మలయానిలః, న చాఘ్రాయతే వాసంతీకుసుమసుకుమారసౌరభం, న చ లభ్యతే సదావగాహాక్షమ శ్శీతలజలసంచయః, న చాస్వాద్యతే యథేష్టం సరససహకారమధురిమా. దిగంతవిశ్రాంతోద్దండపండితశేముషీకిరణా ఇవ నభసి వికసంతి ప్రచండచండకిరణకిరణాః. కార్శ్యమాసాద్య ఖలస్య కులసతీవ పాదమూలమాశ్రియతే మధ్యాహ్నవనరుహాతరుచ్ఛాయా. వృద్ధి మేతి లుబ్ధస్య కోశ ఇవ తృష్ణా. నవనవకోమలతాలదలశ్యామమధురోఽయం మండపః శీతలవితానీభవతు తత్రభవతాం భవతా మిత్యాశాస్మహే. నిదాఘవాతేరితరేణూత్కరకింజల్కాభావత్కపదాబ్జపూజా [illegible] వాధీయతామ్. అహో గర్తపురీమధుమాసవసంతశోభా!

తథాపి సమ్యగ్జానీమహే బహవ స్సంతి సంతో మహాంతః,
యే స్వసుఖనిరభిలాషాః ఖిద్యంతే లోకహేతోః.

ప్రేక్షకమహాశయాః !

దృశ్యతే హి 'మహానయం పరిణామో ద్విజానాం జీవితేషు. విస్మృత మార్షమతం, నిరస్త మాసేతుహిమనగం వైదికగృహేష్వపి నిజవర్ణాశ్రమవిహితం కర్మానుష్ఠానం, త్యక్త మామూలం వేదాధ్యయనం, అనాఘ్రాతం గీర్వాణవాణీసౌరభం, అనధిగతం భారతజాతీయనాగరకతాతత్త్వం, అనార్షమతదూషిత స్సర్వ ఊహాప్రపంచః, పాశ్చాత్యనాగరకతాక్షాళిత స్సర్వోప్యాచారః. అపి యః కశ్చన విద్యతే సనాతన ధర్మాసక్తః, స స్వీయే ష్వన్యేషుచ సమానై ర్హీయతఏవ పూర్వాచారపరాయణ ఇతి 'దేవానాంప్రియ' శబ్దపర్యాయ పదాభిధేయత్వేన గృహీతః పరిహాసాయ కల్ప్యతే. అహో మహానయం విషమసమయ స్సనాతన ధర్మస్య! ఈదృగ్విషమసమయ ఏ వాత్యంత మన్వేష్టవ్యా స్సమ స్తశాస్త్రపారదృశ్వానః సత్కర్మాచరణదక్షాః ప్రబోధనవిధా బద్ధాదరణాః గురుకుల ముకుటాలంకారభూతాః పండితావతంసాః.

మహాభాగాః !

రాజసమ్మితతయా ధర్మ మనుశాసతి వేదాః. తాన్ ప్రవర్తయంతి రాజానః. తదభావే మతగురవః. ఏతదర్థమేవ మనసి సంభావ్య భారతవర్షే దిగ్విజయ మాకలయ్య ధర్మపరిపాలనాయ ప్రాక్పశ్చిమోత్తరదక్షిణదిక్షు చతురః దిగ్గజా-

నివ ప్రతినిధీ౯ స్థాపయాంచక్రుః శ్రీశంకరభగవత్పాదా
చార్యాః. ప్రజా స్వాధ్యాత్మికపరిపాలనభారోఽత్యంత మధు
నాతనకాలే మఠాధిపతిభిరేవావశ్యముహ్యేత. తథాప్యతీవ
విరళా ఏవ సంతి సరళా ఆచార్యపురుషా, యేషాం జ్ఞానదీపేన
సర్వ మజ్ఞానతమః ప్రలీయేత. సుకృతవిశేషేణ సకృదేవ
లభ్యంతే తాదృక్సుగుణగణవిభూషితా గురుపుంగవాః.

సభ్యమహాశయాః!

సుకృతినః ఖలు గర్తపురీనివాసినో య ద్గతసార్ధద్వయ
వత్సర మనిశం నివసం త్యస్మదాచార్యపాద పాదారవింద
సన్నిధౌ నిత్యమితానందకోటి మారోహ త్యాస్మాకీనం మనః.
తత్రాపి సాక్షా చ్ఛ్రీశంకరభగవత్పాదసంతతేరిమే పూజ్య
పాదా ఇతి సముల్లసతితరా మస్మదీయం చేతః. శ్రీగర్తపురీ
భావిచరిత్రవిలేఖక స్యాంగిరసమధుమాసో ఽతీవోత్సాహో
త్పాదకో భవతి; య త్రైవ యుగపదేవ ప్రతిష్ఠాత్రయ మర
చ్యతాస్మదాచార్యశ్రీచరణైః- మోక్షప్రదాయిన్యాః శ్రీరాజ
రాజేశ్వరీపరదేవతాయాః, అఖిలభారతవర్షీయాధ్యాత్మికరా
జ్యస్య గర్త పురీరాజధానీకరణబీజావాపస్య; కృతకృత్యతాయా
స్సద్గురువరాన్వేషిణాం చ. ప్రస్థానత్రయ మధ్యాజీగప న్నంతే
వాసిన స్సార్ధద్వయవత్సరపర్యంతం శ్రీగురుచరణాః.

అథ కిం! తేషా మాశీఃఫల మేవైషా వైదికధర్మసం
వర్ధనీసభా. అద్యైవ తస్యా స్తృతీయజన్మదినోత్సవ ఆచర్యతే.
వయోనురూప మానందయ త్యేషాఽవ్యక్తనిజమధురవచోవి
లాసైః ప్రతిపదం స్ఖల ద్వ్యత్యస్తపాదవిన్యాసైశ్చ జనయిత్వా

వన్యాక్ ప్రేక్షావతశ్చ. భవద్భి రవశ్య మనుదినం పరిపోషణీ
యైషా; అపి చ పిపాసతి భవదీయకృపాపీయూషదుగ్ధం, ఆ
కాంక్షత్యాశిషశ్చ భవతాం, ఆచంద్రతారార్కం జేజీయతా
మిత్యభ్యర్థయామహే.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

గర్తపురీ,<br>
యువ వైశాఖ శు ౯. } రాయప్రోలు లింగనసోమయాజీ

ఓం నమో మేధాదక్షిణామూర్తయే
గర్తపుర్యాం శ్రీమన్మహామహోపాధ్యాయ
తాతాసుబ్బారాయశాస్త్రిణాం
సమ్మానోత్సవవేలాయాం గర్తపురీశ్రీవైదికధర్మసంవర్ధనీసభా
సభ్యైస్సమర్పితా

# అభినందనపత్రికా

పండితాగ్రణీః!

అనుగృహ్ణాన్తు భవదనన్యసామాన్య పాండితీమహిమాతి
శయవశంవదైర్గర్తపురీశ్రీవైదికధర్మసంవర్ధనీపరిషత్సభ్యైః
సమర్పితా మిమా మభినందనపత్రికాం భవంత ఇతి సప్ర
శ్రయం ప్రార్థయామహే.

విద్వద్వంశవిభూషణ!

అనుగృహీతమూర్తిత్రయరూపాణా మత్రభవతాం
భవతాం సవిధేఽధీతశాస్త్రాః పుణ్యమూర్తయ ఏవ ప్రభా

కరప్రభా ఇవాంతరాళం సంవ్యాప్య సాంద్ర మపశబ్దధ్వాంత
మపాకుర్వన్తి త్యత్ర న కాచి దప్యతిశయోక్తిః. శ్రోత్రగాహ
పరికల్పితానాం ఫణిసూనునిదేశదూరాద్ధాంతాంధతమ
సానా మపసారణే నాన్యోఽపకల్పతే ఋతే భవదీయగురు
ప్రసాదసంజనితజ్ఞానభాస్కరాత్. స్వీకృతాపరపాణిన్యవతార
మూర్తయోఽధిష్ఠిత పాణినసూనుసూక్తి సామ్రాజ్యవైభవా
భవంత ఇతి సంవదత్యేవ భవతాం వైయాకరణసార్వభౌమ
పదవీమ్.

అత్రికులతిలక!

నవ్యసౌభాగ్యగుణవిభవానా మత్రిభవతాం భవతా
మగాధధర్మశాస్త్ర పరిచితి మభివ్యనక్త్యేవాతిసూక్ష్మబుద్ధీనా
మపి న్యాయవాదినాం భవదీయ శేముషీసమర్పితానన్య
విశ్వాసః. భవద్ధర్మశాస్త్రకుశలతాఫల మశ్నంతోఽద్యాపి
సుఖేన నిద్రాయంత్యేవ రాజాధిరాజాః. అపార మగాధం
శ్రౌతపారావార మవగాహ్య సంపాదితా భవదీయా నవ్య
రోచీరుచిరా మణినికరాః కస్య హృదయస్థానం న విభూష
యంతి?

విద్యాకులపతే!

సుదుర్లభోయం సర్వతోముఖ పాండితీప్రకర్షః— యత్
పాణినసూనుసూక్తిషు సమగ్రతా, జైమినీయతంత్రే వ్యాజ
య్యతా, బాదరాయణఫక్కికాస్వనన్యసామాన్యస్వతంత్రతా,
శిష్యజనేభ్యోఽనితరసాధారణబోధకతావ్యగ్రతా, మహాజన
పరిషత్సు నిజవాక్సుధాతరంగ డోలికాసు సామాజికానా

మాలోలన శీలతా చ!! తథాపి స్వీకృతవిద్యావతారేషు భవాదృశేష్వేవ శోభతేఽయ మితి మహాన్ భాగ్యవిశేషో భారతీయానామ్.

వైయాకరణసార్వభౌమ!

ప్రత్యగ్రరచనాభి స్సముల్లసంతీం భవదీయా మద్వితీయప్రతిభాం స్వప్రతిభాప్రమాణేన వర్ణయితుముపక్రాంతా జిహ్రేతీయ మాస్మాకీనా పరిషత్. పుత్రపౌత్రైష్ణాఽనుగృహీతానేక సచ్ఛాత్రాణాం భవాదృశాం పండితరత్నానాం జనయిత్రీయం భారతభూమా రత్నగర్భేత్యన్వర్థాభిధానాభవతి.

మహనీయగుణగణగరిష్ఠ!

అథ కిం! పూజ్యపాదానాం భవతా మాగమనమాత్రేణ పూతతాం నీతేయం గర్తపురీ; వయం చ భవదమలవాగమృతఝురీవేగసంతర్పితా గతకల్మషా జాతాః. భవద్భ్య స్సకలాయు రారోగ్యాది విభవానుగ్రహేణ నేయం చిద్రూపిణీ రాజరాజేశ్వరీ పూజ్యపాదా ననుజరీగృహ్యాతా మిత్యాశాస్మహే వయమ్.

ఇతి విజ్ఞాపయితారః,

గర్తపురీ శ్రీవైదికధర్మసంవర్ధనీ పరిషత్సభ్యాః

# ధర్మశాస్త్ర పరిణామము.

ప్రకృతకాలము మహా కోలాహలముతో నిబిడీకృత మగుచున్నది. ఇప్పటి దేశకాలములు ద్వివిధములుగాఁ బఱగుచున్నవి. అం దొకరు మనకు సంప్రదాయానుసృతము లగు నేయే యాచారము లున్నవో య య్యవియే ధర్మమనువారొకరు; ధర్మశాస్త్రము లనఁగా వ్యవస్థలు కావున వీనిని దేశకాలానుసారముగ ధర్మములను మార్చవచ్చు ననువారు వేఱొకరు. వీరియందు నామాట లెవ్వరికైన రుచించునో లేక యిద్దరికిఁ గూడ రుచింపవో చెప్పలేను. కాని పూర్వకాలము నుండియు నొక విశేషము గన్పడుచున్నది. ఏమన: తొలుత నెవ్వరు మనలకు ధర్మములను గొన్నింటి నేర్పఱచి యవ్వానిని దప్పక యనుసరింపవలయునని చెప్పెదరో వా రాకాలము నాఁటి దేశమందలి ప్రజలచే ద్రోహులుగాఁ దలంపఁబడి తరువాతి కాలమునకు నా దేశపు ప్రజలచేతనే దైవముగాఁ గొనియాడఁబడుటయే. చూడుడు! మతప్రవర్తకులుగాఁ బఱఁగిన యందరు నీ రీతిగానే కన్పడుచున్నారు. కావునఁ బ్రకృతమున బాధకము లగునప్పటికి న్యాయాయి విషయములను మన మాచరించియే తీరవలయును. మంచికార్యము లెవ్వియైనను ప్రకృతబాధకము లగుట సహజమై యున్నది. ప్రకృతమున నొక కట్టుబాటు చేసినను అద్దానిని నడువడియం దుంచుకొనుట కూడఁ గష్టతరమగు విషయమే యగుచున్నది. పూర్వ మొకప్పుడు కంచిలో పండిత, జి. సుబ్రహ్మణ్యంగారు విదేశగమ

నమువిషయమై పండితసభ చేయించి యొక వ్యవస్థ నేర్పఱ
చిరి. కాని యట్టి వ్యవస్థ యట్లుండగా "కట్టుబాటున్నను లేక
పోయినను తప్పక వెళ్ళవలసినదే" యని కొంతమంది ఆ కాల
మువనే తప్పక విదేశగమనము నొనర్చిరి. కట్టుబాటు ననుస
రించి వెళ్ళినవారిని మనలోఁ జేర్పఁగూడదని కొంతమంది
వ్యవహరించిరి. కాని ప్రకృత మీకట్టుబాట్లే క్షీణింపఁజొచ్చి
నవి. మనకట్టుబాట్లిట్లే యుండును.

ప్రకృతమున ధర్మశాస్త్రవిపరిణామమునందు ధర్మము
ముఖ్యముగనుక ధర్మమువిషయమై విచారింపవలయును. ధర్మ
శాస్త్రమన - ధర్మము నుద్దేశించి కొన్ని నియమములను నియ
మించిన శాస్త్రము. ధర్మము రెండువిధము లగుచున్నది-
పాపనివృత్తి, పుణ్యప్రవృత్తి యని. అధర్మమన ధర్మవిరుద్ధ
మని యర్థము. కాని ధర్మభిన్నమని యర్థమును జెప్పఁగూడదు.
కర్మకూడ ధర్మజనకము కావున ధర్మశబ్దముచే వ్యవహరింపఁ
బడనొప్పును. అందువలననే పూర్వమీమాంసయందు "అథాతో
ధర్మజిజ్ఞాసా" అని ప్రారంభించి ధర్మమన నిచట నెయ్యది
గ్రహింపఁబడవలయునను నాశంకతో "చోదనాలక్షణార్థో
ధర్మః" అని విధివాక్యములచే నెక్కుడుగా విధింపఁబడిన కర్మ
యే ధర్మముగాఁ బరిగణింపఁబడెను. ఈ కర్మ యదృష్టరూప
ముగా ధర్మము స్వతస్సిద్ధముగా నొప్పు. "ధర్మం చర" అనుచో
ధర్మమనఁ గర్మయని యర్థము. "ధర్మో రక్షతి కీర్తనాత్"
అనుచో ధర్మమన నదృష్టమని యర్థము.

ఇట్లు ధర్మము ద్వివిధముగాఁ బఱగుచున్నను కర్మ నాల్గు తీణములు మాత్రిమే యుండును గావున నయ్యాది యెంతమాత్రిమును ధర్మశబ్దవ్యవహారమునకు యోగ్యము కాదు. కావున ధర్మ మన నిత్యమగు శబ్దము.

అయ్యాది దోషరహిత మగునపుడే ప్రిమాణమగును. అయ్యాదియే వేదము. వేద మపౌరుషేయ మనియు నీశ్వర ప్రిణీత మనియు రెండు పక్షము లున్నను ద్వివిధపక్షముల యందుఁ గూడఁ బ్రితారణ మెంతమాత్రిము పొసగదు కావున వేదము తప్పక ప్రిమాణమగును. కావున ధర్మమునకు వేదము ప్రిమాణము గావున వేదమువలననే ధర్మమును దెలిసికొనవల యును. వేదమునఁ గర్మ చెప్పఁబడుచుండుటచే ధర్మము చెప్పఁబడుచున్నదనఁ గర్మ చెప్పఁబడుచున్నదని తెలియవల యును. కాని యీ ధర్మమునందు విప్రితిపత్తు లెంతమాత్రము లేవు. కాన వీనిని విచారింపఁ బనిలేదు. ప్రికృతమునకుఁ బోవుదము. ధర్మశాస్త్ర పరిణామములోని ధర్మశబ్దమునకు ప్రికృతము మనకు వివాదగ్రిస్త మగు ధర్మమే యర్థ మగు చున్నది. ఇయ్యాది వర్ణాశ్రిమతత్తద్ధర్మవిషయికము.

వేదముల యొక్క యనంతములగు శాఖలు క్రిమ క్రమముగ మనవారియొక్కబుద్ధిమాంద్యమువలన నశించినవి. ఉపలభ్యమానములగు వేదములయొక్క యర్థము దుర్గ్రాహ మగుచున్నది. అంతవేదభాగమునుండి మనము గ్రిహించుట మన బుద్ధులను బట్టి మనకు శక్యము కానిపని. ఇట్టి విషమావస్థను గనిపెట్టియే మన్వాదిమహానీయులు తాము

గ్రహించిన వేదమునందలి విజ్ఞానమును స్మృతి రూపమున మనబోటివారి యుపయోగమునకై గ్రంథబద్ధములుగాఁ జేసిరి. కావున నీధర్మములను స్మృతులవలన నిర్ణయింపవలయును. స్మృతులన్ననో 'అష్టాదశ' అని మనవారి పరిగణనము కాని, పుస్తకములఁ జూచినచో నింకను బదిరెట్లున్నవి. ఇవి యన్నియు నూతనకల్పితములు. ఇందుఁ గొన్ని స్మృతులు తత్తన్మత ప్రవిష్ట ధర్మములను స్మృతిమూలకము లని నిరూపించుటకుఁగా బయలు వెడలినవి. అందుఁ బ్రకృతము పూనాలో మన కుపలభ్యమానమగు దేవలస్మృతి యుదాహరణము. నిశ్చయముగా నిద్దానిని గమనించినచో స్మృతుల యందు మన కుండెడి గౌరవము పూర్తిగ నశించును. ఇందు మ్లేచ్ఛులతోఁ గొంతకాలము మిక్కిలి సంబంధము గలిగినస్త్రీలనుసహితముమనలోఁగలుపుకొనిపూతలుగా నెన్నఁ బడుటకుఁ దగునుపాయము లత్యద్భుతముగాఁ జెప్పఁబడినవి. ఇయ్యది యీ పంజాబు మున్నగు మ్లేచ్ఛులతో నెక్కుడు సంబంధముగల దేశములందుఁ బుట్టినది. ఆ దేశస్వరూపమును, ఇద్దాని యందలి విషయమును గమనించినచో నా దేశపు పరిస్థితులే యీస్మృతికిఁ గారణమని తేటపడఁగలదు. కాని యిందువలన మనము వారికిఁ గల ధర్మమందలి యాసక్తిని జూచి సంతసింపవలయును. అచట నింత రాపిడి గలుగుచున్నను వారికి మనధర్మములయం దెంత శ్రద్ధ గలదో మనము దీనిని బట్టి నిర్ణయింపవచ్చును. సత్యమును గమనించినచో నియ్యది దేవలస్మృతిగాదు. అది యీదేశములవారిచే స్వాచారపరిశుద్ధి

కొఱకుఁ గల్పితమయినది. సత్యమగు దేవలస్మృతియందు రాజకీయము ఆచారవిషయము, శ్రౌతవిషయము విశేషముగా గలదు.

అందొకటియుఁ బ్రకృతము పూనాయందుపలభ్యమానమగు దేవలస్మృతియందుఁ గన్పట్టదు. వైదికధర్మాచరణబద్ధకంకణులగు నోవిచక్షణులారా! స్మృతు లిట్లున్నవి, శ్రుతు లిట్లున్నవి. కావున శ్రుతిస్మృతి సదాచార సిద్ధములగు కర్మల నెద్దియో యొక మిషచే నెగగొట్టుటయో లేక తమకు నాచరింప శక్యము గాక పోవుటచే నొరుల నాచరింపవల దని చెప్పుటయో చేయుటకంటె నవ్వానియందుఁ బ్రామాణ్యాభావము నుంచి "యాచరింప శక్యము కానిచో నాచరింపక పోతిమే" యని విచారించుట మంచిపని యనినాయాశయము.

ఇఁక నెట్టిస్మృతి మనకుఁ బ్రమాణపదవి నలంకరించునో యొకింత విచారింతము. ధర్మనిర్ణయమున స్మృతిలక్షణ మెద్ది గలదో యాలక్షణము లాస్మృతియం దుండవలయును. ఆస్మృతిని బూర్వు లాదరింపవలయును. అద్దానినే మనము ప్రమాణముగా గ్రహింపవలయును. ఇట్టి స్మృతులలో మనుస్మృతి చూడామణి. అందుచేతనే "యత్కించి న్మను రవద త్త ద్భేషజమ్" అని చెప్పఁబడినది. పైలక్షణములచే లక్షితములగు స్మృతులు యాజ్ఞవల్క్యస్మృతి, గౌతమధర్మసూత్రము, ఆపస్తంబసూత్రము, బోధాయనస్మృతి, వాశిష్ఠస్మృతి, విష్ణుస్మృతి, నారదస్మృతియును. హారీతస్మృతి విశాలమగుస్మృతి. ఇది పురాణమా

లేక స్మృతియాయని నాసందేహము. ప్రశ్న ప్రతివచనములు పురాణముల శైలి. ఆ శైలి ననుసరించిన దీహారీతస్మృతి. సాధారణముగ స్మృతిశైలిని గమనించినచోఁ దొలుతతప్ప వేఱొకచోఁ బ్రశ్నమే గన్పట్టదు. అదియుఁగాక, యిందు స్మార్తదూషణమున్నది. స్మృతులు సర్వబ్రాహ్మణ విషయకములు కావలెను గాని యందుఁ గొందఱి నింద యెంత మాత్ర ముండఁ గూడదుగదా? ఇంకను శంకర స్మృతి, పరశురామ స్మృతి యను రెండు స్మృతులు గలవు. ఇందుఁ దొలి స్మృతి మలబారు నందలి పద్ధతులను స్పష్టముగాఁ బ్రకటించు చున్నది. రెండవది చిత్పావను (చితి + పావన) లను మహారాష్ట్రదేశస్థులలో నొకతెగవారిధర్మములను బోధించుచున్నది.

ఇఁకఁ బరాశరస్మృతి విషయమై గమనించినచో నీ స్మృతికిఁ బై స్మృతుల కంటె రెండవ స్థానము నీయవలెను. “కలౌ పారాశరస్మృతిః” అని లోకమునఁ బ్రతీతి యున్నను మనము కలియుగ పురుషులవలె సంచరించుట లేదు కావున మన మన్ని విషయములను గమనింపవలయును. పరాశర స్మృతియందు గర్భాధాన పుంసవనాది విధులు లేవు. అందుచే దీనికిఁ బ్రథమస్థానము నీయఁగూడదు. ఇందుఁ బ్రాయశ్చిత్త విషయము దక్క వేఱొక విషయము స్పష్టముగ నిరూపింపఁ బడియున్నది. దీనికి వ్యాఖ్యానమును మాధవాచార్యుఁడు గావించి యిద్దాని కింత ప్రామాణ్యమును గల్పించినాఁడు. మాధవుఁడు “వర్ణాశ్రమాగతాః” అని ప్రారంభించి వర్ణములు ఆశ్రమములు, తత్తద్ధర్మములు మున్నగు వాని నుద్దేశించి

తొలుతనే యొక మహోపన్యాసమును గావించెను. ఇట్లే గ్రంథ మందు లేని నూతనవిషయములను దాను స్వయముగా వ్రాసి యిద్దానికిఁ దన్మూలమునఁ బ్రామాణ్యమును గల్పించెను. మాధవాచార్యులు మహాపండితులలోఁగాని స్మృతికర్తలలోఁ బరిగణింపఁబడఁడు. ఈ పారాశరస్మృతియందు రాజకీయ సాంఘికశిక్షలలో సాంఘికశిక్షల నుద్దేశించి విపులముగా వ్రాయఁబడెను.

ఇఁక ధర్మశాస్త్రములలో దేశకాలములనుబట్టి మార్పు చేయవచ్చునా యనునది విచారింతము. శిక్షాస్మృతులు శిక్షితుని బుద్ధిని మార్చుటకు బయలువెడలినవి. ప్రాయశ్చిత్తము నకుఁ బరితాపమే ఫల మనుటకు మితాక్షరియే ప్రమాణము. అందువలననే బహిష్కారములు ముఖ్యములగు ప్రాయశ్చిత్తములుగాఁ బరిగణింపఁబడినవి. కావుననే శిక్షితుని యొక్క శక్తినిబట్టి శిక్ష మార్పఁబడుటకు ధర్మశాస్త్రమునందు నిర్ణయము చేయఁబడెను. ధర్మశాస్త్రములలో నైహికమువిషయమై చెప్పఁబడిన వానిలో భేదమున్నను నాముష్మికములో నెంతమాత్రమును భేద ముండదు. అందువలననే ధర్మచ్యుతికిఁ జెప్పిన ప్రాయశ్చిత్తములలోఁ బైని జెప్పిన తీరున భేద ముండ వచ్చును. అంతియకాని యతీంద్రియపదార్థమగు ధర్మమునందు మార్పులు చేయుటకు మనకు హక్కు లేదుగదా! అతీంద్రియ ద్రష్టయగుచో వాఁడు మార్పవచ్చునేమో! కాని, యెవ్వరట్టి వారు? వారు మార్చునపుడు మాత్రము పూర్వమున నున్న దానియందుఁ దప్పును జూపవలయును. ఇట్టి కార్యములు

మన కెంతమాత్రము శక్యములు కావు గనుకనే మనపూర్వులు చెప్పినట్లు మనము తప్పక వినవలయునే కాని వానిని మార్చుటకు వీలు లేదు.

వేఱొక విశేషము: మనము చేయుమను నద్దానిని జేయకపోయినను మానవలయునను నద్దానిని మాత్రము తప్పక మానవలయును. కలివర్జ్య ప్రకరణ మున్నదిగాని కలి గ్రాహ్య ప్రకరణము వేఱొకటి లేదు. దానికి గారణము ప్రాచీనాధునాతనుల యభిప్రాయ భేదములే. అందు వివాహము లలోఁ బ్రాచీనులచే నేర్పరుపఁబడిన కొన్ని నియమములు ప్రకృతకాలమున వినోదముల కొఱకు స్థిరపడి యజమానునికిఁ బ్రాణసంకటమును గల్గించుచున్నవి. అయిదు దినములుగూడ యజమానునికొంప తీయవలయునట! ఎట్టిది యెంతవఱకుఁ బరిణమించినదో చూడుడు. ఒకటిన్నర రోజునందు జరిగెడి కర్మకలాపము తక్క మిగిలిన రెండుమూఁడు దినములయందు జరుగవలయుకర్మమంతయు వరునియింటజరుగవలసియుండగా నీబరు వంతయును వధువుతండ్రితలపై మోపి వానిని బీడించి పిప్పిచేయుచున్నారు గదా! ఎంత వింతగా నున్నది! ఇయ్యది నే జెప్పినచో నపూర్వమగు కల్పనమని యెదరే! మీరొక పరి నాకర్మకలాపమును సాంగోపాంగముగఁ బరీక్షింపుఁడు! మనవారి యన్యాయపు పనులు తేటపడఁగలవు. వివాహములే కాక యజ్ఞములుకూడ నట్టివే యగుచున్నవి. యజ్ఞము సక్రమముగ జరిగినచో నెట్టి ఫలము సమకూరునో, సక్రమముగా జరుగక పోయినచో నంత మహాఘము సమకూరును. ప్రకృ

తము చేయు యజ్ఞములలో నూటికిఁ దొంబదిపాళ్లు పయగ్రి తాంబూలమునకో లేక యేధనార్జనమునకో లేక యేగొప్పఁ దనమునకో కాని వేఱొక సంకల్ప మేమియును లేదుగదా! యజ్ఞవాటికలోనికిఁబోయి మీరొకపర్యాయము గమనించినచో నాయజమానునికి నాఋత్విజులకుఁ గర్మయందు శ్రద్ధయో ధనమందు శ్రద్ధయో వెంటనే తెలియఁ గలదు. యజ్ఞములనుపేర దేశములను గొల్లగొట్టి ధనార్జన మెంతమంది చేయలేదు. అందువలననే తగు సమర్థులు గాని, యట్టి మహా కార్యములను జేయఁదలంపఁ గూడదు. అధికారి నిరూపణమున "అర్థి" అని నుడువుట కిదియే కారణము. ఇట్టి మహాకార్యములను జేయుటకై పూని యిట్టి చేయరాని కార్యములను జేయుదురనియు నద్దానివలన మహాపాతకములు గలుగఁగలవనియుఁ దలంచియే "నాస్తి యజ్ఞసమో రిపుః" అని యభియుక్తులు చెప్పిరి. సుఖమున్నచో దానికి ద్విగుణముగా దుఃఖము పక్కనే యద్దాని నావరించియుండును. ఇట్టియజ్ఞములలో యజమానాదియోగ్యత ద్రవ్యశుద్ధిప్రధానములు. అట్టివియే ప్రకృతకాలమున దుర్లభములు కావున దత్తదాచారముల మన మొనర్చుటకు సమర్థులము కాకపోయినచో నొనర్పలేకపోతిమే యను విచారమైనను గలిగి చేయరాని పనులను జేయకుండుటయే సర్వోత్తమ మగునది యని నాయాశయము.

నీలకంఠశాస్త్రి.
13-5-35.

# దర్శనపరిణామము.

ఆచారముల యొక్క రీతులు పురుషబుద్ధ్యధీనము లగుటం జేసి ధర్మశాస్త్రములు కొన్ని విషయములలో మార్పునొందెను. దర్శనములను మార్చుటకు వీలులేదు. దర్శనములు సంఘముల మూలమున విస్తృతిని జెంది బయలుదేరినవి. అందుఁ జార్వాకదర్శనము ఈ ప్రాపంచికభోగములే సత్యమని యుచ్ఛృంఖల ప్రవృత్తిని బోధించును. అందువలననే యియ్యది చాలమందికి రుచించును. ఈ కాలమునఁ బెక్కం డిందుఁ జేరియుందురు.

వైశేషిక సాంఖ్యాదులు కర్మను సాధనముగాఁ జేసుకొని యద్దానినిబట్టి తమ రీతుల నేర్పరచిరి. అందువలననే వీరు మీమాంసకులతో నెక్కుడు భేదింపరు. వేదాంతులు కూడఁ దమనిర్వృత్తిరూపఫలమునకుఁ గర్మను సాధనముగ గ్రహింతురు. ఈ వేదాంతులు ముఖ్యముగ నుపనిషత్తులను, బ్రహ్మసూత్రములను బ్రమాణములుగ గ్రహించి పరులచే నుపనిషన్మతస్థు లనియు, వ్యాససూత్రమతస్థు లనియుఁ బిలువఁ బడు చున్నారు. ఇందు మూఁడుమతము లున్నవని చెప్ప వచ్చును. ఈ మతస్వరూపములు ప్రత్యేకముగ నెట్లున్నను కర్మాచరణమునందు మాత్ర మెవ్వరికి నాక్షేపము లేదు. కాని యాచరణములో భేదము గలదు. ఇట్టి యాచరణభేదమును బట్టియే సంఘభేదము గలిగినది. కావున సిద్ధాంతము లాలోచనామయము లగుటంజేసి యయ్యవి పరిణమించుటకు

పిలులేదు. పై త్రిత్వము పరిణామసిద్ధ మెంతమాత్రము గాదు. మాధ్వులు, విశిష్టాద్వైతులు గూడ 'వైష్ణవు'లని పిలువఁబడు చున్నారు. అద్వైతులు 'స్మార్తు'లని పిలువఁబడు చున్నారు. అట్లే ప్రాచీనులగు వైశేషికాదీతరమతానుయాయులచేఁ బై రెండుమతములు వైష్ణవమత మనియు, స్మార్తమతము ఔపనిషదమత మనియు, వేదాంతమత మనియు వ్యవహరింపఁ బడుచు వచ్చెను. ప్రకృతమున స్మృతుల నందఱుగూడఁ బ్రమాణముగ గ్రహించుచుండ నద్వైతులను మాత్రమే 'స్మార్తు'లని పిలుచుటకుఁ గారణమేమన-నీస్మార్తులు స్మృతుల కెక్కుడు ప్రామాణ్యము నిచ్చుటయు, మిగిలినవారు పురాణములకు నాగమములకు నెక్కుడు ప్రామాణ్య మిచ్చుటయే కారణము. అందువలననే వారు పౌరాణికులనియు నాగమవాదులనియు వ్యవహరింపఁబడుచున్నారు. అం దేకాదశీశ్రాద్ధమే నిదర్శనము. స్మృతులఁబట్టి చూడఁగా నేకాదశియందైనను శ్రాద్ధము తప్పక పెట్టవలయునని కన్పట్టుచుండ వీరలు ఆగమపురాణముల ననుసరించి యేకాదశినాఁడు శ్రాద్ధము నెగురవేతురు. పితృదేవతలు కూడ మనవంటివారే కనుక యందరికంటెను భగవంతుఁడే ప్రధానుఁడని వారిముఖ్య మగు నుద్దేశము. మనవారల కన్ననో మన్వాదిస్మృతులే ప్రధానములు గాన నందుఁ జెప్పినతీరునఁ దప్పక యనుసరింపవలయు నని యాశయము. ప్రకృతము ననుసరింతము. దర్శనములలోఁ బరిణామము లేకపోయినను దర్శనావలంబకులప్రవృత్తినిబట్టి పరిణామము కన్పడును. దర్శనములు పరిణతములన దర్శనము

లేకరూపమున నున్నవా, లేక భిన్నరీతుల నున్నవా యని విమర్శింతము.

లోకమున సకలమానవులును సుఖాకాంక్షులు గనుక సుఖాన్వేషణమునకై జనులు ప్రవృత్తులగుచుందురు. అవియే దర్శనములు. ఈ దర్శనములయందుఁ బునర్జన్మము నపేక్షించునవి కొన్నియు, నపేక్షింపనివి కొన్నియు నగుచు ద్వివిధము లగుచున్నవి. అనఁగాఁ బునర్జన్మ యున్నదనియు, లేదనియు మతములు భిన్నములుగాఁ బఱఁగుచున్నవి. పునర్జన్మ నంగీకరింపని వారికి ప్రత్యక్షమే ప్రమాణము. అందు నిహమండలి వైషయికసుఖముకంటె వేఱొండు నానందము లేనేలేదు. "త్యాజ్యం సుఖం విషయ సంగమజన్మ పుంసాం దుఃఖోపభోగ మితి మూర్ఖవిచారణైషా" అనియు "యావజ్జీవే త్సుఖం జీవే న్నాస్తి కించిత్తతః పరమ్" అనియు వీరి ముఖ్యసిద్ధాన్తములు. ఇందలి భోజ్యము, భోజన శక్తి, యనుకూలవతియగు నడియౌవన మందలి కాంత, అనుకూలు రగు పుత్రులు తక్క వేఱొక మనుష్యానంద మిఁక లేదు. "అంగనాలింగన సంజనితాఖండానంద ఏవ బ్రహ్మానందః, తస్యోనీవి మోక్ష ఏవ మోక్షః" అని వీరినిర్వాణ విషయక సిద్ధాన్తము. ఇందు రాజే దేవుఁడు. తద్విహిత దండనమే నరకము. కావున నెట్టి తప్పు నొనరించినను నద్దాని వల్లనుండి రక్షించుకొను నుపాయము వెదకు కొను చుండవలయును. ఇదియే చార్వాకమతము. ఫలరూపమగు తుష్టి మనసునందున్నది కాని, బాహ్యవస్తువులయం దెంతమాత్రము లేదు. ఎవ

రికి విధింపఁబడిన కర్మలను వారు నిర్వ్యాజముగ నొనరించినం గాని యట్టి తుష్టి మనమునకుఁ గలుగనేఱదు. బ్రాహ్మణుల బలము, విద్వత్తు, జపతపాదులు. భుజకృషి సేవాబలములు క్షత్త్రియ వైశ్య శూద్రుల బలములు. ప్రకృతమున మనము మనబలము వీడి యొరుల బలమును దెచ్చుకొంటిమి. అట్లే యెవరిబలమును వారు వీడి యొరులబలము నవలంబించిరి. అందుచేతనే వారివారి తేజము, శక్తి వారినుండి తొలఁగిపోయి దాఁగినది. మనము నిశ్చయముగ నొరుల బలమున కాశించి యాబలము నవలంబించుటచేతనే నీచుల మైతిమి. అందువలననే యైహికసుఖమే సుఖమని వాదించుచు మనలోఁ జాలమంది లోకాయతికు లైనారు.

ఇది యిట్లుండఁ గేవల ప్రత్యక్షమే ప్రమాణము కాద నియు, ననుమానము కూడ ముఖ్యమగు ప్రమాణమేయనియు బౌద్ధమత ముదయించినది. కర్మకాండమును దప్పించుకొనుటకే యీమతము బయలు దేరినది. ముఖ్యముగ వారి సిద్ధాన్తము "అహింసా పరమో ధర్మః" అనియే. ఈ సిద్ధాన్తమును మనలనుండియే వారపహరించిరి. కాని యొక విశేషము: వీరు చార్వాకచండకిరణునిచే నెండింపఁజేయఁబడిన పునర్జన్మలతకు నీరు వోసి చిగుర్పఁజేసిరి. వీరు జగత్తు మిథ్యయనియు, క్షణిక విజ్ఞానమనియు సిద్ధాన్తములను జేసిరి. వీరు తమతమ యుక్తులచేతనే తమ సిద్ధాన్తములను స్థిరపరతురు. వీరు 'సంకోచవికాసశాలి యాత్మ'యని చెప్పి పరలోకము నొకదానిని గల్పించిరి. మనవారన్ననో - యుక్తులు పరిచ్ఛిన్నములు గనుక

నద్దానిచే నొకమతము స్థిరముగా నుండఁజాలదని వేదమును ముఖ్యమగు ప్రమాణముగా నంగీకరించిరి. ప్రకృతమునఁ బరలోకమును, దేవుని నంగీకరించిన మాత్రమున ఆస్తిక నాస్తిక విభాగ మేర్పడదు. దేవుని నంగీకరింపకపోయినంత మాత్రముననే నాస్తికుఁడగుచో వైశేషిక సాంఖ్య పూర్వ మీమాంసకులు నాస్తికులు కావలయును. వైశేషికులు దేవు నంగీకరింపలేదు. ప్రకృతేఁపు తర్కశాస్త్రము మిశ్ర మగుటం జేసి యిద్దానివలన మన మావిషయమును నిర్ణయింపలేము. వైశేషికులు ప్రత్యక్షానుమానములే ప్రమాణము లనియు, నుపమితిశాబ్దము లనుమానాంతర్భూతము లనియు—

"శబ్దోపమానయోర్నైవ పృథక్ ప్రామాణ్య మిష్యతే,
అనుమానగతార్థత్వా దితి వైశేషికం మతమ్. కారి. 140

అను కారికావళీ శ్లోకముచే స్పష్ట మగుచున్నది. నైయాయికులు నాలుగు ప్రమాణముల నంగీకరించిరి. పిమ్మట—

"ద్రవ్యం గుణ స్తథా కర్మ సామాన్యం సవిశేషకమ్,
సమవాయ స్తథాఽభావః పదార్థాః సప్త కీర్తితాః'

అని న్యాయవైశేషికముల రెండింటిని గలిపి తర్కశాస్త్రము నొకదానిని సృష్టించిరి. వైశేషికులు ధర్మము సర్వ సృష్టికిఁ గారణమని యంగీకరింతురు. వీరు జీవాత్మ నంగీక రించిరి. పరమాత్మను మాత్రము చెప్పలేదు. ఈశ్వరుఁడు లేనిచో దోషము గలుగునని తరువాతి వ్యాఖ్యాత లీశ్వరుని

గల్పించిరి. వైశేషికులు ధర్మమును ముఖ్యమని దొంటత జెప్పుచు "అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః" అని ప్రతిజ్ఞ చేసిరి. ఈ ధర్మము ప్రవృత్తినివృత్తిభేదముచే ద్వివిధము. ధర్మలక్షణము "యతో౽భ్యుదయనిఃశ్రేయససిద్ధి స్స ధర్మః" అని చెప్పినారు. అనఁగా ధర్మ మైహికాముష్మిక నిఃశ్రేయసములకు హేతువని భావము. ఈ ధర్మము వేదమూలముననే తెలియవలయునని "తద్వచనా చ్చాగమస్య ప్రామాణ్యమ్" అని ధర్మప్రతిపాదకత్వముచే నాగమ ప్రామాణ్యము వ్యవస్థ చేయఁబడుచున్నది. "అనధిగతార్థబోధకత్వం ప్రామాణ్యమ్" అని చెప్పుటచే వేద మతీంద్రియార్థబోధక మగుటం జేసి ప్రమాణమే యగును. తరువాతి వ్యాఖ్యాతలాత్మనిరూపణమున నీశ్వరుని సృష్టించుటకు వీలులేక "తద్వచనా చ్చ" అనుచో "తేన=ఈశ్వరేణ; వచనాత్ ..." అని చెప్పి తచ్ఛబ్దమునకు బుద్ధిస్థపరామర్శకత్వమును జెప్పి యెట్టులో యీశ్వరుని సృష్టించిరి. బుద్ధికూడఁ బూర్వపరామర్శము లేకుండ నుండదుగదా! అందుచే నియ్యది యెంతమాత్రము సమంజసముగా నుండనేరదు. అందుచేతనే భాష్యమునఁ దచ్ఛబ్దమునకు ధర్మమని యర్థము చెప్పఁబడినది. ఇట్లే "అస్మద్విశిష్టానామ్" అనుచో నీశ్వరుఁడు ప్రతిపాదింపఁబడుచున్నాఁడని చెప్పి బహువచనోపపత్తికొఱకు ఈశ్వరుఁడు, యోగులు అను నర్థమును గల్పించి యెట్టులో సరిపుచ్చిరి. ఇది తత్తద్గ్రంథపరిశీలన చతురులకు నసందర్భముగాఁ దోఁపకమానదు.

ఆత్మసద్భావమున జన్యజ్ఞానము చెప్పఁబడినది గాని
నిత్యజ్ఞానము చెప్పఁబడలేదు. ఇంతియకాదు; జ్ఞానము, సుఖము,
దుఃఖము మున్నగునవి జీవాత్మధర్మము లగుటంజేసి పర
మాత్మగాని యీశ్వరుఁడుగాని యిచట నుపదేశింపఁబడెనని
చెప్పుటకు వలనుపడదుగదా! ఇట్లు వ్యాఖ్యాతలచే నీశ్వరుఁడు
వేదకర్తగాఁ బ్రతిపాదింపఁబడినాఁడు.

సాంఖ్యులు ఈశ్వరుఁడు లేఁడని సాధింప బద్ధకంకణులై
సాధించిరి. కాని సాంఖ్యులు స్వరూపపరిశోధనమునందుఁ
జాల శ్రమపడి యత్యద్భుతముగ స్వరూపమును నిర్ణయించిరి.
వా రేయేపదార్థము లెద్దానితో సంబంధించినవో యద్దానిని
విశేషముగా సయుక్తికముగ నిర్ణయించిరి. వీరు పరమాణు
కారణవాదమును ఖండించి మనకు దగ్గరకువచ్చిరి. సమవాయ
మును బాగుగా ఖండించిరి. కాని, వా రాత్మానాత్మల విష
యమై నిర్దుష్టమగు రీతుల నవలంబింపలేక పోయిరి. పండి
తులు ముఖ్యముగఁ జెప్పవలసినదానిని వాచ్యవృత్తిచేఁ జెప్పక
వ్యంగ్యవృత్తిచేఁ జెప్పుదురు. అందు భృగువల్లియే ప్రమా
ణముగా నలరారుచున్నది. భృగువల్లియందు బ్రహ్మ
స్వరూపమును నిరూపించుటకు నానందమయకోశము వఱ
కుండెడి పంచకోశములను జెప్పి బ్రహ్మస్వరూపమును ధ్వనింపఁ
జేసెను. అట్లే సాంఖ్యుఁడుగూడ నద్వైత బ్రహ్మమువలెఁ
బురుష నిర్వచనమును జేసెను. కాని ప్రకృతికూడ నిత్యమని
యే నిర్వచించెను. వా రీశ్వరునివలన నేప్రయోజనము గూడ
లేదని చెప్పెదరు. అట్లగుచో నవాప్తసకలకాముఁడగు నీశ్వరు

రునకీ పాడుసృష్టియం దెంతమాత్రము ప్రవృత్తికలుగుట కవ కాశము లేదని వారి వాదము. స్వార్థ మవసరము లేదు. కావున నీశ్వరు నంగీకరించినచో మూలచ్ఛేదమే యగునని వారి యాశయము.

యోగులకును సాంఖ్యులకును విశేష భేదము లేమింజేసి యోగము విషయమై విశేషముగ మాటలాడనవసరము లేదు. కావుననే బాదరాయణ మహర్షి, సాంఖ్యనిరాకరణమును గావించి "ఏతేన యోగః ప్రత్యుక్తః" అని నిర్వచించెను.

పూర్వ మీమాంసకులన్ననో దేవుని నెగురఁగొట్టి మోక్షమును గూడ నెగురఁగొట్టి కర్మప్రాధాన్యము నంగీకరించిరి. ఉపనిషత్తులను 'అర్థవాదము' లని నిరూపించిరి. ఇందు 12 అధ్యాయములే నిజమగు శాస్త్రము. ఇం దెచటను నీశ్వరుఁడు గానరాఁడు. మిగిలినది సంకలనశాస్త్రము. ఇద్దానిని గల్పించి వీరు ప్రత్యేకముగా నొక యీశ్వరుని సృష్టించిరి.

ఇట్లు "అస్తి ఈశ్వరఇతి యో వద త్యాస్తికః సః" అనియు "నాస్తి ఈశ్వరఇతి యో వదతి స నాస్తికః" అనియు లక్షణములను నిర్వచించినచో నతివ్యాప్త్యవ్యాప్తులు వచ్చును గనుక, "అస్తి వేదప్రామాణం యస్య స ఆస్తికః, నాస్తి వేద ప్రామాణ్యం యస్య స నాస్తికః" అని నిర్వచించిన బాగుండు నని నా యభిప్రాయము.

ఇట్టి వైశేషిక న్యాయములు, సాంఖ్య యోగములు, పూర్వోత్తర మీమాంసలును ద్వంద్వత్రికములుగా బయలు

దేరినవి. ఈత్రికమునందు వైశేషికులతోడి నైయాయికులు ఈశ్వరుని స్థిరపరచుచుఁ బ్రాగభావము, కర్మ మున్నగు సామగ్రిని జెప్పి, దానినిబట్టి సృష్టివైచిత్ర్యము గలిగిన దని చెప్పిరి. దీనింబట్టి చూడ నైయాయికులు వైశేషికులకంటె నవీను లని తేలుచున్నది. వీరు వేదప్రామాణ్యమును, శబ్దమునకు ప్రమాణత్వమును బ్రత్యేకముగా నంగీకరించి దానిని స్థాపించుటకుఁ జాల శ్రమపడిరి.

ఇట్లు పైమతము లుండఁగా వేదాంత విషయమున నేను శ్రీ జగద్గురువుల సన్నిధిని జెప్పుటకు సమర్థుఁడను కాను. కావున నావిషయమును నే నుపసంహరించుకొందును. కాని దేశమున నద్వైతమతమునకుఁ బరిణామముగా బ్రహ్మసమాజము, పూర్వమీమాంసకు ఆర్యసమాజము మున్నగు మతములు బయలుదేరినవి. ఈ యార్యసమాజమున శూద్రోపనయనము నిషిద్ధముకాదు. ఇయ్యది యంతయు వేదమునకుఁ గోశత్వమువలన వచ్చిన దోషము. భగవద్గీత దివ్యజ్ఞానమతము వారికి ముఖ్యమగు ప్రమాణగ్రంథమఁట! వా రాయాయి గ్రంథములను బ్రమాణములుగా గ్రహించి యేవిషయములను గ్రహింతురో తెలియకున్నది. ఇట్లే మన దేశమున మతములు ప్రబలుచున్నవి.

నీలకంఠ శాస్త్రి.
14—5—35.

# వ్యాకరణపరిణామము.

శాస్త్రము అనునది పరమపురుషార్థబోధకము కావలయును. కావున నీ వ్యాకరణము కూడ నట్టిదే యగునో, కాదో విచారింతము. వ్యాకరణమునందు శబ్దసాధుత్వము దక్క వేఱొకటి లేదు. శబ్దములను శాసించుటవలన 'శాస్త్ర' శబ్దము వ్యాకరణమునందే యన్వర్థమగుచున్నది. మనవారు శాస్త్రమన ననుష్ఠానయోగ్యమగునదియను నర్థమును గ్రహించిరి. దానికి యోగశాస్త్రము నిదర్శనము. "అథ యోగానుశాసనమ్" అనునది యద్దానినే తెలియఁజేయుచున్నది. దాని ననుసరించియే "అథ శబ్దానుశాసనమ్" అని భాష్యకారుఁడు ప్రారంభించెను. కావున కాణాదిశాస్త్రము లట్టివి కావు. తక్కిన శాస్త్రములకు శాసకుఁడొకఁడైనను నీ వ్యాకరణమునకు మాత్రము ముగ్గురు శాసకులు. అందుచేతనే "త్రిముని వ్యాకరణమ్" అని ప్రసిద్ధి బయలుదేరినది.

శ్రీజగద్గురు శ్రీకల్యాణానంద భారతీమహాంతాచార్య స్వాములవారు సెలవిచ్చిన "వృద్ధి రాదైచ్" అని వృద్ధి ప్రారంభము, "అ అ" అను నుపసంహారమును బైని నేఁ జెప్పిన పరమ పురుషార్థ బోధకత్వమునకు మిక్కిలి యనుకూలించుచున్నవి.

త్రిమునులలోఁ బతంజలి ప్రధాన మగు ప్రామాణ్య పదవి నధిష్ఠించినాఁడు. పాణిని వాక్యములయందలి సూక్ష్మములగు సందేహములకుఁ బతంజలిమహాశయుని సందేహ

నిర్వాపకములగు వ్యాఖ్యానములు లేనిచో భాషాశాస్త్రము యొక్క గతి యేమయ్యెడినో! ఇందువలననే వైయాకరణు లుత్తరోత్తరప్రామాణ్యము నంగీకరించిరి.

అందువలననే "వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తిర్నహి సందేహా దలక్షణమ్" అని కూడఁ జెప్పఁబడినది. ఈయుత్త రోత్తరప్రాధాన్యము ముఖ్యములగు కొన్ని విషయముల యందుఁ గన్పట్టుచున్నది. చూడుఁడు; శ్రుతిశిరోభూతములగు నుపనిషత్తులకు మనవారు కర్మబోధకములగు పూర్వశ్రుతుల కంటెఁ బ్రాధాన్యము నిచ్చియున్నారు. ప్రమాణములలో వ్యాకరణము ప్రధానమని యందఱు నంగీకరించినవిషయమే. అందువలననే కావ్యప్రకాశమునందు మమ్మటభట్టు "ప్రథమే విద్వాంసో వైయాకరణాః" అనియు "బుధై ర్వైయాకరణైః ప్రధానీభూత స్ఫోటవ్యంజకస్య శబ్దస్య ధ్వని రితి వ్యవహారః కృతః" అనియు వైయాకరణుల నెక్కుడు గౌరవపదవియందు నిలిపెను.

పతంజలిగ్రంథములను బట్టి చూచినచోఁ బతంజలి కభి ప్రేత మగునది యద్వైతమే యని తెలియుచున్నది. అద్వైత జ్ఞానమునందు వాక్కాయమనశ్శుద్ధులు గలవాఁడే యధికారి. అందుచేతనే పతంజలిమహాశయుఁడు వాఙ్మలనివర్తకముగ మహాభాష్యమును, కాయమలనివర్తకముగఁ జరకమను వైద్య గ్రంథమును, మనోమల నివర్తకముగ యోగశాస్త్రమును రచించి నేఁటికిఁగూడఁ దత్తచ్ఛాస్త్రప్రవర్తకులచే—

"యోగేన చిత్తస్య పదేనవాచాం మలం శరీరస్య చ వైద్యకేన,
యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలిరానతోఽస్మి"

అని బహుభక్తిశ్రద్ధలతోఁ గీర్తింపఁబడుచున్నాఁడు.

స్ఫోటమే 'బ్రహ్మ'మని వైయాకరణవాదము. ఇయ్యది యద్వైతులచేఁ దలంపఁబడెడి సజాతీయ విజాతీయ స్వగత భేద రహితమును, సచ్చిదానందరూపము నగు బ్రహ్మము కాక పోయినను పంచకోశాంతర వాక్యములవలెఁ దత్ప్రాపకము లలో నత్యంత సన్నిహిత సాధనము కావచ్చును. "స్ఫుట త్యర్థోఽనేన" అను విగ్రహముచే స్ఫోట మన బ్రహ్మమగునని వారి యాశయము. సమస్తార్థ స్ఫోటకత్వము బ్రహ్మమునకుఁ దక్క వేఱొకదానికి లేదుగదా! శబ్దార్థములకు సంబంధము లేక పోయినచో నర్థబోధ కలుగుటకు వీలులేదు. ఇతరమతము లెట్లున్నను శబ్దార్థముల కభేదమే యని వైయాకరణ సిద్ధాన్తము. నామరూపభేదముచేఁ బ్రపంచము ద్వివిధముగా నున్నదని "నామరూపే వ్యాకరవాణి" అను శ్రుతి బోధించు చున్నది. నామరూపములకు స్వరూపభేద మున్నను గార్యైక్యమువలన ఘటకలశాదులవలె నభిన్నములే యగు చున్నవి. అందువలననే శబ్దదర్శనమున నర్థము, నర్థదర్శన మున శబ్దమును దప్పక స్ఫురించుచున్నవి. ఈయర్థమే—

"న సోఽస్తి ప్రత్యయో లోకే యః శబ్దానుగమాదృతే,
అనువిద్ధమివ జ్ఞానం సర్వం శబ్దేన భాసతే."

అని చెప్పఁబడుచున్నది. కనుకనే ఘటవస్తు విషయక జ్ఞానము "ఘట ఇతి జ్ఞానమ్" అనిశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది. ఈ కారణైక్యమువలనఁ గార్యాభేదము భాసించుటచేతనే "సర్వే సర్వార్థవాచకాః" అని బయలుదేరినది. ఈజ్ఞానము కారణజ్ఞానము గల యోగులకుఁదక్క మనబోంట్ల కారణజ్ఞాన శూన్యులకుఁ గలుగదు.

ఇఁక శబ్దము వర్ణాత్మక మగుటంజేసి యావర్ణములు నిత్యములనియు, ననిత్యములనియుఁ బెక్కుమతము లున్నవి. ఏది యెట్లున్నను నీశబ్దమువలన నర్థమును బోధించు నొకశక్తి గలుగుననియు నయ్యదియే స్ఫోట మనియు వీరివాదము. ఈ స్ఫోటము తాభాసించుచున వస్త్వంతరమున్నంతవఱకు వస్త్వంతరమును భాసింపఁజేయును. ఇయ్యది యద్వైతపరబ్రహ్మమునకు సన్నిహితము. ఈస్ఫోటము దేశకాలాపరిచ్ఛిన్నము. ఈక్షణమున నీదేశములో ఘటశబ్దము నుచ్చరించినచో నెట్లర్థబోధ కలుగుచున్నదో, యాతీరుననే వేఱొక దేశమం దీక్షణముననే ఘటశబ్దము నుచ్చరించినచో నర్థబోధ కలుగును. అట్లే కాలాంతరమునఁగూడ నీఘటశబ్దము తనయర్థమును బోధించుచుండును. కావున నీస్ఫోటము దేశకాలాపరిచ్ఛిన్నము. పైతీరున స్ఫోటము సాధకమయినను స్వసూతమయినను ముఖ్యమగునది మాత్రము కాఁగలదు. ఈవిషయము మనకు పాణినియొక్క సూత్రములలో నెచటను గన్పడకపోయినను సూత్రాశయములను బ్రకటీకరించు భాష్యములో స్పష్టముగాఁ గన్పడుచున్నది. కావుననే తత్త్వార్థబోధకుఁడగు పతంజలికి నపూర్వ

మగు గౌరవము గలిగినది. సత్యమున కేకరూపము తక్క భిన్నరూపము లుండవుగావునఁ బ్రక్రియ యలీకము. ఈ ప్రక్రియ భాషకొకొక్కవిధమున విచిత్రముగ మారుచుండును. ఇట్టి ప్రక్రియా ప్రదర్శనమునందు వ్యాకృతికర్తలు, వ్యవహారవిరుద్ధముగఁగూడ రూపములను సాధింతురు. మచ్చున కొకదానిని చటుఁబ్రదర్శించెదను. తెనుగులో 'మా + ఊరు' అను మొదలగు చోటులందుఁగూడ యడాగమము వచ్చునని "సంధి లేనిచో స్వరంబుకంటెం బరంబగు స్వరంబునకు యడాగమంబగు' అని చిన్నయసూరి సూత్రించెను. సాధారణముగా 'మా + ఇల్లు=మాయిల్లు, మా + ఎద్దు=మాయెద్దు' మున్నగు చోటుల యడాగమము వచ్చినను, పై స్థలమునందు వకారము వచ్చి "మావూరు" అను రూప మగుట సర్వానుభవసిద్ధమై యున్నది. ఇట్లే యీవ్యాకరణములయందుఁ జాల విచిత్ర ప్రక్రియలు గన్పడుచుండును. భాష వ్యవహారమునఁ జాల మార్పులను పొందుచుండును. చూడుడు; సాధారణముగఁ దెనుఁగున రేఫసంయుక్త వర్ణములలో రేఫము పోవుట గన్పడుచున్నది- వ్రాత=వాత, గ్రద్ద=గద్ద, ప్రత్తి=పత్తి మున్నగునవి. ప్రకృతము ననుసరింతము.

అలీకమయినను శాస్త్రము పంచకోశాది వాక్యములవలె ముఖ్యమగు సాధన మగుచున్నది. అందుచేతనే—

"శాస్త్రేషు ప్రక్రియాభేదై రవిద్యైవోపవర్ణ్యతే,
సమారంభస్తు భావానా మనాది బ్రహ్మ శాశ్వతమ్॥

అని వాక్యపదీయమునఁ జెప్పఁబడియెను. ఇంతియ కాదు, ప్రక్రియా విశేషమును బోధించు శాస్త్రముయొక్క ప్రయోజనము—

"తద్ద్వార మపవర్గస్య వాఙ్మలానాం చికిత్సితమ్
పవిత్రం సర్వవిద్యానా మధివిద్యం ప్రకాశతే,
ఇద మాద్యం పదస్థానం సిద్ధిసోపానపర్వణామ్,
ఇయం సా మోక్షమాణానా మజిహ్మా రాజపద్ధతిః,
అత్రాతీతవిపర్యాసః కేవలా మనుపశ్యతి"

అని చెప్పఁబడియెను. అందుచేతనే—

పంచకోశాదివత్తస్మా త్కల్పనైషా సమాశ్రితా,
ఉపేయప్రతిపత్త్యర్థా ఉపాయా అవ్యవస్థితాః."

అని చెప్పఁబడినది. ఈయుపాయావ్యవస్థచేతనే యనేకములగు దర్శనములు బయలు దేరినవి.

ఇఁక భాషావిషయమును బరిశీలింతము. భాషయొక్క ప్రయోజనము సాక్షాత్తుగాఁ గాని బరంపరగాఁ గాని ప్రవృత్తి నివృత్తులు. ఈప్రవృత్తినివృత్తులు వాక్యములవలననే కలుగును గాని కేవలము వాక్యమునం దేకదేశములగు పదముల వలన నెంతమాత్రము కలుగవు. కావున భాష వాక్యరూపమున నే యున్నదని చెప్పవలయును గాని తార్కికులవలెఁ బదరూపమున నున్నదని చెప్పఁగూడదు. భాష యలవడుట గూడ వాక్యరూపమున నున్న లోకవ్యవహారమువలననే యల వడునని సర్వసమ్మత మగుచున్నది. వ్యవహారము శక్తిగ్రాహక శిరోమణిగదా?

ఇంతియకాదు! ప్రకృతియావిశేషమును బోధించు శాస్త్రముగూడ పదములవలన వ్యవహారము గాక వాక్యముల వలననే యని సూచించుచున్నది. చూడుఁడు: 'రాజపురుషః' అనుచో రాజశబ్దము పురుషశబ్దము వేఱా లేక రెండుగా భాసించుచున్నను, ఒక్కటియేనా అని విచారించినచో నయ్యది యొక్కటియే కాని రెండుపదములయొక్క కూడిక యెంతమాత్రము కాదని స్పష్టమగును. ఎందుచేత ననఁగా "సుందరస్య రాజ్ఞః పురుషః" అనుచోఁ బ్రత్యేకములగు పదములలో సుందరశబ్దార్థ మెట్లు రాజశబ్దార్థములోని కన్వయించునో యట్లు "సుందరస్య రాజపురుషః" అనుచో నన్వయింపక యా వాక్యమున కసాధుత్వము నాపాదింపఁజేయుచున్నది. కావున నీ రాజపురుషశబ్దము నందలి రాజశబ్దము నకుఁ బ్రత్యేకఁపు టర్థము లేదని సుస్పష్ట మగుచున్నది. ఈ యర్థమునే శాస్త్రకారులు "సవిశేషణానాం వృత్తిర్నవృత్తస్య వా విశేషణయోగో నాస్తి" అని చెప్పిరి. కావున వృత్తియందలి శబ్దము లఖండములే కాని ఖండము లెంతమాత్రము గావు. ఇట్టివృత్తిగతపదముల కర్థము గలదా లేదా యను విషయమును దీసికొనియే శాస్త్రమున జహత్స్వార్థపక్ష మనియు నజహాత్స్వార్థపక్షమనియు రెండు బయలుదేరినవి. జహత్స్వార్థమున వృత్తిగతపదముల కర్థముండక విశిష్టమున కఖండార్థము సిద్ధించుచున్నది. అజహాత్స్వార్థమున వృత్తిగతపదముల కర్థ ముండవచ్చును. ఈ పక్షములలో తొలిపక్షము నేకార్థభావ పక్షమనియు, రెండవదానిని వ్యపేక్షావాద మనియు వ్యవహా

రింతురు. ఇట్లు రెండుపక్షములు శాస్త్రసిద్ధము లయినను వైయాకరణుల సిద్ధాన్తము వృత్తులవిషయమున నేకార్థీభావమే కాని వ్యపేక్షావాద మెంతమాత్రము కాదని—

"సమాసేషు భిన్నైవ శక్తిః పంకజశబ్దవత్
బహూనాం వృత్తిధర్మాణాం వచనైరేవ సాధనే
స్యాన్మహద్గౌరవం తస్మాదేకార్థీభావ ఆశ్రితః"

అను కారికలచేఁ దెలియవచ్చుచున్నది. కావున సమాస మఖండమే. "సమర్థః పదవిధిః" (పా. సూ. 2-1-1) అను సూత్రముకూడ సిద్ధానినే చెప్పుచున్నది. పదములయందలి వర్ణముల కెట్లర్థము లేదో యాతీరుననే వృత్తిగత పదముల కర్థము లేదు. 'రాజపురుషః' అనునది యంతయు నఖండమగు నొక పదమే యని వైయాకరణసిద్ధాన్తము. అవయవవిభాగ మవిద్యాకల్పిత మని వారు చెప్పుదురు.

'రాజ్ఞః + పురుషః' అనునది 'రాజపురుషః' అను దాని యొక్క స్వరూపపరిజ్ఞానము కొఱకుఁ గల్పింపఁబడిన వాక్యమే కాని 'రాజ్ఞః + పురుషః' అనునదియే 'రాజపురుషః' అని యగుచున్నదని చెప్పఁగూడదు. ఈ విగ్రహవాక్యములు సమాసముయొక్క యర్థమును బోధించుటయే ప్రధానముగాఁ గలవగుటచే నెట్లుచెప్పబడినను బాధలేదు. అందుచేతనే 'రాజ్ఞః + పురుషః' అనునది 'రాజపురుషః' అను దానియొక్క యర్థమును సరిగా బోధింపజాలదని యితరమతములవారు 'రాజసంబంధీ పురుషః' అనియు 'రాజసంబంధవాన్ పురుషః' అనియు నిట్లు వేఱువేఱు విగ్రహవాక్యములను గల్పించిరి. 'రాజ్ఞః + పురుషః'

అనునదియే విగ్రహవాక్యమనినచో "నామార్థయో రభేదా న్వయః" అను నియమముచే నభేదబోధ గలిగి 'రాజాభిన్నః పురుషః' అని బోధ కలుగునేమో యని వారిభయము. కాని యితర మతస్థు లట్లు విగ్రహముల నర్థోపపత్తికొఱకుఁ జెప్పి నను శాస్త్రము ప్రక్రియను బోధించుచున్నది గావున శాస్త్ర దృష్టిచే వారుచెప్పిన విగ్రహములయందు మతుబాదులకు లోపముఁ జెప్పెడి శాస్త్రము గన్పట్టదు. కావున శాస్త్రరీతిచే 'రాజ్ఞః + పురుషః' అనియే చెప్పి పూర్వోక్తదోషము నివారించుటకు రాజపదము రాజసంబంధిలక్షకమని చెప్పవలయును. వస్తుతః విగ్రహవాక్యము రేఖాగవయన్యాయముచే వస్తుప్రదర్శన మాత్రోపయోగియై యలీకమే యగుచున్నదని పూర్వమునఁ జెప్పఁబడియె.

ఇంతియకాదు. విగ్రహమున నేకత్వాది సంఖ్యా విశేషము భాసించుననియు సమాసమున నభేదైకత్వ సంఖ్య భాసించుననియు వైయాకరణుల సిద్ధాన్తము. అభేదైకత్వ సంఖ్యయనఁగా నేకత్వాదివిశేషసంఖ్యకు వేఱు వేఱుగా నవభాసము లేకపోవుట యని యర్థము. వేఱు వేఱురుచులు గలిగిన యనేకపదార్థముల నొకదానియందుఁ గలిపినచో నాయారురుచులు తిరుగ మనకు నెట్లు వేఱువేఱుగాఁ గన్పడవో యాతీరుననే సీవృత్తియందు సంఖ్యావిశేషము మనకు వేఱువేఱుగాఁ గన్పడదని

"యథౌషధిరసా స్సర్వే మధున్యాహితశక్తయః,
అవిభాగేన వర్తన్తే సంఖ్యాంతాం తాదృశీం విదుః."

అను వాక్యపదీయమువలన సుస్పష్టమగుచున్నది.

ఇట్లువైయాకరణు లఖండములగు వాక్యములే వ్యవహారసిద్ధము లగుట వలన నాయఖండవాక్యస్ఫోటయే బ్రహ్మమనియు నయ్యదియే పరమపురుషార్థమనియు

"ఇత్థం నిష్కృష్యమాణం యచ్ఛబ్దతత్త్వం నిరంజనమ్,
బ్రహ్మైవేత్యక్షరంప్రాహు స్తస్మైపూర్ణాత్మనేనమః"
అని సిద్ధాన్తమును జేయుచున్నారు.

నీలకంఠశాస్త్రి.

---

# మధ్వప్రమాణలక్షణఖండనము.

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం,
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.
శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానంద విగ్రహమ్,
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే.
కామేశ్వరీం వరాం మీడే కాదిహాదిస్వరూపిణీమ్,
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్.

మధ్వమతమునకుఁ బరమప్రమాణములుగా మధ్వచే రచింపఁబడిన ప్రమాణలక్షణము మున్నగు పది ప్రకరణములని మధ్వసంప్రదాయస్థు లెల్లరిచేఁ బరిగణింపఁబడుచున్నది.

వలనన మధ్వతనమతమును లోకమునకు బోధింపఁ బ్రథమ
మున నీదశప్రకరణములను జిత్రించి తన్మూలకముగఁ బవిత్ర
గ్రంథములుగా విబుధలోకముచే నెన్నఁబడు ప్రస్తానత్రయ
మునకుఁ గువ్యాఖ్యానములను లోకమునకు వ్యామోహమును
గల్పింప రచియించినట్లు గ్రంథపరిశీలనచే సువ్యక్త మగు
చున్నది. అంతియకాదు. మధ్వగ్రంథములలో బ్రహ్మసూత్ర
వ్యాఖ్యానములుగఁ బఱఁగుచుండెడి సూత్రార్థము, అణ్వర్థము,
అను వ్యాఖ్యానమునను గ్రంథములును భగవద్గీతావ్యాఖ్యా
నమును దశోపనిషద్వ్యాఖ్యానమును గూడ నీదశప్రకర
ణములయందు వ్యక్తీకరింపఁబడిన యర్థసందర్భముల తోడనే
చిత్రింపఁబడి యలరారుచున్నవి. ఇంటియందు మధ్వగ్రంథము
లకుఁ బలువిధములగు వ్యాఖ్యానాడంబరములను జిత్రించిన
పలువిధముల గువ్యాఖ్యాతలు గూడ సందిగ్ధార్థనిర్ణయముల
యందు నీ దశప్రకరణములలోని వాక్యములను గైకొని యర్థ
నిర్ణయమును జేసియున్నారు. కావున మధ్వమతముయొక్క
బ్రతుకంతయు నీ దశప్రకరణములే యని సువిదితమే.

ఈ దశప్రకరణములు నెట్టి ప్రమాణము నాధార
ముగాఁ గల్గియుండక మధ్వకపోలకల్పితమగు వాక్యములచే
నలరారుచున్నది. మధ్వకపోలకల్పితము లైనను బ్రమాణ
సిద్ధము లగుచో నుపాదేయములు కావచ్చును. కాని యీ దశ
ప్రకరణములు శిష్టపరిగృహీతములగు ప్రమాణములకు విరు
ద్ధము లగుటంజేసి సర్వదా హేయంబు లగుచున్నవి.

ఇంతియకాదు. ఈ దశప్రకరణములు నొకదానికి నింకొకటి బాధకము లగుచున్నను నున్మత్తప్రలాపము లట్లు బఱగుచున్నవి. దోషగ్రస్తములగు నీ దశప్రకరణముల తత్త్వమును విబుధలోకము గుర్తింపకుండుటంజేసి లోకమున కనర్థము గల్గుచున్నది.

ఈ దశప్రకరణములయందుఁ బ్రమాణలక్షణ మను ప్రకరణ మగ్రగణ్యమును బ్రకరణాన్తరముల కాధారభూత మున్న గావున నద్దానియందలి దోషములు నిర్వచింపబడును గావునఁ బ్రమాణవిదులు ప్రయోజనమును గందురుగాక !

మధ్వయన్నతో తన ప్రమాణలక్షణమునందలి యుపక్రమశ్లోకమునందుఁ దన ప్రమాణలక్షణము అలక్షణమే యని తెలియవచ్చునట్లు "ప్రవక్ష్యామి ప్రమాణానాం స్వలక్షణమ్" అని నిర్వచించియున్నాఁడు. ఇచట 'ప్రమాణానాం స్వలక్షణమ్' అనఁ బ్రమాణములయొక్క స్వలక్షణమనికదా యర్థము. స్వలక్షణ మననేమి? స్వస్య = తనసంబంధమగు, లక్షణమనియును, లేదా సు = లెస్సయగు, అలక్షణమ్ = అవలక్షణమనియును రెండర్థములు భాసించుచున్నవి. ఇందు రెండవయర్థముచేఁ బ్రమాణములకు లెస్సయగు నవలక్షణము జెప్పఁబడుచున్నదను నర్థము నిస్సందేహముగ సిద్ధమగుచున్నది. ఇఁక మొదటియర్థమందన్నతో 'స్వస్య' అను దానికి నెట్లర్థమును గ్రహింప వలయును? అనఁగా మధ్వయనియా ప్రమాణమనియా స్వశబ్దమున కర్థము. మధ్వ యను నర్థమును గ్రహించినచో నయ్యది మధ్వునికిఁ బ్రమాణము

గావచ్చునుగాని తదితరుల కెంతమాత్రము ప్రమాణము కానేఱదు. స్వశబ్దమునకుఁ బ్రమాణమను నర్థమును గ్రహించి నచో 'ప్రమాణానాం' అనుపదము పూర్వమం దుండుటచేఁ బునరుక్తిదోషగ్రస్తమగును. కావున నీ 'స్వలక్షణమ్' అను శబ్ద మపశబ్దమని సువ్యక్తమగుచున్నది. అపశబ్దముచేఁ బ్రారంభింపఁబడిన ప్రకరణ మపప్రకరణమే యగునుగాని సుప్రకరణ మెంతమాత్రము గాదు గదా! అయినను బ్రకరణ మొకింత విమర్శింపబడుచున్నది.

ఈ ప్రకరణము 'యథార్థం ప్రమాణం' అను వాక్యముతోఁ బ్రారంభమగుచున్నది. అనఁగా బ్రమాణమన యథార్థమని యర్థము. 'తద్ద్వివిధం కేవల మనుప్రమాణంచ' అనునది రెండవ సూత్రము. అనఁగా ఆ యథార్థము కేవలమనియు ననుప్రమాణ మనియు రెండువిధములని యర్థము.

2. ఇఁక మూఁడవ సూత్రము 'యథార్థజ్ఞాన కేవలం' అని అనగాఁ గేవల మను యథార్థము యథార్థజ్ఞాన మని చెప్పబడుచున్నదని యర్థము. దీనిని బట్టి యొకవిధమగు యథార్థము యథార్థజ్ఞానమని చెప్పఁబడినట్లు దేలుచున్నది. అనగా యథార్థ మన యథార్థజ్ఞాన మని చెప్పినట్లు స్పష్టమగుచున్నది. యథార్థమును యథార్థజ్ఞాన మనుటకంటె వేఱొండు నవివేకము లేదు. ఇందలి దోషము సుగమము గాఁగ నీ మూఁడుసూత్రములవలనఁ దెలియవచ్చెడి యర్థము నీదిగువ బరిలేఖనము చేయఁబడుచున్నది.

యథార్థము (ప్రమాణము)

కేవలము (యథార్థ జ్ఞానము) | అనుప్రమాణము.

ఈ పరిలేఖనమువలన యథార్థములో నవాంతరభేదము యథార్థజ్ఞానమని చెప్పబడినట్లు సువ్యక్త మగుచున్నదిగదా! అర్థజ్ఞానములు రెండు నత్యంతవిలక్షణము లగుచుండ నర్థము నందలి యవాంతరభేదము జ్ఞాన మనుట యున్మత్తాలాపము.

3. ఇఁక "తత్సాధన మనుప్రమాణ" మని నాలుగవ సూత్రము బఱఁగుచున్నది. ఇందు 'తత్సాధన' మనఁగాఁ కేవల మను యథార్థజ్ఞానమునకు సాధనమనిగదా యర్థము. ఇచ్చట ననుప్రమాణ మనుటలోఁ బ్రమాణశబ్దమునకు నెట్టి యర్థమును గ్రహింపవలయును? "యథార్థం ప్రమాణం" అనుసూత్రము ననుసరించి యథార్థ మనియేకదా? దీనిఁబట్టి యథా కేవల మను యథార్థజ్ఞానమునకు సాధన మను యథార్థ మనికదా తేలుచున్నది. యథార్థజ్ఞానమన యథార్థమే యని పూర్వము నిరూపింపఁబడినది.

అనుప్రమాణ మన యథార్థమనికూడఁ జెప్పఁబడినది. కావున యథార్థమునకు యథార్థము సాధనమనియు యథార్థజ్ఞానమునకు యథార్థజ్ఞానము సాధన మనియు స్పష్ట మగుచున్నది. ప్రమాణమునకుఁ బ్రమాణము సాధనమని

స్పష్టము. సాధనసాధ్యములు రెండు నొకటే యనుట యవి
వేకవిలసితము. ఇందలిదోషము సుగమముగాఁగఁ బైవరిలేఖ
నము ప్రదర్శింపఁబడుచున్నది.

యథార్థము (ప్రమాణము)




4. ఈ దోషము లట్లుండ నీ నాల్గుసూత్రములవలనఁ
దెలియవచ్చెడి ప్రమాణము, యథార్థము, జ్ఞానము, సాధ
నము అను నాల్గుపదములకు నెట్టి యర్థమును గ్రహింపవల
యునో యింతవఱకు నూహింప నవకాశము చాలకున్నది.
లక్షణగ్రంథమున నుపయోగింపఁబడుపదములకు నుచితమగు
నర్థము నిరూపింపఁబడనిచో నాపదములు గగనకుసుమము
లతోఁ దుల్యము లగుచు నిరర్థకములు నిష్ప్రయోజనములు
నగుచున్నవి.

పోనిండు తంత్రాంతరములందుఁ దెలియవచ్చెడి యర్థము
నీపదములకు గ్రహింతమన్ననో యేతంత్రము నుండి యర్థ
మును గ్రహింపవలయునో యయ్యదియు వ్యాగ్యమే. ఏలనన
నీపదములకుఁ దంత్రభేదముచే నర్థభేదము లక్షణభేదమును
సుప్రసిద్ధముగఁ దెలియవచ్చుచున్నది.

5. ఇంతియకాదు. ప్రమాణశబ్దార్థము సర్వతంత్ర
విరుద్ధముగ నిం దుదాహరింపఁబడియున్నది. ఏమన ప్రమాణ

మనఁ బ్రమాకరణమనియుఁ బ్రమ యన యథార్థజ్ఞానమనియు గరణ మన సాధనమనియుఁ బ్రసిద్ధము. అనఁగా యథార్థజ్ఞానమునకు సాధనము ప్రమాణమని ప్రమాణశబ్దముయొక్క వ్యుత్పత్తిచే నిర్వచింపఁబడియున్నది. ఇట్లు సర్వతంత్రసిద్ధమగు వ్యుత్పత్తినుల్లంఘించి యథార్థము ప్రమాణమని యపూర్వముగ నొక యసంబద్ధప్రలాపమును బ్రమాణలక్షణ మను ప్రకరణముయొక్క తొలుత నిర్వచించుటచేతనే యీ ప్రకరణ మంతయు నసంబద్ధప్రలాపమే యని తెలియవచ్చుచున్నది.

మధ్వ యీ నాల్గుసూత్రములను జిత్రింపక "యథార్థజ్ఞానసాధనం ప్రమాణం" అని తొలిసూత్రమును రచించినచో నొకింత సరసముగ నుండియుండును. అట్లు చేయకపోవుటచే నీ గ్రంథము విరసముగఁ బరిణమించుటయేకాక, విఘ్నేశ్వరుని జేయఁదలంచినవానికి వానరము తయారాయె ననులోకోక్తికి వన్నెదెచ్చుచున్నది.

ఇంతియకాదు: సర్వతంత్రసిద్ధమగు లక్షణమునే గ్రహించినచో నిందు మధ్వునిచే నుద్దేశింపఁబడిన దుర్మతము నిందుఁ బ్రవేశపెట్టుటకు సావకాశము గలుగదను నాశయమున నీచిత్రరచనకు మధ్వ గడంగినట్లు నిశ్చయింపనగును.

6. ఇందుఁ బ్రవేశపెట్టబడిన దుర్మత మెద్దియన:

1. కేవలం చతుర్విధం, ఈశలక్ష్మ్యయోగ్య యోగిభేదేన.

2. పూర్వద్వయ మనాది నిత్యం.

3. స్వాతంత్ర్యపారతంత్ర్యాభ్యాం తద్విశేషః.

4. పూర్వం స్వపరగతాఖిలవిశేషవిషయమ్.
5. ద్వితీయ మీశేఽన్యేభ్యోఽధికమ్, అసార్వత్రికం.
6. అన్యత్ర సర్వవిషయం.
7. స్పష్టత్వే భేదః.
8. యోగిజ్ఞానం ఋజూనా మనాది నిత్యం.
9. ఈశే జీవేభ్యోఽధికమ్.
10. అన్యత్రాలోచనే సర్వవిషయం. క్రమేణ వర్ధమాన మాముక్తేః.
11. తతోఽవ్యయమ్.
12. తతోఽర్వాక్క్రమేణ హ్రసితం, సాదిచ తాత్త్వికేభ్యోఽన్యత్ర.
13. అయోగిజ్ఞాన ముత్పత్తి వినాశవ దల్పమ్

అని ఈ పదమూఁడు సూత్రములచేఁగొత్తగ మధ్వచేఁ జిత్రింపఁబడినది యపూర్వవిశేషము. దీనిని మధ్వ కేవల యథార్థమని చెప్పుకొనుచున్నాఁడు. దీనిని యథార్థ మనుటకుఁ గాని కేవల యథార్థ మనుటకుఁ గాని గల ప్రమాణ మెద్దియు నిర్వచింపఁబడియుండ లేదు. దానంజేసి యయ్యది మధ్వ ప్రకల్పనమే గాని వేఱొండు శ్రుతిస్మృతిచోదిత మెంత మాత్రము గాదు కావున నిర్మూలకమును నిష్ప్రమాణకము నగుటంజేసి సర్వవిధముల నుపేక్షింపఁబడుచున్నది.

7. ఇఁక నీ స్వకపోలజల్పనమునకుఁ బిమ్మట "అను ప్రమాణం త్రివిధం, ప్రత్యక్ష మనుమాన మాగమ ఇతి" అని

వాక్యనిర్వచనమును జేసియున్నారు. ఇచ్చట ననుప్రమాణ
మన యథార్థజ్ఞానసాధన మని "తత్సాధన మనుప్రమాణం"
అను సూత్రముచేఁ దెలియవచ్చుచున్నవి. దానంజేసి యీ
వాక్యమున ననుప్రమాణమను పదమును దొలఁగించి 'తత్'
అను పదమును జేర్చి "తత్త్రివిధం ప్రత్యక్షానుమానాగమ
ఇతి" అని రెండవ సూత్రముగా గ్రహించిన నొకెంత సరస
ముగ నుత్తరగ్రంథ ముండును. మధ్వ యిం దెట్లు చిత్రించినను
యథార్థజ్ఞానమునకు సాధనము ప్రత్యక్షము అనుమానము
ఆగమము అను మూఁడువిధములని వెల్లడించియేయున్నారు.
ఇది యొక నూతనవిషయము గాదు. ఈ విషయమును జెప్పు
టచే మధ్వునకుఁ గల్గు గొప్పదనముకూడ లేదు. ఏలనన
ఇంతకుముందుఁ బతంజలి తనయోగసూత్రమున "ప్రత్య
క్షానుమానాగమాః ప్రమాణాని" అని ప్రమాణనిర్వచన
మును జేసియున్నాఁడు.

8. ఇట్లే సాంఖ్యతంత్రమందుఁగూడ బ్రత్యక్షానుమా
నాగమములు మూఁడే ప్రమాణములుగా గ్రహింపఁబడినవి.
దానం జేసి యీ మధ్వోక్తి తంత్రాంతరీయవాక్యముయొక్క
పునరుక్తిగాని వేఱుకాదు.

పోనిండు. పునరుక్తి యైనఁ గావచ్చును. ఇం దెద్ది
యైన విశేషము గలదా యనినచో విశేషము లేకపోవుట
యటుండ నీప్రమాణములు దురుక్తిభూయిష్ఠములై యున్నవి.
ఏలనన నీప్రత్యక్షానుమానాగమము లను మూఁడిటికిని
జెప్పిన లక్షణములను జేసినవివరణములను జూచిన మధ్వబుద్ధి

యొక్క వైశద్య మంతయు నువ్యక్తమగును. కావున నద్దాని నొకింత పరిదర్శింతుము.

ప్రత్యక్షమన నిర్దోషార్థేంద్రియసన్నికర్షమని "నిర్దోషార్థేంద్రియసన్నికర్షః ప్రత్యక్షః" అనియు, అనుమానమన నిర్దోషోపపత్తియని "నిర్దోషోపపత్తి రనుమానమ్" అనియు అనాగమ నిర్వచనము 'నిర్దోషః శబ్ద ఆగమః' అనియుఁ బ్రత్యేకముగా మూఁడువాక్యముల రచించెను. ఇచటఁ బ్రత్యక్షలక్షణమును గ్రహించుటలో నైయాయికులచే నిర్వచింపఁబడు "ఇంద్రియార్థసన్నికర్షజన్యం జ్ఞానం ప్రత్యక్షం" అను ప్రత్యక్షలక్షణమున నొకింతఁ దొలఁగించి గ్రహించునట్లు స్పష్టమగుచున్నది. నైయాయికు లింద్రియార్థ సన్నికర్ష వలనఁ బుట్టుజ్ఞానమును ప్రత్యక్ష మందురు. మధ్వ యన్ననో యింద్రియార్థసంనికర్షమునే ప్రత్యక్ష మనుచున్నాఁడు. ఇఁక నీయింద్రియార్థసన్నికర్షమునకు నిర్దోష మని విశేషమును వాడెను.

ఈ నిర్దోషపదముచేఁ గల్గు ప్రయోజనము లేదని నైయాయికులు దీనిని దొలగించియేయున్నారు. అట్టి నిర్దోషపదమును మఱల గ్రహించుట యొకదోషము.

10 ఆవశ్యకములగు జన్యజ్ఞానపదములఁ ద్రోసివుచ్చుట వేఱొకదోషము.

ఇట్లు న్యాయదృష్టిచే నీలక్షణము దోషభూయిష్ఠమై యున్నది. ఇఁక ననుమానమునకు లక్షణము "నిర్దోషోపపత్తి రనుమానం" అని చెప్పబడుచున్నది. ఇం దుపపత్తి యనునది

తంత్రాంతరములయందుఁ దెలియఁబడని యొక విశేషమే. కావున నీ లక్షణము సర్వతంత్రవిరుద్ధమ్మగ నున్నది. ఇచట నుపపత్తి యన నేమియో యొకింత మధ్వముఖమున విచారింతము.

ఇందు "ఉపక్రమోపసంహార తదైకరూప్యాభ్యాసాపూర్వతాఫలార్థవాదాశ్చ ఉపపత్తివిశేషాః తఏవసోపపత్తయో లింగాని సమాఖ్యావాక్యప్రకరణ స్థానానిచ లింగవిశేషాః" అని వ్రాయఁబడినది. దీనివలనఁ దెలియవచ్చు నదేమన ఉపక్రమము, ఉపసంహారము, తదైకరూప్యము, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము, అను నివి యేడు నుపపత్తి విశేషములనియు, తఏవ = ఆయే డుపపత్తులే, సోపపత్తయః = ఉపపత్తులతోఁగూడి, లింగాని = లింగము లగుచున్నవని. అనఁగా నుపపత్తులతోఁగూడినయుపపత్తులు లింగములని చెప్పినట్లాయెను.

ఇట్టి యర్థమును "నిర్దోషోపపత్తి రనుమానః" అను సూత్రముతోఁ బొందికచేసినచో ననుమానముతోఁ గూడిన యనుమానము లింగమని తేలుచున్నది.

**11.** ఇఁక నట్టి యనుమానముతోఁ గూడిన యనుమానము లనెడి లింగము లెవ్వి యనః 'సమాఖ్య, వాక్యము, ప్రకరణము, స్థానము' అనునవి యని "సమాఖ్యా వాక్య ప్రకరణ స్థానాని లింగవిశేషాః" అనువాక్యముచేఁ దెలియవచ్చుచున్నది. దీనివలనఁ దెలియవచ్చెడి యనుమానలక్షణ మెద్దియో యనుమానప్రమాణకోవిదులే నిర్ణయింపవలెను. ఈ

మూఁడు వాక్యములను మధ్వ యెట్టిస్థితిలో రచియించి యుండెనో భగవంతుఁడే యెఱుఁగుఁ గాక!

"ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతా ఫలమ్,
అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే."

అను నభియుక్తోక్తిని,

"శ్రుతిలింగ ప్రకరణ స్థాన సమాఖ్యానాం పారదౌర్బల్య మర్థవిప్రకర్షాత్" అను జైమినీయసూత్రమును అనుమానమను ప్రమాణము బుద్ధియం దుంచికొనినవాఁడు ఉన్మాదము వలనఁ బలికినపలుకులవలె భాసించుచున్నవి.

12. ఇఁక "నిర్దోషః శబ్ద ఆగమః" అనిమాత్ర మాగమ లక్షణము నిరూపింపఁబడినదిగాని యర్థము వివరింపఁబడియుండ లేదు. నిర్దుష్టశబ్ద మెద్దియో నిర్వచింపఁబడలేదు. కావున నాగమలక్షణముగూడఁ బ్రత్యక్షానుమానములతోఁ బాటు దుష్టలక్షణమే యగుచున్నది.

ఇఁక నుత్తరగ్రంథమున, నిగ్రహము, జాతి, ఛలము, విరోధము, సప్రతివిధానము, ఉపాధి, యను ననుమాన ప్రమాణమునకుఁ గలుగు దోషము లనుమానప్రమాణమునకు బాధకములగు దోషము లని యవ్వానికిఁగూడఁ బైలక్షణములతోఁ దుల్యమగు లక్షణాభాసములనే చిత్రించి స్వాభిమతమును "సర్వవతే దృశ్యత్వానుమానే దృష్టవ్యాః" అని యొకప్రతిజ్ఞాభాసమును జేయుచున్నాఁడు. అనఁగా "జగత్ మిథ్యా దృశ్యత్వాత్" అని యొకయనుమానము గలదనియు

నట్టియనుమానము పై దోషములచే బాధింపఁబడు ననియు దానంజేసి జగత్తునకు మిథ్యాత్వము సిద్ధింపదు గావున జగత్తు సత్యమని స్వమతమును వ్యక్తీకరించెను. అట్టి యభిప్రాయమును దనబుద్ధికిఁ దగునట్లు "ప్రత్యక్షాగమాదిభి ర్జగతః సత్యత్వాత్ తత్పక్షే దృశ్యత్వస్య చ మిథ్యాత్వాత్, అనిర్వచనీయస్య ప్రతివాదినోఽసిద్ధత్వాత్, ఆత్మనోఽపి దృశ్యత్వాత్, శుక్తిరజతాదే రనిర్వచనీయత్వాభావాత్, అనిర్వచనీయస్య దృశ్యత్వాభావాత్, మానసిద్ధత్వాదితి సప్రతిసాధనత్వాచ్చ జగత్సత్యత్వగ్రాహిప్రత్యక్షస్య వర్తమానమాత్రగ్రాహిత్వే అనుమానాగమ ప్రామాణ్యగ్రాహిణోఽపి ప్రత్యక్షత్వ విశేషాదుత్తరక్షణే ప్రామాణ్యం న సేత్స్యతీతి భేదాదివాక్యానామేవ ప్రామాణ్యం స్యాత్" అని నిర్వచించెను. ఈవాక్యగౌరవమంతయు "ఆత్మనోఽపి దృశ్యత్వాత్" అను వాక్యముచే నిర్ణయింపనగును. 'ఆత్మనోఽపి దృశ్యత్వాత్' అన నాత్మగూడ దృశ్యమగుటవలననని కదా యర్థము. అనఁగా జగత్తుతోఁ బాటు ఆత్మగూడ దృశ్యమేయని కదా మధ్వునియభిప్రాయము. కేవల పామరునకు, దేహాత్మవాదియగు చార్వాకునకు, నున్మత్తునకు నాత్మ దృశ్యమగుచోఁ గావచ్చునుగాని దేహముకంటె నాత్మ విలక్షణమని గ్రహించుసామాన్యులకుఁగూడ నాత్మ దృశ్యమెంతమాత్రముగాదని నిర్ణయమే. దానంజేసి యాత్మ దృశ్యమని పలుకు మధ్వవచనము నేమనవలయును? ఉన్మత్తప్రలాపమనితీరవలయును. కావున జగత్సత్యత్వవచన మున్మత్తప్రలాపమే యగును.

ఇట్లు ప్రమాణలక్షణమునఁ జితింపఁబడిన రెండుపత్రి ముల యందలిదోషముల లెక్కించుట కంబళియందన్నమును దినుచు రోమములను లెక్కించుభంగి బఱఁగుచుండుటంజేసి స్థాలీపులాకన్యాయమున నీ పండ్రెండు దోషములును బ్రద ర్శింపఁబడినవి. దీనింబట్టి మధ్వయొక్క ప్రమాణస్వలక్షణ నైపుణ్యము సువ్యక్తమగుచున్నది. ఇంతతో మధ్వపాండిత్య మాఁగియుండుట లేదు. "కురూపీ! ఎందులకుఁ బుట్టితివిరా?" అన 'సురూపములను వెక్కిరించుటకు' అనునట్లు తంత్రాంతరము లందలి ప్రమాణలక్షణములను గూడ నధిక్షేపించిన ట్లసంబద్ధ ప్రలాపములఁ గావించెను. ఎట్లన: "న ప్రమాసాధనం ప్రమా ణం, జ్ఞానవ్యతిరిక్తప్రమాయాం ప్రమాణాభావాత్, 'నచా జ్ఞాతపరిచ్ఛిత్తిరేవ ప్రమేత్యత్ర కించిన్మానమ్, యాథార్థ్యమేవ ప్రామాణ్య మిత్యంగీకారాత్' అని. అనఁగాఁ బ్రమాణమనఁ బ్రమాసాధనముగాదు. ఏలయన జ్ఞానముకంటె భిన్నమగు ప్రమయందుఁ బ్రమాణములేదు గావున. ఇందలి హేతుపద ముచే 'జ్ఞానము, ప్రమ' యను పదములు పర్యాయములే యను నర్థము గోచరించుచున్నది గదా!

'ప్రమాసాధనము ప్రమ' యని చెప్పువారు ప్రమ యన జ్ఞానమునకుఁ బ్రత్యక్షము, అనుమానము మొదలుగాఁ గలవి సాధనములని చెప్పుచున్నారుగాని జ్ఞానము సాధనమని చెప్పుటలేదు. ప్రమాసాధనము జ్ఞానమని చెప్పినచో నయ్యది మధ్వస్వలక్షణమువలె నవలక్షణమే యగును. ప్రమాణలక్షణవాదు లెన్నడును జెప్పనియపార్థమును జెప్పి లక్ష

ణము యుక్తముగా దనుట దుర్నయము.

ఇంతియకాదు; హేత్వంతరమట్లు "యాథార్థ్యమేవ ప్రామాణ్య మిత్యంగీకారాత్" అని నిర్వచింపఁబడినది. యాథార్థ్యము ప్రామాణ్యమని యెవ్వ రంగీకరించిరి? "యథార్థం ప్రమాణ" మని నిరర్థకపదములను బల్కినమధ్వయే కదా. తిన నిరర్థకపదములు సార్థకములని తలంచు నవివేకికి సార్థకములగు పదము లప్రమాణములుగఁ దోఁచుట యుక్తమే.

ఈతీరుననే 'న చానుభూతి రేవ ప్రమాణమ్' అనియుఁ 'నచ సమ్యగనుభవసాధనం ప్రమాణమ్' అనియుఁ దంత్రాంతర లక్షణములఁగూడ నిరూపించిన ట్లున్మత్తప్రలాపములఁ బలికి యున్నారు.

అహాహా !! మధ్వయొక్క స్వమతస్థాపనము, పరమత నిరసనము నెంత మనోహరముగ నున్నవి! ఇయ్యది బ్రహ్మతర్క మార్గమట! ఈ బ్రహ్మతర్క మీ మధ్వుని కెట్లు లభించినదో యొకింత నిరూపించిన బాగుండెడిది. ఇట్టి బాల్యప్రలాపము లను బ్రహ్మతర్క మనుటకు మారుగ మధ్వతర్కమే యనిన సమంజసముగ నుండెడిది. ఇట్టిదోషభూయిష్ఠమగు ప్రమాణ స్వలక్షణము నాధారముగాఁ జేకొని చిత్రింపఁబడిన ప్రకర ణాంతరములుగూడ సర్వవిధముల దోషభూయిష్ఠములే యను టకు సందియము లేదు. అయినను విబుధలోకమునకు నందలి దోషములుగూడ సువ్యక్తముగాఁగఁ ప్రకరణాంతరముల ఖండనముగూడఁ గ్రమముగఁ జేయఁబడును.

ఇతి, నారాయణస్మృతిః.

శ్రీః.

# మధ్వకథాలక్షణ ఖండనము.

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.
శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహమ్
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే.
కామేశ్వరీం పరా మీడే కాదిహాదిస్వరూపిణీమ్
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్.

మధ్వచే రచింపఁబడిన రెండవ ప్రకరణము కథాలక్షణ మను పేరఁ బఱగుచున్నది. ఈ కథాలక్షణమునఁ గథ యన శాస్త్రచర్చ యని యభిప్రాయము. శాస్త్రచర్చను జేయుట మూఁడువిధములఁబఱఁగుచున్నదనియు నయ్యవివాదముజల్పము వితండ మనునామములతో వ్యవహరింపఁబడుచున్న వనియు నిర్వచింపబడియున్నది. ఇది యొక యపూర్వవిషయము గాదు. సర్వసామాన్యముగ గ్రంథములయం దనుసరింపఁబడు రచనా భేదముల ననుసరించి విద్వాంసులమధ్య వ్యవహరింపఁబడుచుం డెడివిషయమే యైయున్నది. కాని యిందొక విశేషము గలదు. మధ్వ తనయొక్క యనుచరులు మతాంతరులతో శాస్త్ర చర్చకు నొకవేళఁ గడంగినచో నవ్వారలమూలమునఁ దనకుఁ బరాభవము గలుగునను భయముచేఁ దన యనుచరు లెట్టివార లతోఁ జర్చకుఁ గడంగవలయునను విషయతత్త్వమును బోధించు

వ్యాజమున నీ కథాలక్షణమును జితి్రించినట్లు దెలియవచ్చు చున్నది. అందులకై ప్రాశ్నికలక్షణ ఖిందుఁ బ్రిధానముగ నిరూపింపఁబడియున్నది. ఎట్లన—

రాగద్వేషవిహీనాస్తు సర్వవిద్యావిశారదాః
ప్రాశ్నికా ఇతి విజ్ఞేయా విషమాఏక ఏవవా
అశేషసంశయచ్ఛేత్తా నిఃసంశయ ఉదారధీః
ఏకశ్చే త్ప్రాశ్నికో జ్ఞేయ స్సర్వదోషవివర్జితః
ఏకోవా బహవో వా స్యు ర్విష్ణుభక్తిపరా స్సదా
విష్ణుభక్తిర్హి సర్వేషాం సద్గుణానాం స్వలక్షణమ్.

అని యిచటఁ బ్రాశ్నికుఁడన వాది ప్రతివాదులను బ్రిశ్నించి తీర్మానమును జెప్పు మధ్యవర్తి యని యభిప్రాయము. ఇట్టి మధ్యవర్తి యొకఁడుగాని విషమసంఖ్యగల యనేకులుగాని యుండవలయు ననియు నట్టివారు విష్ణు భక్తిపరులే యైయుండవలయుననియు నిర్వచింపఁబడియున్నది. ఇంతియకాదువిష్ణుభక్తి యొక్క ప్రాశస్త్యము 'విష్ణుభక్తి ర్హి సర్వేషాం సద్గుణానాం స్వలక్షణం' అని చెప్పబడుచున్నది. అన్ని సద్గుణములకును విష్ణుభక్తియే స్వలక్షణ మని దీనియర్థము. అనఁగా మనుజుఁ డెట్టివాఁడైనను విష్ణుభక్తి నభినయించినచో యోగ్యుఁ డనియుఁ దదితరు లెట్టి సద్గుణములతోఁ గూడియున్నను నెంతమాత్రము యోగ్యులు గారనియు నభిప్రాయము. దీనిఁబట్టి యీమధ్వవాదమునకు మధ్వుఁ డొక్కఁడుదక్క వేఱొక్కఁడు మధ్యవర్తిగా నుండ ననర్హు డని తేలుచున్నది.

ఇఁక వాదమునందు వాదిగూడ మధ్వయే యగుచున్నాఁడు. ఇఁకఁ బ్రతివాది యెవ్వఁ డయిననేమి? సర్వదా వాదియు మధ్యస్థుఁడును మధ్వలేగదా! ఇఁక మధ్వస్వవిజయమునకుఁ గొఱతయేల? వాదమందు నిర్ణాయకమగు ప్రమాణముగూడ నీ కథాలక్షణమునందు—

"పృష్టే నాగమ ఏవాదౌ వక్తవ్య స్సాధ్యసిద్ధయే,
నైషా తర్కేణాపనేయా మతి రిత్యాహ హి శ్రుతిః.

అని చెప్పఁబడినది. అనఁగా నీబుద్ధి తోలఁగింపఁబడఁగూఁడ దని శ్రుతి పలుకుచున్నది గావున, పృష్టేన = ప్రతివాదిచే నడుగఁబడినవాదిచే, సాధ్యసిద్ధయే=స్వపక్షస్థాపనముకొఱకు, ఆగమ ఏవ=ఆగమమే ప్రమాణముగా చెప్పఁబడవలయు నని. యాగమమే ప్రమాణముగా జెప్పఁబడినది. ఆగమ మన మధ్వచేఁ బ్రమాణలక్షణమున "నిర్దోషః శబ్ద ఆగమః" అని చెప్పఁబడియున్నది. దీనింబట్టి శబ్దము నిర్దోషము సదోష మని రెండు విధములనియు నందునిర్దోషశబ్దమాగమమని నిర్వచింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది. సదోషశబ్ద మన దుష్టశబ్దము నిర్దోష శబ్ద మన సచ్ఛబ్దముగదా? అందు సచ్ఛబ్దమున కాగమ మను పేరు గ్రహించినట్లు పై 'నిర్దోషః శబ్ద ఆగమః' అనుదానిచే నువ్యక్తముగదా! ఇది యిట్లుండ నీ కథాలక్షణమున నాగమమునుగూర్చి యొక యపూర్వమును బల్కుచున్నాఁడు. ఏమన—

ఋగ్యజుస్సామాథర్వాశ్చ భారతం పంచరాత్రకం
మూలరామాయణం చైవ సంప్రోచ్యన్తే సదాగమాః.

అనుకూలా య ఏ తేషాం తేచ ప్రోక్తా స్సదాగమాః
అన్యే దురాగమా నామ తైర్న సాధ్యం హి సాధ్యతే.

అని. ఇందు సదాగమము లనియు దురాగమము లనియు నొక విభాగమును గావించెను. ఈ విభాగము ప్రమాణస్వలక్షణమందలి యాగమస్వలక్షణమునకు విరుద్ధముగా నున్నది. ఆగమ మన సచ్ఛబ్దమని కదా పైన నిర్వచింపఁబడెను. ఆనిర్వచింపఁబడిన యర్థము నీశబ్దములయందలి యాగమమునకు గ్రహించినచో సదాగమ మన సత్సచ్ఛబ్దము దురాగమ మన దుస్సచ్ఛబ్దమని తెలియవచ్చుచు మధ్వాగమనిర్వచన మున్మత్తప్రలాపముగఁ దెలియవచ్చెడిని. ఇందలి దోషము సువ్యక్తముగాఁగ నీ క్రింది పరిలేఖనము ప్రదర్శింపఁబడుచున్నది.




ఇఁక నీసదాగమములని నిర్వచింపఁబడిన విశేషములను గూర్చి యొకింత విచారింతము. ఋగ్యజుస్సామాథర్వములు, భారతము, పంచరాత్రము, మూలరామాయణము అనునవి

కదా సదాగమము లని చెప్పఁబడుచున్నవి. ఇందు ఋగ్యజు స్సామాథర్వములన్న విడిచినచో భారతము పంచరాత్రము మూలరామాయణము అను మూఁడు ఫొత్తములును గదా సదాగమములని చెప్పఁబడుచున్నవి. నిర్దోషశబ్దమే యాగమ మని గ్రహించినచో వేదము లన్నియు బుష్కలముగ నిర్దు ష్టము లని యంగీకరించు నెల్లరకు వేదము లాగమములు గావచ్చును. ఇఁక భారతము రామాయణము పంచరాత్రము గూడ వేదములవలెనే సదాగమములా లేక వ్యెద్దియేని యొకింత భేదము గలదా యను విషయమును మధ్వ నిర్వచింప వలయును. ప్రకృతమున వేదము లెట్టి గౌరవముతో వేదవాదు లచే గ్రహింపఁబడుచున్నవో యట్టి ప్రమాణముచే వేదము లను మధ్వ గ్రహించినట్లు యోజించుట కవకాశము చాలదు. ఏలనన మహాభారతము పంచరాత్రము మూలరామాయణము లను పుస్తకములతోఁ బాటు, అపౌరుషేయములును స్వతఃప్ర మాణములును నిత్యములు నగు వేదముల నొకే తరగతియందుఁ జేర్చుటచే మధ్వుఁడు వేదనిందాదోషదూషితుఁడగుచున్నాఁడు.

స్వతఃప్రమాణము లగు వేదముల నటుంచి మిగిలిన మూఁడుగ్రంథములను గూర్చి యొకింత విచారింతము. ఈ మూఁడు గ్రంథములఁ గూర్చి మధ్వ గీతాస్వవ్యాఖ్యయందు:

లోకేశా బ్రహ్మరుద్రాద్యాః సంసారే క్లేశినం జనమ్
వేదార్థాజ్ఞ మధికారవర్జితం చ స్త్రియాదికమ్
అవేక్ష్య ప్రార్థయామాసు ర్దేవేశం పురుషోత్తమం
తతః ప్రసన్నో భగవాన్ వ్యాసో భూత్వాచ తేన చ

అన్యావతారరూపైశ్చ వేదానుక్తార్థభాషితమ్
కేవలేనాత్మబోధేన దృష్టం వేదార్థసంయుతమ్
వేదాదపి పరం చక్రే పంచమం వేద ముత్తమమ్
భారతం పంచరాత్రంచ మూలరామాయణం తథా
పురాణం భాగవతం చేతి సంభిన్నః శాస్త్రపుంగవః.

అని చెప్పియుండెను. ఈశ్లోకములవలనఁ దెలియవచ్చెడి దేమన వేదార్థమును గుర్తెఱుఁగనట్టియు వేదమునం దధికారము లేనట్టియు స్త్రీ శూద్ర ద్విజబంధువుల నుద్దేశించి యీ మూఁడు గ్రంథములును బుట్టినవని. ఈగ్రంథములు: వేదానుక్తార్థ భాషితం=వేదమందుఁ జెప్పఁబడని విషయమును బోధించుచున్నవనియు; వేదాదపి పరం=వేదముకంటె శ్రేష్ఠమనియుఁ గూడ నిర్వచింపబడియున్నది. దీఁనిబట్టి వేదములయందు లేని విషయము వీనియం దున్న దనుటచే నీగ్రంథములకు వేద బాహ్యదోషముగూడ మధ్వచే ఘటింపఁజేయఁబడుచున్నది.

ఇట్టి గ్రంథములు వేదబాహ్యము లనియు వేదమం దధికారము లేనివారికొఱకుఁ బ్రవర్తింపఁజేయబడినవనియు నిర్వచించినమధ్వ యీగ్రంథములను వేదములతోఁ దుల్యమగు స్థానమునం దుంచి వేదాధికారులకుఁగూడ నుపయుక్తము లన నెట్లు సాహసించెను? ప్రాయశః తనయనుచరులను మెప్పించి తాను మెప్పువడయుటకు నీయపూర్వకల్పనమును గల్పించె నని నిశ్చయింపనొప్పును. ఇంతియకాదు. దీనిఁబట్టి మధ్వయొక్క యనుచరులు స్త్ర్యాదిగణములోఁ జేరినద్విజబంధువు లయియుండ వచ్చునని యొకింత యూహింపనొప్పును. స్త్ర్యాదిగణములోఁజేరిన

ద్విజబంధువులు గావుననే మధ్వయాడిన దే యాట యనియుఁ బాడి నదే పాటయనియుఁ దలంచుచు సంతసించుచున్నారు.

ఈభారతభూమియందు శ్రుతులను వేదము లటుండ స్మృతులను పవిత్రగ్రంథములు పెక్కులుండగా నవ్వాని నన్నిటిని దోసిపుచ్చి సామాన్యములగు నితిహాసములైన భారత రామాయణములను శ్రుతిస్మృతిసదాచారములచే సర్వవిధముల నిషిద్ధమగు పంచరాత్రమును సదాగమము లని పేర్కొనుటయు నవ్వానిచేతనే సాధ్యము సాధింపఁబడవలయు ననుటయుఁ దద్భిన్నములగు గ్రంథము లన్నియు దురాగమము లనియు నిర్వచించు మధ్వునిగాని యాతనిమతమునుగాని యేమనవలయునో శ్రుతిస్మృతిసదాచారప్రమాణకోవిదులు యోజింతురుగాక? ఇట్టి కథాలక్షణ వ్యాజమున మధ్వచేఁబలుకఁబడిన పలుకులు ప్రమాణలక్షణమునందు నిర్వచింపఁబడిన "నిర్దోషః శబ్ద ఆగమః"అను నాగమలక్షణమును దుడిచివేసి మధ్వకు ననంబద్ధప్రలాపిత్వమును ఘటింపఁజేయుచున్నది. ఇయ్యదియ కథాలక్షణమున మధ్వ సంపాదించినవిశేషము.

ఇతి నారాయణస్మృతిః.

---

# ఆగమము ప్రమాణమా?

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహమ్
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే
కామేశ్వరీం పరా మీడే కాదిహాదిస్వరూపిణీమ్
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్.

మధ్వరాయలు 'ప్రమాణలక్షణ'మను ప్రకరణమునందు నిట్లు ప్రదర్శించియున్నారు:

"1 యథార్థం ప్రమాణమ్. 2 తద్ద్వివిధమ్. 3 కేవల మణుప్రమాణంచ 4 యథార్థజ్ఞానం కేవలమ్ 5 తత్సాధన మణుప్రమాణమ్" అని.

ఇట్లుపక్రమించి పిమ్మట 'అణుప్రమాణం త్రివిధం ప్రత్యక్ష మనుమాన మాగమ ఇతి'అని నిర్వచించియున్నారు. దీనిఁబట్టి ప్రత్యక్షము, అనుమానము, ఆగమము, అని యణు ప్రమాణము మూఁడువిధములుగ నిర్వచించియున్నారుగదా! ఇట్లు నిర్వచించి "నిర్దోషార్థేంద్రియ సన్నికర్షః ప్రత్యక్షమ్, నిర్దోషోపపత్తి రనుమానమ్, నిర్దోష శ్శబ్ద ఆగమః" అని ప్రత్యేక ముగాఁ బ్రత్యక్షానుమానాగమలక్షణములు నిర్వచింపఁబడి యున్నవి. ఇందు "నిర్దోషః శబ్ద ఆగమః"అను నాగమలక్షణ ముచేఁ దెలియవచ్చు విశేష మొకింత దశప్రకరణసందర్భమునఁ దిలకించిన మధ్వరాయలయాశయము సుస్పష్ట మయ్యెడిని. కావున నద్దానిని విచారింతము.

ఆగమమన: దోషరహితమగు శబ్దమనికదా నిర్వచింపబడుచున్నది. శబ్దమునందలి దోషము నెట్లు గ్రహింపవలయు నను విషయ మిట నిరూపింపఁబడలేదు. ఎట్టి శబ్దము నిర్దుష్ట

మో, యెట్టి శబ్దము దుష్టమో తెలిసినపుడుగదా నిర్దుష్టశబ్దమునుగ్రహించి యద్దాని నాగమమని వ్యవహరించుటకు నవకాశము గల్గును. అట్టి యవకాశ మీ ప్రమాణలక్షణమునందు నిర్వచింపఁబడక పోవుటంజేసి "నిర్దోషః శబ్ద ఆగమః" అను లక్షణమే దుష్టశబ్ద మగుచు నప్రమాణ మగుచున్నది. ఇంతియకాదు; ఒకింత విచారించిన నీ శబ్దమందలి దుష్టత్వము సువ్యక్త మయ్యెడిని. కథాలక్షణమున—

"ఋగ్యజుస్సామాథర్వాశ్చ భారతం పంచరాత్రికమ్
మూలరామాయణం చైవ సంప్రోచ్యన్తే సదాగమాః.
అనుకూలా య ఏతేషాం తేచ ప్రోక్తా స్సదాగమాః
అన్యే దురాగమా నామ తైర్న సాధ్యం హి సాధ్యతే.

అని నిర్వచింపఁబడియున్నది. దీని యర్థమేమన ఋగ్యజుస్సామాథర్వములు, భారతము, పంచరాత్రికము, మూలరామాయణ మనునవి సదాగమములనియు వీని కనుకూలమగునవిగూడ సదాగమములే యనియును దద్భిన్నములు దురాగమము లనియును.

ఇం దుదాహరింపఁబడిన సదాగమములకు ననుకూలమగు గ్రంథము లెవ్వియో యయ్యవి యించుకేనియు నిరూపింపఁబడకపోవుటచే నిర్వివాదముగ నొక గ్రంథమునైన సదాగమమని గ్రహించుటకు సావకాశములేదు. కావున "అనుకూలా య ఏతేషాం తెచ ప్రోక్తా స్సదాగమాః"అనువాక్యముగూడ "నిర్దోష శ్శబ్ద ఆగమః" అనువాక్యమట్లే దోషగ్రస్తమై నిష్ప్రమాణ మగుచున్నది. కావున నద్దాని విచారింపఁబనిలేదు. ఇక

ఁ దుష్టవాక్యముల ద్రోసిపుచ్చి యర్థమును విచారించినచో
ఋగ్యజుస్సామాథర్వములును భారతము, పంచరాత్రము,
మూలరామాయణము సదాగమములనియుఁ దద్భిన్నము లగున
వన్నియు దురాగమము లనియు మధ్వరాయలచే నిర్ణయము
జేసికొనఁబడినట్లు సువ్యక్త మగుచున్నది. ఇట్టి వ్యవస్థయందు
మధ్వరాయలచే నాశ్రయింపఁబడిన సదాగమ దురాగమ శబ్ద
ములు రెండునుగూడ దోషగ్రస్తములై నిరర్థకము లగు
చున్నవి. ఎట్లన— ఆగమమన నిర్దోషమగు శబ్దమని “నిర్దోష
శ్శబ్ద ఆగమః” అని లక్షణము చెప్పఁబడియెనుగదా! సదాగమ
శబ్దమందును దురాగమ శబ్దమునందునుగూడ నాగమశబ్దము
నకు నర్థ మేమని గ్రహింపవలయును? నిర్దోషశబ్ద మనియేకదా!
అప్పు డీశబ్దముల కర్థము “సన్నిర్దోషశబ్దః సదాగమః దుర్నిర్దోష
శబ్దః దురాగమః” అనికదా బఱఁగును. దీనిఁబట్టి నిర్దోషశబ్ద
మునకు సత్త్వము, దుష్టత్వమను ద్వివిధపరికల్పనము సిద్ధ
మగుచు నాగమలక్షణ మని చెప్పఁబడిన “నిర్దోషః
శబ్దః” అను దాని యందలి నిర్దోషశబ్దము నిరర్థకమై త్రోసి
పుచ్చఁ బడవలయును. అట్లు చెప్పినచో నాగమలక్షణము
‘శబ్ద ఆగమః’ అని సరసముగ నుండును. నిర్దోషశబ్దము
నిరర్థకము గావున ‘నిర్దోషః శబ్ద ఆగమః’ అను లక్షణకథన
మప్రమాణమగును. పోనిండు, ‘శబ్ద ఆగమః’ అని యంగీకరిం
తము. అప్పుడు శబ్ద మన నేమియర్థమును గ్రహింపవలయును?
ఇందు నద్దాని బోధించు విశేష నిర్వచనము లేదుగావునఁ
బ్రతిశబ్దమునకు నాగమత్వవ్యవహారము గలుగుటచేఁ బశు

పత్న్యాదిశబ్దములకుఁ గూడ నాగమత్వము ఘటించును. కావున "శబ్ద ఆగమః" అను లక్షణము దోషగ్రస్తమగుచున్నది. కావున నేవిధమునఁ జూచినను 'నిర్దోషః శబ్ద ఆగమః' అన్ను లక్షణము దుష్టమగుచున్నది. కావున నప్రమాణము.

ఇది యటులుండ దురాగమము లనుటకు—

"అన్యే దురాగమానామ త్రైర్న సాధ్యో హి సాధ్యతే" అని యొకవిశేషము చిత్రింపఁబడియున్నది. సాధ్యము దేనిచే సాధింపఁబడదో, యయ్యది దురాగమమని యిద్దాని యర్థము. సాధ్యమన నేమియో యిందు నిర్వచింపఁబడియుండలేదు. ఇం దెవరికభీష్టమగు సాధ్యమును నుద్దేశించి యీదురాగమ వ్యవస్థ చేయఁబడవలయునో, యయ్యది యొకింత విచారింపఁబడవలయును. సాధ్య మందఱకు నొక్కటియే యగుచో విప్రతిపత్తి కవకాశము లేదుగాని స్వస్వ శేముష్యనుసారముగ సాధ్యములఁ దలపెట్టువారలకు నీ దురాగమములవ్యవస్థ సుకర మెంతమాత్రము గానేఱదు. ఎట్లన— ఒకానొకవేళ నొక శివాచారికి శివుఁడు సాధ్యుఁడు గావున శివుని బోధింపని శబ్దజాల మంతయు దురాగమం బె యగునుగదా! ఆతీరుననే శక్తిని సాధ్యముగాఁ దలఁచు శాక్తేయులకు శక్తిబోధకముగాని శబ్దజాల మంతయు దురాగమమే యగునుగదా! ఇఁక మధ్వారాయల దృష్టియందు సాధ్య మెయ్యదియో యొకింత విచారించి మధ్వారాయల యాశయమును దెలిసికొందము.

విష్ణుతత్త్వ వివేకమున నిట్లు జిత్రింపఁబడియున్నది—

ఋగాద్యా భారతం చైవ పంచరాత్ర మథాఖిలమ్
మూలరామాయణం చైవ పురాణం చైతదాత్మకమ్.

యే చానుయాయిన స్తేషాం సర్వే తేచ సదాగమాః
దురాగమా స్తదన్యే తే యై ర్నజ్ఞేయో జనార్దనః." అని.

ఇం దేశబ్దజాలముచే జనార్దనుఁడు చెప్పఁబడఁడో యట్టి శబ్దజాలము దురాగమ మని నిర్వచింపఁబడుటవలన మధ్వరా యల కభీష్టమగు విష్ణువును బోధింపని శబ్దజాల మంతయు దురా గమమని చెప్పఁబడుటచే మధ్వరాయలదృష్టియందు సాధ్యము విష్ణు వని తెలియఁబడుచున్నది. అట్టి విష్ణువును బంచరాత్రమే బోధింపుచుండుటచేఁ బంచరాత్రమే సదాగమమనికదా మధ్వ రాయల యాశయము. ఇంతియకాదు; "పంచరాత్ర స్యైవ ప్రామాణ్య ముక్తమ్" అని మధ్వరాయలచేఁ గంఠోక్తిగ నిర్వచింపఁబడియున్నదిగదా! ఈ విషయమ్మునే యాగమ లక్షణప్రసంగమున నిర్వచించిన నో నాగమలక్షణ మొకింత నిర్దుష్టమై మధ్వరాయలకైన నొకింత యనుకూలించి యుం డును. ప్రకృతమునం దన్ననో మధ్వరాయలకు స్వవచన వ్యాఘాతదోషము నప్రామాణ్యప్రసంగమును గలుగును. ఏది యెట్టులైనను మధ్వరాయల తత్త్వము తెలియవచ్చినది. విష్ణువు నగ్రగణ్యముగఁ బ్రతిపాదింపని గ్రంథము లన్నియు దురాగమములనియు విష్ణువును బోధించు పంచరాత్రతంత్ర ము సదాగమ మనియు నయ్యదియే యాతనికి శరణ్య మనియుఁ దెలియవచ్చుచున్నది. దీనిఁబట్టి మధ్వరాయల ద్వైత మునకుఁ బాంచరాత్రద్వైత మని యన్వర్థమిడిన నయ్యది సార్థ కతఁ జెందును. ఇతరప్రమాణాడంబర మంతయుఁ బరవ్యా మోహార్థముగాని స్వాభిలాషితార్థనిరూపణార్థముగాదని సుస్ప

ష్టముగఁ దెలియవచ్చుచున్నది. పంచరాత్రాగమమునం దన్నానో వేదవిరుద్ధమును శిష్టాపరిగృహీత మగుటంజేసి యవైదికములగు చతుష్షష్టి నిర్వచింపఁబడియున్నది.

కావున మధ్వారాయాదులమతమును వారు ద్వైత మనుకొందురుగాక, వైష్ణవ మనుకొందురుగాక, వైదిక వైష్ణవ మనుకొందురుగాక, యాస్తికవైదిక మనుకొందురుగాక, వైదిక మనుకొందురుగాక! ఎట్లనుకొన్నను సర్వవిధముల నవైదికమే.

ఇఁకఁ బ్రకృత మేమన: మధ్వారాయలచే నణుప్రమాణములుగఁ బేర్కొనఁబడిన ప్రత్యక్షానుమానాగమములలో నాగమ మను నణుప్రమాణమునకు లక్షణ ప్రమాణములు సిద్ధింపకపోవుటంజేసి వస్తుసిద్ధి యెంతమాత్రమును లేదు. కావున మధ్వారాయలచే నుదాహరింపఁబడిన నాగమమను ప్రమాణమునకుఁ బ్రమాణభావము లేకపోవుటచే నయ్యది సర్వవిధముల నప్రమాణము ననర్థకము నగుచున్నది.

పోనిండు, 'తుష్యతు దుర్జన'న్యాయముచేఁ బంచరాత్రమును సదాగమముగ గ్రహించినను నయ్యది మధ్వారాయాదులకుఁ బ్రధానసిద్ధాన్తమగు జగత్సత్యత్వమును దోసిపుచ్చుటంజేసి, యియ్యదియు మధ్వారాయాదులకుఁ బ్రమాణముగ నలరారుచున్నట్లు దోఁపదు గావున మధ్వారాయాదులకు నొక ప్రమాణగ్రంథమైన నున్నట్లు చెప్పుట కవకాశ మెంతమాత్రము చాలదు. దానంజేసియే "నిర్దోషః శబ్ద ఆగమః" అని యొక దుష్టసూత్రమును రచించుటకుఁ గల కారణమని నిర్ణయింప నొప్పు.

ఇట్లు ప్రమాణలక్షణమును దశప్రకరణ సందర్భముచే విచారింప మధ్వరాయులచే నభిమతములుగా నిర్వచింపఁబడిన మూఁడు ప్రమాణములలో నాగమప్రమాణ మత్యర్హితమై నందున మధ్వరాయలకుఁ బ్రత్యక్షానుమానము లను రెండు ప్రమాణములే సిద్ధమగున ట్లూహింపవలసి వచ్చుచున్నది. ఊహింపనేల? సిద్ధమే యగుచున్నది. విష్ణుతత్త్వవినిర్ణయ మును జూడుడు! అందు "ప్రత్యక్షానుమానసిద్ధత్వేచ భేదస్య, తద్విరోధాదేవాప్రామాణ్య మభేదాగమస్య" అని చెప్పఁబడి యున్నది.

భేదస్య = ద్వైతము, ప్రత్యక్షానుమానసిద్ధత్వే చ = ప్రత్యక్షముచేతను అనుమానముచేతను సిద్ధించుచున్నదిగావున, తద్విరోధాదేవ = ఆప్రత్యక్షాను మానములకు విరోధము గలుటవలననే, అభేదాగమస్య = అభేదమును బోధించు నాగమమునకు ననఁగా నద్వైతమును బోధించు నిర్దోష శబ్దమునకు, అప్రామాణ్యమ్ = ప్రమాణభావము లేదు. ఈ వాక్యమును లెస్సఁగఁజూచిన నభేదమును, అనఁగా నద్వైతమును బోధించు నాగమము, అన నిర్దుష్టమగు శబ్దజాల మున్నదనియు నయ్యది ప్రత్యక్షానుమానవిరుద్ధ మగుటంజేసి త్రోసివేయఁబడ వలయునని కదా మధ్వరాయల యాశయము. నిర్దుష్టశబ్దమగు నాగమము ప్రమాణమని యంగీకరించుచు నద్దానిని మఱల ఇతరప్రమాణబాధక మగుటంజేసి యప్రమాణమని నిర్వచించుటవలన శబ్దజాల మెంత నిర్దుష్టమని తలంపఁబడినను నయ్యది యెంతమాత్రము ప్రమాణముగాక ప్రత్యక్షానుమానములే

ప్రమాణపదవి నలంకరించుచున్నవని నిర్వచించిన యీమధ్వరా యాదులకుఁ బ్రత్యక్షానుమానములే ప్రమాణములని నిర్వచించు బౌద్ధమతప్రవేశాపత్తి గల్గుననుటకు సందియము లేదుగదా!

ఇంతియకాదు; ఒకప్పు డనుమానముచే సిద్ధించు విషయముగూడఁ బ్రత్యక్షముచే బాధింపఁబడినచో నయ్యదియుఁ గూడఁ ద్రోసిపుచ్చఁబడవలయు నను నిర్ణయమును "బల్యే వానుభవ స్తత్ర నిర్దోషం త్వక్షజాదికమ్" అని చెప్పియున్నారు. అన నింద్రియములవలనఁ బుట్టు ప్రత్యక్షము 'నిర్దోషం తు' అని యితరవ్యవచ్ఛేదార్థకమగు తుశబ్దముచే నిర్దోషమని నిర్వచింపఁబడుటవలన ననుమానమునుగూడఁ ద్రోసి ప్రత్యక్షమే ప్రమాణముగా నిర్వచింపఁబడినట్లు సువ్యక్తమేకదా! దీనిఁబట్టి మధ్వరాయాదుల మతమునకుఁ జార్వాకాదులవలెఁ దమ ప్రత్యక్షమే ప్రమాణ మగుటంజేసి వీరిద్వైతము చార్వాక మతసదృశమే యని నిర్ణయమును బడయుచున్నది. కావున మధ్వరాయలచే "అణుప్రమాణం త్రివిధం, ప్రత్యక్షమనుమాన మాగమఇతి" అను ప్రమాణసూత్రము సర్వవిధముల దోషగ్రస్త దురాగమకోటిలోఁ బడి ప్రామాణ్యమును గోలుపోవుచున్నది.

శ్రీ స ద న మ్,
18—6—35.

ఇతి, నారాయణస్మృతిః.

# వైదిక ధర్మ సంవర్ధని.

సంపుటము 1] జులై 1935 [సంచిక 7

ఓం నమో మేధాదక్షిణామూర్తయే.

## సంస్కృతభాష — పాణినీయము.

పీసపాటి కృష్ణమూర్తిగారు, M. A., B. Ed.

చిదానందమయుఁడును, జగన్నాటక సూత్రధారియు నగు పరమేశ్వరునిచే నీ జగన్నాటకమును బ్రదర్శింపఁబోవు సమయమునఁ దద్వ్యవహారనిర్వర్తక మగు భాషకూడ సృష్టింపఁబడెనని "నామరూపే వ్యాకరవాణి" అను శ్రుతిచేఁ దెలియవచ్చుచున్నది. పరస్పరభావవ్యక్తికి సృష్టింపఁబడిన భాష వాక్యసమూహము. వాక్యములు పదరూపములు. పదములు వర్ణసముదాయరూపములు. ఈ సముదాయములేకాక వర్ణమే పదముగను, పదమే వాక్యముగను గూడ వ్యవహరింపఁబడుచున్నది. కాని భాష యొక వాక్యముతోఁ బర్యాప్తి నొందునదిగాదు. లోకమున స్థావరజంగమములయందు బ్రత్యక్షసిద్ధ మగు జన్యజనకభావముగూడ నీ భాషలయందుఁ జూపట్టుచున్నది. అందు స్వతస్సిద్ధ మగు శ్రుతిని వేఱుగా నుంచి మిగిలిన భాషలను బరిగ్రహించినచోఁ బరంపరగఁగాని, ప్రత్యక్షముగఁగాని యన్ని భాషాయోషలకు జనని గీర్వాణభాషామతల్లిక యగుచున్న దని

కొందఱు ముఖ్యసిద్ధాన్తము. ఒక భాషవలన వేఱొకభాష జనిం
చుటకు మూలభాష, వ్యవహారము నుండవలయునుగదా ! అట్టి
గీర్వాణ మెప్పుడైనను వ్యవహారమున నున్నట్లు దెలియరాదు.
కావున నిద్దానివలన భాషలు పుట్టుట కవకాశమే లేదని పరుల
సిద్ధాన్తము. ఇట్టి విచారణమున సంస్కృతవాగనుశాసకుల త్రిక
మునందు ముఖ్యుఁ డగు పతంజలిమహాశయునికృతి యగు
మహాభాష్యము కొంతవఱకు సాహాయ్య మొనర్పఁగలదు. మహా
భాష్యమున సిద్ధాన్తవార్త్తిక మగు "సర్వే దేశాన్తరే" అనుచో
"సర్వేఖల్వప్యేతే శబ్దా దేశాన్తరే ప్రయుజ్యన్తే" అని యుప
క్రమించి యతివిస్తృత మగు వాఙ్మయప్రపంచమును జూపి
"ఏతస్మిం శ్చాతిమహతి ప్రయోగవిషయే తేతే శబ్దాస్తత్రతత్ర
నియతవిషయాదృశ్యన్తే" అని వ్యవహారముచేతనే కలుగు శబ్ద
నియమమును దెలియఁజెప్పి దృష్టాన్తములుగా "శవతిర్గతికర్మా
కంభోజేష్వేవ భాషితో భవతి, వికార ఏన మార్యా భాషన్తే,
'శవ' ఇతి, హమ్మతిః సురాష్ట్రేషు, రంహతిః ప్రాచ్యభర
తేషు, గమిమేవ త్వార్యాః ప్రయుంజతే, దాతిర్లవనార్థే ప్రా
చ్యేషు, దాత్ర ముదీచ్యేషు" అని నుడివెను. ఇట్టి నియతవ్యవ
హారము, భాష వ్యవహారమున నుండినఁగాని యెంతమాత్రము
పొసఁగదు గదా! కావుననే తెనుఁగుభాషయందలి "ఉరువు,
గుంట, లావు" మున్నగు ననేకపదములు దేశభేదముచే నర్థ
భేదమును గనుచున్నవి. ఇంతియకాదు; భాషా సంస్కర్తల
యనుక్రమమునుబట్టి చూడఁగా నీ సంస్కృతభాష వ్యవహార
మునం దుండెడి దనియే చెప్పనగు. "యథోత్తరం మునీనాం

ప్రామాణ్య" మ్మని సంస్కృతవైయాకరణు లొకే నియమము సంగీకరించిరి. మునులనఁ బాణినికాత్యాయనపతంజలులు. కాల పరిధావనముచే గలిగిన భాషాభేదమును బట్టియే యీ యుత్త రోత్తరప్రామాణ్యాధిక్యము గలిగినదని చెప్పిన సయుక్తి కముగ నుండును. ఇంతియగాదు; పాణినిచే స్మరింపఁబడిన శాక టాయన శాకల్య గార్గ్య భారద్వాజ గాలవాచార్య ప్రభృతు లందఱును వ్యాకరణాచార్యు లనియే తెల్లమగుటంజేసి యింద ఱిచే సంస్కరింపఁబడి యిన్ని మతభేదములు గలుగుటవలనఁ గాలక్రమమున భాష విపరిణామము నొందుచున్నదనికాని దేశ భేదముచే భాష మార్పునెందుచున్నదని కాని యంగీకరిం చుచు సంస్కృత మొకానొకప్పుడు వ్యవహారమున నున్నదని తప్పక యంగీకరింపవలసియున్నది. కాని యీ కాలమునందైనను సదాచారసంపత్తి గలిగిన శిష్టులకుటుంబములయందే వ్యవహ రింపఁబడుచుండెడి దనుటలోఁ గొన్ని ప్రమాణములు గాన వచ్చుచున్నవి. ఉద్దేశము, లేఖనమును వేఱుమార్గముల నొందు చున్నవి. ప్రకృతమునకుఁ బోవుదము.

భాషాసంస్కారమునకు బయలువెడలిన వ్యాకరణము నకుఁ బ్రధానతమ మగు నొక ప్రయోజనము "లఘ్వర్థం చా ధ్యేయం వ్యాకరణమ్ ; నచాంతరేణ వ్యాకరణం లఘునోపా యేన శబ్దాః శక్యా విజ్ఞాతుమ్" అని మహాభాష్య కృతికర్తచేఁ జెప్పఁబడియె. పవిత్రతమముగా నెన్నఁబడు నీ సంస్కృతభాషకు వ్యాకరణ మా కాలమునఁ దప్పక కావలసివచ్చెను. భాష యందు వర్ణభేద మెట్టి యర్థభేదమును గల్గించునో యట్టి యర్థ

భేదమునే స్వరభేదము గల్గించును. ప్రకృతకాలమున స్వరవ్యవ
హారము మనకు స్థూలదృష్టిచే లేకపోయినను దత్ఫల మచ్చ
టచ్చటఁ గానవచ్చుచుండును. అందువలననే—

"దుష్టశ్శబ్దః స్వరతో వర్ణతోవా మిథ్యాప్రయుక్తో న
త మర్థ మాహ, స వాగ్వజ్రో యజమానం హినస్తి యథా
'ఇంద్రశత్రుః, స్వరతో ఽపరాధాత్"
అని చెప్పఁబడియె. శశ + షష, మంచక + మంజక,
పలాశ+పలాష, శకృత్ +సకృత్, అను వర్ణభేదము అర్థభేద
బోధక మగుట సర్వజనవిదితము. కాని యిట్టి యర్థభేదమును
బ్రమాదములును స్వరభేదమువలనఁ గలిగినను నిక్కాలమున
నట్టి స్వరము క్రమముగ వ్యవహారమునుండి నివృత్తిం జెందిన
దని చెప్పనొప్పు.

విచారింపఁగా సంస్కృతభాషకు 'దేవభాష' యనియు,
'గీర్వాణభాష' యనియు మున్నగు నామములు వ్యవహరింపఁ
బడుచున్నవి. దీనివలన సంస్కృతభాష కుండెడి ప్రాశస్త్య
మును బవిత్రతయును స్పష్టపఱుపఁబడుచున్నవి. స్వతస్సిద్ధ మగు
వేదములనుండి మహర్షులు తమ పవిత్రతమము లగు వ్యవహార
ముల కొఱకే సంస్కృతమును సృష్టించిరని ప్రమాణజ్ఞుల
వాదము. అనఁగా వైదికభాషకును సంస్కృతభాషకును జన్య
జనకభావరూప మగు సంబంధము తక్క సమాన భాషాజన్య
త్వముగాని సోదరభాషాజన్యత్వముగాని సంబంధముగా నంగీ
కరింపఁబడదు. సర్వమునకు నిదానభూత మగు వేద మీ సంస్కృ
తమునకుఁ గారణభూత మయినదని చెప్పుటకు విప్రతిపత్తి గన్ప

డదు. భాషావిపరిణామమునకు ముఖ్యహేతువు లగు ననుకరణా న్యతరాకర్షణ లఘ్వీకరణేచ్ఛలయందు లఘ్వీకరణేచ్ఛ (అలసత) ముఖ్యమగు హేతువగునని భాషాశాస్త్రవిదు లంగీకరించిన విషయము. అద్దానిని బట్టి మనము వైదిక సంస్కృత వాఙ్మయములను బరిశీలించినచో వైదిక వాఙ్మయమునందలి పదములయందలి వర్ణములను విడచికాని దీర్ఘములకు హ్రస్వముల గూర్చికాని మహాప్రాణముల నల్పప్రాణములనుగాఁ జేసికాని సంస్కృతభాష యేర్పడినదని చెప్పవచ్చును.

| వైదికము. | సం. | వై. | సం. | వై. | సం. |
|---|---|---|---|---|---|
| స్కంభ | స్తంభ. | జనాసః | జనాః. | పుత్రేభిః | పుత్త్రైః |
| వై. | సం. | | | | |
| ఇత్థా | అత్ర." | | | | |

మున్నగు స్థలములయందుఁ బై విషయమును శీఘ్రముగ గమనింపఁగల్గుదుము. కావున నధునాతనభాషాశాస్త్రజ్ఞులు సకలభాషాసామరస్య విచారణ మను పేర నేవేవియో వ్రాసి వైదికసంస్కృతములను దూరములుగాఁ జేయుట తత్తచ్ఛాస్త్ర సంప్రదాయవిరుద్ధము.

ఇది యిట్లుండఁ దమ పవిత్రవ్యవహారమునకుఁ బ్రత్యేకముగా పురుషులచే నేర్పఱుపఁబడిన యీ సంస్కృతభాష వ్యవహర్తలయొక్క తాల్వాదివర్ణోత్పత్తిస్థానములు విగుణము లగుటచేఁగాని వేఱొక కారణముచేఁగాని మార్పును జెందుచుండ మహర్షులు కొందఱు వైదికజన్యమగు నీభాషను స్వస్వ

రూపము నొందింపఁదలఁచి వ్యాకరణముల వ్రాసిరి. అందు

"ఐంద్రం చాంద్రం కాశకృత్స్నం కౌమారం శాకటాయనమ్,
సారస్వతం చాపిశలం శాకలం పాణినీయకమ్.

అనునవి ప్రసిద్ధములుగా నలరారుచున్నవి. ఇందలి వ్యాకరణములలోఁ బాణినికిఁ బూర్వమున వ్రాయఁబడిన వెవ్వియో, స్పష్టముగఁ దెలిసికొనలేము. ఇందుఁ బాణినీయముతక్క మిగిలిన వన్నియుఁ గేవల సంస్కృత భాషామాత్ర సంస్కారకములేగాని వైదికమును విలాసమునకైన వాసనజూడవు. పాణినీయము మాత్రము వైదికసంస్కృతములను రెండిఁటినిగూడ రమారమి కృత్స్నముగా సంస్కరించినదని చెప్పనొప్పు. వైదికమునకే తక్క లౌకికమగు భాషకు నీపాణినీయ మెంతమాత్రముప యోగింపదను కొందఱివాద మెంతరమణీయమో తద్జ్ఞులకుఁ దెలియకపోదు. కావున నద్దాని విమర్శన మనవసరము. అందుచేతనే—

"పాణినీయం మహాశాస్త్రం పదసాధుత్వలక్షణమ్,
సర్వోపకారకం గ్రాహ్యం కృత్స్నం త్యాజ్యం న కించన."

అని శిష్టులు వ్యవహరించియున్నారు. ఇంతియ కాదు; పతంజలికూడ "అథ శబ్దానుశాసనం" అని ప్రారంభించి "కేషాం శబ్దానాం"? అని ప్రశ్నించుకొని "లౌకికానాం వైదికానాంచ" అని లౌకికభాషాపురస్సరముగ సమాధానమును జెప్పెను. మహర్షులగు ననుశాసకుల యనంతరమున నిరంకుశత్వమును బూని ప్రయోగించు కవులధాటి నెవ్వ రడ్డఁగలరు? వారు రవికాననిచోఁ గాంచువారు. కావున నట్టిదోషముల ననుశాసనములపై నాపా

దింపనవసరము లేదు. అదియుంగాక యనంతమగు నీభాషా ప్రపంచమును సాధింపఁబూనినచో నే తద్ఘనస్సునందో లీనమగు నొక చిన్న ప్రయోగపరమాణువును గనిపెట్టలేదనునది యను శాసకులకు లౌకికానుశాసన నిరాకరణవాదు లాపాదించి నంత దోషమును గల్పింప దని యందఱకుఁ దెలిసినవిషయమే. ఇట్లు సమస్త వ్యాకరణములలోఁగూడఁ బ్రస్థానముచేతను, లాఘవముచేతను సర్వభాషలను సానుకూలముగా సాధించుచు నీ పాణినీయము వేదాంగమైనది.

ఇఁకఁ బాణినిచేఁ బ్రవర్తింపఁ జేయఁబడిన ప్రస్థాన మెట్లున్నదో చూచుటకు బయలు వెడలుదము.

పాణిని తన భాషానుశాసనము నెన్మిది యధ్యాయములుగా విభజించెను. ఇందు నధ్యాయమునకు నాల్గుపాదములు గలవు. పాదములందలి సూత్రసంఖ్యకుమాత్రము నియమము లేదు. ఈ సూత్రములు "అల్పాక్షరం" అను సూత్రలక్షణమునకు సర్వవిధముల లక్ష్యము లగుచున్నవి. ఒక్కొక యధ్యాయమునం దొక్కొక విషయమును జెప్పుచు ప్రకరణవిభాగము సుగమముగఁ జేసెను. ఇం దనువృత్తులు, అపకర్షములు, జ్ఞాపకసిద్ధార్థగ్రహములును దఱచుగఁ గన్పడుచు శాస్త్రశైలిని సంపూర్ణముగ నవలంబించినవి. అధికారసూత్రములని కొన్ని సూత్రము లత్యంతము శాస్త్రోపయోగు లగుచు నపూర్వము లగు నర్థములను గడించుచు సూత్రాంతరములకంటె నీసూత్రములకు వన్నెను దెచ్చిపెట్టుచున్నవి. ఇందుఁ బాణిని "వృద్ధిరాదైచ్- అదేఙ్ గుణః—ఇకోగుణవృద్ధీ" అని యుపక్రమించి

"అ అ" అని శాస్త్రము నుపసంహరించుచుఁ దన యద్వైత తత్త్వమును నిగూఢమ్ముగఁ గనఁబరచెను.

పాణినీయము లోకమున నుండెడి యీవైదికసంస్కృత భాషలను రెండిఁటిని ననుశాసించుటకు బయలువెడలినది. అందు సిద్ధమగు వైదికశబ్దజ్ఞానమును సుగమముగఁ దెలియఁజేయుటయును లౌకికమగు భాషను నియమించుటయును సిద్ధాని పని. లోకమున సాధారణముగ జనులచే వ్యవహరింపఁబడుచుండెడుభాష నియ్యది యనువదించుచు మ్లేచ్ఛభాష నపహరించుచున్నది. అంతియేకాని యియ్యది నూతనమగు నొక వాఙ్మయమును బుట్టించుటలేదని పతంజలిమహాభాష్యమునందలి "లోకతః" అను వార్త్తికమున "యే పునః కార్యా భావా నిర్వృత్తౌ తావ త్తేషాం యత్నః క్రియతే, తద్యథా—ఘటేన కార్యం కరిష్యన్ కుంభకారకులం గత్వాఽఽహ—'కురు ఘటం, కార్యమనేన కరిష్యామీ'తి న తద్వచ్ఛబ్దాన్ ప్రయుయుక్షమాణః వైయాకరణకులంగత్వాఽఽహ—'కురు శబ్దాన్ ప్రయోక్ష్యే' ఇతి తావత్యేవార్థముపాదాయ శబ్దాన్ ప్రయుంజతే." అనిచెప్పఁబడియెను. కావునఁ బాణిని లోకమున సిద్ధమగు శబ్దరూపములను సుగమముగఁ దెలిసికొనుటకుఁ దనశాస్త్రమును రచించెనని తెల్లమగుచున్నది. అనఁగా "రాజపురుషః' 'రక్తోత్పలమ్' దేవదత్త యజ్ఞదత్తౌ" మున్నగు శబ్దములను "రాజ్ఞః పురుషః, రక్తముత్పలం, దేవదత్తశ్చ యజ్ఞదత్తశ్చ" మున్నగుశబ్దములయొక్క రూపములేగాని వేఱుగావని చెప్పుటకు నన నయ్యవియే యీ రూపములుగా నగుచున్నవిగాని నూతనములుగాఁ బుట్టిన

వెంతమాత్రము కావని యద్దానియాశయము. కేవలలోకవ్యవహారమేకాక శాస్త్రీయవిషయములయందుఁగూడ నిట్లే గన్పడుచున్నది. లోకమునందు సుబంతము తిఙన్తమును 'పదము' అని వ్యవహరింపఁబడుచుండ నద్దానినే పాణిని 'సుప్తిఙన్తం పదం' అని యొక 'అంత' శబ్దమును దొలఁగించి సూక్ష్మరూపమున బోధించినాఁడు. ఆరీతిగానే తనశాస్త్రమునందుఁ గూడ బ్రాతిపదికార్థ మాత్రమునందు, లింగ మాత్రాధిక్యమునందుఁ, బరిమాణమాత్రమునందు వచనమాత్రమునందును బ్రథమావిభక్తి యగునని చెప్పుటకు "ప్రాతిపదికార్థలింగపరిమాణవచనమాత్రే ప్రథమా" అని చెప్పెను. ఇట్లు లోకమున వ్యవహృతములగు పదములనే యొకానొక విధముగ సమకూర్చుచు నవ్వానినే యాధారముగఁ జేసికొని తన శాస్త్రమునంతను బాణిని పొందికచేసెను. కావుననే పాణినికృత మగు నష్టాధ్యాయి కార్యశబ్దవాదమునే బోధించుచు నట్టి కార్యశబ్దవాదమే పాణిన్యభిప్రేత మని సర్వవిధములఁ జాటుచున్నది. కావుననే పాణిని యెచటనుగూడ సిద్ధశబ్దవాదమును జెప్పలేదు. ఇంతియకాదు; "దేవదత్తో గ్రామం గచ్ఛతి" మున్నగు వాక్యములయందు, "గ్రామం దేవదత్తో గచ్ఛతి, గచ్ఛతి గ్రామం దేవదత్తః, గచ్ఛతి దేవదత్తోగ్రామం" అను వికారములు గల్గుచుండుటచే నియ్యవి భిన్నములగు సిద్ధవాక్యము లనుటకంటె సమానపద సమూహమే యిన్నితీరుల నగుచున్నదని చెప్పిన యుక్తియుక్తముగ నుండునుగదా! కావుననే యీవాక్యములు సిద్ధములుగాక తత్తత్పదస్థానభేదముచే భేదము నొందుచున్నవి.

పైనిఁ జెప్పఁబడిన "తద్యథా ఘటేన కార్యం కరిష్యన్" అనుభాష్యము కేవలోత్పాద్యములు శబ్దములు కాఁజాలవను నర్థమునే బోధించుటంజేసి ప్రకృతోపక్రమమున కెంతమాత్రము విరోధింపఁజాలదు. కావున పాణినీయమును లోకానుభవమును గమనించినచో లోకమున వ్యవహృతములగు పదజాలమే సమాసరూపము నొందుచున్నది గాని వేఱగు కొన్ని శబ్దములు నూతనముగఁ బుట్టుట లేదనియుఁ దెల్లమగుచున్నది. ఇట్లే సమాసార్థబోధకొఱకు విగ్రహవాక్యముల నెట్లు నిరూపించినను దోషములేదు. వైదికము సిద్ధమగుటఁజేసి యద్దాని ననుశాసించుట శాస్త్రమున కెంతమాత్రము తగదు. కాని తమ వ్యవహారముకొఱకు వైదికభాషనుండి యేర్పరుపఁబడిన యీ సంస్కృతము నొక పద్ధతియం దుంచుటకుఁ బాణినీయము బయలువెడలినది. అందువలన వైదికములగు ఛందస్సులు సమాసములు, వాక్యములు నిం దుద్ధరింపఁబడినవి. వైదికభాషాజన్యములగు నీపదములెట్లున్నను, నవ్వానిని దమతమ బుద్ధుల ననుసరించుకొని సమాసములుగనో గద్యములుగనో పద్యములుగనో వ్యవహర్తలు మార్చుకొనుచుండ నద్దానిని భాషానుశాసనము శాసించును. అందుచే నొకానొకపదముయొక్క యుపచయాపచయస్థానభేదములచే ననేకవికారములను బొందుచుండెడి వాక్యజాలమంతయు సిద్ధమే యనినచో ననంతమగు గౌరవము గలిగి యనుభవమునకు విదూరమగునుగదా?

కావునఁ బైనిఁ జెప్పఁబడిన "సుప్తిఙన్తం"మున్నగు ననేకసమాసముల విషయమై "సుబంతం తిఙన్తం పదం" అను

లోకవ్యవహారమునే యంతశబ్ద లోపమును జేసి 'సుప్తిఙన్తం
పదం'అని పాణిని వ్యవహరించెను. ఈరీతిగా నపదాన్త (1-1-58),
క్రుధద్రుహేర్ష్యా-(1-4-37,) నమః స్వస్తి స్వాహా - (2-3-16,)
ప్రాతిపదికార్థ - (2-3-46,) "సహనఞ్" 4-1-57, "పాకకర్ణ"-
(4-1-64) అను మొదలగు ననేక సూత్రములును, "బుద్ధిః కర్మేం-
ద్రియ ప్రాణపంచకైః" అనుమున్నగు లోకవ్యవహారము గల
యనేక పదములును బరగుచున్నవి. ఇచట "సుప్తిఙన్తం"
అనుచో నొక యంతపదము లోపించినట్లు పైస్థలములయందుఁ
గూడ తత్తచ్ఛబ్దము లోపించుట కెద్దియైన నొక యను
శాసనము గలదేమో యద్దానిని దచ్ఛాస్త్ర పారంగతులు
నుడువవలయును. లేకపోయినచోఁ బాణినివ్యవహారముచేతనే
యవ్వానికి లోపమువచ్చునని తెలియవలయునో చెప్పవలయును.
లేకపోయినచో సుబంతతిఙన్తములను శాస్త్రీయవ్యవహారము
నందును, జ్ఞానేంద్రియ పంచక, కర్మేంద్రియపంచక, ప్రాణ
పంచక మను లౌకికవ్యవహారమునందును నాయాయి అంత,
పంచక శబ్దములకు లోప మెట్లు గలుగును? ఇట్టి చోటులయందు
లోపమును జెప్పు శాస్త్రమే లేకపోయినచో వేఱొకవిధమున
నియ్యవి సాధింపఁబూనుట యనుభవవిరుద్ధముగ నుండునుగదా !

కావునఁ బైనిఁ జెప్పఁబడిన రూపములకు ననుభవ సహ
మగు సాధకప్రమాణమును దెలుపవలసిన బాధ్యత తచ్ఛాస్త్ర
పారీణులయందుఁ గలదు.

శ్రీః

# మధ్వమతభంజని.



బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిన్
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతన్
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.
శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహమ్,
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే.
కామేశ్వరీం పరా మీడే కాదిహాదిస్వరూపిణీమ్,
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్.

## పంచరాత్రాగమము ప్రమాణమా?

మధ్వారాయ లను ప్రసిద్ధవ్యవహారము గలిగిన యానంద తీర్థులు తన దశప్రకరణములలో గథాలక్షణమను ప్రకరణమున—

ఋగ్యజుస్సామాథర్వా శ్చ భారతం పంచరాత్రికమ్,
మూలరామాయణం చైవ సంప్రోచ్యన్తే సదాగమాః.
అనుకూలా య ఏతేషాం తే చ ప్రోక్తా స్సదాగమాః,
అన్యే దురాగమా నామ తై ర్న సాధ్యం హి సాధ్యతే.

అని చెప్పియున్నారు. దీని యర్థమేమన— ఋగ్యజుస్సామాథర్వములును భారతమును బంచరాత్రకము నను నవియే

సదాగమము లని చెప్పఁబడుచున్నవి. వీనికంటె భిన్నము లగు నవి దురాగమములని చెప్పఁబడుచున్నవనియు నవ్వానిచే సాధ్యము సాధింపఁబడ నేఱదనియుఁ జెప్పఁబడుచున్నది.

ఇందు నాగమములన నేవియో మధ్వరాయాను యాయు లొకింత నిర్వచింపవలయును. ఏలయన: నిదివఱకు ఋగ్యజుస్సామాథర్వములకు వేదము లనియు రామాయణభారతము లకు నితిహాసము లనియుఁ, బంచరాత్రితంత్రమునకు నాగమము లలో నొక్కటి యనియు శిష్టవ్యవహారము కలదు. అంతియకాని యీనాల్గు గ్రంథములు నొకే తరగతికిఁ జెందియున్నట్లు శిష్టు లెవ్వరును వ్యవహరించియుండలేదు. ఋగ్యజుస్సామాథర్వములు వేదము లనియు నిత్యములనియు స్వతఃప్రమాణము లనియు సర్వ విధముల రాయలవారు విష్ణుతత్త్వవినిర్ణయమునందు నిర్వ చించి తద్భిన్నములగు స్మృత్యాదులు పరతఃప్రమాణములు ననిత్యములనియు శ్రుతిర్వావ నిత్యా,అనిత్యావావ స్మృతయో యాశ్చాన్యా వాచః "ఇతి పైంగిశ్రుతిః" అని నిర్వచించి యున్నారు. ఇచట నుదాహరింపఁబడిన ప్రమాణములలో స్మృతు లనుపేరఁ బరఁగు మన్వాది పవిత్ర స్మృతులలో నెద్దియు నుదాహరింపఁబడి యుండలేదు. పురాణములలో నొక్కటియైనను బేర్కొనఁబడలేదు. ఇఁక నితిహాసములు రెండు నాగమములలో నొకటియగు పంచరాత్రకమును గదా నిర్వచింపఁబడుచున్నవి. ఇతిహాసములు నీయాగమమును గూడ ననిత్యములును బరతఃప్రమాణములునుగదా ! ఇయ్యవి వేదసంమతము లైనవో నొకింత యుపాదేయత్వమును బడ

యును. లేనిచో నిరర్థకము లగును. అట్టియనిత్యములును బరతః ప్రమాణములునగు నీమూఁడు గ్రంథములతో ఋగ్యజు స్సామాథర్వములను జేర్చి పాంచరాత్రమునకు వ్యవహరింపఁ బడు సామాన్యనామమగు నాగమ మను శబ్దముచే వేదములను జేర్కొనుటకంటె వేఱ యనౌచిత్యముండ దని వేదవిదుల పర మాశయము. ఇంతియకాదు; ఆగమములలో సదాగమములు దురాగమము లని రెండువిధము లున్నటుల రాయలవారిచేఁ జెప్పఁబడుచున్నది. తమకుఁ బ్రమాణముగ నెన్నుకొనఁబడిన పంచరాత్రము సదాగమ మనుటకుఁ దమ యభిమతమని తక్క వేఱొండు కారణము చెప్పఁబడియుండలేదు. అద్దానిని దురా గమమని శిష్టు లెవ్వరైన గ్రహించినచో వీరిద్వైతము దుర్ద్వైత మగుచు నవైదికమగునని వేఱ చెప్పనక్కఱలేదుగదా!

ఇఁక రామాయణ భారతములుగూడఁ బంచరాత్ర ముతోఁ దుల్యముగ సదాగమము లని చెప్పఁబడుచున్నవి. పంచరాత్రాగమము దురాగమ మని నిర్వచింపఁబడుచో శిష్టు లచేఁ బవిత్రతమములుగ నెన్నఁబడు రామాయణభారతాదు లకుఁగూడఁ బంచరాత్రాగమముయొక్క గతియే పట్టును. ఇంతియకాదు; వేదమునకుఁగూడ నిట్టి దుర్దశ కలుగుటకు సావ కాశము గలదు.

ఇది యిట్లుండ విష్ణుతత్త్వ వినిశ్చయ మను ప్రకరణము నందు రాయలవారిచే నిట్లు మఱల వ్రాయఁబడియున్నది:

"ఋగాద్యా భారతం చైవ పంచరాత్ర మథాఖిలమ్ ,
మూలరామాయణం చైవ పురాణం చైతదాత్మకమ్ .
యే చాన్యయాయిన స్తేషాం సర్వే తే చ సదాగమాః,
దురాగమా స్తదన్యే తే నై ర్న జ్ఞేయో జనార్దనః."

ఇందుఁ గథాలక్షణమునఁ జెప్పిన విషయముకంటె నొకింత విశేషము దెలియవచ్చుచున్నది. అదెద్దియన-"పురాణం చైతదాత్మకం" అనునదికాని ఇద మిత్థం అని యొక పురాణమైన నిర్వచింపఁబడియుండలేదు. దీనిఁబట్టి రామాయణభారతము లను నితిహాసములు పంచరాత్రమను నాగమమును జెప్పెడి విషయములను బోధించు పురాణము ప్రమాణ మని పురాణముల గుణదోషములను, అనఁగాఁ బ్రామాణ్యమును నిర్ణయించుటకు నిదానముగ నీ రెం డితిహాసములుఁ, బంచరాత్రతంత్రమునుగదా ప్రమాణములుగఁ జెప్పఁబడుచున్నవి. అహ హ ! ఏమి ద్వైతప్రామాణ్యము ! పురాణమున కనుగుణముగ నుండని యితిహాసములనుగాని తంత్రములనుగాని ప్రమాణముగా గ్రహింపని మీమాంసకు లీ వాక్యము నెట్లు పరిగ్రహింతురు? ఆగమములు స్మృతివిరుద్ధములు పురాణవిరుద్ధములు నైనచో దురాగమము లనుట కెట్టు సంమతము. అంతియకాని యాగమమునకు విరుద్ధమగు పురాణములఁ ద్రోసిపుచ్చవలయునను విశేషమీద్వైతమునందు వినఁబడుచున్నది. సరియే; ఇది యిటు లుండ నాగమద్వైవిధ్యనిరూపణమునకుఁ గూడ నిం దొకవిశేషము నిర్వచింపఁబడియున్నది. ఏమన:

"దురాగమాస్తదన్యే తే యైర్న జ్ఞేయో జనార్దనః"
అని. అనఁగా నేయాగమములందు విష్ణువు తెలియఁబడఁడో యయ్యవి దురాగమము లని యొక విశేషము నిర్వచింపఁబడు చున్నది. దానంజేసి విష్ణువును బ్రతిపాదించు పంచరాత్రాగమ మొక్కటియే సదాగమ మనియుఁ దద్భిన్నములగు శైవాద్యాగమము లన్నియు దురాగమము లనియే గదా రాయల వారియభిప్రాయము. అందులకు సందియ మేల?
'అతోవిష్ణోఃసర్వోత్తమత్వమేవమహాతాత్పర్యంసర్వాగమానాం'
అని విష్ణుతత్త్వనిర్ణయమందలి వాక్కువలన సుస్పష్టమే యగుచున్నది.

ఇచట సర్వాగమము లన నిందుదాహరింపఁబడిన నాలుగాగమములేనా? లేక లోకవ్యవహారమునఁ దెలియవచ్చు నాగమము లన్నియునా? లోకవ్యవహారమునఁ దెలియవచ్చెడి యాగమము లన్నియు విష్ణువునే బోధించునని యభిమత మగుచో నాగమములందు సదాగమ దురాగమ నిర్ణయమున కవకాశ మెట్లు? ఆగమములయందు రాయలవారు కొన్ని దురాగమము లున్నవని వ్యవస్థ చేయుటచేఁ గొన్ని యాగమములు విష్ణ్వితరములగు పరశివాదుల సర్వోత్తమత్వమును గూడ బోధించుచున్నవని రాయలవా రొప్పి తీరవలయును. అట్లైనచోఁ గొన్ని యాగమములచే విష్ణువుయొక్క సర్వోత్తమత్వమును మఱి కొన్ని యాగమములచేఁ బరశివాదుల సర్వోత్తమత్వమును దెలియవచ్చుచుండ సర్వాగమములకును విష్ణువుయొక్క సర్వోత్తమత్వమునందే తాత్పర్యమను నుక్తి దురుక్తి యగుచు రాయల

వారికి స్వవచన వ్యాఘాత దోషమును ఘటింపఁ జేయుచు న్నది.

ఇట్లు రాయలవారి కభిమతమగునట్లు కొన్ని యాగమ ములు విష్ణువుయొక్క యతిశయమును, మఱికొన్ని యాగమ ములు పరశివాదుల యతిశయమును బోధించుచుండ నయ్యవి గూడఁ దత్తదభిమానులచే సదాగమములుగఁ దలంపఁబడు చుండ రాయలవారిపంచరాత్రి మొక్కటియే సదాగమ మను టకుఁ గల హేతు వెద్ది? అందులకు హేతువు రాయలవారియభి మానవిశేషమే యని చెప్పితీరవలయును. చెప్పనేల? సుస్పష్ట ముగఁ గన్పట్టుచునే యున్నది.

రాయలవారి బ్రహ్మసూత్రభాష్యమున 'శాస్త్రయో నిత్వాత్' అను సూత్రమున రాయలవారి చిత్రిలేఖనమును జూడుఁడు! అందు—

ఋగ్యజుస్సామాథర్వా శ్చ భారతం పంచరాత్రికమ్,
మూలరామాయణం చైవ శాస్త్ర మిత్యభిధీయతే.
ఇచ్ఛానుకూల మేతస్య తచ్చ శాస్త్రం ప్రికీర్తితమ్,
అతోన్యో గ్రంథవిస్తారో నైవ శాస్త్రం కువర్త్మ తత్.

అనివ్రాసి పిమ్మట "వేదపంచరాత్రయో రైక్యాభిప్రా యేఃపంచరాత్రస్యైవ ప్రామాణ్య ముక్తమ్" అని వ్రాయఁ బడియున్నది. ఇచట శాస్త్రనిర్వచనలక్షణమందుఁగూడఁ బురా ణములు దోసివేయఁబడుటయేగాక రామాయణ భారతముల

యొక్క ప్రామాణ్యముగూడ "పంచరాత్రస్యైవ ప్రామాణ్యముక్తమ్" అను వాక్యముచేఁ ద్రోసివేయఁబడుచున్నదని సుస్పష్టము.

కాని యిందొక విశేషముగూడఁ గలదు. వేదమునకును బంచరాత్రమునకు నొకే యభిప్రాయ ముండుటవలనఁ బంచరాత్రమునకేఁ బ్రామాణ్యము నిరూపింపఁబడుటవలన వేదార్థమును బోధించుటచేఁ బంచరాత్రమునకు బ్రామాణ్య మున్నట్లు నిర్వచించినను, వేదపంచరాత్రశబ్దములను సమస్యమానపదములుగాఁ జేయుటవలనఁ బంచరాత్రమునకు వేదతుల్యత్వమును బ్రతిపాదించుట స్పష్టమగుచున్నది. వేదము స్వతఃప్రమాణము. తదనుగుణములగు స్మృతులు ప్రమాణములు. తదనుగుణము లగు పురాణములు ప్రమాణములు. తత్పురాణానుగుణములగు నాగమములు ప్రమాణములని శిష్టులచే నాగమప్రామాణ్యము నికృష్టమగునదిగా గ్రహింపఁబడుచుండ నట్టి యాగమములను వేదములతోఁ దుల్యములుగ గ్రహించుటచే మధ్వరాయలు వేదనిందాదోషమున కెందులకుఁ బాల్పడఁడు? సర్వవిధములఁ బాల్పడునుగదా?

అయినను సర్వప్రమాణములు ద్రోయఁబడి మధ్వరాయలచేఁ బ్రమాణముగాఁ జేకొనఁబడిన పంచరాత్రతంత్రము యొక్క ప్రామాణ్యమును గూర్చి యొకింత శిష్టవ్యవహారమును గమనింతము.

కూర్మపురాణమున యుగధర్మప్రశంసయందు—

"వామాః పాశుపతాచారా స్తథా, వై పాంచరాత్రకాః ।
భవిష్యంతి కలౌ తస్మిన్ బ్రాహ్మణాః క్షత్రియా స్తథా ॥
కుర్వంతి చావతారాంశ్చ బ్రాహ్మణానాం కులేషు వై ।
దధీచిశాపనిర్దగ్ధాః పురా దక్షాధ్వరే ద్విజాః ॥"

అని చెప్పఁబడినది. ఇఁక నీ పాంచరాత్ర తంత్ర మఱువదినాల్గు కుతంత్రములలో నొకటిగా శిష్టులచే స్మరింపఁ బడినది. వేయేల? శ్రీకృష్ణ ద్వైపాయనులచేఁ గుతంత్ర ఖండన ప్రకరణమునందు ననఁగా ద్వితీయాధ్యాయ ద్వితీయ పాదమునందు "ఉత్పత్త్యసంభవాత్" "నచ కర్తుః కరణమ్" "విజ్ఞానాదిభావేవా తదప్రతిషేధః" "విప్రతిషేధాచ్చ" అను నాల్గు సూత్రములచే నీ పాంచరాత్రతంత్రము దోసివేయఁ బడుచున్నది. ఈ పాంచరాత్రతంత్రమును మన్వాదిస్మృతికర్త లెవ్వరు నించుకేనియు స్మరించియుండలేదు. అందుఁ బ్రధానాలంకారముగా దాసవేషమునకు నిర్వచింపఁబడిన తప్తచక్రాంకనాదికములు మన్వాదిస్మృతికర్త లెవ్వరు నుపాదేయముగా వర్ణించియుండలేదు. మన్వాదిస్మృతుల ననుసరించిన నిబంధకారు లన్ననో యీ పంచరాత్రాగమ మవైదికమనియు నందు నిర్వచింపఁబడిన పంచసంస్కారము లవైదికము లనియుఁ జెప్ప నీ పంచరాత్రాగమము సదాగమ మనుట యెట్లో తదభిమానులే నిర్వచింపవలయును! శ్రుతిస్మృతిసదాచారదృష్టిచే నన్ననోసీ పంచరాత్రాగమము సర్వవిధముల దురాగమమే యని రాద్ధా

_స్తము. ఏోనిండు, తుష్యతుదుర్జనన్యాయమున వారలకుఁ బ్రమా ణమే యగునందము. అట్లున్నను రాయలవారికిని, వారల శిష్య పరంపరకును బరమ రాద్ధాన్త మగు జగత్సత్యత్వము నీ పంచ రాత్రతంత్రము తుడిచివేయుచున్నది. పాంచరాత్రాంతర్గత మగు బృహద్బ్రహ్మసంహితయందలి మొదటిపాదమునందలి యేడవయధ్యాయమున—

జ్ఞాత్వా భగవతో రూపం సర్వత్రా స్తి తయా స్థితమ్।
ధారకః ప్రేరకః సాక్షా ద్వాసుదేవః సనాతనః॥ 20

సర్వానందమయో నిత్యో నిత్యలీలానికేతనః।
సర్వావధిః సర్వశేషీ సర్వవేదాంతసమ్మతః॥ 21

తస్మా దన్య న్నైకరూపం మాయాకార్య మిదం జగత్।
అనిత్యం మృగతృష్ణాభం గంధర్వనగరోపమమ్॥ 22

అని చెప్పఁబడినది. ఇందు మూఁడవశ్లోకమున వేదాభి ప్రాయమునే పంచరాత్రతంత్రము బోధించుటంజేసి యదియే పరమప్రమాణమని చెప్పిన రాయలవారుగాని, వారి దాసవర్గము వారుగాని తంత్రము నెన్నడైన నామూలాగ్రముగఁ జూచి యున్నారా? లేదా? చూచినచో నింతదనుకఁ జూడలేదా? చూచినచో నీజగత్తు ఏకరూపముగాదు. నానారూపము; మా యాకార్యము; అనిత్యము; మృగతృష్ణాతుల్యము; గంధర్వనగ రోపమము - అని ప్రత్యక్షముగ శ్రీనారాయణునిచే నుపదే శింపఁబడిన యుపదేశమును సర్వవిధముల నుల్లంఘించి యద్వై

తులు జగన్మిథ్య యని చెప్పునది ప్రమాణవిరుద్ధము గావున సత్యమని నిర్వచింప సాహసించునా ?

ఇంతియకాదు; రెండవపాదమున రెండవ యధ్యాయమును వీరించుకేనియుఁ జూచినట్లు తోఁపదు. చూచియుండినచో ద్వైతము సత్యమని పలుకుచు నద్వైతమును దూలనాడ సాహసింతురా? సాహసింపరు. ఈ రెండవ యధ్యాయమందలి నారాయణుని యుపదేశమునకుఁ బ్రకృతోపయుక్తమగు విషయమును బ్రదర్శించుచున్నారము. ఏమన—

సర్వాధారతయా బ్రహ్మన్ అహ మేకోఽద్వయః పరః।
మదేకాయనత స్సర్వ మహ మేవ న సంశయః ॥
పా. 2. అ. 2-26.

ద్వైతం నాస్తీతి బోధేన మనసో ద్వైతనాశనమ్।
ఏతదంతో హి సంసారో బ్రహ్మన్నేవం విచారయ॥
అని 2-27.

అని. అనఁగా సర్వజగత్తున కాధారభూతముగ నద్వితీయుఁడను పరుఁడనగు నేనొక్కఁడనే యున్నాను. ఈ పరిదృశ్యమానమగు జగం బంతయు నేనే యాధారముగాఁ గల్గి యుండుటవలన నీ జగం బంతయు నేనే యగుచున్నాఁడను. అందు సందేహములేదు. ద్వైతములేదను బోధచే మనస్సునకు ద్వైతజ్ఞానము నశించును. ఈసంసార మంతయు ద్వైతనాశనమే.

యంతముగాఁ గలిగియున్నది. అనఁగా ద్వైతము లేదను జ్ఞానము గలుగువఱకు నీ సంసారము గలుగుననియు నట్టి జ్ఞానము గలుగ నీ సంసారము నశించును. కావున నోయీ బ్రహ్మమా! "ఏవం = ఈప్రకారముగా, అనఁగా, ద్వైతం. నాస్తీతి = ద్వైతము లేదు, కల్లయని, విచారయ= విచారింపుమా" అని యర్థము.

ఇట్టి నారాయణుని యుపదేశమువలనఁ దెలియవచ్చెడిదేమన— నారాయణుఁడు సకల జగదాధారుఁడు, పరుఁడు, అద్వయుఁడు (ఒక్కఁడు) అను జ్ఞానమును బడయుటకుఁ గాను నారాయణునియం దాధేయముగాఁ దెలియవచ్చుచుండెడి ద్వైతమెంతమాత్రము లేదని విచారము చేయఁబడవలయునని కదా? ద్వైతం నాస్తిహి—ద్వైతము లేదని, నారాయణుఁడు బోధించుచుండఁ బంచరాత్రతంత్రమంతయుఁ బరమప్రమాణమను మధ్వరాయలుగాని తత్సంప్రదాయస్థులుగాని ద్వైతము సత్యమని యెట్లు నిర్వచింపఁగలరు? ఎంతమాత్రము నిర్వచింపలేరు; కావున ద్వైతమును మిథ్యయే యని సుస్పష్టమే.

కావున నింతదనుకఁ జూచియుండరనునది నిశ్చయమే. వారల కభీష్టమగు దాసవేషము మొదటి మూఁడధ్యాయముల చేతనే సిద్ధించుచుండ నద్దానిదాఁటి పైకిఁ బోవలయు నవసరము వారికేల కల్గును? వారి కుపయుక్తమగు గ్రంథమంతయు మూఁడవయధ్యాయాంతమందలి శ్లోకమగు—

"దీక్షాం భాగవతీం ప్రాప్య సంతాప్య తను మాత్మనః ।
అనుసంధానకర్తా మే మా ముష్మిన్ప్యసి మా శుచః ॥"

అనుదానిచే సిద్ధించుచుండెడు నీ గ్రంథములోని ప్రయోజనమేమి? ప్రయోజన మెంతమాత్రము లేదనియే యుపేక్షింపఁబడినది. అంతియేకాని సదాగమమో దురాగమమో, యద్దానిఁగూడ సమగ్రముగ నెంతేనాలోచించుచో నిట్టి నిర్ణయమునకు రాయలవారు సమర్థులని నిశ్చయింపనోపను.

కావున నిందువలన గ్రహింపవలయును దేదియన—పాంచరాత్రాగమము సదాగమ మెంతమాత్రముగాదు. అయ్యది శిష్టుల. కేరికిని ప్రమాణముగాదు. ఒకవేళ రాయలవారికిని వారి దాసవర్గమునకుఁ బ్రమాణమైనను వారిచే నట్టహాసముగాఁ బ్రతిపాదింపఁబడు జగన్మిథ్యాత్వ సిద్ధాంతమును బంచరాత్రతంత్ర మెంతమాత్రము పోషింపకపోవుటచే నయ్యది యథార్థము కాకపోవుటచే నప్రమాణము.

శ్రీ సదనము,
9—12—34.

ఇతి నారాయణస్మృతిః.

# దాసవేషము.



పంచరాత్రాగమము ప్రమాణమా? యను విషయమును విచారించుటయందు నా యాగమమందుఁ దెలియవచ్చెడి—

"తస్మాదస్య నైకరూపం మాయాకార్య మిదం జగత్ ।
అనిత్యం మృగతృష్ణాభం గంధర్వనగరోపమమ్॥"

అను జగన్మిథ్యాత్వమును ద్రోసిపుచ్చి యెద్దియో యొకతీరున జగత్సత్యత్వమును బలుకుటయే ముఖ్యతాత్పర్యముగాఁ గల్గి దశప్రకరణముల రచించిన మధ్వరాయలకును దత్సంప్రదాయస్థులకుఁ బంచరాత్రాగమ మెట్లు ప్రమాణముగాఁ బరఁగు నను విషయ మొకింత యోజింపవలయును.

జగత్సత్యత్వమును సిద్ధాన్తముగాఁ దలఁచువారికిఁ బంచరాత్రాగమము బాధకమే యైనను లోకమునం దెవ్వరికేని నెద్దానియందైనను బ్రీతిగల్గినచో నద్దానికొఱకైన నిష్టములేని దానిని గూడ నొకప్పుడిష్టమని పలుకుట కుహకులకు సహజమే. అట్టి లౌకికన్యాయము ననుసరించి మధ్వరాయలు దనకు సర్వవిధములఁ బ్రీతికరమగు దాసవేషము నీపంచరాత్రాగమముననే వర్ణింపఁబడియుండుటం జేసి యద్దానియందలి ప్రీతిచే—

"ఋగాద్యా భారతం చైవ పంచరాత్ర మథాఖిలమ్"

అని యనుచుఁ బంచరాత్రాగమ మంతయుఁ బ్రమాణమని నిర్వచించుచున్నారు గాని యందలి సర్వవిషయములును

బరమ ప్రమాణముతో గ్రహించినట్లు తెలియరాదు. మధ్వరాయలకు సర్వనిధములఁ బ్రతికరమగు దాసవేషము పంచరాత్రాగమమునందలి బృహద్బ్రహ్మసంహితయందు మొదటి మూఁడధ్యాయములయందును నిరూపింపఁబడి యుత్తరగ్రంథమునందుఁ బ్రసంగవశమున ననువదింపఁబడుచున్నది. కావున నట్లు ప్రసంగవశమున ననువదింపఁబడిన దాసవేషవాక్యమును బోధించు వాక్యములయందే వీరలకుఁ బ్రమాణభావముగాని తదితరములగు విషయములయందుఁ బ్రమాణభావము వీరల కున్నట్లూహించుట కవకాశము లేదు. ఇట నుదాహరింపఁబడిన దాసవేషమునందే వీరలకు సర్వనిధములఁ బ్రీతియనుటకుఁ బ్రత్యక్షమే పరమప్రమాణము. అనుమానాదులతో నెంతమాత్రము పని లేదని పరిష్కృతము నాఁచే నిరూపింపఁబడు దాసవేషమువలన నువ్యక్తమయ్యెడిని.

పరిష్కృత ముదాహరింపఁబడిన గ్రంథమునందలి కథావిశేష మిట్లు జరుగుచున్నది.

ఒకానొకప్పుడు మందరపర్వతముయొక్క గుహయందు బ్రహ్మ వైష్ణవరూపమును ధరించి ద్వయమంత్రమును జపింపుచుఁ గూర్చొని యుండెనని—

“ఏకదా మందరద్రోణ్యా మాసీనః కమలాసనః।
ద్వయ మావర్తయ న్నాసీ ద్వైష్ణవం రూప ముద్వహన్॥”
అ 1. శ్లో. 2.

అను శ్లోకముతోఁ దంత్ర ముపక్రమింపఁబడియున్నది.

అట్లు గూర్చొనియున్న బ్రహ్మకడకు నారదాదిమునులు బోయి యాతని సవినయముగఁ బ్రార్థించి,

"త్వం కర్తా సర్వలోకానాం కిం జప న్నిహ తిష్ఠసి।
కిమిదం ధార్యతే రూపం కిమిదం మౌన మాశ్రితమ్॥"

అని ప్రశ్నించిరి. అనఁగా సర్వలోకములను సృజించెడి మహానుభావులరగు మీరు ఏమి జపించుచు నిచటఁ గూర్చుంటిరి? ఈ రూపమెందులకు ధరించితిరి? మౌనము నెందులకు వహించితిరి? అని యర్థము. దీనిఁబట్టి బ్రహ్మచే మందరద్రోణియందు ధరింపఁబడిన వైష్ణవరూప మదివఱకు నారదాదిమునులకు నగమ్య మగుటం జేసి యపూర్వమే యైనట్లు సువిదితమే గదా! నారదుఁ డన్ననో సకలకళావిభూషితుఁ డని ఛాందోగ్యోపనిషత్సప్తమప్రపాఠకమునందలి నారద సనత్కుమార సంవాదమువలనఁ దెలియవచ్చుచున్నది. ఎట్లన: నారదుఁడు దాఁ జదివిన విద్యల నిట్లు నిర్వచించియున్నాఁడు.

"ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేద మాథర్వణం। చతుర్థ మితిహాసపురాణం పంచమం వేదానాం వేదం పిత్ర్యం రాశిం। దైవం నిధిం వాకోవాక్య మేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూతవిద్యాం క్షత్త్రవిద్యాం నక్షత్రవిద్యాం సర్పదేవజనవిద్యా మేతద్భగవోఽధ్యేమి" (ఛాం. 7-1-2) అని.

ఇట్లు సకలకళావిదుఁడగు నారదునకు నాతనియనుచరులగు మునులకును బ్రహ్మచే ధరింపఁబడినరూప మపూర్వముగాఁ

గన్నట్టైనన్నచో నట్టి దాసవిశేష మిదివఱకు శ్రుతి స్మృతి పురాణేతిహాస సదాచారము లనెడి ప్రమాణములచేఁ దెలియఁబడని విశేషమైనదే యని సర్వసిద్ధములఁ దెలిసికొన నవకాశము గలదు.

అట్లు నారదాదులు ప్రశ్నించిన ప్రశ్నార్థములకు సమాధానముగాఁ దాసవేష మాహాత్మ్యము నిట్లు నిర్వచించెను—

"నాత్ర కాలవిచారోఽస్తి నానుతర్పణమార్జనమ్ ।
న్యాసముద్రాంగదేవాశ్చ విధియోగో న సంస్థితః॥
దాసవేషశ్చ సంస్కారో ముఖ్యః సిద్ధాన్తవర్త్మని।
అనేకేషాం ముముక్షూణా మనుసంధానసిద్ధయే॥
యథాజలసముద్రాదే గుణాః స్యాదవేక్షితే।
తథాఽర్థభావనం సూత్రం పరమాత్మాభిసంగమే॥
అనుసంధానసిద్ధ్యర్థం దాసవేషో మయా ధృతః।
ద్విపరార్ధావసానేఽపి న సత్యక్షణ మివాయుషమ్॥" అని.

అనఁగాఁ దాను ధరించినది దాసవేషనామకసంస్కారమనియు నయ్యది సిద్ధాన్తమార్గమున ముఖ్యమనియు మోక్షముగలవారల కనుసంధానసిద్ధికొఱకు నయ్యది యవసరమనియు నట్టి యనుసంధానసిద్ధికొఱకుఁ దానా దాసవేషమును ధరించితిననియు నర్థము. ఇట్లు మొదటి యధ్యాయమున దాసవేషాతిశయమును జెప్పి యట్టి దాసవేషమునకు ముఖ్య సంస్కారము లక్ష్మినిగూర్చి నారాయణునిచేఁ జెప్పఁబడినట్లు రెండవ యధ్యాయమున—

"భక్తాభ్యాం శంకచక్రాభ్యాం యాచితోఽహం పురా ప్రియే
ఆవాంవినా న శక్తవ్యం ధర్మం భాగవతం ప్రభో॥ 2-30
తచ్ఛ్రుత్వా చావదం తాభ్యాం వరం సర్వోపకారకమ్।
భవద్వారం ప్రభవతు నరాణాం పరమం పదమ్॥ 5-31
తస్మాత్సంకల్పసిద్ధ్యర్థే కమలే భుజమూలయోః।
సంధారయే మహాభాగే శంకచక్రే సనాతనే॥" 2-32

అని చెప్పఁబడియున్నది. ఈ శ్లోకములవలనఁ దెలియవచ్చున దేమన— తన భక్తులగు శంకచక్రములచే బ్రార్థింపఁబడి వారల ననుగ్రహించుటకై భాగవతధర్మము ననుసరించు వార లందఱును భుజమూలములయం దీ శంఖచక్రముల ధరింప వలయునని దాను వారలకుఁ జెప్పెనని.

కావున నెవ్వరు, అగ్నిచే లెస్సఁగఁ దప్తమగు చక్రమును దక్షిణభుజమందు ధరింతురో యట్టివార లుత్కృష్టగతిఁ జెందు దురని—

"యే తు సంశ్రద్ధయా సమ్యక్సంతాప్య దహనే భుజే।
దక్షిణే ధారయిష్యన్తి స్యాత్తేభ్యః పరమా గతిః॥" 2-64

అని చెప్పఁబడుచున్నది. ఇట్లుపదేశింప శ్రీనారాయణుని దేవి సంతసించి ప్రయోజనాంతరము నపేక్షింపకయే శంఖ చక్రములను భుజములందు ధరించినట్లు రెండవ యధ్యాయాం తిమ శ్లోకమగు—

“ఓమిత్యుక్త్వా చ సా దేవీ చక్రశంఖౌ భుజద్వయే ।
ప్రయోజనాంతరం హిత్వా మంత్రరాజ మథో దధౌ॥

అని వానిచేఁ జెప్పఁబడి లక్ష్మిచే దాసభావమును బొందితి నని నారాయణునకు నివేదన చేయఁబడినట్లు—

“దేవ దేవ జగన్నాథ రహస్యం మే ప్రకాశయ।
దాసభావం ప్రపన్నాస్మి స్వామీ త్వం మే దయానిధే॥”

అని మూఁడవ యధ్యాయ ప్రథమశ్లోకముచేఁ దెలియవచ్చుచున్నది.

పిమ్మట లక్ష్మికి రహస్యోపదేశము నారంభించి చెప్పుటలో మూఁడవ యధ్యాయాంతమందలి శ్లోకమున నారాయణుఁడిట్లు చెప్పియున్నాఁడు—

“దీక్షాం భాగవతీం ప్రాప్య సంతాప్య తను మాత్మనః ।
అనుసంధానకర్త్రా మే మా ముపైష్యసి మా శుచః ॥ ”

అని చెప్పుచున్నాఁడు. ఇందు భుజద్వయమునందుఁ దప్తచక్రశంఖధారణమును చేయుట భాగవతదీక్షయనియుఁ జెప్పఁబడియున్నది.

ఇట్లు చెప్పి యుత్తరగ్రంథమునం దచ్చటచ్చట నీతప్తశంఖచక్రాంకనమును దాసవేషము స్తవముచేయఁబడుచున్నది. ఎట్లన—

"వైకుంఠదాస్యయుక్తానాం దాసవేషోపశోభినామ్ ।
దాస దాసేతి లపతా మపూర్వా గతి రిష్యతే"
(పం 4-22)
పరితాప్య చక్రశంఖాభ్యా మంకయే ద్భుజమూలయోః॥
(5-42)
పవిత్రేణ విశుద్ధాత్మా యది హీనకులోద్భవః ।
ద్వయాధికారీ భవతి పూజ్యో వంద్యోఽమరై రపి॥(5-43)
చక్రాంకితస్య దేహోఽయం యత్ర కుత్ర పతే దిహ ।
తత్రైవ తీర్థం భవతి యత్ర తీర్థం కలేబరమ్॥ (5-44)
సంతప్తచక్రపూతాంగ స్తులసీమాలయా వృతః।
నారాయణం జగన్నాథ మనన్యే నాంతరాత్మనా॥ (5-67)
సేవతే పరయా భక్త్యా యథా సంప్రాప్యతే హరిః॥(5-68)
దాసో భూత్వా యజే దేవం పంచసంస్కారసంస్కృతః॥
(7-26)

అని. ఇట్లీ పంచరాత్ర తంత్రమున వర్ణింపఁబడిన తప్తచక్ర శంఖాంకనములతోఁ గూడిన దాసవేషమందలి యభినివేశముచేఁ బవిత్ర గ్రంథముల నన్నిఁటిని దుడిచి పంచరాత్రాగమ మొక్కటియే పరమప్రమాణమని—

"వేదపంచరాత్రయో ర్మైక్యాభిప్రాయేణ పంచరాత్రస్యైవ ప్రామాణ్య ముక్తమ్"

అని మధ్వరాయలు గ్రహించుటకుఁగల కారణమని సువ్యక్తమయ్యెడిని.

అని. ఇట్లు పంచరాత్రోగమోక్తమునుదాసవేషమునకు ముఖ్యాలంకారమునగు చక్రశంఖాంకనము పతనహేతు వని సకల శాస్త్రరహస్యముగా నిరూపింపఁబడుచున్నది. కావున నీ చక్రశంఖాంకన మవైదికము. అట్టి యవైదిక సంస్కారముల బోధించు తంత్రము దురాగమము గాని సదాగమ మెన్నటికిని గాదు. ఇట్టి,యవైదికమగు దురాగమమును వేదతుల్యమ నియుఁ బరమప్రమాణమనియు గ్రహించుట యెట్లు? కావున నియ్యది సర్వవిధముల నవైదికమేయని స్పష్టము. ఇట్టి యవైదికమగు దురాగమమునందలి సంస్కారములనే మతమునకుఁ బరమసంస్కారములుగానెన్నుకొనిన మధ్వరాయలయొక్కయుఁ దదనుచరులగు తీర్థులవారియొక్కయుఁ దదనుచరులగు దాస వేషధారులయొక్కయు మతము వైదిక మెట్లగును? కావున నియ్యది వైదిక మెంతమాత్రముగాక యవైదికమే యగుచు దుర్మత మగుచున్నదని వేఱ వచింప నవసరములేదు.

శ్రీ సదనమ్,
10—12—34.

ఇతి నారాయణస్మృతిః.

# వైదిక ధర్మసంవర్ధని.

సంపుటము 1] ఆగస్టు 1935 [సంచిక 8.

## మధ్వమతభంజని

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిమ్
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతమ్
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహమ్,
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే.

కామేశ్వరీం పరాం వందే కాదిహాదిస్వరూపిణీమ్,
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్.

## దాసభావము ముక్తియగునా?

మధ్వాచార్యుల కభిమతమగు పంచరాత్రతంత్రమున నిట్లు చెప్పఁబడియున్నది:

"వైకుంఠదాస్యయుక్తానాం దాసవేషోపశోభినామ్,
దాస దాసేతి లసతా మపూర్వా గతి రిష్యతే. (పం. 4-22)

అనఁగా వైకుంఠముతోఁ సంబంధించిన దాస్యముతోఁ గూడుకొనినట్టియు దాసవేషముతో నొప్పుచున్నట్టియు "దాసుఁ

డను, దాసుఁడను నని నిరంతరముఁ బలుకుచు వర్తించువారలకు నపూర్వమగుగతి యన ముక్తి లభించునని యీవాక్యమున కర్థము. ఈశ్లోకమునందలి యర్థమునే పరమావధి యగు మహామత మని బోధించుచు నట్టి దాసవేషమునకు ముఖ్యలింగములగు తప్త చక్రశంఖాద్యంకనమును గావించుచుఁ దమశిష్యులను విష్ణుదాసులని ప్రచ్ఛన్నముగఁ బిలుచుచుఁ బ్రకటముగా ద్వైతులని వ్యవహరించుచు ననుసరించుచుండెడి విశేషముచే ముక్తియను పరమపురుషార్థము లభించునా? యని యొకింత నీప్రచ్ఛన్న దాసమతతత్త్వమునుగూర్చి యొకింత విచారించుదము. ఏల యన - మధ్వరాయసంప్రదాయమునకుఁ జెందిన యుత్తరాది మఠస్థులగు సత్యధ్యానతీర్థులవారు తమ సంయమనీపురం హైకోర్టులోఁ దన కభిమతమగు మతమును విష్ణుదాసాచార్యు లను వానియొక్క మతముగాఁ జిత్రించియున్నారు. ఇంతియకాదు, తమ దివానుచే వైదికధర్మ సంవర్ధనీ సభవారికి 14-12-1934 తేదీగల బహిరంగప్రత్యుత్తరమున శ్రీమధ్వాచార్యులవారి గ్రంథముల ననుసరించి విష్ణుదాసాచార్యులు చెప్పిన ద్వైతమే వైదికము; వేదాంతవిచారణ సివిల్ కేసు పుస్తకములలో సవిస్తరముగను సశాస్త్రీయముగను నిరూపింపఁబడియేయున్న"దని వ్రాయించియున్నారు. దీనింబట్టి యీయుత్తరాది మఠస్థులు సత్యధ్యానతీర్థు లను పరోక్షనామముచే లోకమున వ్యవహరించుచున్నను దమకుఁ బ్రత్యక్షనామ మగు విష్ణుదాసాచార్యనామముచేఁ గోర్టులో నిలిచియున్నట్లు వ్రాయుట స్పష్టమే యగుచున్నది. దానినిబట్టికూడ నొకింత వీరి మతస్వరూ

పము సువ్యక్త మగుచున్నది. ప్రకృతమున విష్ణుదాసాచార్య శబ్దార్థము నొకింత విచారింతము.

విష్ణుదాసాచార్యశబ్దము సమస్తపదము. ఇందు విష్ణు, దాస, ఆచార్య శబ్దములు మూఁడు చేరియున్నవి. ఈ మూఁడుశబ్దములయొక్క యన్యోన్యసంబంధము ననుసరించి యీ సమస్తపదముయొక్క యర్థమును నిరూపింపవలయును. ఇచ్చట విష్ణువుయొక్క దాసుఁడు = విష్ణుదాసుఁడు, విష్ణువనెడి దాసుఁడు = విష్ణుదాసుఁడు, విష్ణువు దాసుఁడుగాఁ గలవాఁడు = విష్ణుదాసుఁడు అని మూఁడువిధములగు నర్థములు లభించును. ఈ మూఁడువిధములగు నర్థములందును గర్మధారయ బహువ్రీహ్యర్థములను వదలి షష్ఠీతత్పురుషార్థము అనఁగా విష్ణువుయొక్క దాసుఁడు = విష్ణుదాసుఁ డనునది తీర్థులవారికిఁ బరమ తాత్పర్యమై యుండును గావున నద్దానిని మేము విచారింతుము.

ఇంక విష్ణుదాస శబ్దమునకు నాచార్య శబ్దమునకును సంబంధమును విచారింతము. ఇచటఁగూడ మూఁడు విధము లగు సమాసము సంభవించును. ఎట్లన-విష్ణుదాసుల కాచార్యుఁ డని తత్పురుష సమాసమును, విష్ణుదాసుఁ డనెడి యాచార్యుఁ డని కర్మధారయమును, విష్ణుదాసుఁ డాచార్యుఁడుగాఁగలవాఁడని బహువ్రీహియును. తీర్థులవారియందన్ననో యీ మూఁడువిధము లగు వ్యుత్పత్తిగూడ నిరాక్షేపముగఁ బట్టుట కవకాశము గలదు. ఏలయన - ఆచార్యశబ్దమునకు నాచరించి ప్రవర్తింపఁజేయువాఁ డనియర్థము. ఏలయనఁ, దా నాచరింపనిది యొరు

లకుఁ జెప్పిన నోరు లెంతమాత్రము విశ్వసింపనేరరుగదా! కావున నాచరణమునందు నిపుణుఁడే యాచార్యుఁడుగ నలరారుచుండును. కావున విష్ణుదాసాచార్యుఁ డన విష్ణుదాసులలో నగ్రణి యనియర్థము. అనఁగా దాసశ్రేష్ఠుఁడని ఫలితార్థము. ఇట్టి విష్ణుదాసశబ్దముచేఁ దీర్థులవారి కభిమతమగు మతమును సుకరముగ గ్రహింపవచ్చును. అట్టిమత మే మన?

విష్ణువునకుఁ బరిచర్యసలుపువాఁడు గావున విష్ణుదాసని. విష్ణువునకుఁ బరిచర్య చేయుటచేతనే కాలమును వెళ్లించుట పరమపురుషార్థమగు ముక్తియని వీరి యభిప్రాయముగాఁ దెలియవచ్చుచున్నది. ఇట్టిపరిచర్యచే విష్ణువుయొక్క యనుగ్రహామునకుఁ బాత్రులై విష్ణువుచేఁ బొందింపఁబడుయథోచితసుఖముల ననుభవించుటయే పరమపురుషార్థ మనికూడ వీరియాశయము. ఏలయన-సేవింపఁబడువానివలన లభించెడిసేవాఫలము సేవయొక్క తారతమ్యమునుబట్టి యుండునుగాని నిరతిశయ మెన్నటికిని గానేఱదు. మతములకు సాధారణముగా నామత స్థులచేఁ దలంపఁబడు ముక్తిసాధనమే మతనామముగాఁ బరఁగుచుండును. ప్రకృతమున విష్ణుసేవనుముక్తిసాధనముగాఁ దలంచువారలమతనామము విష్ణుసేవయే యనుటకుఁ దగును. అట్లు సుకరముగఁ జెప్పినచో నెల్లరకును, అనఁగా మతస్థులకును మతాంతరులకునుగూడ సంశయములచే నెట్టి చీకాకును గలుగకుండ నుండును. వివాదములకుఁగూడ నవకాశ ముండదు. ఇట్టి నిస్సందేహమగు మార్గమును విడిచి నిరర్థకము లగు వైదిక వైష్ణవము, ఆస్తికవైదికము, వైదికము, ద్వైతము అను పేరులతో

శాఖాచంక్రమణమును జేయుట యొకింత లోకవంచనగాని ఋజుప్రవర్తన మెంతమాత్రమును గాదు.

ఏది యెట్లులైనను సత్యము బయటఁబడెను. విష్ణుసేవ యనెడి దాస్యము ముక్తిసాధన మని తీర్థులవారి సంప్రదాయాభిప్రాయముగదా? ఇయ్యది వాస్తవమగు ముక్తి యగునా యని యొకింత విచారింతము.

## ము క్తి య న నే మి ?

"ముచ్లృ = మోక్షణే" యను ధాతువుకంటె భావార్థమున 'క్తిన్' ప్రత్యయమును జేసినచోఁగదా 'ముక్తి' యను రూపము సిద్ధమగును. అట్టి ముక్తిశబ్దమునకు మోక్ష మనియు, అనఁగా 'విడుట' అని యర్థము. దేనినుండి విడుట యనఁగా బంధమునుండి విడుట యని యర్థము. కావున ముక్తిని బరమ పురుషార్థముగాఁ దలంచువారలు బంధమన నెద్దియో యద్దానిని నిర్వచించి యట్టి బంధము తొలఁగుటకుఁ దగు మార్గమును సశాస్త్రీయముగను సయుక్తికముగను నిర్వచింపవలయును. అట్లు నిర్వచింపనిచో నా మతమునకు గౌరవ మెంతమాత్రము గలుగనేరదు. ఇది యట్లుంచి ముక్తి యనునది యొకటి పురుషార్థ మగునా యనునది యొకింత విచారింతము.

## పు రు ష స్వ భా వ ము.

లోకములోఁ బ్రతిమానవునకును దుఃఖమునుండి తప్పించుకొనవలయును, సుఖమును సంపాదింపవలయు నను ప్రవృత్తి సహజసిద్ధ మగుచున్నది. ఇట్టిప్రవృత్తియందుఁగల యాశను విచారించినచోఁ బ్రతిమనుజుఁడును దుఃఖము నించుకేనియుఁ

బొందకుండఁ దరుగకుండ నుండు సుఖమును సంపాదింపవలయు
నని కోరుటగూడ సహజమే యని తెలియవచ్చుచున్నది. లోక
మున సుఖదుఃఖములన నింద్రియములచే విషయములకు సంబం
ధము గలుగ ననుభూయమానము లయ్యెడి యనుకూల ప్రతి
కూలవేదనము లని యెల్లరకును దెలిసినవిషయమే. ఇంద్రియ
స్పర్శము లొకప్పుడు సుఖములుగా గోచరించినను వేఱొకప్పు
డయ్యవి దుఃఖమిశ్రితము లగునవిగాని లేక పరిణామమునందు
దుఃఖమును గలుగఁజేయునవి గాని యగుచునేయున్నవి. కాని
నిరతిశయమగు సుఖమును గలుగజేయున వెంతమాత్రము
గానేఱవు. కాని పురుషునియొక్క యీప్సయన్నో నిరతిశయ
సుఖమును గూర్చి యభివృద్ధిఁ జెందుచునే యుండును.
లోకములోఁ బ్రభువును సేవించు సేవకుఁడు తనయొక్క
జీవికను సంపాదించు కొనుటకు స్వాతంత్ర్యము లేక
పోవుటచేఁ బ్రభువుయొక్క యనుగ్రహమును సంపాదించు
కొనుటకు సేవకుఁ జొచ్చుచుండుట సహజమే యైయు
న్నది. స్వతంత్రజీవనము గలవాఁడు సేవకు నెంతమాత్రమును
బాల్పడఁడు గదా! కొందఱు, సేవచేతఁ దక్క వేఱొక
విధమునఁ దమయొక్క జీవికను సంపాదించుకొనఁజాలనివారు
సేవచే జీవించుటయే యతిశయ మని యెంచినంతనే స్వతం
త్రముగ జీవించువారు జీవిక లేక చెడుచున్నా రని యనుట
యుచితమును యుక్తిసహమును గానేఱదు. ఇంతియకాదు,
సేవచే జీవించువారలు గూడ నెద్దియేని యొక యతిశయవశ
మున నీసేవ తప్పి స్వతంత్రజీవనము గలుగునా యని కోరు

టయు నద్దాని సంపాదింప యత్నించుటయు సహజసిద్ధమే. కాని సేవయే పరమపురుషార్థ మని యెల్లరును జన్మప్రభృతి మరణపర్యంతమును సేవయందు మగ్ను లగుటకు నెంతమాత్రము నిచ్ఛయింపరు. ప్రభువును సేవించువార లందఱకు నొకే విధ మగు సేవాఫలము లభించుట యసంగతము. సేవాఫలము లందు న్యూనాతిరేకములు దెలియవచ్చుటం జేసి యతిశయ ఫలమును బొందినవారలఁ జూచి న్యూనములగు ఫలములను జెందినవారలు దాపమును జెందుటయు నవ్వాని గోరకుఁ జింతించుటయుఁ గూడ సహజమే. ఉత్తమఫలములు దృష్ట ములు కాఁగా నల్పఫలములతోఁ దృప్తిఁ జెంది యతిశయంబున నున్నార మని యనుకొనుట గూడ నశక్తవిషయముగాని శక్తవిషయ మెంతమాత్రము గాదు. విషయేంద్రియ సం యోగముచే నలవడు సామయికసుఖములనే సుఖము లని తలంచుచు నయ్యవి పరాధీనము లగుటంజేసి యవ్వానిని సంపా దింప, సేవ దక్క వేఱొకమార్గము లేదను శ్వవృత్తితోఁ బ్రభు వును సేవించుట బంధరహితమగు ముక్తి యెట్లగునో యాసేవ కులే గుర్తెఱుఁగవలయునుగాని ప్రాజ్ఞు లెల్లరును శ్వవృత్తిరూప మగు దాస్యమును ముక్తియని తలంపరు. "తెడ్డు ఏసంద్రకుఁ బోయినను గానియే" యనునట్లు, ఏలోకమునకుఁ బోయినను దాస్యము దాస్యమే గదా! అయ్యది బంధరహితమగు ముక్తి యెంతమాత్రమును గాదు.

శ్రీసదనము, గుంటూరు,
25—12—34.

ఇతి,
నారాయణ స్మృతిః

శ్రీః

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహమ్,
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే.

కామేశ్వరీం పరా మీడే కాదిహాదిస్వరూపిణీం,
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్.

# బ్రహ్మయొక్క దాసవేషమునకుఁ గారణమెద్ది?

పంచరాత్రతంత్రమున బృహత్సంహితయం దుపక్రమ మున నిట్లుదాహరింపఁబడియున్నది:

"ఏకదా మందరద్రోణ్యా మాసీనః కమలాసనః,
ధ్యాయమావర్త్య యన్మానీ వైష్ణవం రూపముద్వహాన్.
దిదృక్షవో మహాభాగా మునయో నారదాదయః,
ఆగతాః పరయా భక్త్యా గాయంతో యజ్ఞపూరుషమ్. అని.

ఒకానొక సమయమున బ్రహ్మ విష్ణుసంబంధమగు రూపమును ధరించి మానభావముతో ద్వయమంత్రమును జపించుచు మందరపర్వత గుహాయం దుండె ననియు నాతని

జూచుటకు నారదాదిమునులచటకుఁ బోయి యాతనితో 'నీవు సకలలోకములకును గర్తవు. ఏమి జపించుచు నిట నున్నాఁడవు? ఈ వేషము నీచే నెందులకు ధరింపఁబడెను? ఈమౌన మెందుల కాశ్రయింపఁబడె' నని,

"త్వం కర్తా సర్వలోకానాం కిం జపన్నిహ తిష్ఠసి,
కిమిదం ధార్యతే వేషం కిమిదం మౌన మాశ్రితమ్."

అని యిట్లు ప్రశ్నించిరి. అందులకు నాతఁడు సమాధానమును,

"దాసవేషశ్చ సంస్కారో ముఖ్యః సిద్ధాన్తవర్త్మని,
అపేక్షితో ముముక్షూణా మనుసంధానసిద్ధయే. (1-1-26)

అనుసంధానసిద్ధ్యర్థం దాసవేషో మయా ధృతః,
వ్యాసరాద్ధాన్తసారేఽపి మన్యే క్షణ మివాయుషమ్. (1-1-28)

సంస్కృతోఽహం సముత్పన్న విష్ణునా ప్రభవిష్ణునా,
అధీతవేదోఽపి తదా మంత్రరాజార్థసిద్ధయే. (1-29.)

అని చెప్పెను. అనఁగా ముముక్షువులకు ననుసంధానసిద్ధికొఱకు దాసవేషమును, సంస్కారమును ముఖ్యమనియు నట్టి యనుసంధానసిద్ధికొఱకుఁ దనచే దాసవేషము ధరింపఁబడెననియుఁ దాను సకలవేదములను జదివినప్పటికి మంత్రరాజముయొక్క యర్థసిద్ధికొఱకు విష్ణువుచేఁ దాను సంస్కృతుఁడయ్యెననియుఁ జెప్పెను. ఇచటఁ దాను విష్ణువువలనఁ బడసిన

సంస్కార మన తప్తశంఖ చక్రాద్యంకన మనియు, వేష మన ద్వాదశోర్ధ్వపుండ్రములనియు నభిప్రాయము. ఇట బ్రహ్మచే నీవేషమును, సంస్కారమును బడయుటకుఁ గల కారణ మెట్లు నిర్వచింపఁబడినను సంస్కారమును, వేషమునుమాత్రము విష్ణువు వలనఁబడసినట్లు నిశ్చయమే. ఈవేషము నీసంస్కారము మహాను భావులగు నారదాదిమునులకు నపూర్వముగఁ దెలియవచ్చి నట్లు కథాసందర్భమువలన సుస్పష్టమే యగుచున్నది. దీనిని బట్టి యిదివఱకు లోకములో నెవ్వరును ధరింపనట్టి వేషమును బొందనట్టి సంస్కారమును బ్రహ్మ కొత్తగాఁ బొందినట్టు స్పష్టముగదా! మహనీయుల కెల్లరకు నపూర్వమగు సంస్కార వేషంబులను విష్ణువు బ్రహ్మ కెందులకు నిచ్చెనను విషయము నొకింత యోజింపవలయును. అయ్యది యీ గ్రంథమునఁ దెలియఁబడకపోయినను గ్రంథాన్తరములనుండి తెలిసికొనుటకు సావకాశము గలదు. అద్దాని నొకింత సంక్షేపముగా నిరూపించుచున్నారము.

బ్రహ్మ పార్వతీవివాహమును జేయించెడి సమయ మున నామెయొక్క ప్రతిబింబమును జూచి యామెసౌందర్య మునకు వ్యామోహమును జెంది వికృతమనస్కుఁడై రేతఃస్ఖలన మును గావించుకొనియెనట! అట్టి దుర్వృత్తి నీశ్వరుఁడు దెలిసికొని కోపావేశమున బరవశుఁడై తన త్రిశూలముచే బ్రహ్మయొక్క శిరమును ద్రుంచివేసెను. పిమ్మట నాబ్రహ్మ తన శిరశ్ఛేదమునకు వగచుచుఁ దన మానసిక వ్యభిచారము నకుఁ దగు ప్రాయశ్చిత్తమును జేసికొనుట యుచితమని యెంచి

విష్ణువుకడకుఁ బోయి యాతనిఁ దనకుఁ దగుప్రాయశ్చిత్తమును జేయింపవలయునని వేఁడఁగా విష్ణువు బ్రహ్మకు నుచితమగు ప్రాయశ్చిత్తమును జరిపించి తదంగముగ నీ తప్తచక్రాంకణాది సంస్కారములఁ గావించి యపూర్వమగు దాసవేషమును వేయించి పంపించెను. ఇంతియ కాదు, శిరశ్ఛేదముచేతను దనయొక్క మానసికవ్యభిచారముచేతను బ్రహ్మ వైదికమునుండి ప్రచ్యుతుని జెంద నాతఁడు తీర్ణుఁడగుటకు ద్వయమంత్రమును దానే జపించున ట్లూహింపనొప్పను. కాని యిట్టి దురవస్థతో లోకమున మెలంగుటకు సిగ్గుఁజెంది యేకాంతమున మందరపర్వతముయొక్క గుహాయందు మౌనిభావమును దాల్చి దాగియుండెను. గుట్టులను గిట్టుచేయుటయే నారదుని స్వభావము గావున నారదుఁడు బ్రహ్మయొక్క గుట్టులు బయటఁబెట్ట మునులతోఁ గూడ బ్రహ్మను భక్తితో సందర్శించువానివలె ద్రోణగిరికరిగి యెద్దియో యపూర్వమును జూచినట్లు బ్రహ్మను బ్రశ్నించెను. బ్రహ్మయన్ననో యున్నదున్నట్లు చెప్పుకొనుటకు సిగ్గుపడి యద్దాని కొక యపూర్వమార్గమును ద్రొక్కి బృహద్బ్రహ్మసంహితయను గ్రంథాడంబరము నొకదానిని గావించెను. బ్రహ్మచేఁ దనయవజ్ఞత మఱుఁగుపరచుకొనుటకుఁగా నీపంచరాత్రతంత్రము బరగుటంజేసి యియ్యది వేదబాహ్య మగుచున్నది.

బ్రహ్మ మహనీయుఁడే. ఆతఁ డబద్ధమును బలుకునా ? తనయొక్క దుఃస్థితిని దాఁచుకొన గ్రంథాడంబరమును గావించునా ? అన దుఃస్థితిని దాఁచుకొనుటకు నబద్ధమాడుట

బ్రహ్మకు నొకక్రొత్త గాదు. శివునియొక్క శిరోభాగము నన్వేషింపఁబోయి యన్వేషింపలేక యటనుండి జారుచుండెడి యొక కేతకీకుసుమమును దల పెట్టుకొని వచ్చి తాను శివుని యొక్క శిరోభాగమును జూచితి నని యబద్ధమాడుటయే గాక యా కేతకీకుసుమముచేఁ గూడ నసత్యమును బలికించినట్లు పురాణమువలనఁ బ్రసిద్ధముగఁ దెలియుచునే యున్నది. దానంజేసి తన నేరమును, ప్రాయశ్చిత్తమును మఱుఁగుపడు టకుఁగాను గ్రంథాడంబరమును జేసె నన వింతయేమి? ఎంత మాత్రమును వింతలేదు. దానం జేసియే బ్రహ్మవాదు లెల్లరు నీ తంత్రమును వేదబాహ్యముగా నిరసించియున్నారు. వాస్త వముచే నీ దాసవేషమే వైదికమై పవిత్ర మగుచో మన్వాది మహనీయులు ధర్మస్మృతులలో నొకింతయైనఁ బ్రశంసింపరా? మన్వాదిమహనీయు లీ తంత్రమునుగాని యిందలి వేషమును గాని సంస్కారమునుగాని పవిత్ర మని తలంపలేదు గావుననే యీ విశేషములను వారు సర్వవిధముల నుపేక్షించిరి. కావున నీదాసవేషము, సంస్కారము నొకప్పుడు ప్రాయశ్చిత్తార్హుల విషయ మగుచోఁ గానొప్పునుగాని పవిత్రజన్మల కింకతో నెంతమాత్రము పనిలేదు.

శ్రీసదనము,
గుంటూరు,
26—12—34.

ఇతి,

నారాయణస్మృతిః.

శ్రీః

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్,
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహమ్ ,
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే.

కామేశ్వరీం పరా మీడే కాదిహాదిస్వరూపిణీమ్ ,
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్.

# మ ధ్వ మ త మ న నే మి ?

ఉత్తరాదిమతస్థులగు శ్రీసత్యధ్యాన తీర్థులవారు తమ మతమునుగూర్చి పలువిధములగు నామములఁ బేర్కొనుచుఁ బలువిధములగు విప్రతిపత్తుల కవకాశమును గలుగఁజేసి యున్నారు. అవ్వాని నొకింత విమర్శించి యవి యన్నియు ననర్థకములగు నామములేకాని యిసుమంతయుఁ బ్రయోజనము నవి సమకూర్పవని యధిక్షేపింపఁ జిట్టచివరకు వారు "శ్రీమధ్వాచార్యులవారి గ్రంథముల ననుసరించి విష్ణు దాసాచార్యులు చెప్పిన ద్వైతమే" యని యొకవ్రాఁతను వ్రాయించిరి. దీనిని బట్టి విష్ణుదాసాచార్యులు చెప్పిన ద్వైతము తమమతమనియు నయ్యది మధ్వాచార్యులవారిగ్రంథము ననుసరించి యున్నదనియుఁ దీర్థులవారిపరమతాత్పర్యమనిసుస్పష్టముగదా? ఇదివఱకు

ద్వైతమనుపేర నెట్టిమతమును బ్రత్యేకముగాఁ బిలుచుట కవకాశములేదని "ద్వైతము మతమా?" అను ప్రకరణమునఁ బుష్కలముగ నిరూపింపఁబడి యున్నది. ఒకానొకవేళ విష్ణుదాసాచార్యులు చెప్పిన మతము నిప్పుడు తీర్థులవారు ద్వైతమని చెప్పినఁ జెప్పనొప్పు. కాని మధ్వాచార్యులవారియొక్క మతమునకు ద్వైత మను నామము సార్థకముగ మధ్వ సంప్రదాయమున నెచటనైన నుపయోగింపఁబడెనా యని విచారింప నట్లు తెలియవచ్చుటలేదు. కాని లోకమున నీమధ్వ సంప్రదాయమువారు వైదికసంప్రదాయమునకుఁ జెందిన బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యములవారు నద్వైతులని పిలుచుచు వారల నెద్దియో యొకతీరునఁ దూలనాడుచుండుటంజేసి తాము ద్వైతుల మనియుఁ దమమతము ద్వైత మనియు నొక వ్యవహారమును గ్రమక్రమముగఁ బ్రచారమును జేసికొనిరి. ఏలయన, వీరు బయలువెడలిన క్రీ. శ. 12 శతాబ్దమునుండియు "మధ్వ"లను ప్రత్యేకనామముచే నేటివఱకు వ్యవహరింపఁబడుట సువిదితమే. వీరు వైదికులలో నగ్రగణ్యులగు బ్రాహ్మణు లుపనామముగా వాడుకొను "బ్రహ్మశ్రీ" అను పదమునకు మాఱుగ "మధ్వశ్రీ" అను శబ్ద ముపనామముగా వాడుకొనుట సువిదితమే కదా! దీనిఁబట్టి యద్వైత మను శబ్దముయొక్క యర్థమునకు నత్యంతవిలక్షణమగు నర్థమును స్ఫురింపఁజేయు ద్వైతశబ్దము నెంత ప్రీతితోఁ జేకొనిరో యటులనే బ్రహ్మశ్రీ యను శబ్దముయొక్క విరుద్ధమగు స్ఫురింపఁజేయు మధ్వ శబ్దమును బవిత్రముగా గ్రహించినట్లు నిశ్చయించి తీరవల

యును. కావున సామాన్యముగ మధ్వ యన బ్రహ్మకంటె విలక్షణుఁ డని యభిప్రాయము.

ఇది యటులుండ వీరియొక్క మత మిదివఱకు మధ్వమత మని వ్యాప్తమగు వ్యవహారమును గనుచున్నట్లు పుష్కల ప్రమాణములు గలవు. వ్యాసతీర్థుల న్యాయామృతము నందలి మొదటి శ్లోక మిట్లు నడఁగుచున్నది—

“శ్రీమధ్వశాస్త్రదుగ్ధాబ్ధిమందరమహీభృతా,
అసౌ ద్ధ్రియతే న్యాయామృతం విబుధతృప్తయే.”

అని. ఇందు మధ్వశాస్త్రముయొక్క సారము దనచేఁ జెప్పఁబడుచున్నదని చెప్పుటచే మధ్వశాస్త్రమును బ్రమాణముగాఁ జేసికొని తన గ్రంథమును జేసియున్నాఁడని సుస్పష్టముగదా! ఇఁక వాదిరాజమునినాథుఁడు దనయొక్క యుక్తిమల్లికయందలి యుపరిమిది తొమ్మిదిశ్లోకములలో —

“పూర్వః పూర్వః పూర్వపక్షో యావన్మధ్వమతోదయః,
“అస్తి సిద్ధస్తు సిద్ధాన్తో మధ్వ స్యాగమ ఏవ హి.”

అని చెప్పియున్నాఁడు. ఇందు మధ్వమతమనియు మధ్వయొక్క యాగమమనియు రెండు పేర్లను వాడి యయ్యది తనకుఁ బ్రమాణమని నిర్వచించియున్నాఁడు.

ఇఁక యుక్తిమల్లికా వ్యాఖ్యాత యగు సురోత్తమ తీర్థుఁడు తన భావవిలాసినియందుఁ బైశ్లోకములకు వ్యాఖ్యా

నముల రచించుటలో "మధ్వస్యాగమ ఏవ సిద్ధాన్తః" అనియు "అస్మాన్మధ్వాగమాత్" అనియును నిర్వచించియున్నాఁడు. దీనిఁబట్టి ప్రకృతఁపు సత్యధ్యాన తీర్థులవారిమఠ మిప్పుడు మధ్వమతమనియు మధ్వాగమమనియు మధ్వశాస్త్రమనియు సుస్పష్టముగా వ్యవహరింపఁబడుచుండఁ బ్రకృతమున నీతీర్థుల వారు తమమతమున కప్పుడు వైదికవైష్ణవ మనియు, మఱి యొకప్పు డాస్తికవైదిక మనియు వేఱొకప్పుడు వైదికమనియు నింకొకప్పుడు ద్వైతమనియు నిట్లు పలువిధములగు మార్గముల శాఖాచంక్రమణమును జేయుటకుఁ గల కారణ మేమియో యొకింత యూహింపవలయును.

ఇది యటులుండ నీ సంప్రదాయప్రవర్తకునకు, 'మధ్వ' యనియు, పూర్ణప్రజ్ఞుఁడనియు, ఆనందతీర్థుఁ డనియు, మూఁడు నామములచే వ్యవహార మున్నట్లు తెలియవచ్చుచున్నది. కాని సంప్రదాయస్థులచే మధ్వశబ్దముమాత్రమే సర్వవిధములఁ బవిత్రముగ నెన్నఁబడుచున్నట్లు సుప్రసిద్ధము. మిగిలిన రెండునామములకును లోకమునందు వ్యవహార మత్యల్పము. అల్పమే గాదు, శూన్యమే యనికూడఁ జెప్పవీలగును. దానంజేసి మధ్వశబ్దమందుఁ బ్రవర్తకునికిని బ్రవర్త్యులకును బరమప్రీతి యున్నట్లు సువ్యక్తమే. కావున నద్దానియొక్క యభిప్రాయము నొకింత విచారింతము.

మధ్వశబ్దముయొక్క వ్యుత్పత్తినివిచారించినబ్రకృతము సువ్యక్తమగును. ఎట్లన—

ఇఁక మధ్వశబ్దముయొక్క వ్యుత్పత్తి యొకింత నైపుణ్యముతో—

శ్లో. మధ్వి త్యానంద ఉద్దిష్టో వేతి తీర్థ ముదాహృతం,
మధ్వ ఆనందతీర్థః స్యాత్తృతీయా మారుతీతనుః.

అని నిర్వచింపఁబడి యున్నది. దీనిఁబట్టి మధ్వశబ్దము 'మధువ' అను శబ్దములయొక్క సమాహార మని వివరింపఁబడుచున్నది. మధుశబ్దము బ్రహ్మద్వేషియగు రక్కసునియందు రూఢియని మధుసూదన, మధురిపు శబ్దార్థకోవిదు లెల్లరకును దెలిసియే యున్నది. ఇంతియకాదు. మార్కండేయపురాణమునందలి—

మధుకైటభౌ దురాత్మానా వతివీర్యపరాక్రమా,
క్రోధరక్తేక్షణా వత్తుం బ్రహ్మాణం జనితోద్యమా.

అను శ్లోకముచే మధుశబ్దవాచ్యుఁడగు రక్కసుఁడు బ్రహ్మను మ్రింగుటకుఁ బ్రయత్నించెనని స్మరింపఁబడియే యున్నది.

ఇది యట్లుండ క్రీ. శ. ఏడవ శతాబ్దమున గోబ్రాహ్మణద్వేషి యగు నొకఁడు చెలరేఁగి మధునామముతోఁ దృప్తిఁజెందక మహామధునామమును ధరించి యొకమతమును లేవఁదీసి ప్రవర్తింపఁజేసి యున్నట్లు భవిష్యత్పురాణము స్మరించుచున్నది. ప్రకృతఁపు బురుషుఁ డన్ననో వారితలంపుతో సజాతీయమగు తలంపుతో బయలువెడలి తన్నామమునే యొకింత నైపుణ్యముతోఁ బెట్టుకొని వ్యవహరించినట్లు సర్వవిధముల నిశ్చయింపనగును. దానంజేసియే యీ మధ్వమత

మనుదానికి నొక స్వరూప మించుకేనియు లేకుండ నెద్దియో యొకతీరున వైదికమతమును, బ్రాహ్మణులను దూలనాడుటయే మతస్వరూపముగాఁ గల్గినట్లు తెలియవచ్చుచున్నది. మధ్వునిచే రచింపఁబడిన పదిప్రకరణములు నొకింత జాగరూకతతోఁ దిల కించిన మధ్వునికి స్వతంత్రమత మెద్దియు లేదనియుఁ బరమ పవిత్రమగు వైదికమతమును మాయావాదమను నామముచేఁ దూలనాడుటయే ప్రధానముగాఁ గల్గియున్నట్లు తెలియవచ్చె డిని. ఇంతియకాదు, మధ్వసంప్రదాయమునకుఁ జెందినవారలు రచించిన గ్రంథములయొక్క శైలి యంతయుఁ బవిత్రములగు వైదిక సంప్రదాయ గ్రంథములను దూలనాడుటయందే విని యోగింపఁబడుచున్నట్లు సువ్యక్తమయ్యెడిని.

ఇట్లు పరిపరివిధముల యోజించిన మధుశబ్దముచే గౌరవమును బడయఁదలఁచిన బ్రహ్మద్వేషులలో మూఁడవ వాఁడుగా దెలియవచ్చుచున్నాఁడు. అందు మొదటివాఁడు పరమప్రాచీనుఁడగు మధువను రక్కసుఁడు. మిలిగిన యిద్ద ఱును నీకలియుగమునందు మనకు సన్నిహితకాలమునందలి మహామధువు, మధువు (మధ్వ) అని యిచట నుదాహరింపఁ బడిన—

శ్లో. "మహామధుశ్చ మధ్వశ్చ ద్వావేతౌ కలిదుర్మదౌ,
బ్రాహ్మణాన్ ద్వేష్టి మధ్వశ్చ గోబ్రాహ్మణాన్మహామధుః.

అను నభియుక్తోక్తివలన సువ్యక్తమగుచున్నది.

ఇట్లే మధ్వశబ్దము బ్రహ్మద్వేషి యనునర్థమును మధ్వమత మన బ్రహ్మద్వేషియగు మతమనియుఁ దెలియవచ్చుచున్నది. బ్రహ్మద్వేషమను శబ్దమునందే బ్రహ్మశబ్దమునకెన్ని యర్థములు గ్రహింపఁబడుచున్నవో యన్నిఁటినిగూడ ద్వేషించు మతమని సుస్పష్టము. బ్రహ్మశబ్దమన్ననో 'జాతిజీవకమలాసన వేదలోకేషు బ్రహ్మశబ్దః ప్రయుజ్యతే' అను నిఘంటువాక్యమువలన నైదర్థములయందు వ్యవహారమును గనుచున్నది. బ్రహ్మద్వేషమన నీయైదింటిని ద్వేషించుటయనిపూర్వమునఁ జెప్పఁబడియేయున్నది.

మధ్వలు బ్రాహ్మణులను ద్వేషించుట సర్వలోకానుభవసిద్ధము. ఇఁక జీవునికి వేదములు బ్రహ్మత్వము బోధించుచుండ నద్దానికి నసూయఁజెంది జీవునికి బ్రహ్మత్వమలవడదని తూలనాడుట జీవద్వేషము. బ్రహ్మ సకలవైదిక సంప్రదాయములకు మూలపూరుషుఁడై యుండ నద్దానిని దోసిపుచ్చి మధ్వసంప్రదాయ మనుటయు మధ్వాగమ మనుటయు బ్రహ్మ యనెడి దేవతయందలి ద్వేషము. వేదములన్నియు బ్రహ్మతత్త్వములను బోధించుచుండ విష్ణుతత్త్వములను బోధించుచున్న వనుటచేతను,

వేదా దపి పరం చ క్రే పంచమం వేద ముత్తమం,
భారతం పంచరాత్రం చ మూలరామాయణం తథా॥

అని కంఠోక్తిగ మధ్వునిచేఁ బలుకఁబడుటవలన వేదద్వేషము సువ్యక్త మగుచున్నది. ఎట్లన, భారతమును

బంచరాత్రమును, మూలరామాయణమును, వేదాదపి వేదము కంటెఁగూడ, పరం = శ్రేష్ఠమని, చెప్పుటచే వేదప్రామాణ్య మత్యంతము నిరసింపఁబడుచున్నట్లు సువ్యక్తమగుచున్నది.

ఇఁక వేదమందు లోకములలో బ్రహ్మలోక ముత్తమ మనియు, నయ్యది క్రముముక్తికి మార్గ మనియును వ్యక్తముగ బోధింపఁబడుచుండ నద్దానిఁ ద్రోసిపుచ్చి విష్ణులోకము సర్వో త్తమ మని నిర్వచించుటచే లోకద్వేషము సువ్యక్తమగు చున్నది. ఇంతియకాదు. సత్పథమున నుండెడి బ్రహ్మ వాదులగు బ్రాహ్మణు లెయ్యది ప్రమాణమనిన నయ్యది గాదనుటయే పరమతాత్పర్యముగాఁ గల్గిన మధ్వమతమునకు బ్రహ్మద్వేషమని యర్థమును గ్రహించిన మధ్వమతశబ్దా ర్థమును సువ్యక్త మయ్యెడిని.

శ్రీసదనము,
23-12-34.

ఇతి,
నారాయణస్మృతిః.

శ్లో.

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహమ్,
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే.

కామేశ్వరీం పరా మీడే కాదిహాదిస్వరూపిణీమ్,
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్.

# మ ధ్వ మ త మ నా ది యా ?

ఉత్తరాదిమతస్థులగు సత్యధ్యానతీర్థులు విష్ణుదాస పాత్రిముఖమున సంయమనీపురం హైకోర్టులో దాఖలుచేసి కొనిన ప్లయింటునందు నాలవ విషయము "ఈ వైదికమత మనాదికాలమునుండి వచ్చుచున్నది" అని చెప్పినాఁడు. పిమ్మట 14-12-1934 తేదీగల బహిరంగ ప్రత్యుత్తరములో విష్ణుదాసాచార్యులు చెప్పినమతము ద్వైత మనియు నయ్యది మధ్వాచార్యులవారి గ్రంథముల ననుసరించి చెప్పఁబడిన దనియు వ్రాయించెను. కావునఁ దీర్థులచే ప్లయింటునం దుదాహరింపఁబడిన మతము మధ్వమత మనియు, నయ్యది యనాది కాలమునుండి వచ్చుచున్న దనియుఁ దీర్థులవాదమే యైనట్లు

సుస్పష్టమేగదా ! ఇయ్యది కువాదమును, సత్యేతరమును. ఏల యన— ఈమతమునకు మధ్వమతమని కదా సుప్రసిద్ధ వ్యవహారము. మధ్వమతమున మధ్వునియొక్క మతము. మధ్వుని మతము మధ్వునితో బయలువెడలును గాని యనాది యెట్లగును ? మధ్వయన్ననో క్రీ. శ. 13వ శతాబ్దమున నున్నట్లు లెక్కింపఁబడుటం జేసి యాకాలమునుండి యీ మధ్వమతమునకుఁ బ్రచారము గల్గుటచే నీ మధ్వమతము కేవల మాధునికమే గాని సాంఖ్యాదిమతములట్లు ప్రాచీనమును గూడఁ గాదు. ఇయ్యది యాధునిక మనియుఁ బ్రాచీన మెంత మాత్రము గాదనియు మధ్వపరంపరలోఁ జేరిన వాదిరాజు అనుసతనియొక్క వచనములవలననే సుస్పష్ట మగుచున్నది. వాదిరాజను నాతఁడు మధ్వమతాభినివేశముచే "యుక్తిమల్లిక"యను గ్రంథాడంబరమునఁ దాను స్వమతమును దృజించి యప్పటికిఁ గ్రొత్తది యగు మధ్వమతమును జేకొనుటకుఁగల కారణము నిట్లు నిర్వచించియున్నాఁడు—

"బౌద్ధజైనాగమాః పూర్వపక్షాః సర్వాగమస్య హి,
తతఃపరస్తా జ్జాతేషు మతేషు చ యథాక్రమమ్.

పూర్వః పూర్వః పూర్వపక్షో యావన్మధ్వమతోదయః,
అన్తే సిద్ధస్తు సిద్ధాన్తో మధ్వస్యాగమ ఏవ హి.

నిర్ణేతుం శక్యతే యుక్తాయుక్తపక్షవిమర్శిభిః,
అస్మా దుత్తరపక్షోఽన్యో యస్మాన్నాద్యాపి దృశ్యతే.

తస్మా త్సఏవ సిద్ధాన్త ఇతి నిశ్చిత్య చేతసా,
అవలంబ్య మతం సర్వమతోన్నతం శ్రీతిపురస్కృతమ్.

మయేత్థం యుక్తిరుచినా క్రియతే యుక్తిమల్లికా." అని.
ఈశ్లోకములఁబట్టి వాదిరాజక్కాలమునఁ గ్రొత్తగా జయలు వెడలి మధ్వమతమును స్వీకరించి యద్దాని బోధించుకొనఁ నీయుక్తిమల్లికను రచించినట్లు గుణసౌరభమను ఖండమున ఈ 8, 9, 10, 11, శ్లోకములచే నిర్వచించుచున్నాఁడు. తానవలంబించిన మతముయొక్క యతిశయము నిట్లాగుణసౌరభమునందే, 735, 736, 737, 738 శ్లోకములచే నిరూపించినాఁడు. ఆశ్లోకము లెవ్వియన—

"ఏష నిష్కంటకః పంథా యత్ర సంపూజ్యతే హరిః,
కుపథం తం విజానీయా ద్గోవిందరహితాగమమ్.
ఇతి భారతవాక్యం హి గోవిందరహితాగమమ్,
కుపథం వక్త్యతోఽప్యాసీ న్నిర్మూలం నిర్గుణం తవ.
అవైష్ణవపురాణానా మవైష్ణవమతస్య చ,
అవైష్ణవశ్రుతీనాం చ కుపథత్వ మభూదహో.
హరే ర్భిన్నత్వపూజ్యత్వస్వామిత్వప్రతిపాదికా,
నిష్కంటకా మాధ్వశుద్ధపద్ధతిశ్చేతి సిధ్యతి."

అని. దీనినిబట్టి విష్ణువును ప్రధానముగా బోధింపని పురాణములును, విష్ణువును ప్రధానముగాబోధింపనిమతమును, విష్ణువును ప్రతిపాదింపనిశ్రుతులును గుపథము లని మధ్వ

బోధించినట్లు నయ్యది తనకు హితమగునట్లును సుస్పష్టముగఁ జెప్పుచున్నాఁడుగదా! దానంజేసియే భారతభూమియందుఁ బవిత్రతమంబగు ప్రమాణరాజంబుగ నలరారుచుండిన బ్రహ్మసూత్రములను విడనాడినచోఁ దమమతమునకు గౌరవము గలుగ దనియు విబుధలోకము నిందించు ననియు బ్రహ్మసూత్రములను బ్రమాణములని చెప్పికొనుచు నాసూత్రములు విష్ణుబోధకములని ప్రతారణమును గావించి యాబ్రహ్మము దమ కభిమతములగు పురాణములందలి విష్ణువే యని యొక దురుక్తినిఁగూడ—

"తత్సాత్త్వికపురాణోక్తో విష్ణుర్బ్రహ్మ స్మృతేర్బలాత్" అని 744 వ శ్లోకమునఁ జితించెను.

కావున నిట్టి యపూర్వవైష్ణవమును మధ్వ యను నాతఁడు క్రొత్తగఁ బ్రవర్తింపఁజేసినట్లు నద్దాని తుష్టితో యుక్తిమల్లికను రచించితిననియు వాదిరాజతీర్థులే ప్రకటించుటం జేసి యీ మధ్వమత మాధునికమే గాని యనాదికాలము నుండి వచ్చుచున్న దెంతమాత్రముగాదు. కావున సత్యధ్యానతీర్థులచే నాఅవకలమున వ్రాయఁబడినవిషయము దురుక్తియు సత్యేతరము నని వారివాదిరాజతీర్థులే రుజువుచేయుచున్నారు.

ఇంతియ కాదు, ఈ మత మాకాలమున నొక వ్యక్తియగు మధ్వచే శ్రుతిస్మృతిసదాచారప్రమాణ విరుద్ధముగ బ్రవర్తింపఁజేయఁబడుటచేతనే యట్టి ప్రవర్తకులు—

"త్వం చండాలః పశు ర్మ్లేచ్ఛ శ్చోరో జారః ఖరః కపిః,
కుండో గోళక ఇత్యాద్యా యా నిందా లోకసమ్మతాః.

అను నిట్టి నిష్ఠురనిందకు సర్వవిధములఁ బాల్పడినట్లు నిశ్చయింపవచ్చును. ఇంతియ కాదు, ఈ నిందయందలి యుత్తమశబ్దము లెంతెంత భావగర్భితములుగ నున్న యైతిహ్యముల వలన నిశ్చయింపవచ్చును. కాని యవ్వానితత్త్వమును లోకమునకు వెల్లడిచేయుట యనుచితమని వివరింపఁబడుచున్నది.

ఇంతియ కాదు, మధ్వసంప్రదాయముచే గౌరవింపఁబడెడి మునిత్రయముగూడ నేతద్భావసూచకమే యని నిశ్చయింపనవకాశము గల్గుచున్నది. ఏది యెట్లైనను బాపము శమించుగాక!

శ్రీసదనము,
గుంటూరు,
1-1-1935.

ఇతి,
నా రా య ణ స్మృ తిః.

శ్లో॥

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహం,
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే.

కామేశ్వరీం పరా మీడే కాదిహాదిస్వరూపిణీమ్,
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్.

# ఆత్మ దృశ్యమా?

మధ్వరాయలు జగన్మిథ్యాత్వానుమానఖండనము నందు జగత్తు దృశ్యము గావున మిథ్యయని చెప్పినచో నాత్మ గూడ దృశ్యమే గావున నాత్మగూడ మిథ్యయే యగునని "ఆత్మనోఽపి దృశ్యత్వా దనైకాంతికః" 'విమతం సత్యం, దృశ్యత్వా దాత్మవత్; ఇత్యపి ప్రయోజ్యత్వా త్ప్రకరణసమః' అని యాత్మకు దృశ్యత్వము లోకానుభవసిద్ధ మగునట్లు నిర్వచించియున్నారు. దీనివలనఁ దెలియవచ్చునదేమన: జగత్తెట్లు దృశ్యమో యట్లే యాత్మగూడ దృశ్యము గావున నుభయము సత్యమే యని. ఇదివఱకు జగత్తు సత్యము గాదనియు నయ్యది దృశ్యమాన మగుటచే ననిత్యమని చెప్పఁబడుచున్న

దనియుఁ  బంచరాత్రాగమమునందలి  శ్రీనారాయణుని యుపదేశమువలనఁ దెలియవచ్చుచున్నది. ఆ యుపదేశమేమనః

"దృశ్యమాన మిదం సర్వ మనిత్యమితీ చోచ్యతే,
ప్రాకృతం కార్యభూతం హి మదనన్యతయా స్థితమ్. 3-1-9.
ద్వైతం నాస్తీతి బోధేన మనసో ద్వైతనాశనం,
ఏతదంతో హి సంసారో బ్రహ్మన్నేవం విచారయ.
(2-2-25)

అని. ఆత్మగూడ జగత్తువలె దృశ్యమే యని మధ్వారాయల కభిమతమగు నట్లంగీకరించిన నాత్మకుఁగూడ ననిత్యత్వము తప్పక సిద్ధించును. ఎట్లన, " ఆత్మా అనిత్యః, దృశ్యత్వాత్ , ఘటవత్ " అని. ఇట్లనిత్యమని తెలియవచ్చెడి యాత్మ దేహమే యగుచున్నది. దేహమే యాత్మయని యనుట చార్వాకమత ధర్మముగాని వైదికధర్మముగా. దువైదికమగునాత్మ దృశ్యమే యగుచో నద్దానినిగూర్చి విప్రతిపత్తి, జిజ్ఞాసయు, నన్వేషణ మును నిష్ప్రయోజకములు గావలసివచ్చును. శ్రుతిచే "య ఆత్మాఽపహతపాప్మా సోఽన్వేష్టవ్య స్సవిజిజ్ఞాసితవ్యః" అని యాత్మకు జిజ్ఞాసాన్వేషణములు విధింపఁబడుచున్నవి గావున నాత్మ దృశ్యమని యెంతమాత్రము చెప్ప వలనుపడదు. ఏలయన, దృశ్యమానములగు ఘటపటాదులకుఁ గాని జగత్తునకుఁ గాని జిజ్ఞాసాన్వేషణము లెచ్చటను విధింపఁబడలేదు. ఇంతియ కాదు, ఆత్మయే జగత్తువలె దృశ్య మగుచోఁ దత్స్వరూపవిచారణ మును గూర్చి పలువిధములగు విప్రతిపత్తులు గలుగుట కవ

కాశ ముండదు. దృశ్యమగు ఘటపటాదివస్తువులకు నిర్ణయింపఁ బడెడి లక్షణములఁగూర్చి లోకములో నెవ్వరికిని వివాదము గన్పట్టదు. ఆత్మయో యట్లుగాక వివాదాస్పదమై యున్నది.

ఇఁక నాత్మస్వరూపమునుగూర్చి విప్రతిపత్తులు గలవా? యని సామాన్యజనులు దలంపనొప్పుఁగాని ప్రాజ్ఞులట్లు దలంపరు. అయినను జిజ్ఞాసువులయొక్క యుత్సాహమునకుఁగా నాత్మ స్వరూపమునుగూర్చిన విప్రతిపత్తుల నొకింత దిఙ్మాత్రముగఁ బ్రదర్శించుచున్నారము.

1. శాస్త్రజ్ఞానశూన్యు లగు పామరజను లీ దృశ్యము, కరచరణాద్యవయవవిశిష్టము నగు పిండమునే యాత్మ యని తలంచుచున్నారు. పండితమ్మాను లగు చార్వాకులలోఁ గొందఱు గూడఁ బామరజనులట్లే యీ దేహమునే యాత్మగాఁ దలంచుచున్నారు.

2. చార్వాకులలోఁ గొందఱు చక్షురాదీంద్రియ సమూహము నాత్మగాఁ దలంచుచున్నారు.

3. హైరణ్యగర్భులు పంచవృత్తిరూపమగు ప్రాణము నాత్మగాఁ దలంచుచున్నారు.

4. ఉపాసనాపరులు సంశయ విపర్యయాత్మక మగు మనస్సు నాత్మగాఁ దలంచుచున్నారు.

5. బౌద్ధులలోఁ గొంద అన్తఃకరణరూపమగు క్షణిక విజ్ఞానము నాత్మ యని తలంచుచున్నారు.

6. క్షణికమగు విజ్ఞానమాత్మగాదనియు నద్దానికంటె వేఱొకటి దెలియఁబడలేదు గావున శూన్యమే యాత్మయని మాధ్యమికులు జెప్పుచున్నారు.

7. నిరధిష్ఠానమగు విభ్రాంతి యప్రసిద్ధము గావున క్షణికవిజ్ఞానమున కాధారమగు నానందమయుఁ డాత్మ యని వేదవాదులు దలంచుచున్నారు.

ఇది యిట్లుండ నీయాత్మయొక్క పరిమాణమునుగూర్చి భేదములుగలుగ-

8. అంతరాళు లాత్మ నణుపరిమాణవిశిష్టమని చెప్పుచున్నారు.

9. జైనసంప్రదాయమునకుఁ జెందిన దిగంబరులాత్మను మధ్యమపరిమాణవిశిష్టము ననఁగా శరీర పరిమాణముతోఁ దుల్యమగు పరిమాణముగలదానినిగాఁ జెప్పుచున్నారు.

10. ఆత్మ సావయవమును సపరిమాణము నగుచో నాశ ప్రసంగము గలుగుఁ గావున మహత్పరిమాణవిశిష్టమును నిరవ యవము నని వేదవాదులు దలంచుచున్నారు.

ఇఁక సదనాత్మ నిరవయవము, సర్వవ్యాపక మని వేద వాదులు దలంచుచున్నను దత్స్వరూపవిశేషముగూర్చి వేద వాదులు విప్రతిపత్తిని బడయుచున్నారు. ఎట్లన:

11. ప్రాభాకరులును దార్కికులు నాత్మ యచిద్రూప మని నిర్వచించుచున్నారు.

12. భాట్టు లాత్మ చిదచిద్రూపమని చెప్పుచున్నారు.

13. సాంఖ్యు లన్ననో యాత్మ కేవలచిద్రూపమే యని నిర్వచించుచున్నారు.

ఇట్లాత్మనుగూర్చిన విప్రతిపత్తు లింకను బలువిధములఁ దెలియవచ్చుచున్నవి. ఆత్మయే జగత్తువలె దృశ్యమగు-చో నిట్టివిప్రతిపత్తుల కాస్పద మయి యుండదు గదా! అయిన నొకింత శ్రుతితాత్పర్యమునుగూడఁ జూతము. ఛాందోగ్యోపనిషత్సప్తమప్రపాఠకమున నారదసనత్కుమారసంవాదమున నారదవాక్య మిట్లు బరఁగుచున్నది:

'ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థమితిహాసపురాణం పంచమం వేదానాం వేదం పిత్ర్యం రాశిం దైవంనిధిం వాకోవాక్య మేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూతవిద్యాం క్షత్రవిద్యాం సర్పదేవజనవిద్యా మేత ద్భగవోఽధ్యేమి, సోఽహం భగవో మంత్రవిదేవాస్మి నాత్మవిత్, శ్రుతా హ్యేవ మే భగవద్దృశే భ్య స్తరతి శోక మాత్మవి దితి సోఽహం భగవశ్శోచామి, తం మా భగవాన్ శోకస్య పరం తారయతు" అని. ఈ వాక్యమునఁ దెలియవచ్చున దేమనః నారదుఁడు సకలవిద్యాపారంగతుఁడయ్యు నాత్మను దెలిసికొనఁజాలక యందులకుఁ గడు విషాదము నొంది యాత్మవిదు లగు సనత్కుమారుల కడకుఁ బోయి యాత్మను దనకుఁ దెలిపి కృతార్థునిఁ జేయఁ బ్రార్థించి వారలవలనఁ గడుప్రయాసముచే నాత్మజ్ఞానమును

బడసినట్లు దెలియవచ్చుచున్నది. ఆత్మయే దృశ్య మగుచో నింతప్రయాసమును నారదుఁ డొందుటకుఁ గల కారణ మేమి? ఇది యట్లుండ ఛాందోగ్యోపనిషదష్టమప్రపాఠకమున నింద్ర విరోచను లిరువురు నాత్మను దెలిసికొనఁగోరి ప్రజాపతికడ ముప్పదిరెండు వత్సరములు ప్రథమమున బ్రహ్మచర్యమును సలిపి రనియు నప్పుడు ప్రజాపతి చేసిన యుపదేశమును వ్యత్యాసముగా విరోచనుఁడు గ్రహించుటచే దృశ్యమగు దేహమునే యాత్మగాఁ దలంచి యయ్యదియే సత్యమని యెంచి తనరాజ్యమునకుఁ జేరి తనప్రజలకు బోధించెననియు నయ్యదియే చార్వాకదర్శనమునకు మూలమయ్యె నని సుప్రసిద్ధమేగదా!

ఇఁక నింద్రుఁ డన్ననో యద్దానియందలి దోషమును గనిపెట్టి పిమ్మట మఱల నరువదితొమ్మిది సంవత్సరములు బ్రహ్మచర్యమును గావించి యాత్మస్వరూపమును దెలిసికొని నట్లు తెలియుచున్నది. మధ్వరాయలు దలంచునట్లును విరోచనుఁడు దెలిసికొనినట్లు నాత్మ దృశ్యమే యని ప్రతిపాదించు మత మాసురమతమే గావలయుఁ గాని వైదికమత మెంతమాత్రము గానేఱదు.

ఈ సందర్భమున దృశ్యమన నెద్దియో విచారింతము. దృశ్యమనగాఁ దెలిసికొనఁబడునది యని యర్థము. తెలిసికొనఁబడునది యని యనఁగా విషయమని యర్థము. అన విషయిచేఁ దెలసికొనఁబడినది యని భావము. విషయియనఁ గర్త యగు నాత్మ. విషయియగు నాత్మ విషయములనన నఁగా శబ్దస్పర్శ రూపరసగంధములను, దదాశ్రయములగు వస్తువులను దెలిసికొను

చున్నటుల లోకవ్యవహారము. విషయి మనస్సుచే నింద్రియముల ద్వారా బాహ్యములగు విషయములను జాగ్రదవస్థయందుఁదెలిసికొనుచున్నాఁడు. స్వప్నమునందు నింద్రియము లుపరమింప వాసనారూపములగు విషయములను గ్రహించును. ఇట్లు విషయియగు నాత్మకు రెండువిధములగు విషయములు, అన స్వప్నసంబంధమందలి విషయములు, జాగ్రత్సంబంధములగు విషయము లని రెండువిధములగు విషయములును దెలియుచుండును. ఈ రెండు విధములగు విషయములుగూడ దృశ్యములే యని చెప్పఁబడును. ఈ రెండువిధములగు దృశ్యములుగూడ నశ్వరములే యని యెల్లరకును దెలిసినవిషయమే. విషయముల ట్లాత్మగూడ దృశ్యమే యగుచో జాగ్రద్దశయందుఁ దెలియవచ్చిన కరచరణాద్యవయవవిశిష్టమగు స్థూలశరీరమో లేక వాసనామయ మగు సూక్ష్మశరీరమో యాత్మ యని చెప్పఁబడవలయును. అప్పు డాత్మకు నాశప్రసంగ మనివార్యము. ఆత్మ నశ్వరమే యగుచోఁ గృతనాశాకృతాభ్యాగమదోషము, ముక్తిశాస్త్రానర్థక్యము, ఆచార్యోపదేశాద్యానర్థక్యము నను మహాదోషములు సంభవించును. కావున నట్టియాత్మ వేదవిదులకు సమ్మతముగాదు. ఇంతియ కాదు, దృశ్యాత్మవాద మాసుర మని శ్రుతియే బోధించుచున్నది గావున సర్వథా హేయము. కావున నాత్మ దృశ్య మని యెంతమాత్రము దలంపఁగూడదు.

శ్రీసదనమ్,
12—12—1934.

ఇతి,
నారాయణస్మృతిః.

శ్రీః

# వైదికధర్మ సంవర్ధని.

సంపుటము 1 | అక్టోబరు, 1935 | సంచిక 10

శ్రీః

## మధ్వమతభంజని.



బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహమ్,
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే.
కామేశ్వరీం పరా మీడే కాదిహాదిస్వరూపిణీమ్,
మాతృకావర్ణలిప్తాంగిం మహాశ్రీచక్రమధ్యగామ్.

# విష్ణువునందే సర్వాగమములకును దాత్పర్యమా?

మధ్వారాయలు విష్ణుతత్త్వ వినిర్ణయమునందు "విష్ణోః సర్వోత్తమత్త్వమేవ సర్వాగమానాం మహాతాత్పర్యమ్" అని యొక ప్రతిజ్ఞను గావించి, యద్దానిని సాధింప నెక్కుడు శ్రమ గొన్న ట్లభినయింపఁబడినది. కాని యీ ప్రతిజ్ఞ యెంతమాత్రము సిద్ధింపనట్టుల మధ్వారాయల కభీష్టమగు దశప్రకరణములవలననే సువ్యక్తమగుచున్నది. ఏలయన నిందు సర్వాగమములును విష్ణువునే సర్వోత్తమునిగ బోధించుచున్నవని కదా మధ్వారాయలు చేయుచుండెడి ప్రతిజ్ఞ! ఇందు సర్వాగమము లన నెద్దియో యొకింత సందర్భపూర్వకముగ విమర్శించినచో నీ ప్రతిజ్ఞ సర్వవిధముల భగ్నమగును. ఎట్లన - ఆగమములను నిర్వచించుటలో నీ విష్ణుతత్త్వవినిర్ణయమునందు మధ్వారాయ లిట్లు నిర్వచించి యున్నారు—

> "ఋగాద్యా భారతం చైవ పంచరాత్ర మథాఖిలం,
> మూలరామాయణం చైవ పురాణం చైతదాత్మకమ్.
> యే చానుయాయిన స్తేషాం సర్వే తే చ సదాగమాః,
> దురాగమా స్తదన్యే యే తై ర్న జ్ఞేయో జనార్దనః."

అని. దీనినిబట్టి ఋగాదులు, భారతము, పంచరాత్రము, మూల రామాయణము అను నాల్గు గ్రంథములే సదాగమములని

ప్రామాణ్యము లేనట్లు సువ్యక్తమగుచున్నది. వేదముల నటుంచి, శిష్టులచేఁ బ్రమాణముగా గ్రహింపఁబడిన గ్రంథ రాజము లెవ్వియైన మధ్వరాయలచేఁ బ్రమాణముగా స్వీకరింపఁబడెనా యని యనుచో, మన్వాదిస్మృతులందు, నష్టాదశ మహాపురాణములయందు, నాపస్తంబాదులచే రచింపఁబడిన కల్పసూత్రములయందు నెద్దియేని యొకగ్రంథమునైన స్మరింపక స్త్రీశూద్రద్విజబంధువుల కుద్దేశింపఁబడిన భారతరామాయణములందును సర్వవిధముల నిషిద్ధమని త్రోసివేయఁబడిన పంచరాత్రమునందుమాత్రమే సదాగమములని వేదములతో సమానమగు బుద్ధిని గల్గియుండుటచేతనే మధ్వరాయలయొక్క వేదప్రామాణ్య మొకింత హాస్యాస్పద మగుచున్నది.

ఆధునికు లందఱును వేదమును బరమప్రమాణమని చెప్పువారలేకాని వేదమును స్వతంత్రముగఁ జేఁబూని సాధ్యమును సాధించువారలు గానరారని యెల్లరకుఁ దెలిసినవిషయమే. ఒక వేళ వేదమును జేఁబూని వ్యవహరించువారలుగూడ శిష్టుల యొక్క వ్యాఖ్యానములను, స్మృతులను సాధనములుగాఁ జేసికొని యర్థమును గ్రహించువారలే యగుచున్నారు గావున నేగ్రంథములమూలమున వేదార్థమును నిర్ణయింపవలయునో యయ్యది ముందుగా విచారింపవలయును. అయ్యది యొక విశేషము మధ్వరాయలచే వ్యక్తీకరింపఁబడియున్నది. అదెద్ది యన- "వేదపంచరాత్రయో రైక్యాభిప్రాయేణ పంచరాత్రస్యైవ ప్రామాణ్య ముక్తమ్" అని.

దీనింబట్టి భారతరామాయణములు సదాగమము లని యుచ్చరింపఁబడినను నవ్వానియందుఁగూడ మధ్వరాయలకుఁ బ్రామాణ్య మున్నట్లు తోఁపదు. ఉండినను బ్రయోజన మేమి?

అయ్యవి యితిహాసరూపము లగుటంజేసి యవ్వానివలన గల్గు ప్రయోజనము తత్త్వనిర్ణయమునం దెంతమాత్రమును గానరాదు. ఒకవేళ, బ్రయోజన మున్న నయ్యది వేదమునం దధికారము లేని స్త్రీశూద్రద్విజబంధువులకు గాని, వేరొకరికిఁ గాదు. దానంజేసి పంచరాత్రతంత్ర మొక్కటియే మధ్వరాయాభిలషితమగు సదాగమ మని తెలియవచ్చుచున్నది. అట్లైనచోఁ గానొప్పు. ఏమన నాతంత్రమున విష్ణువు బోధింపఁబడినట్లు సుస్పష్టమే. కాని విష్ణువును బోధింపని తంత్రములు గాని పురాణములుగాని యితిహాసములుగాని దురాగమము లనుటకుఁ గల కారణ మేమి! అందులకు మధ్వరాయాభీష్ట మేనా? లేక వేఱొక కారణ మెద్దియైన గలదా? మధ్వరాయాభీష్టమే కారణ మని చెప్పినచో మఱియొకరాయలు శివుని బోధింపని యాగమములు దురాగమము లని చెప్పవచ్చును. మఱియొక రాయలు గణపతిని బోధింపని యాగమములు దురాగమములని చెప్పనొప్పు.

ఇట్లెవరిచిత్తమునకు వచ్చినట్లు వా రొక్కొక తంత్రమున నభినివేశము నొంది తమతమ తంత్రములచే నితరులను దుర్మార్గులని నిందింపనొప్పు. అట్టినిందయందు మధ్వరాయలు గూడ నొకింత విశేషమును గల్గియుండు ననుటకు సందియము

లేదు. ఇట్టి దుర్దశనుండి తంత్రాభిమానులు విముక్తిం జెందుట యెన్నటికైనను సాధ్యముకాదు. ఆగమములు వేనవేలు. అందలి విషయములు నానాముఖములును. ఇట్టివిషయమున విష్ణువు నందే సర్వాగమములకుం దాత్పర్య మనుట యొకపెద్దకల్లగాని నిజ మెంతమాత్రము గాదు. ఇయ్యది శిష్టులచే నాగమకోటి యందు విధింపఁబడిన గ్రంథములసరణి ననుసరించి చెప్పఁబడిన విశేషము.

ఇఁక మధ్వరాయలదృష్టియం దన్ననో యాగమ మనిన నొక విజాతీయవిశేషము దెలియవచ్చుచున్నది. ఎట్లన- "నిర్దోషః శబ్ద ఆగమః" అని ప్రమాణలక్షణమందు మధ్వ రాయలచే నిర్వచింపఁ బడియున్నది. నిర్దోషమగు శబ్దమే యాగమ మని చెప్పినచో సదాగమదురాగమ ద్వైవిధ్య కథనము సమంజసము కానేరదు. అంతియ కాదు: దురాగమ లక్షణము సదాగమలక్షణమును సమంజసము గానేరవు.

దీనిఁబట్టి మధ్వరాయల యాగమలక్షణముచే మధ్వ రాయలకు లభించెడి యాగమమే యెద్దియును లేదని యాగమ లక్షణఖండనమునందు నిదివఱలో సర్వవిధముల నిరూపింపఁ బడియేయున్నది. ఆగమ మను ప్రమాణమే సిద్ధింపనిచో సర్వాగమము లెక్కడ! అన్నానికన్నిఁటికిని విష్ణువుపై దాత్పర్య మెక్కడ? కావున మధ్వరాయల కభీష్టమగు విష్ణువు ప్రమాణ సిద్ధుఁ డెంతమాత్రము గాఁడని మహాతాత్పర్యము.

శ్రీసదనము,
16-12-34.

ఇతి
నారాయణస్మృతిః

శ్రీః

# మధ్వమతభంజని

---

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.
శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహమ్,
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే.
కామేశ్వరీం పరాం ముగ్ధాం కాదిహాదిస్వరూపిణీమ్,
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్.

## జగత్తు సత్యమా?

మధ్వాచార్యులు, వారి యనుచరులును నభిమత మగు ద్వైతమతసిద్ధాంతము 'జగత్తు సత్య' మనునదియని తెలియవచ్చుచున్నది. సత్యధర్మతీర్థులవారి ప్రైంటునందుం గూడ 'ద్వైతికమతతత్త్వము'లను నాలవవిషయమున '౧' అను మొదటివిషయముగూడ నట్టి యభిప్రాయమునే వ్యక్తీకరించుచున్నది. ఎట్లన —

“(౧) బ్రాహ్మణాదివర్ణములు బ్రహ్మచర్యాద్యాశ్రమములు, యజ్ఞాదిక్రియలు, దేవతలు, వేదములు, గంగాదితీర్థ

ములు, స్వర్గాదిపరలోకములు, ఈలోకము ఇవి మొదలైన సమస్తజగత్తు నిజమైనది." అని.

ఇంక మధ్వారాయలచే రచింపఁబడిన ప్రమాణలక్షణమున "ప్రత్యక్షాగమాదిభిర్జగతః సత్యత్వాత్" అని నిర్వచింపఁబడియున్నది.

ప్రపంచమిథ్యాత్వానుమానఖండనమునందు "విమతం, మిథ్యా, దృశ్యత్వాత్, యదిత్థం; తత్తథా యథా సంప్రతిపన్నమ్" అని యొక యనుమానమును బూర్వపక్షముగా గ్రహించి, యద్దానికి సమాధానముగ "ప్రత్యక్షాదివిరుద్ధత్వాత్, విశ్వం సత్యమ్ ఇత్యాది వాక్యవిరుద్ధత్వాచ్చ కాలాత్యయాపదిష్టః" అని స్వమతము నుపపాదించి స్వాభిమతమగు ననుమానములను "విమతం, సత్యం దృశ్యత్వాత్, ఆత్మవత్, ఇత్యపి ప్రయోజ్యత్వాత్ ప్రకరణసమః" అనియును; "విమతం సత్యం, ప్రమాణదృష్టత్వాత్, యదిత్థం తత్తథా, యథాఽఽత్మేతి ప్రయోగాత్సప్రతిసాధనః" అని రెండిటిని జతిరించి యున్నారు.

తత్త్వోద్యోతమందు "న చ బాధ్యం జగదిత్యత్ర కించిన్మానమ్" అనియును, "ప్రత్యక్షబాధితం చ జగన్మిథ్యాత్వమ్, స దితి ప్రతీయమానత్వాత్, న చ ప్రత్యక్షసిద్ధమన్యేన కేనాపి బాధ్యం దృష్టం, చంద్రప్రాదేశత్వాదివిషయం తు దూరస్థత్వాదిదోషవిషయత్వాదపటు, న చ జగత్ప్రత్యక్షస్యాపటుత్వే కించిన్మానమ్" అనియు; విష్ణుతత్త్వవినిర్ణయము

నందు "అతో న కుత్రాపి జగతో మిథ్యాత్వ ముచ్యతే" అనియుఁ జెప్పఁబడినది.

ఇట్లు దశప్రకరణములయందును జగత్సత్యత్వమును గూర్చి వాక్యములు పరఁగుచున్నవి. అవ్వానిసరసత నొకింత విచారింతము. అందుఁ బ్రమాణలక్షణమున నిరూపింపఁబడిన "ప్రత్యక్షాగమాదిభి ర్జగత స్సత్యత్వాత్" అను వాక్యమును ముందుగా విచారింతము. దీనియర్థ మేమన - ప్రత్యక్షాగమాదులచే జగత్తుయొక్క సత్యత్వము బోధింపఁబడుటవలన ననికదా!

ఇందలి యాదిశబ్దముచే నెద్దాని గ్రహింపవలయును? అనుమానమను ప్రమాణమును గ్రహింపవలయునని ప్రకరణ సందర్భమునఁ దెలియవచ్చుచున్నది. ఏమన నీ ప్రమాణలక్షణ మనుప్రకరణము మధ్వరాయల యభీష్టములగు ప్రమాణములను నిర్వచించుటకు రచియింపఁబడినది. అం దిట్లు నిర్వచింపఁబడినది —

1 "యథార్థం ప్రమాణమ్ = యథార్థముప్రమాణము.

2 "త ద్ద్వివిధం, కేవల మనుప్రమాణం చ = ఆప్రమాణము రెండువిధములు: కేవలమనియు ననుప్రమాణ మనియు.

3 "యథార్థజ్ఞానం కేవలమ్ = యథార్థజ్ఞానమునకుఁ గేవలప్రమాణ మని పేరు.

4 తత్సాధన మణుప్రమాణమ్ = కేవలరూప మగు యథార్థజ్ఞానమునకు సాధనమగు ప్రమాణ మనుప్రమాణమని యర్థము.

5. అణుప్రమాణం త్రివిధం, ప్రత్యక్ష మనుమాన మాగమ ఇతి = ప్రత్యక్ష మనియు నాగమ మనియు ననుమాన మనియు ననుప్రమాణము మూఁడువిధములు.

1 నిర్దోషార్థేంద్రియ సంనికర్షః ప్రత్యక్షమ్ = దోష రహితమగు నింద్రియార్థసంనికర్ష వలనఁ గల్గు జ్ఞానము ప్రత్యక్షము.

2 నిర్దోషోపపత్తి రనుమానమ్ = దోషరహితమగు నుప పత్తి యనుమానము.

3 నిర్దోష శ్శబ్ద ఆగమః = దోషరహితమగు శబ్దము ఆగమము అని. ఇచట నాగమశబ్దమునకు దోషరహిత మగు శబ్దమని యొక యపూర్వార్థము నిర్వచింపఁబడుచున్నది. ప్రత్యక్షానుమానము లనెడి లౌకికప్రమాణములగూర్చి తంత్రాంతరీయులతో మధ్వరాయుల కించుకేనియు భేద మున్నట్లు గానరాదు. ఆగమమను ప్రమాణమునుగూర్చి విప్రతిపత్తి యున్నట్లుత్తరప్రకరణమువలనఁ దెలియవచ్చెడిని. ఎట్లన ఆగమశబ్ద నిర్వచనము—

"ఋగ్యజుస్సామాథర్వాశ్చ భారతం పంచరాత్రికం,
మూలరామాయణం చైవ సంప్రోచ్యన్తే సదాగమాః.
అనుకూలా య ఏతేషాం తే చ ప్రోక్తా స్సదాగమాః,
అన్యే దురాగమా నామ తైర్నసాధ్యం హి సాధ్యతే."*

అని కథాలక్షణమునఁ జేయఁబడియున్నది. అనఁగా ఋగ్యజుస్సామాథర్వములును, భారతము, పంచరాత్ర తంత్రము

మూలరామాయణము నను నాల్గు గ్రంథములును సదాగమము లని నిర్వచింపఁబడినది. అంతియ కాదు; ఇతరములగునవి యన్నియు, దురాగమములనియు, నవ్వానిచే సాధ్యము సాధింపఁ బడదనియు నర్థము.

ఆగమ మన, దోషరహితమగు శబ్దమనికదా యర్థము చెప్పఁబడెను. దీనిఁబట్టి పాంచరాత్రాగమము దోషరహిత మగు శబ్దమనియేకదా మధ్వరాయలవారి తాత్పర్యము. తాత్పర్యమే కాదు నిర్ణయముగూడ నంతియే. ఏలయన-“శాస్త్ర యోనిత్వాత్” అను సూత్రవృత్తియందు “వేదపంచరాత్రయో రైక్యాభిప్రాయేణ పంచరాత్రస్యైవ ప్రామాణ్య ముక్తమ్” అని ఋగ్యజుస్సామాథర్వములను, భారతరామాయణములను గూడ మధ్వరాయలు వ్రాసియున్నారు. దానంజేసి యాగమము ప్రమాణ మన నిటఁ బంచరాత్రాగమమే యని సుస్పష్టమే కదా! కావునఁ బంచరాత్రాగమముచే జగత్సత్యత్వము బోధింపఁ బడుచున్నదో లేక మిథ్యాత్వము బోధింపఁబడుచున్నదో యొకింత ముందుగా విచారింతము.

పంచరాత్రతంత్రమునందు మొదటిపాదమున •నేడవ యధ్యాయమున శ్రీమన్నారాయణునియొక్క జగత్తును గూర్చిన ఉపన్యాస మిట్లు పరఁగుచున్నది —

“తస్మా దన్య న్నైకరూపం మాయాకార్య మిదం జగత్ ।
అనిత్యం మృగతృష్ణాభం గంధర్వనగరోపమమ్” (7-22.)

అని. ఇఁక రెండవపాదమందు రెండవ యధ్యాయమున—

"సర్వాధారతయా బ్రహ్మ న్నహమేకోఽద్వయః పరః,
మదేకాయతన స్సర్వ మహమేవ న సంశయః. (2-26)
ద్వైతం నాస్తీతి బోధేన మనసో ద్వైతనాశనం,
ఏతదంతో హి సంసారో బ్రహ్మన్నేవం విచారయ. (2-27)

అని చెప్పఁబడినది. ఇఁక మూఁడవ పాదముయొక్క మొదటి యధ్యాయమున—

"లోకా శ్చతుర్దశ ప్రోక్తా మయా తే కమలోద్భవ,
అధ స్సప్త సమాఖ్యాతా ఊర్ధ్వం సప్త ప్రకీర్తితాః. 1-4
ఉక్తా స్సచరణా స్సర్వే నాశశీలా భవంతి తే,
బ్రహ్మణో దివసస్యాన్తే నాశ మాయు స్త్రయశ్చ తే. 1-5
దృశ్యమాన మిదం సర్వ మనిత్య మితి చోచ్యతే,
ప్రాకృతం కార్యభూతం హి మదనన్యతయా స్థితమ్. 1-9
వ్యక్తా మాయా కార్యరూపా నైకరూపా ప్రజాయతే,
సర్వదా నైకరూపేయం పరిణామస్వభావతః. 1-27
అనిత్యా హ్యసతీ మిథ్యా వస్తుభూతాఽపి దుర్గ్రహా,
దుస్తరా దుష్ప్రధర్షాచ దురూహా దుర్విచేష్టితా. 1-28

అని చెప్పఁబడినవి. ఈ శ్లోకముల నెన్నఁడైనఁ దిలకించిన చోఁ బంచరాత్ర తంత్రము జగత్సత్యత్వమును బోధించుచున్నదని నిర్ణయింప సాహసించునా!

ఇఁక నాగమప్రమాణము నటుంచి యనుమానప్రమాణమును గూడఁ దిలకింతము. పైని నుదాహరింపఁబడిన పంచరాత్రాగమవాక్యములలో—

"దృశ్యమాన మిదం సర్వ మనిత్య మితి చోచ్యతే,
ప్రాకృతం కార్యభూతం హి మదనన్యతయా స్థితమ్.
అనునది పరంగుచున్నది. దీని కర్థ మేమన—

ఇదమ్= ఈప్రత్యక్షముగా దెలియవచ్చెడి, సర్వమ్= సకలజగత్తు, దృశ్యమానమ్=చూడఁబడుటచేతను, ప్రాకృతమ్= ప్రకృతివలనఁ గల్గిన, కార్యభూతమ్=కార్యరూపమగుటచేతను, అనిత్యమ్ ఇతి చ=అనిత్యమనియే, ఉచ్యతే=చెప్పబడుచున్నది. ఈ శ్లోకమునుబట్టి యనుమానరచనను జేసినచో —

1 ఇదం సర్వం (జగత్) అనిత్యం, దృశ్యమానత్వాత్, యథా ఘటాది. 2 ఇదం సర్వం(జగత్)అనిత్యం, కార్యత్వాత్, ఘటాదివత్

అభావద్వయమధ్యఘటితమగు ఘటాదికార్య మెట్లనిత్యమో ఆ యాతీరుననే సృష్టిలయములకు మధ్య భాసించు జగంబుగూడ ననిత్యమే యని తెలియవచ్చుచున్నది.

ఇఁక మధ్వారాయ లన్ననో "విమతం (జగత్) సత్యం, దృశ్యత్వాత్, ఆత్మవత్" అని యొక యపూర్వానుమానమును గల్పించియున్నారు. దీనిఁబట్టి దృశ్యత్వ హేతువుచే జగత్తునకు మిథ్యాత్వమును సాధించినచో నాత్మగూడ దృశ్యము గావున నాత్మకుఁగూడ మిథ్యాత్వము ఘటించునను ప్రతిబంధ్యనుమానమును జితించి జగత్తునకు సత్యత్వమును సాధించియున్నారు. ఆత్మకు దృశ్యత్వము, కరచరణాద్యవయవవిశిష్టమగు దేహమే యాత్మ యను చార్వాకమతమునందుఁ దక్క వేఱొకమతమునం దెచటను గానరాదు.

ఆత్మకు దృశ్యత్వమును నిర్వచించు మాధ్వమతమునకుఁజార్వాక
మతసాదృశ్య మేల ఘటింపదో ప్రాజ్ఞు లూహింపవలయును.

ఇఁకఁ జార్వాకునికి దృశ్యమగు నాత్మ సర్వవిధముల
నశ్వరమే యని యెల్లరకును దెలిసిన విషయమే. అట్టి యాత్మ
తో సాదృశ్యము జెప్పఁబడిన జగత్తునకుఁ గూడ నాశ
ప్రసంగము సిద్ధించుచు మధ్వరాయలసత్యత్వము పరాహత
మగుచున్నది.

ఇఁకఁ బ్రత్యక్షముచే జగత్సత్యత్వము సిద్ధించుచున్న
దని యొక యపూర్వవాదము దెలియవచ్చుచున్నది. ప్రత్యక్ష
ప్రమాణైకశరణులగు చార్వాకులుగూడ జగత్తు సర్వవిధ
ముల నశ్వర మనియే యంగీకరించుచున్నారు. ప్రత్యక్షాను
మానములను మాత్రమే ప్రమాణముగ గ్రహించు సౌగ
తులు గూడ జగత్తు నశ్వర మని నిరూపించుచున్నారు.
మధ్వరాయల కభిమత మగు పాంచరాత్రాగమముకూడ
జగ త్తనిత్య మనియే చెప్పుచున్నది. పంచరాత్రాగమమునఁ
జెప్పఁబడిన యర్థమునే వేదము బోధించుచున్నట్లు మధ్వ
రాయలచే నంగీకరింపఁబడుటచే వేదముగూడ జగత్తుయొక్క
నశ్వరత్వమునే బోధించుచున్నట్లు సుస్పష్టముగఁ దెలియవచ్చు
చున్నవి. వేయేల? శ్రుతిస్మృతిపురాణేతిహాసాగమము
లన్నియుఁగూడ జగత్తున కుత్పత్తిస్థితిలయములను బోధించు
చున్నది. ఉత్పత్తి యనఁ బుట్టుక, స్థితి యన నునికి, లయ
మన నాశమునుగదా! ఉత్పత్తికిఁబూర్వమందును లయమునకుఁ
బరమందును జగ త్తించుకేనియుఁ దెలియఁబడకపోవుటచే

జగత్తు అదృష్టదృష్టప్రణష్టరూపమగుచు మరుమరీచికాగంధర్వ నగరాదులట్లు మిథ్యాభూతమే యని తెలియనచ్చుచున్నది.

ఇట్టి జగత్తుయొక్క మిథ్యాస్వభావమునే శ్రీకృష్ణభగవానులు—

"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనాన్యేవ తత్రకా పరిదేవనా."

అని వచించియున్నారు. ఇట్లు సర్వప్రమాణసిద్ధమగు జగన్మిథ్యాత్వమును సంక్షేపమున మధ్వరాయల కభిమతమగు ననుమానరచనచే నిట్లు నిరూపించుచున్నారము.

1 "జగన్మిథ్యా, అదృష్ట దృష్ట ప్రణష్ట రూపత్వాత్, యథా మరుమరీచికాది."

2 "జగన్మిథ్యా, దృశ్యమానత్వాత్, యథా మరుమరీచికాది."

3 "జగన్మిథ్యా, కార్యత్వాత్, యథా ఘటాది."

ఇంక మధ్వరాయలు దలంచిన ట్లాత్మకు దృశ్యత్వమే సిద్ధ మగు-నేని మధ్వరాయలయాత్మకుఁగూడ జగత్తునకువలె మిథ్యాత్వము సంభవించి దుర్దశ గలుగుచుండును. అంతియ కాదు; మధ్వరాయలకుఁగూడఁ జార్వాకమత ప్రవేశాపత్తి కల్గుచుండును. దేహమే యాత్మ యనువార లొక్కరుదక్క మఱి యెవ్వరును నాత్మకు దృశ్యత్వము నంగీకరింపరు. ఆట్లాత్మకు దృశ్యత్వమే సిద్ధమగుచో నాత్మను గూర్చి జిజ్ఞాసయు నద్దానినిగూర్చి శాస్త్రాచార్యోపదేశమునుగూడ నించుకేనియు నవసరము లేదు.

శాస్త్రమును జూచినచో నాత్మను దెలిసికొనుటకు జిజ్ఞాసువులు పరితపించినట్లు, అద్దానిని దెలిసికొనుటకు శాస్త్రాచార్యోపదేశము నభిలషించినట్లును నారద సనత్కుమారసంవాదమువలనఁ బ్రజాపతీంద్రసంవాదమువలన సుస్పష్టమగుచున్నది. నారదుఁడు సనత్కుమారులఁ జేరఁబోయి “శ్రుతం హ్యేవమేవ భగవద్దృశేభ్యః’ తరతి శోకమాత్మవిదితి” మంత్రవిదే వాస్మి నాత్మవిత్, సోఽహంభగవః శోచామితం మాభగవాన్ శోకస్య పారం తారయతు” అని ప్రార్థించినట్లు వినవచ్చుచున్నది. ఇంతియు కాదు; “య ఆత్మా అపహతపాప్మా సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః” అను ప్రజాపతివాక్యమువలనను “ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః” అను యాజ్ఞవల్క్య వాక్యమువలనను గూడ నాత్మ యన్వేష్యము, జిజ్ఞాస్య మని చెప్పఁబడినది. ఆత్మయే దృశ్యమగుచో ఘటపటాదులవలె సుకరముగఁ దెలియవచ్చునుగావున నందులకు నన్వేషణమును జిజ్ఞాసయును వ్యర్థమే యగును; శాస్త్రార్థము దూరమగును. కావున నాత్మ దృశ్యమని యెన్నఁడును జెప్పఁగూడదు. ఆత్మ దృశ్య మెప్పుడు గానేరదో యప్పుడు జగన్మిథ్యాత్వమునకు నాత్మ బాధక మెంతమాత్రము గానేరదు. కావున జగత్తు సత్య మనువాదము ప్రత్యక్షానుమానాగమవిరుద్ధమగుటంజేసి సర్వథా హేయము.

శ్రీసదనము,
11-12-34.

ఇతి
నారాయణస్మృతిః.

శ్రీః

# మధ్వమతభంజని

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

శుద్ధస్ఫటికసంకాశం సచ్చిదానందవిగ్రహమ్,
దాతారం సర్వకామానాం కామేశ్వర ముపాస్మహే.
కామేశ్వరీం పరా మీడే కాదిహాదిస్వరూపిణీమ్,
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్.

## 'విశ్వం సత్యమ్' అన నేమి?

మధ్వరాయలు 'జగత్తు సత్య'మని తా బోధించినవాక్యము ప్రమాణానుగుణ మనుట కొక యపూర్వశ్రుతి నుదాహరించి, యందు 'విశ్వం సత్యమ్' అని యుండుటచే జగత్తు సత్యమని నిర్వచించుచున్నారు. ఆశ్రుతి నిట్లుదాహరించుచున్నారు: "విశ్వం సత్యం మఘవానాయువోరిదా పశ్చన ప్రిమినంతి వ్రితం వాం, ప్రఘాన్యస్య మహతో మహాని సత్యాసత్యసకారణాని వోచమ్" అని.

ఈశ్రుతికి శ్రీ విద్యారణ్యులవారు భాష్యము వ్రాయుటలో:—విశ్వం - సర్వం స్తోత్రం యథార్థం స్తుత్యా యద్గుణజాతం ప్రతిపాద్యతే తత్సర్వం యువయో ర్విద్యమానమేవ, న త్వారోపితమ్"అని యింద్రాదులయొక్క స్తుతిచేఁ బ్రతిపాదింపఁబడు గుణములు సత్యములే కాని యనృతములు గావని యీ మంత్రమిందాద్రిదిస్తావకముగా నర్థమును వ్యక్తీకరించి యున్నారు. అందీ విశ్వశబ్దమును జగత్తను నర్థమును బోధించు నదియని యనుటకుఁగాని, సత్యశబ్దము తత్సత్యత్వమును బోధించునదియనికాని యెంతమాత్రము దెలియరాదు. ఇంద్ర స్తుతిగా వర్ణింపఁబడిన మంత్రమిందునియొక్క యతిశయమును బోధించును గాని యప్రకృతమగు జగత్సత్యత్వమును బోధించుచున్న దనినచోఁ బ్రకృతహానాప్రకృతప్రసంగరూప దోషము వాటిల్లును. అట్టిదోషము నించుకేనియు సరకుగొనక యేది యెట్లైనను "మాతా మాకు లభించిన"దను లోకోక్తికి వన్నెమీఱ నీ మంత్రమునందలి "విశ్వం సత్యమ్"అను నాల్గక్షరములఁ జేకొని సకలశ్రుతిస్మృతిపురాణేతిహాసవిరుద్ధముగ 'జగత్తు సత్య'మని మధ్వారాయలు నిర్వచింపసమకట్టియున్నారు. ఇంతియ కాదు; వారియనుచరు లందఱు నంధగోలాంగూల న్యాయమున నద్దానినే యనువదించుచున్నారు. కావున నీ 'విశ్వం సత్యమ్' అను శబ్దముచే జగత్సత్యత్వము లభించునా? ఒకానొకవేళ నెట్లో లభించిన నయ్యది సదాగమసిద్ధ మగునా? యని యొకింత విచారింతము.

విశ్వశబ్దము సర్వనామశబ్దమని పాణిన్యాదిమహనీయు లచే స్మరింపఁబడియున్నది. ఎట్లన - "సర్వాదీని సర్వనామాని" అను సూత్రమునందు ఆదిశబ్దముచే నభిప్రేతములగు సర్వనామ శబ్దము లన్నియును "సర్వ, విశ్వ, ఉభ, ఉభయ, డతర, డతమ, అన్య, అన్యతర, ఇతర, త్వత్, త్వ, న్వ, సమ, సిమ, పూర్వ, పరావర,దక్షిణోత్తరాపరాధరాదీని సర్వాదీని" అని చెప్పఁబడు చున్నవి.

ఇందు సర్వశబ్దమునకు వెనుక విశ్వశబ్దము దెలియవచ్చు చున్నది. సర్వశబ్దమునకు నెట్టి యర్థమో యయ్యదియే విశ్వ శబ్దమునకుఁ గూడనని క్రొత్తగ బోధింపనవసరములేదు. సర్వా దులు సర్వనామములని స్మరించిన పాణిని యేసర్వాదులు సర్వ నామములని స్మరించెనని ప్రశ్నించినచో వేదమందలిసర్వాదులు గూడ సర్వనామములేయని స్మరించెనని స్పష్టముగఁ దెలియ వచ్చును. కావున వేదమందలి స్మరించిన సర్వాదు లన్నియు సర్వనామములే యగును. కావున వేదమం దెచ్చట విశ్వశబ్దము వినవచ్చినను సర్వనామమే యని తెలియనగును.

ఇంతియ కాదు; వేదమునందు విశ్వశబ్దముతో నొప్పు చుండు మంత్రములఁ దిలకించినచో నా విశ్వశబ్దము విశేష ణముగానే పరఁగుచున్నది. ఒకానొక వేళ విశ్వశబ్దమునకు మంత్ర మునందు విశేషణము దెలియఁబడనిచో నా విశ్వశబ్దము సర్వ నామముగానే యలరారుచు సర్వశబ్దమునకుఁ బర్యాయపదమై ప్రకరణ సందర్భమునుబట్టి, యెద్దియో యొక విశేష్యమును సూచించుచునే యున్నది. దానంజేసియే శ్రీ విద్యారణ్యులవా

కి “విశ్వం సత్యమ్” అను మంత్రమునందలి విశ్వశబ్దమునకుఁ బర్యాయపదముగా సర్వశబ్దమును వాడి యీ సర్వశబ్దముచేఁ బ్రకృతమున సూచింపఁబడు స్తోత్రము నర్థముగ్గా గ్రహించి యున్నారు. దానంజేసి యీ విశ్వశబ్దము జగత్తను నర్థమును బోధించుటకుఁగాని యచ్చో సత్యశబ్దము జగత్తుయొక్క సత్య మని బోధించుటకుఁగాని యెంతమాత్రమును ప్రవర్తించి యుండలేదు.

ఇఁక నీ విశ్వశబ్దమునకు నిఘంటువులయందుఁ దెలియ వచ్చెడి యర్థమునుగూడ నొకింత విచారింతము. విశ్వశబ్దమున కమరకోశమున—

“ఆదిత్యవిశ్వవసవ స్తుషితాభాస్వరానిలాః” (ప్రథమ. స్వ. 10) అనియు,

“స్త్రీనపుంసకయో ర్విశ్వం నాగరం విశ్వభేషజమ్” (ద్వి. వై. 38)

“అథ సమం సర్వం, విశ్వ మశేషం కృత్స్నం సమ స్తనిఖిలాఖిలాని నిఃశేషమ్. సమగ్రం సకలం పూర్ణ మఖండం స్యా దనూనకే” (తృ. విశే. 65)

అని యర్థము నిరూపింపఁబడినది. ఈ నిఘంటువును జూచి నను జగత్తునకు ప్రసిద్ధమగు పర్యాయముగా విశ్వపదమును వాడియుండలేదు. ఇఁక విష్ణుసహస్రనామములయొక్క యుప క్రమమును జూచినచో నచట “విశ్వం విష్ణు ర్వషట్కారః” అని స్మరింపఁబడియున్నది. ఇందు “విశ్వమ్” అను శబ్దము విష్ణువు

యొక్క నామములలో నొకటిగా నుద్దేశింపఁబడుటయే కాక తొమ్మిదివందలతొంబదితొమ్మిదినామములకంటెఁ గూడ నభ్యర్హితముగా, మొదొలుత స్మరింపఁబడుటయు, నందుఁ గూడ నపుంసకలింగముతోడనే వాడఁబడుటయును జూడఁబడుచున్నది. దీనినిబట్టి యీ విశ్వశబ్దమునకుఁ గల యతిశయము ప్రాజ్ఞులచే విపులముగ నిరూపింపఁబడవలయువిషయమే. అయ్యది ప్రక్రృతముగాదు కావున విరమింపఁబడుచున్నది. సామాన్యదృష్టిచే నీ విశ్వశబ్దము విష్ణువునకుఁ బర్యాయముగా నెల్లరును గ్రహించుచున్నారు గావున నీ విశ్వశబ్దమునకు విష్ణువని యర్థము గ్రహించుట యుచితముగదా! ఇట్లు విశ్వశబ్దమునకుఁ బలువిధములగు నర్థములు దెలియవచ్చుటంజేసి యర్థనిర్ణాయకలింగముల యొక్క యపేక్ష లేకుండ నెద్దియో యొకతీరున నర్థమును నిర్ణయించుట శాస్త్రసమ్మతముగానేఱదు. అర్థనిర్ణాయకలింగము లేమన—

> "సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా,
> అర్థః ప్రకరణం లింగం శబ్దస్యాన్యస్య సన్నిధిః."

అను మొదలగునవి. వేద భాష్య కర్తలగు శ్రీవిద్యారణ్యులవారన్ననో యర్థనిర్ణాయక లింగముల యోజించి ప్రకరణసందర్భమును బట్టి "విశ్వం సత్యమ్" అనుమంత్రమునందలి 'విశ్వమ్' అను శబ్దమునకు 'సర్వం స్తోత్రమ్' అని నిర్వచించియున్నారు. మధ్వాచార్యాదు లన్ననో యీ విశ్వశబ్దమునకు నుచ్ఛృంఖలముగఁ

బూర్వాపరసందర్భముల గమనింపక 'జగ' త్తను నర్థమును గల్పించుచున్నారు.

పోనిండు, "తుష్యతు దుర్జనః" అను న్యాయముచే 'విశ్వం సత్యం' అనుచో విశ్వశబ్దమునకు 'జగత్తు' అనియు; 'సత్యమ్' అను శబ్దమునకు 'నిజమైనది' అనియు నంగీకరించి జగత్తు సత్యమే యని మధ్వరాయాదులరీతి ననుసరించినను నయ్యది గొప్ప ముప్పున కే హేతు వగుచున్నది. ఏలయన - మధ్వరాయలచే నత్యంత సదాగమమనియు వేదముతో సమానమగునర్థమును బోధించుచున్నదనియుఁ బరమప్రమాణమనియుఁ దలంపఁబడు పాంచరాత్రాగమము సర్వవిధముల జగత్సత్యత్వమును నిరసించి మిథ్యాత్వమునే బోధించుచున్నది. ఈదిగువవాక్యముల గమనింపుడు!

> "తస్మా దన్య న్నైకరూపం మాయాకార్య మిదం జగత్,
> అనిత్యం మృగతృష్ణాభం గంధర్వనగరోపమమ్" 1-7-22
>
> ద్వైతం నాస్తీతి బోధేన మనసో ద్వైతనాశనమ్,
> ఏతదంతో హి సంసారో బ్రహ్మ న్నేవం విచారయ.
> 1-7-23

అని. ఈనారాయణోపదేశమువలన జగత్తు మిథ్య యని దెలియఁబడుచున్నది.

ఇఁకఁ బ్రకృతమును గమనించిన 'విశ్వం సత్యమ్' అను శ్రుతిచే మధ్వరాయాదులు తలంచినట్లు జగత్సత్యత్వమే తెలియవచ్చినచోఁ బంచరాత్రాగమము శ్రుతివిరుద్ధమై వేద

బాహ్యమగుచున్నది. పంచరాత్రాగమమే ప్రమాణమగుచో
"విశ్వం సత్యమ్" అను శ్రుతిమాత్రమునకు వ్యాకోపము గల్గు
చున్నది. ఇచట శ్రుతిప్రామాణ్యమును జేఁబూని పంచరాత్రా
గమమును ద్రోసిపుచ్చినచోఁ బంచరాత్రాగమము సదా
గమములనుండి తుంపఁబడి దురాగమములయందుఁ దుళ్లి
పోవును.

ఇట్లు వేదమునకును బంచరాత్రాగమమునకును మధ్వ
రాయాదులకును మధ్వరాయాభిమతమగు ప్రధానసిద్ధాన్త
మగు జగత్సత్యత్వమునందే వైషమ్యము దెలియవచ్చుచుండ
"వేదపంచరాత్రయో రైక్యాభిప్రాయేణ పంచరాత్రస్యైవ
ప్రామాణ్య ముక్తమ్" అనునదియు,

"ఋగ్యజుస్సామాథర్వాశ్చ భారతం పంచరాత్రకమ్,
మూలరామాయణం చైవ సంప్రోచ్యన్తే సదాగమాః."

అనువాక్యములును నిరర్థకము లగును. ఆగమ మన- "నిర్దోషః
శబ్ద ఆగమః" అనికదా లక్షణము నిర్వచింపఁబడుచున్నది.
ప్రకృతఁపుశ్రుతియుఁ బంచరాత్రమునుగూడ నొకదాని కొకటి
బాధకము లగుచో దోషగ్రస్తములే యగుచున్నవి. కావున
ఋగ్యజుస్సామాథర్వములును బంచరాత్రమును దోషగ్రస్త
ములే యగుటంజేసి యయ్యవి యాగమకోటిలో నెంతమాత్రముఁ
జేరవుగదా! ఆగమకోటిలోనైనఁ జేరుట కవకాశము లేని
గ్రంథములను సదాగమము లనుట యెట్లు? ఎంతమాత్రము
వీలులేదుగదా! కావున మధ్వరాయాదులయభిప్రాయమున

ఋగ్యజుస్సామాథర్వములును బంచరాత్రాగమమును దురాగమములే యగుచున్నవి. కావున మధ్వరాయాభిమతమును బోధించుటకు నొక్క ప్రమాణగ్రంథమైన నున్నట్లు తెలియరాదు.

కావున 'విశ్వం సత్యమ్' అను శ్రుతికి మధ్వరాయాదులు చెప్పినట్లు జగత్తు సత్య మను నర్థము నెంతమాత్రము గ్రహింపఁగూడదు. వేదభాష్యకారులగు శ్రీవిద్యారణ్యులవారు చెప్పిన యర్థమే సకలశాస్త్రసంమతమగు నర్థమని గ్రహింపవలయును. కావున మధ్వరాయాదులు తలంచునట్లు జగత్తెంతమాత్రమును సత్యము గాదు.

శ్రీసదనమ్,
12—12—34.

ఇతి
నారాయణస్మృతిః.



శ్రీః

# వైదికధర్మసంవర్ధని

సంపుటము 1] నవంబరు, 1935 [సంచిక 11

## విష్ణుదాసునిమధ్వమతము

### ప్రస్థానత్రయముచే నెట్లు ఘటించును?

శ్రీ గుంటూరు 'వైదిక ధర్మసంవర్ధనీ'సభవారి యాజమాన్యమున విష్ణుదాసుని మధ్వమత మెటులు ప్రస్థానత్రయముచే ఘటించునో విమర్శనపూర్వకముగఁ బరీక్షించుచు శ్రీసదనమున జగద్గురు శ్రీకల్యాణానందభారతీ మహాంతాచార్యస్వామిపాదులవారు వైదికమతసంస్థాపనమునకుఁ గావించిన యుపన్యాసముక్తాఫలములను బ్రహ్మశ్రీ రాయప్రోలు లింగనసోమయాజులు బి. ఏ., బి. యల్. గారొక హారముగా సమకూర్చి త్రయీరాజసనికిఁ గంఠాభరణముగ నొసర్చిరి. అయ్యది దిగువఁ బొందుపఱుపఁబడుచున్నది గావున వైదికధర్మానుయాయు లందఱుఁ బ్రీతిచే దనియుదురుగాక !!

వేదములు. బ్రహ్మసూత్రములు, భగవద్గీతలు ఈ మూఁడుగ్రంథములు వైదికు లందఱకుఁ బ్రమాణమే. బ్రహ్మసూత్రములు వేదార్థనిర్ణాయకము లనుటకంటె వేదాంతార్థ

నిర్ణాయకము లనుట శాస్త్రసమ్మతము. బ్రహ్మసూత్రము లందు ముఖ్యముగ నుపనిషత్తులే విమర్శింపఁబడినవి. వేదములు బహుసంఖ్యాకము లలభ్యము లగుటంజేసి తదర్థము వేదాంతములచేఁ బ్రతిపాదిత మగుచున్నది. వేదాంతార్థనిర్ణాయకములు బ్రహ్మసూత్రములు. అందు ఈశకేనాదిదశోపనిషత్తులు ముఖ్యములు. బ్రహ్మసూత్రములచే నిర్ణీత మగు పరమార్థమునే గీత లుపదేశించుచున్నవి. కనుకనే ప్రస్థానత్రియ మని పిలువఁబడు నీమూఁడుగ్రంథరాజములే ప్రమాణగ్రంథములుగ నంగీకరింపఁబడినవి. బ్రహ్మసూత్రములు కృష్ణద్వైపాయనుఁ డను నపరనామముగల వ్యాసునిచే రచింపఁబడినవి. కలిద్వాపర సంధియందు వారు జీవించిరి. న్యాయవైశేషికాదివైదికమతములచేతను చార్వాకాదివేదబాహ్యమతములచేతను వేదమునకుఁ గలుగుచున్న ముప్పు నెడఁబాపుటకై వీ రీసూత్రముల రచించిరి. "తత్తు సమన్వయాత్" అను సూత్రమందలి "తు" శబ్దముచే జైమినిమతమును "ఈక్షతేర్నాశబ్దమ్" "స్మృత్యనవకాశదోషప్రసంగ ఇతి" అను సూత్రములచే సాంఖ్యమతమును బ్రధానమల్లనిబర్హణన్యాయమున నిరాసఁజేయుచు "ఏతేన యోగః ప్రత్యుక్తః" అను సూత్రమున యోగమును "మహద్దీర్ఘవద్వా" అను సూత్రముచే న్యాయవైశేషిక మతములను ద్రోసిపుచ్చినారు. మఱిరెం డధికరణములలో బౌద్ధజైనమతములను "పత్యురసామఞ్జస్యాత్" అను సూత్రముచే పాశుపత మతమును నుత్పత్త్యసంభవాధికరణమునఁ బాంచరాత్రభాగవత మతమును సంపూర్ణముగఁ దీసివేసిరి.

పఠనపాఠనములకొఱకు వేదమునంతయు ఋగ్యజురాది నాలుగుశాఖలుఁ జేసి పంచిపెట్టిరి. ఛాందోగ్య కేన ప్రశ్నోపని షత్తులు సామశాఖకును, ఐతరేయము ఋగ్వేదమునకును, ముండకమాండూక్యము లాథర్వణశాఖకును తైత్తిరీయబృ హదారణ్యములు యజుశ్శాఖకును జెందినవి. బ్రహ్మసూత్రములం దలి 191 అధికరణములలో సుమారు 81, ఛాందోగ్యవాక్య విచారణకు వినియోగింపఁబడినవి. వేదాంత విజ్ఞాన సునిశ్చితా ర్థము మోక్షమునకు ముఖ్యసాధనము గనుక నీ వేదాంతముల యొక్క యంగాంగీభావనిర్ణయమే బ్రహ్మసూత్రముల ముఖ్య భావము. స్వల్పకాలమందు జదువుటకు యోగ్యములగునటుల యనవద్యము నసందిగ్ధము నగు నిండర్థముతోఁగూడిన యల్పా క్షరాత్మకములగు 555 సూత్రము లందుఁ గలవు. విచారణ విషయము, సందేహము, పూర్వపక్షము, సిద్ధాంతము, సంగతి యను బంచావయవవిరాజితము లగు 191 అధికరణములు గలవు. ఇయ్యవి సమన్వయ, అవిరోధ, సాధన, ఫలము లను నాలు గధ్యాయములుగ నొప్పుచున్నవి. సమన్వ యాధ్యాయమునందు మొదటిపాదమున స్పష్టబ్రహ్మలింగ వాక్యవిచారణ, రెండవ మూడవపాదములయం దస్పష్టబ్రహ్మ లింగ వాక్యవిచారణ, నాలవపాదమున నస్పష్టము లగు అజాది పదముల విచారణయుఁ జేయఁబడినది. మొదటిపాదమందలి మొదటి నాల్గు సూత్రములయందు సకల వేదాంతసార మిముడ్పఁబడినది. ఉత్తరగ్రంథ మంతయు నీ చతుస్సూత్రి

వ్యాఖ్యానము. ఈక్షత్యధికరణమునకుఁగూడ చతుస్సూత్రిము
తోఁ బాటు తత్త్వబోధకతను మధ్వరాయలు గల్పించెను.

"యతోవా ఇమానిభూతాని జాయంతే" యను వాక్య
ముచే బ్రహ్మ జగత్కారణ మగుటచే బ్రహ్మ యన్నిఁటి
కంటె నుత్కృష్టమగు వస్తువనియు "బ్రహ్మవి దాప్నోతి పర"
మిత్యాది వాక్యములచే నట్టిబ్రహ్మ నవశ్యముగఁ దెలిసికొను
టకై యన్నిమతములవారును బ్రయత్నించిరి. స్వబుద్ధిసామర్థ్య
ముచేఁ దెలిసికొనఁ బ్రయత్నించిరి. బౌద్ధాద్యవైదికదర్శన
ప్రవర్తకులు స్వబుద్ధిచేఁ దెలిసికొనునది వేదముచే నెంతవఱకు
సమర్థించుకొనవచ్చునో చూడయత్నించిరి సాంఖ్యాదులు.
వేదమాత్రప్రతిపాదిత మగుదానినే గ్రహించి తదనుగుణముగఁ
దమ యూహల మార్చుకొనిరి వేదాంతులు. జగత్కారణ
విప్రతిపత్తులచే నిన్నిదర్శనములకుఁ గారణము గలిగినది. వీరం
దఱును వేదాంతులకుఁ బూర్వపక్షకోటిలోఁ జేరువారే
యగుదురు.

---

౧

# జిజ్ఞాసాధికరణము

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యనునది బ్రహ్మసూత్రములలోఁ బ్రథమసూత్రము. ఇది శాస్త్రారంభక సూత్రము. ప్రతి గ్రంథమునకు సార్థకతను గలుగఁజేయు నధికారి విషయ ప్రయోజనము లను ననుబంధత్రయ మిందు సూచింపఁబడినది. ఇందలి "అథ" శబ్దమునకు ఆనంతర్యార్థము చెప్పవలెను. గ్రంథారంభమందుఁ జేయవలసిన మంగళప్రయోజన మథ శబ్దశ్రవణమాత్రముచేతనే గలుగును. సమన్వయము గాక పోవుటచే "అథ" శబ్దమునకు మంగళార్థముఁ జెప్ప వీలు లేదు. 'జిజ్ఞాసా' యన జ్ఞానేచ్ఛ. అది క్రియ గాదు గాన ప్రారంభ విషయము గానేరదు. కనుక "అథ" శబ్దమునకు ప్రారంభార్థ మీ సూత్రమున ఘటింపదు. ప్రశ్న, కార్త్స్న్య రూపము లగు మిగిలిన రెండర్థములకిచట తావు లేదు గాన అథశబ్దమున కానంతర్యార్థమే యవశ్యము సిద్ధ మగుచున్నది. అతఃశబ్దము హేత్వర్థసూచకము. ఏ కారణముచే బ్రహ్మజిజ్ఞాసేచ్ఛ గలుగుచున్నదో యట్టి కారణ ముండుటవలన నని యర్థము. "బ్రహ్మజిజ్ఞాసా" యన బ్రహ్మవిషయకజ్ఞానేచ్ఛ. వాక్యపూరణముకొఱకు "భవతి" యనుదాని నధ్యాహారముఁ జేసికోవలెను. 'అనంతరము కారణ ముండుటచే బ్రహ్మవిషయకజ్ఞానేచ్ఛ కలుగుచున్న'దని సూత్రార్థము తేలినది. దేని యనంతరము?

యేమికారణముగలది? అని రెండుప్రశ్నలు కలుగుచున్నవి. బ్రహ్మ జనసామాన్యమునకుఁ దెలియనివస్తువు. భూతప్రపంచాత్మకమగు లోకము సువిదితము. ఇట్టి లోకమసత్యమని వైరాగ్యము కలిగినఁ గాని బ్రహ్మజిజ్ఞాసేచ్ఛ కలుగదు. అంతియ కాక మోక్షమునకుఁగారణమును సర్వోత్కృష్టమునగు జ్ఞేయము బ్రహ్మయే యని తెలిసికొనినపుడే బ్రహ్మను దెలిసికొనవలె నను కోరిక కలుగును.

“పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్” నాస్త్యకృతః కృతేన” అను వాక్యములచేఁ గర్మముచే సంపాదింపఁబడిన యీ లోకము, స్వర్గాదులుకూడ ననిత్యము లను జ్ఞానము గలిగినతరువాత శాశ్వతమగు పదార్థమేది కలదని గురుసన్నిధిని జికిత్సఁ జేయ “బ్రహ్మవి దాప్నోతి పరమ్” “బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి” అను వాక్యములచే బ్రహ్మను దెలిసికొనుటచే బ్రహ్మ యగునని హేతుప్రయోజనముల రెంటిని దెలిసికొనుటచే బ్రహ్మను దెలిసికొనుట కిచ్ఛ జనించుచున్నది.

“యతో వా ఇమాని భూతాని జాయంతే” యను వాక్యముచే జగత్సృష్టిస్థితిలయ కారణము బ్రహ్మమే యనియు “తద్విజిజ్ఞాసస్వ” అట్టి బ్రహ్మను తెలిసికొమ్మనియుఁ జెప్పఁబడినది. ఇందుచే లోకమనిత్యమనియు నంతకంటె నుత్కృష్టము శాశ్వతమునగు జ్ఞేయవస్తువు బ్రహ్మపదార్థమొకటి గలదనియు సిద్ధించుచున్నది. వైరాగ్యము గలిగిన యధికా

రికి మోక్షహేతువగు బ్రహ్మపదార్థ మొకటి యుండుటచే నద్దానిం దెలిసికొను కోరిక కలుగుచున్నదని అధికారివిషయ ప్రయోజనపురస్సరముగ సూత్రార్థము తేలినది.

ఇచట మధ్వరాయలు "అథశబ్దో మంగళార్థోఽధికారానంతర్యార్థశ్చ, అతఃశబ్దో హేత్వర్థః" అని అథఅతఃశబ్దములకు అర్థమువ్రాసిరి. శ్రవణమాత్రముచేఁగాక అథశబ్దమునకు మంగళార్థముచెప్పిన, సూత్రసమన్వయము గాకపోవుటయేగాక యీగ్రంథముఁజదువఁదగిన యధికారిని తెలియఁజేయనట్లగును. లోకమే సత్యమని తృప్తిఁజెందు మనుజుఁడు అసులభసాధ్యమగు బ్రహ్మను దెలిసికొనఁగోరఁడు. కాని "ఆ బ్రహ్మస్తంబపర్యంతమసారం చాప్యనిత్యకం స విజ్ఞాయ జాతవైరాగ్యః విష్ణుపాదైకసంశ్రయ ఉత్తమాధికారీ స్యాత్" అని; లోక మనిత్యమని తెలిసికొని విష్ణుపాదైకసంశ్రయుఁడయిన మనుజుఁడే యధికారియని వ్రాయుటచే లోకము సత్యమని తలంచువారికి విష్ణుపాదైకాశ్రయము కలుగదని తెలియఁజేసిరి. ఇందుచే మోక్షమునకు లోకసత్యత్వజ్ఞానము సహజవిరోధియని శ్రీమధ్వరాయల భావముగా తేలుచున్నది.

ఇఁక 'బ్రహ్మజిజ్ఞాసా, అను శబ్దమునకుఁ బ్రత్యేకమర్థము వ్రాయక "బ్రహ్మశబ్దశ్చ విష్ణావేవ" అనఁగాబ్రహ్మశబ్దమునకు విష్ణువునందే యన్వయమని వ్రాయుచు నారాయణమునందలి (3-4-6-35) వాక్యముల నుదాహరించుచు "తన్నోన్న విష్ణురితి వచనాత్" అని తమ యర్థమునకుఁ బ్రమాణముఁ జూపించిరి.

నారాయణమునందలి వాక్యములు ప్రత్యేక మొక విషయమునుగూర్చి చెప్పునవిగాక ఒకదాని కొకదానికి, పౌర్వాపర్యమగు నర్థసంబంధము లేక యనేకస్థలములఁ గానవచ్చు మంత్రములతో నొకచోటఁగూర్చఁబడిన వాక్యకదంబ మయియున్నవి. అందును 5-6-35 మంత్రము లేకార్థబోధకములుగావు. బ్రహ్మ శబ్దమునకు నిఘంటువులలో వ్రాయఁబడిన తొమ్మిదియర్థములలో విష్ణువను నర్థము చెప్పఁబడి యుండలేదు. "యత్పరః శబ్దః స శబ్దార్థః" అను న్యాయముచే బ్రహ్మశబ్దము బ్రహ్మయందు రూఢము; ఇతరులయందు గౌణము.

వ్యాసమహర్షి తన సూత్రములయందు విష్ణువునే జ్ఞేయవస్తువుగాఁ జెప్పఁదలఁచిన, తన గ్రంథమునకు విష్ణుసూత్రము లనియు, మొదటిసూత్రము "అథాతో విష్ణుజిజ్ఞాసా" యనియు వ్రాయవలసియుండును. బ్రహ్మశబ్దమునకు విష్ణ్వర్థముఁ జెప్పుటచే సూత్రమసందిగ్ధార్థముగా నుండవలయు నను లక్షణమునకు భంగము కలుగఁజేయుటయే గాక సర్వజ్ఞుఁడగు వ్యాసునికి కించిద్జ్ఞత్వదోష మాపాదించినవార మగుదుము. ప్రకరణబలముచే బ్రహ్మలక్షణములు గానవచ్చినపుడు జ్యోతిః ప్రాణాకాశాదిశబ్దపరమని చెప్ప వీలులేదు. అట్లే విష్ణుశబ్ద మొక్కఁడనయినను ప్రకరణసిద్ధిచే బ్రహ్మపరముగా వాడఁబడినను బ్రహ్మశబ్దముమాత్రము విష్ణుపరము గానేరదు.

---

౨

# జన్మాద్యధికరణము

పరిదృశ్యమానమగు జగత్తు కార్యమని సర్వమతముల వారు నంగీకరించిరి. దీనికి "యతో వా ఇమాని భూతాని జాయంతే" అను శ్రుతి ప్రమాణము. కార్య మభావద్వయ ఘటితమగును. జగద్రూపకార్యముయొక్క పుట్టుకయు నాశముగానీ మనుజున కనుభవవేద్యములు కానేరవు. కార్యమగు జగత్తునకుఁ గారణమును గల్పించుటయందుఁ గల యభిప్రాయభేదములచే నిన్నిదర్శనములుఁ బయల్వెడలినవి. ఘటరూప కార్యమును జేయుటకు నుపాదానకారణమగు మృత్తును నిమిత్తకారణమగు కులాలుఁడు నెట్లు గావలయునో యటులనే జగద్రూపకార్యమునకుఁ గారణములు రెండా? ఒకటియా? యని విచారణ గలుగ వైశేషికసాంఖ్యమతములవారు ఉపాదానకారణ మొకటియే యని తలంచిరి. అట్టి కారణమే పరమాణువు లని వైశేషికులును ప్రధాన మని సాంఖ్యులును దలంచిరి. పరమాణుప్రధానములు అచేతనము లగ్టుటంజేసి వానిని గార్యములుగఁ జేయుటకై యీశ్వరసాహాయ్యమును న్యాయయోగమతములవారు గల్పించిరి. జగత్తు కార్యమని చెప్పిన పైశ్రుతియే, యట్టి జగత్తునకుఁ గారణ మొకటియే యనియు నది ఉపాదానమె యనియుఁగూడఁ జెప్పుచున్నది. అచేతనమగు నొక యుపాదానకారణమునె యంగీకరించు వైశేషిక సాంఖ్యమతములవారు గాని నిమిత్తోపాదానరూప

కారణద్వయము నంగీకరించు న్యాయయోగమతములవారు గాని శ్రుతిసమ్మతముగాఁ జెప్పకపోవుటంజేసి, చేతనాత్మక మగు నొక్క యుపాదానకారణమునె యంగీకరింపవలసివచ్చెను.

పూర్వమతనిరసన పూర్వకముగ శ్రుతిసమ్మత మగు జగత్కారణమును జెప్పుటకై "జన్మాద్యస్య యతః" యను రెండవసూత్రమును వేదవ్యాసుఁడు రచించెను. ప్రథమసూత్ర మున జ్ఞేయముగ నేబ్రహ్మము చెప్పఁబడినదో యా బ్రహ్మమే పరిదృశ్యమానమగు నీ జగత్తుయొక్క "జన్మాదులకు" అనఁగా సృష్టిస్థితి లయములకుఁ గారణమని సూత్రార్థము. ఈ సూత్ర ముచే జగత్కారణము చెప్పఁబడుటయె కాక ప్రథమసూత్ర మున జిజ్ఞాస్యముగఁ దెలుపఁబడిన బ్రహ్మముయొక్క లక్షణము గూడఁ జెప్పఁబడినది.

ఈ సూత్రమునకు మధ్వరాయ లర్థమును వ్రా యుచు నెవ్వరివలన జగత్తుయొక్క సృష్టి స్థితి సంహార నియ మన జ్ఞానాజ్ఞాన బంధమోక్షములు గలుగుచున్నవో యాతఁడే బ్రహ్మయని బ్రహ్మలక్షణముల వ్రాయుచు—

"ఉత్పత్తిస్థితిసంహారా నియతి ర్జ్ఞానమేవ చ,
బంధమోక్షౌ చ పురుషా ద్యస్మా త్స హరి రేకరాట్."

అని స్కాందపురాణశ్లోకమును, "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభి సంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ" అను తైత్తిరీయమంత్రము

నుదాహరించి జగత్కారణము విష్ణువని వ్రాసిరి. రెండవసూత్రము బ్రహ్మలక్షణమును జెప్పుచున్నదని యుపక్రమించి విష్ణుపరముగ నుపసంహరించుట ప్రకరణవిరుద్ధము. బ్రహ్మశబ్దమునకు విష్ణువను నర్థమును జెప్పఁగూడదని చెప్పియున్నారము. కేవల శివపరమగు స్కాందపురాణము సూతపురాణ మగుటం జేసి హరి కియ్యది ప్రమాణము కానగదా! అచట హరి శబ్దనిర్వచనముగూడ గానరాదు. ఇంతియకాదు; శ్రుతిస్మృతి పురాణేతిహాసములు పూర్వాపూర్వప్రాబల్యము నొందుటచేఁ బ్రమాణము లగుచున్న శ్రుతిని విడనాడి స్కాందపురాణ శ్లోకముచే "యతో వా ఇమాని" అను శ్రుతియందలి బ్రహ్మ శబ్దమునకుఁ గాని, బ్రహ్మసూత్రములలోని మొదటి సూత్ర మందలి బ్రహ్మశబ్దమునకుఁగాని యర్థమును గల్పించుట యనర్థ హేతు వగుచున్నది. జన్మాదిసూత్రమునందలి ఆదిశబ్దముచే నియమనాదుల గ్రహించుట కాధారము గానరాదు.

"జన్మాద్యస్య యతః" అను సూత్రమునకు "యతో వా ఇమాని భూతాని" అను తైత్తిరీయమంత్రము విషయవాక్యము. భృగువు బ్రహ్మస్వరూపమును జెప్పుమని తండ్రిని బ్రార్థింప "ఏది జగత్సృష్టి-స్థితి-లయ-కారణమో అదియే బ్రహ్మముగాఁ దెలిసికొను" మని తండ్రి చెప్ప నద్దానిని గ్రహించుటకై తపము నొనరించి చివరకు నానందము జగత్సృష్టిస్థితిలయకారణ మగుటచే నానందమే బ్రహ్మమని భృగువు స్పష్టముగాఁ దెలిసికొనియెను. కనుక నానందమే బ్రహ్మమనియు నా యానం

దమే మొదటిరెండుసూత్రములలో వ్యాసునిచేఁజెప్పఁబడినట్లును సువిదితమగుచున్నది. ఇట్టి యానందస్వరూపమగు బ్రహ్మమునకు విష్ణువనికాని, శివుఁడనికాని తెలియుటలేదు. ప్రత్యక్షప్రబలప్రమాణమగు శ్రుతిని వదలి యంగభావముచే గౌణముగఁ బ్రమాణములగు పురాణములను బ్రధానప్రమాణములుగ గ్రహించుట వైదికశాస్త్రసంప్రదాయ మెంతమాత్రముఁ గానేరదు. మఱియుఁ బై శ్రుతిచే వైశేషికులపరమాణువులు, సాంఖ్యులప్రధానము, నైయాయిక యోగుల ఈశ్వరసహిత పరమాణుప్రధానములు, పాంచరాత్రమందలి విష్ణువు, పాశుపతమునందలి శివుఁడునుగూడ నిరసింపఁబడెను.

మధ్వరాయ లీసూత్రమున కణుభాష్యమున "విష్ణురేవ విజిజ్ఞాస్యః సర్వకర్తాఽఽగమోదితః" అనుశ్లోకవాదముచే నాగమములచే సర్వజగత్కర్తగాఁ జెప్పఁబడిన విష్ణువే జ్ఞేయవస్తువని వ్రాసెను.

సూత్రమునకు విషయవాక్య మగు శ్రుతిని విడనాడి యాగమమును బ్రమాణముగ గ్రహించుటకుఁ గారణములేదు. ఆగమమన నేమియో, వానికిఁ బ్రమాణభూతములగు నాగమములనెవ్వియో దెలియుటలేదు. విష్ణువునకు సర్వకర్తృరూపమగు నిమిత్తకారణత్వమును గల్పించుటచే వైషమ్యనైర్ఘృణ్యాదోషములు విష్ణువునకు ఘటించును. అంతియకాదు, ఉపాదానకారణము వేరొకటి యుండవలసివచ్చును. కారణద్వయము నంగీకరించుట శ్రుతివిరుద్ధముగదా! ఇట్టిమతము లన్నింటిని

"ఏ తేన స ర్వే వ్యాఖ్యా తా వ్యాఖ్యా తాః" అను ప్రథమాధ్యాయాంతిమసూత్రముచే వ్యాసులు నిరసించిరి.

కావున చేతనమగు బ్రహ్మ యొకటియే జగత్కారణమనియు బ్రహ్మ మానందమనియును శ్రుతిచే సిద్ధించుచున్నది. అనేక పరమాణువుల నొకచోట చూచి యొక నూతనవస్తువు నారంభించినట్లు (ఆరంభవాదము) బ్రహ్మము జగత్తునకుఁ గారణమా? లేక త్రిగుణాత్మకమగు ప్రధానము గుణతారతమ్యముచే భిన్నరూపముగాఁబరిణామము నొందినట్లు (పరిణామవాదము) బ్రహ్మము జగత్తునకుఁ గారణమా? యనఁ నట్లు గాదు. ఏలయన: బ్రహ్మము పరమాణువులవలె ననేకము గాక యొక్కటియే యని శ్రుతిచేఁ జెప్పఁబడుటవలన నారంభ వాదమును జెప్పుటకు వీలులేదు. వికారము (పరిణామము) నొందు కారణము నశించును గావున నిర్వికారమనియు నిత్యమనియు వేదముచే బోధింపఁబడు బ్రహ్మమునకుఁ బరిణామ కారణత్వముగూడ సంభవింపకపోవుటచే నీపరిణామ వాదమును నుటింప నేరదు.

వస్తుస్వరూపము స్వస్వరూపప్రచ్యుతిని జెందకయే వేఱొకటిగా భాసించుట లోకమున దృష్టమగుచున్నది. కావున నట్లే యీ బ్రహ్మము సత్యజ్ఞానానందరూపమును నిర్వికారమునయ్యు నీ జగద్రూపముఁగ భాసించుచున్నదని చెప్పినచో సత్యమగు నేకకారణత్వమును బోధించు శ్రుతికి నెన్నఁటను విరోధము గలుగదు. ఇయ్యదియే వివర్తవాదమని శిష్టు

లచే వ్యవహరింపఁబడుచున్నది. వస్తుస్వరూపము విశేషము గాన వేఱుగా నుండుటయన భావించుటయని వివర్తశబ్దమున కర్థము. త్రాఁటిని జూచి సర్పమను భ్రాంతిని జెందినపుడు త్రాడే సర్పముగఁ గనఁబడుచున్నది. దృష్టకుఁగూడ భయకంపనాది వ్యవహారములు గలుగుచున్నవి. కాని సర్పకారణమగు రజ్జువునకు మాత్రము ఈ సర్పస్వరూపముచే వికారము గలుగలేదు గదా! త్రాడు లేకపోయినచో సర్పము గనఁబడదు గావున సర్పమునకుఁ ద్రాడు కారణమగుచున్నది. త్రాడుమాత్రము సర్పముగా మారుటలేదుగదా! సర్పముమాత్రము భాసించినది. కనుక సర్పమునకుఁ ద్రాడు కారణమనియు నొకవిధముగ సర్పము త్రాడువలన బయలుదేరినది (వచ్చినది) అనియుఁ జెప్పనొప్పును. కాని త్రాడువలన సర్పము పుట్టినదని మాత్రము చెప్పవీలులేదు. త్రాడుయొక్క లక్షణ మెంతమాత్రము పామునందు లేదు.

అయ్యది త్రాఁటికంటెఁ గేవలము విజాతీయము. భ్రాంతి యుండునంతవఱకుఁ ద్రాఁటిని సర్ప మనుకొనుచున్నాము. ఇట్లే బ్రహ్మము జగత్తునకుఁ గారణ మగుచున్నది. జగత్తునకు బ్రహ్మము కారణమగుటచే బ్రహ్మము వలన జగత్తు పుట్టినదని యర్థమును జేసికొనఁగూడదు. భృగువు పరిదృశ్యమానమగు కార్యరూపజగత్తునుబట్టి కారణాన్వేషణముఁ జేసెనుగాని కారణమునందీ కార్య మెట్లు గలిగెనో విచారింపలేదు.

---

3

# శాస్త్రయోనిత్వాధికరణము

"శాస్త్రయోనిత్వాత్" అనునది మూఁడవసూత్రము. ఈ సూత్రమునకు బహువ్రీహిసమాసముచే నొక యర్థము, షష్ఠీతత్పురుషముచే మరియొక యర్థమును గలవు. "శాస్త్రమే ప్రమాణముగాఁ గలవాఁడగుటవలన" నని బహువ్రీహ్యర్థము. రెండవసూత్రమునఁ దెలియఁజేసిన "యతో వా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాదిశాస్త్రములే బ్రహ్మనుగురించి ప్రమాణములు గనుక వానివలననే యద్దానిఁ దెలిసికొనవలయును గాని యితరప్రమాణములచేఁ దెలిసికొనవీలులే దని తాత్పర్యము.

ఇచట శాస్త్రమున బ్రహ్మను దెలిసికొనుటకుఁ బ్రమాణమగు శాస్త్రమని కదా యర్థము. అది ఎద్ది యన: ఈ సూత్రమున కర్థము వ్రాయుచు మధ్వరాయలు "అనుమానతోఽస్య న కల్పనీయాః, నావేదవిన్మనుతే తం బృహంతం సర్వానుభూమాత్మానం సంపరాయే" "ఔపనిషదః పురుష ఇత్యాదిశ్రుతిభ్యః" అని చెప్పెను. అనఁగా సర్వోత్కృష్టమగు బ్రహ్మ యుపనిషద్వేద్యమగుటచే వేదము తెలియనివాఁ డద్దానిఁ దెలిసికొనఁ జాలఁ డనియు నద్దానిఁ దెలిసికొనుటకు వేదముకంటె నితరప్రమాణములను గేవల మూహాబలముచేఁ గల్పింపకూడదనియు వ్రాసిరి. "ఔపనిషదః పురుషః" అను దానిని జయతీర్థులు, జగత్కర్తయగు బ్రహ్మ యుపనిషదేక

గమ్యమనియు వ్రాసిరి. కాని శాస్త్రశబ్దమున కిటుల మధ్వా రాయ లర్థము వ్రాసిరి—

"ఋగ్యజుస్సామాథర్వాశ్చ భారతం పంచరాత్రికం,
మూలరామాయణం చైవ శాస్త్ర మిత్యభిధీయతే.

యచ్చానుకూల మేతస్య తచ్చ శాస్త్రం ప్రకీర్తితమ్,
అతోఽన్యో గ్రంథవిస్తారో నైవ శాస్త్రం కువర్త్మతత్.

...... వేద పంచరాత్రయో రైక్యాభిప్రాయేణ పంచ రాత్రస్యైవ ప్రామాణ్య ముక్తమ్" అని.

ఇందువలన ఋగ్యజుస్సామాథర్వము లను నాలుగు వేదములును, భారతమును, పంచరాత్రమును, మూల రామాయణమును మాత్రమే శాస్త్రముగా గ్రహించి, ఇతరగ్రంథములను గ్రంథ వి స్తా ర ము గా ని శాస్త్ర మెంతమాత్రము కాదనియు కుత్సితమార్గములనియు త్రోసిబుచ్చిరి. మరియు వేదపంచరాత్రము లేకాభిప్రాయము లగుటచే పంచరాత్రమునకే ప్రామాణ్యము చెప్పఁబడినదని వ్రాసిరి. "బ్రహ్మౌపనిషదః పురుష ఉపనిషదేకగమ్యః" ఉపనిషత్తులచేతనే తెలిసికొనఁదగినదని వ్రాసినను మధ్వారాయల ప్రమాణగ్రంథములలో మాత్ర మవి లేవు. 'ఉపనిషదేకగమ్యః' అనఁగా బ్రహ్మ యుపనిషత్తులలో మాత్రమే తెలియఁజేయఁబడినదని చెప్పుటచే భారతపంచరాత్రమూలరామాయణములు బ్రహ్మను

ంరించి చెప్పవనియు నీగ్రంథములలో వినఁబడునర్థము
హ్మ కాదనియుఁగూడఁ దేలుచున్నది.

మరియు "ఇష్టానిష్ట ప్రాప్తిసాధన..."వేదానధికారిణాం
శూద్రాదీనాం చ ధర్మజ్ఞానాదిద్వారా మోక్షోభవేదితి"
ని భారతము వేదానధికారులగు స్త్రీశూద్రాదులకై వ్రాయఁ
డినటుల మధ్వరాయలు వ్రాసిరి. మూలరామాయణ మన
గ్రంథ ము ద్దేశింపఁబడినదో తెలియరాదు గాని వాల్మీకిరచిత
గు శ్రీమద్రామాయణముమాత్రము గానట్లున్నది. మూల
స్వారస్యముగూడఁ దెలియుట లేదు. భారత పంచరాత్ర
లు తంత్రము లని ద్వైతసిద్ధాంత మొప్పుకొనుచున్నది.
అంత్యజా అపి యే భక్తా నామజ్ఞానాధికారిణాం, స్త్రీశూద్ర
హ్మబంధూనాం తంత్రేస్మిన్నధికారితా" అని పంచరాత్ర
రికిఁ బ్రమాణమో మధ్వరాయలు వ్రాసిరి. "అంత్యజా
బాహ్యాః...తంత్రం పంచరాత్రాది, అధ్యయనాభావేన
దికజ్ఞానానధికారిత్వేపి త్రివర్ణేతరేషాం నామజ్ఞానాధికారి
త్ మోక్షోపపత్తిరితిభావః"అని తంత్రశబ్దమునకు వేదాన
రులై వర్ణబాహ్యులగు నంత్యజుల కుపకారములగు
ంథములని జయతీర్థులు వ్యాఖ్యవ్రాసిరి.

అందుచే నధ్యయనాధికారములేని యంతిమజాతివారలు
వన్నామముమాత్రము తెలిసికొని మోక్షము నొందు
కై భారత పంచరాత్రతంత్రములు వ్రాయఁబడినట్లు మధ్వ
యలు దలంచిరి. కనుక మధ్వరాయల యభిప్రాయాను

చున్నది. ఈ సాంఖ్యయోగములకును కపిల పతంజలికృతము లగు సాంఖ్యయోగశాస్త్రములకును సంబంధము లేదు. శ్రీకృష్ణుం డుపదేశించిన సాంఖ్యయోగములయందలి విషయములు కాపిలపాతంజలశాస్త్రముల కత్యంతభిన్నములు. వ్యాసమహర్షి కాపిల పాతంజల మతములను "ఈక్షతే ర్నాశబ్దమ్" "ఏతేన యోగః ప్రత్యుక్తః" ఇత్యాదిసూత్రములచేం ద్రోసిపుచ్చెను. భగవద్గీతయందలి 2 అ. 11-38 శ్లోకమువరకును మోక్షైక సాధనమగు జ్ఞానోపదేశమును శ్రీకృష్ణుఁడు చేసి యిట్టిసాంఖ్య నిశ్చయము నీకుఁ జెప్పితిననియు నింకముందు యోగనిశ్చయ మును జెప్పుచున్నాననియు నర్జునునకుఁ జెప్పెను. అట్టి యోగ తత్త్వమును దెలిసికొనినయెడలఁ గర్మబంధమునుండి ముక్తి గూడఁ గలుగునని తెలియఁజేసెను. కనుక నాత్మజ్ఞానము సాంఖ్యమనియుఁ గర్మలయందలి కౌశలము యోగమనియు శ్రీకృష్ణభగవానుని తాత్పర్యము. ప్రస్తావవశమున నీ సాంఖ్య మర్జునునికొరకుఁ దిరిగి చెప్పఁబడుటచే నీ శాస్త్రము భారతాంతర్గతమయినను నూతనముగఁ జెప్పఁబడినదిగాదు. "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ, జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్" "ఇమం వివస్వతే యోగమ్" అను శ్లోకమునందవ్యయమగు నీ సాంఖ్యమును దాను సర్గాదియందు వివస్వంతునకుఁ జెప్పినట్లును, వివస్వంతుఁడు మనువునకును మనువు తనపుత్రునకుఁ జెప్పినట్లును జ్ఞానాత్మక మగు నీసాంఖ్యముయొక్క వంశకథాప్రస్తావముఁ జేసెను. కనుక నిది కేవలముసృష్ట్యాదియందు భగవన్ముఖనిస్సృతమయి తిరిగి

మధ్వరాయలు మూఁడవ సూత్రమునకు షష్ఠీతత్పురుషముచే లభ్యమగు నర్థముఁ జెప్పలేదు. సర్వశాస్త్రమునకు బ్రహ్మమే కారణమని యిచట భావము. సర్వజ్ఞానమున కాకరమగు ఋగ్వేదాదులు "మహతో భూతస్య నిశ్వసిత" మని శ్రుతి సిద్ధము. ఇట్టి మహాసిద్ధవస్తు వెద్ది యన: "అయ మాత్మా అనంతరః అబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ" అనఁగా బాహ్యాభ్యంతర భేదములులేక ఘనీభవించి జ్ఞానస్వరూపమయి యనుభవైక వేద్యమగు నాత్మయే యని చెప్పఁబడినది. "సత్యం జ్ఞానమనంతమ్" అని తైత్తిరీయమున బ్రహ్మలక్షణము చెప్పఁబడినది. కనుక బ్రహ్మాత్మలకు భేదము లేదని తేలుచున్నది. ఆనంద స్వరూపముగఁ దైత్తిరీయమునందుఁ జెప్పఁబడిన బ్రహ్మయే "విజ్ఞాన మానందం బ్రహ్మ" యని బృహదారణ్యమున నిరూపింపఁబడినది గనుక బ్రహ్మ యన నానంద స్వరూపమే యనియు విష్ణువుగాదనియు నట్టి బ్రహ్మ ఉపనిషచ్ఛాస్త్రైకగమ్యమనియు నట్టిబ్రహ్మవలననే సర్వశాస్త్రములు కలుగుచున్నవనియు సర్వోపనిషద్బోధిత మగునది బ్రహ్మగాని విష్ణువుగాదనియు పంచరాత్రాదిగ్రంథములు బ్రహ్మస్వరూప నిరూపణమునకు వైదికులు ప్రమాణములుగా గ్రహింపఁజాలరనియు స్పష్ట మగుచున్నది.

౪

# సమన్వయాధికరణము

మొదటి మూఁడు బ్రహ్మసూత్రములమీఁద మధ్వ రాయలు వ్రాసిన వ్యాఖ్యలోని ముఖ్యార్థమిట్లు చెప్పవచ్చును:

## 1-వ సూత్రమున

1. ఆబ్రహ్మస్తంబపర్యంత మగు జగత్తసార మనిత్య మని తెలిసికొని వైరాగ్యముఁ జెంది విష్ణుపాదైక సదాశ్రయుఁ డగు మనుజుఁ డుత్తమాధికారి యగును.

2. నారాయణప్రసాదమే మోక్షసాధనము.

3. విష్ణువే జిజ్ఞాస్యము.

ఈమూఁడును బ్రథమసూత్రమువలన.

## 2-వ సూత్రమున

4. సృష్టి స్థితి సంహారనియమన జ్ఞానాజ్ఞాన బంధ మోక్షము లను నెనిమిదియు హరివలనఁ గలుగుచున్నవి.

5. విష్ణువు జగత్తునకుఁ గర్తగాని యుపాదానముగాదు.

## 3-వ సూత్రమున

6. నాలుగువేదములు, భారతము, పంచరాత్రము, మూలరామాయణము ప్రమాణములు. తత్రాపి పంచరాత్రమునకుఁ బ్రాముఖ్యము- అని.

ఇచట మోక్షమన నేమో చెప్పలేదు. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" బ్రహ్మను దెలిసికొనినవాఁడు బ్రహ్మ

యగును. అదియే మోక్ష మని మా సిద్ధాంతము. నారాయణ ప్రసాదమువలన సాక్షాత్తుగా మోక్షము కలుగదనియు నట్టి ప్రసాదముచే వైరాగ్యము, వైరాగ్యముచే జ్ఞానము, జ్ఞానముచే మోక్షమనియు మా సిద్ధాంతము. మధ్వరాయలు హరిబ్రహ్మ స్వరూపనిరూపణము చేయలేదు. ఆనందమే బ్రహ్మయని భృగు వల్లి మైత్రేయబ్రాహ్మణములు చాటుచున్నవి. జగత్తునకుఁ గల కారణములన్నియు, అనఁగా నిమిత్తోపాదానకారణములు రెండును, బ్రహ్మయే యని "యతో వా ఇమాని భూతాని జాయంతే" యను శ్రుతివలన సువిదిత మగుచున్నది. బ్రహ్మకు సృష్టిలయములఁ జేరొనుటచే నిమిత్తకారణత్వము, స్థితిని జేరొనుటచే నుపాదానకారణత్వము సిద్ధించుచున్నది. మధ్వ రాయల ప్రమాణ గ్రంథములఁగూర్చి కడచిన యుపన్యాసమున విపులముగఁ జర్చింపఁబడినది.

"తత్తు సమన్వయాత్" అను సూత్రమునకు సర్వోపనిష ద్వాక్యతాత్పర్యము బ్రహ్మయందే సమన్వితమగుటచే మొదటి మూఁడుసూత్రములచే ఏ బ్రహ్మ ప్రతిపాదింపఁబడెనో యట్టి సర్వజ్ఞమగు బ్రహ్మయే వేదాంతశాస్త్రముచే ప్రమిత మగుచున్నది గాని యితరములు గావని తాత్పర్యము. ఈ సూత్రములోని 'తత్, తు' శబ్దములకు మధ్వరాయ లీ యర్థము చెప్పక "సమన్వయాత్" అనుదానికి మాత్రము వ్యాఖ్య వ్రాయుచు "అజ్ఞానాం ప్రతీయమానమపి నేతరేషాం శాస్త్ర యోనిత్వమ్" శాస్త్రయోనిత్వమితర దేవతలకుఁగూడఁగనఁబడు చున్నను ప్రాజ్ఞులు విష్ణువునే శాస్త్రయోనిగా గ్రహింపఁగలరు.

ఎందువలననగా: నుపక్రమాదిలింగములచే నిరూపించినప్పుడు విష్ణువే శాస్త్రగమ్యుఁ డగుచున్నాఁడు గనుక నని వ్రాసిరి. వేదాదులయందును పాశుపతాదితంత్రములయందును రుద్రునకుఁ గూడ జగత్కారణత్వము వినఁబడుటచే రుద్రునియందీ సూత్రము వర్తించు నను పూర్వపక్షనిరాసకొఱకని జయతీర్థులు 'ఇతరేషామ్' అను పదమునకు సార్థక్యమును జెప్పిరి. ఇందుచేఁ బాశుపత పంచరాత్రముల కన్యోన్యముఁగల వాదములలో పాశుపతమత నిరాసపురస్సరముగ నీ నాలుగు సూత్రములకును విష్ణుప్రతిపాదకముగ మధ్వరాయ లర్థకల్పనఁ జేసినట్లు సువిదిత మగుచున్నది. "పత్యు రసామంజస్యాత్" అను సూత్రముచే పాశుపతమతమును 'ఉత్పత్త్యసంభవాత్' అను సూత్రముచే బాంచరాత్రమును వ్యాసులు ద్రోసిబుచ్చినందున బ్రహ్మవిచారణయందా రెండుమతముల తారతమ్యవిచారణము మన కక్కరలేదు. రెండును నుపనిషదేక గమ్యమగు బ్రహ్మకుఁ గడుదూరమని చెప్పవలయు.

ఉపనిషత్తులన్నియు బ్రహ్మపరములని చెప్పియుంటిమి. అందు రెండవసూత్రమునకు విషయవాక్యమగు "యతో వా ఇమాని భూతాని జాయంతే" యను వాక్యముగల భృగువల్లియు, మూఁడవ సూత్రమునకు విషయవాక్యములఁ జెప్పు మైత్రేయ శాకల్య బ్రాహ్మణములును సర్వోపనిషన్మకుటాలంకారములై సర్వప్రమాణముల కగ్రస్థానము నలంకరించుచున్నవి.వీనియర్థమే మిగిలిన యుపనిషత్తులయందు సమన్వితమగుచున్నది.

సత్యధ్యానతీర్థులవారి ప్లయింటులోని మతము మధ్వ మతమునుండి దూర మగుచున్నదని వ్రాసి యుంటిమి. మధ్వరాయల కభిమతమగు భారత 'పంచరాత్ర మూల రామాయణము లను ప్రమాణగ్రంథముల విడనాడి మధ్వ రాయలు గ్రహింపని వేదార్థనిర్ణాయకములగు బ్రహ్మసూత్ర ములను భగవద్గీతలను తీర్థులవారు తమమతమున కాధారము చేసికొనిరి. భగవద్గీత భారతాంతర్భాగమని చెప్పినను భారతము వేదానధికారులును త్రివర్ణేతరులును నగు స్త్రీశూద్రాదుల కొఱకు రచియింపఁబడినట్లు మధ్వరాయలంగీకరించినపుడు బ్రాహ్మ ణోత్తములుగఁ బరిగణింపఁ బడుచున్న తీర్థులవారికి వైదిక వైష్ణవమత ప్రతిపాదనమున కెట్లుపకరింపగలదు? తీర్థమధ్వరాయ లకుఁ బ్రమాణము లెట్లు భిన్నమో వారిమతసూత్రములు నట్లే భిన్నములు.' తీర్థులవారిమతమునందు బ్రాహ్మణాదివర్ణములు బ్రహ్మచర్యాద్యాశ్రమములు మున్నగు సమస్తజగత్తు నిజము. "ఆబ్రహ్మస్తంబపర్యంత మసార మనిత్యమ్" అని మధ్వ రాయలు ఘంటాపథముగఁ జెప్పిరి. పరమాత్మ జీవునికంటె భిన్నుఁడు, పరమాత్మ జీవునికంటె భిన్నుఁడను జ్ఞానమే మోక్ష సాధనమని తీర్థులవారు దెలిపిరి. నారాయణప్రసాదమే మోక్ష సాధనమని మధ్వరాయలు బోధించిరి నారాయణప్రసాదముచే మోక్షము ఘటించుచుండ దురవగాహమగు పరమాత్మజీవ భిన్నజ్ఞానసంపాదన నెవరు గోరుదురు? ఇందుచేఁ దీర్థులవా మతము మధ్వమతానుయాయి గాదని వ్రాసితిమి.

౫

# ఈక్షత్యధికరణము

## ఆత్మ దృశ్యమా?

గ్రంథమండలి తొలి నాల్గుసూత్రములచేతను బోధింపఁబడిన యర్థము సిద్ధము. ఇయ్యది శ్రుత్యంతావతంసమగు భృగువల్లిచేతను, శాకల్య మైత్రేయ బ్రాహ్మణముల చేతను బోధింపఁబడుచున్నది. ఈ సిద్ధమగు గ్రంథమునకే యుత్తరగ్రంథ మంతయు వ్యాఖ్యానరూపమని బ్రహ్మసూత్ర వ్యాఖ్యానకర్త లందఱు నంగీకరించిరి.

ఇఁక సర్వోపనిషత్తులలోను ఛాందోగ్యము వివాదాకరమగుటచే నీ బ్రహ్మసూత్రములం దయ్యదియే యెక్కుడుగా విచారింపఁబడునని పూర్వము ప్రదర్శించియే యున్నారము. అందులకు నీ గ్రంథమండలి యధికరణములలో ఛాందోగ్య విషయకములగు నధికరణములసంఖ్యాబాహుళ్యమే ప్రమాణము. సిద్ధగ్రంథమగు చతుస్సూత్రియనంతరమందు ఛాందోగ్య విషయమును జర్చించు "ఈక్షతే ర్నాశబ్దమ్" అను సూత్రమాదిగాఁ గల యీ యీక్షత్యధికరణమును శ్రీ వేదవ్యాసులు నిబంధించుటకూడ నద్దానినే సూచించుచున్నది. కనుకనే మిగిలిన సూత్రవ్యాఖ్యాత లందఱుగూడ నీ యధికరణమున ఛాందోగ్యమందలి షష్ఠప్రపాఠకమగు శ్వేతకేతూద్దాలకసంవాదవిషయమునే జర్చించియున్నారు. ఈ యధికరణ

మున నేడు సూత్రములు గలవు. వానిలో నైదుసూత్రములు ప్రకృతఫుచ్ఛాందోగ్యవిషయమును జర్చించుచున్నవి. మిగిలిన రెండుసూత్రములును జెప్పఁబడిన విషయమున శ్రుతి సామాన్యసమన్వయమును జేయుచున్నవి.

కాని మధ్వాచార్యులవా రన్ననో పై సూత్రవ్యాస కర్తలప్రస్తావములఁ బూర్తిగా విడచి వేఱొక ప్రస్థానము నవలంబించిరి. వీ రీ యీక్షత్యధికరణముతోఁ గూడిన యైదధి కరణములచేతను జెప్పఁబడిన యర్థమే సిద్ధమనియు నద్దానినే యుత్తరగ్రంథము వివరించుచున్నదనియు నూతనమగు మార్గమును బ్రదర్శించిరి. ఇంతియ కాదు, అధికరణార్థవిచారణమునఁగూడ వీరు ఛాందోగ్యమందలి శ్రుతులఁ జేర్కొనక నానాముఖములగు విభిన్నోపనిషత్తులయందలి మంత్రైక దేశములను విషయములుగాఁ గనఁబఱచిరి.

ఏదైన నొకయుపనిషత్తునందలి విషయమును గ్రహించి యద్దానియందలి విశయ పూర్వపక్షోత్తరసంగతులతోడ నా విషయమును జర్చించుటయే యధికరణస్వరూప మయియున్నది. కాని నానాముఖములగు నుపనిషద్వాక్యములఁ జర్చించుట యధికరణస్వరూపముకాదుగదా !

మధ్వాచార్యులవారు "ఈక్షతే ర్నాశబ్దమ్" అను సూత్రమునకు "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" అను 'అశబ్ద మస్పర్శమ్' "అవచనే నైవ ప్రోవాచ" అను శ్రుతులచే బ్రహ్మము శబ్దగోచరము గాదను పూ

పక్షముగాఁగా సూత్రము ప్రారంభింపఁబడుచున్నదని ప్రతీకమును వ్రాసిరి. వేదమునందు బ్రహ్మమున కీక్షణీయత్వము దెలియవచ్చుటచే నయ్యది శబ్దగోచరమే యగుచున్నదని సూత్రార్థమునుజెప్పిరి. ఇందులకుఁబ్రమాణములుగా "స ఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరం పురిశయం పురుషమీక్షతే" ఆత్మన్యేవాత్మానం పశ్యేత్ "విజ్ఞాయ ప్రజ్ఞాంకుర్వీత" అని ప్రశ్నోపనిషత్తునందు, బృహదారణ్యకమందు నచ్చటచ్చట మంత్రైకదేశముల నుదాహరించిరి. ఇందు 'ఈక్షతే, పశ్యేత, విజ్ఞాయ' అని బ్రహ్మమున కీక్షణీయత్వము వినఁబడుటవలన నయ్యది యీక్షణీయమేయని సిద్ధాంతించిరి. ఇచట బ్రహ్మమవాచ్యమను పూర్వపక్షమునకు బ్రహ్మ మీక్షణీయమే యనునది యెట్లు సమాధానమగునో బుద్ధిమంతులు గ్రహింతురుగాక!

ఇంతియకాదు; పై నుదాహరించినశ్రుతులు బ్రహ్మమశబ్దగోచరమని చెప్పుచున్న వేయని శంకించుకొని బ్రహ్మయొక్క యప్రసిద్ధివలన నయ్యది యట్లు చెప్పుచున్నవిగాని యాశ్రుతులకు బ్రహ్మముయొక్క యశబ్దగోచరత్వమునందుఁ దాత్పర్యము లేదని మధ్వాచార్యులవారు సమాధానమును జెప్పిరి. బ్రహ్మము జిజ్ఞాస్యమని చెప్పు ప్రథమసూత్రముచే బ్రహ్మముయొక్క ప్రసిద్ధి దెలియఁబడుచుండ బ్రహ్మమప్రసిద్ధమని చెప్పుట సమంజసము కానేరదు గదా! ప్రసిద్ధమగుచు సందేహగ్రస్తమును సప్రయోజనము నగుదానియందే జిజ్ఞాస కలుగునని శిష్టసమ్మతము.

ఇఁక రెండవసూత్రమగు "గౌణ శ్చే న్నాత్మశబ్దాత్" అను సూత్రమ్మునొక్క వాఖ్యానమున నాత్మ సగుణమనియు నిర్గుణమనియు రెండువిధములుగాఁ బరఁగుచున్నదనియు నందు నిర్గుణాత్మయేముఖ్యాత్మయనియు నయ్యదియే యీక్షణీయము గాని సగుణాత్మ గౌణాత్మయగుటచే నీక్షణీయ మెంతమాత్రము గాదనియు వ్రాసిరి. ఆత్మానాత్మలక్షణమును—

"యో గుణై స్సర్వతో హీనో యశ్చ దోషవివర్జితః,
హేయోపాదేయరహితస్స ఆత్మేతి సతాం మతమ్.

ఏతదస్యస్వభావోయః సోఽనాత్మేతి సతాంమతమ్."
అని ప్రదర్శించిరి. దీనివలన సర్వగుణహీనమై దోషరహితమై హేయోపాదేయరహితమగునదియేయాత్మయనియుఁ దద్భిన్నమగునది యాత్మకాదనియుఁగూడ నన్వయవ్యతిరేకములవలనఁ దెలియఁజెప్పిరి. గుణమనఁగా త్వక్చక్షురాదిజ్ఞానేంద్రియ పంచకముచేతను మనస్సుచేతను దెలియఁబడునది. వానిచేఁ దెలియఁబడనిది నిర్గుణము.

జ్ఞానేంద్రియపంచకముచేతను మనస్సుచేతను దెలియఁబడు గుణమే యాత్మయందు లేదు గనుకనే యాత్మ నిర్గుణ మనఁబడుచున్నది. అద్దానినే "యతో వాచో నివర్తన్తే" యన్నగు శ్రుతులు పలుకుచున్నవి. జగత్తునకు నాత్మ దృశ్యము గావున వాచ్యమని మధ్వరాయలయాశయము.

ఇఁక 'తన్నిష్ఠస్యచ మోక్షోపదేశాత్' అను సూత్రముచే నా ముఖ్యాత్మనిష్ఠునికే మోక్షముగాని గౌణాత్మనిష్ఠునికి

మోక్షము లేదని చెప్పఁబడుచున్నదని మధ్వరాయలు వ్రాసిరి. "అయమాత్మా బ్రహ్మ" అను శ్రుతులు ఈ యాత్మయే బ్రహ్మయని చెప్పుచుండుటవలన నీయాత్మనిష్ఠులకే మోక్షమని మధ్వాచార్యులవారు వివరించిరి. దీనివలనఁ బూర్వము జిజ్ఞాసాసూత్రమున వ్రాసిన "యతో నారాయణ ప్రసాదామృతేన మోక్షః" అను నారాయణుని ప్రసాదము వలన మోక్షము గలుగునను వాక్యమును ద్వైతులవారిట్లయింటు నందుఁగల జీవ పరమాత్మ భేదజ్ఞానమే మోక్షసాధన మను వాక్యమును నిరసింపఁబడుచున్నట్లు సుస్పష్టము. ఇంతియకాదు, 'భేదవ్యపదేశాత్' అను సూత్రమునకుఁ బ్రతీకముగ "స చ తత్త్వ మస్యహంబ్రహ్మాస్మీత్యాదిశ్రుతివిరోధః" అని యాది శబ్దముచే 'అయమాత్మా బ్రహ్మ' మున్నగు శ్రుతులను బుద్ధి యం దుంచుకొని "తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి, అయమాత్మా బ్రహ్మ" మున్నగు శ్రుతుల కభేదమునందుఁ దాత్పర్యమును వర్ణించిరి. ఇట్లిచట వర్ణించినరాయలవారు 'తత్త్వమసి' అనుచో 'అతత్త్వమసి' అని అకారప్రశ్లేష చేయుటయు మిగిలిన రెండు శ్రుతులకు వేఱొక యర్థమును గల్పించుటయు నెంత సమంజసముగా నుండునో నిష్పక్షపాతబుద్ధులగు విబుధులు గ్రహింతురుగాక !

నిర్గుణాత్మజ్ఞానముచేతనే మోక్షమనియు సగుణాత్మ జ్ఞానముచే ముక్తినొందఁజాలఁడనియు—

"తస్యాత్మనో నిర్గుణస్య జ్ఞానా న్మోక్ష ఉదాహృతః,
సగుణా స్త్వపరే ప్రోక్తా స్తద్జ్ఞానాన్నైవ ముచ్యతే." *

అని ప్రమాణపురస్సరముగ మధ్వరాయలచేఁ జెప్పఁ బడియెను.

ఇట్లే 'స్వాప్యయాత్' అను సూత్రమున "స ఆత్మన ఆత్మాన ముద్ధృత్యాత్మన్యేవ విలాపయతి, అథాత్మైవ భవతి" అని ఆత్మభావమే ముక్తిగా నిరూపింపఁబడెను.

'గతిసామాన్యాత్' అను సూత్రముచే సర్వవేదాంతములును విమతులుగాక ఘంటాపథముగ నొక్క బ్రహ్మజ్ఞానమునే చెప్పుచున్నవని మధ్వాచార్యులు ముక్తకంఠులై వచించిరి. అందుఁ బ్రమాణముగ "సర్వే వేదా యుక్తయః సుప్రమాణాః. బ్రహ్మజ్ఞానం పరమం త్వేకమేవ ప్రకాశయంతే" అని చెప్పిరి.

ఇట్లు చెప్పి 'శ్రుతత్వాచ్చ' అను సూత్రమునకు నర్థమును నిరూపించుటలో "ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా, కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" అనుదానిని బ్రమాణముగ నిరూపించిరి. మధ్వాచార్యులవారు ఇందు 'గూఢః' అనుటవలన అదృశ్యుఁడని స్పష్టముగాఁ దెలియవచ్చుచుండ 'ఆత్మనోఽపి దృశ్యత్వాత్' అను మధ్వరాయలవారివాక్య మెట్లు సమంజసమగును? ఇందు సర్వభూతములయందు నొక్కఁడే యీశ్వరుఁడని చెప్పుటవలన జీవపరమాత్మభేదమును బ్రహ్మము సజాతీయ విజాతీయ స్వగత భేదరహితము నని సుస్పష్ట మగు

చున్నది. ఇయ్యది శ్వేతాశ్వతరమందలి శివబోధకమగు మంత్రము.

ఇట్లు బ్రహ్మాత్మల కభేదము నొప్పుకొనినను బ్రహ్మాత్మలు సుప్రసిద్ధములై యీక్షణీయములగుటచే నవాచ్యములు గాక వాచ్యములే యగుచున్నవని మధ్వరాయలు నొక్కి చెప్పిరి. అప్రసిద్ధమైన నవాచ్యమనియుఁ బ్రసిద్ధమగునదియే వాచ్యమగుననియు వారియాశయమని నిరూపించితిమి.

ఇఁక నాత్మ దృశ్యమా? అని విచారింపఁదగు. దృశ్యమన నింద్రియగోచర మగుటయే యని చెప్పియున్నారము. మధ్వమతిమునఁ బారమార్థిక లౌకిక భేదము లేదు. గావున నాత్మదృశ్యమనిన జగత్తువలెనే యాత్మగూడ దృశ్యమని మధ్వరాయల యభిప్రాయము. "జగత్, మిథ్యా, దృశ్యత్వాత్, రజ్జుసర్పవత్" సర్పమనుభ్రమచే గ్రహించిన రజ్జువువలెనే జగత్తు గూడ దృశ్యమగుటచే మిథ్య యని యనుమానైకప్రమాణ వాదులకొఱకుఁ గల్పింపఁబడిన యద్వైతానుమానమును ఖండించుటకు మధ్వరాయలు 'ప్రపంచమిథ్యాత్వానుమాన ఖండన' మను నొక పండ్రెండు పంక్తులు గల ప్రకరణము నొకదానిని వ్రాసిరి. పై యనుమానమును మధ్వరాయలవారు విమర్శించుచు జగత్తుయొక్క మిథ్యాత్వమును సాధించుటలో దృశ్యత్వ మెంత మాత్రము హేతువు గానేరదు కనుక దృశ్యమగు నీజగత్తు మిథ్య యెంతమాత్రము గాదు. కనుక "విమతం సత్యం దృశ్యత్వాత్, యథా ఆత్మా" అని దృశ్యమగు నాత్మ యెట్లు సత్యమో,

యటులే జగత్తుగూడ దృశ్యము గావున సత్యమని వేఱొక యనుమానరచనను జేసిరి.

ఇంతియే కాదు, జగత్తు సత్యమనుటకు "విశ్వం సత్యమ్" అను శ్రుతివచనము నాధారముగాఁ జేకొనిరి. "ఆబ్రహ్మ స్తంబ పర్యంత మసారం చా ప్యనిత్యకమ్" అను మధ్వారాయలవారి వచనమువలనను 'యత్కృతికం త దనిత్యమ్'అను నభియుక్తోక్తి వలనను జగత్తు అనిత్యమని సుస్పష్టమగుచుండ సత్యమని చెప్పుట యెంత యుచితముగా నున్నదో చెప్ప వీలులేదు. ప్రథమసూత్రమున నసారమనియు ననిత్యమనియు మధ్వారాయలవారే వక్కాణించిరి. ఇంతియకాదు, శ్రుతిసందర్భమును బట్టి చూచినచో నీవిశ్వశబ్దము జగద్వాచక మెంతమాత్రముఁ గానేరదు. ఏలయన: నియ్యాది మరుద్గణగుణములను వర్ణింపుచు, విశ్వం - మరుద్గణముయొక్క వర్ణింపఁబడిన గుణసముదాయ మంతయు, సత్యం-నిజమే యగుచున్నది - అనఁ గల్పితము గాదని యర్థము. ఇంతియకాదు; సర్వనామగణములో నీ విశ్వశబ్ద ముండుటంజేసి యియ్యాది జగత్తునందే రూఢ మగు నని చెప్ప వీలులేదుగదా! శ్రుతియందుఁగూడఁ బ్రచురముగాని విశ్వ శబ్దము సర్వపర్యాయముగానే వాడఁబడుచున్నట్లు వేదవిదులకుఁ దెలియని విషయము గాదు. విష్ణుసహస్రనామములయందలి "విశ్వం విష్ణు ర్వషట్కారః" అనుచో నీ విశ్వశబ్దము విష్ణ్వపర పర్యాయముగా వాడఁబడినది. కనుక "విశ్వం సత్యమ్"అను శ్రుతివాక్యము జగత్తునకు సత్యత్వము నెంతమాత్రము బోధింపనేరదు.

అనుమానమునందలి 'దృశ్యత్వాత్' అను హేతువు శ్రుతివిరుద్ధ మగుటచే 'విమతం సత్యమ్' అను ప్రతిజ్ఞయు సరి కాదు. అందుచే 'యద్యద్దృశ్యం తత్తత్సత్యమ్' 'దృశ్యమగున దెల్ల సత్యమగునను వ్యాప్తియు సరికాదు. 'యథా ఆత్మా' అను దృష్టాంతముగూడ 'ఈక్షతే ర్నాశబ్దమ్'అను సూత్రమునకుఁ బైనిఁ జెప్పినతీరున నపార్థమును గల్పించుటచే దృష్టాంతాభాస మగుచున్నది. ఇట్టి యుదాహరణముచే సిద్ధించు నిగమనము అశాస్త్రీయమే యగును. "ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ" అను శ్రుతిని బ్రమాణముగా గ్రహించి యాత్మలక్షణమునుగూర్చి తమ భావము నట్లు దెలిపిరి! గూఢ శబ్దమునకు దృశ్యముకాద నియునర్థముఁ జెప్పవలెను. ఆత్మ యనఁ బ్రపంచ మంతయు నిండి నిబిడమై యింద్రియాగోచర మగు నొక యనిర్వాచ్యవస్తు వని చెప్పనొప్పును. అందువలననే యాత్మనుగూర్చి యత్యంతభిన్నము లగు నభిప్రాయములు గలిగినవి.

ఆత్మయే దృశ్యమగుచో దృశ్యములగు ఘటపటాదిపదార్థములవలె నందు నభిప్రాయభేదములకు నవకాశము లేదుగదా! ఇంతియకాదు, ఆత్మదృశ్యమగుచో నిర్గుణముగాక సగుణమగు దేహ మనవలయును. అపుడు ఆత్మదృశ్యమనువాదముచార్వాక మతస్వరూపము నొందును

ఆత్మ యిట్టిదని వాక్కులచేఁ జెప్పుటకు సాధ్యముగాదు. జ్ఞేయము. శాస్త్రమఖండార్థబోధనచే నద్వానిలక్షణముమాత్రమే.

చెప్పెను. ఇంతియ దాని వాచ్యత్వము. అటుతరువాత దాని స్వరూపమును జెప్పుటయందు విఫలములై వాక్కులు మనస్సు కూడ నటనుండి మరలుచున్నవి. "యతోవాచోనివర్తంతే" అను శ్రుతి యిద్దానినే బోధించుచున్నది. బ్రహ్మస్వరూపమును జెప్పుటకై కుమారునిచేత నత్యంతము ప్రార్థితుఁడయ్యు వరుణుఁడు వాక్కులచేఁ జెప్పలేక "యతోవా ఇమాని భూతాని" అను శ్రుతిచేఁ దల్లక్షణమునుమాత్రము జెప్పి "తపసాబ్రహ్మవిజిజ్ఞాసస్వ" శ్రవణ మనన నిదిధ్యాసలచే నీ వడిగిన బ్రహ్మము ననుభవపూర్వకముగాఁ దెలిసికొమ్మని యుపదేశించెను. తండ్రిచేసిన బోధ వలననే గాక స్వయముగాఁ దపము నొనరించుటచే బ్రహ్మమును సాక్షాత్కారముచేసికొని భృగువు బ్రహ్మమాయెను "ఆత్మన్యేవాత్మానం పశ్యేత్" తమ శ్రుతులయందలి దర్శనార్థబోధకములగు శబ్దములకిత్యాదియే యర్థముగాని జగత్తువలె దృశ్యమను నర్థమెంతమాత్రముఁగాదు. శరీరమునం దాత్మను జగత్తును జూచినట్లు చూచుట యసంభవము గదా!

౬

# శ్వేత కేతూద్దాలక సంవాదము

భారత దేశమందలి వేదాంతవిచారణ కాండయందు ఛాందోగ్యమందలి శ్వేత కేతూద్దాలక సంవాద మను షష్ఠప్రపాఠకము ముఖ్యస్థానము నధిష్ఠించి యున్నది. ఇందులకు ముఖ్యమగు కారణము: ఇందు స్పష్టార్థబోధకములగు శబ్దములు గానరా కుండుటయే. అనేకు లనేకభంగుల నర్థకల్పనముచేసి వ్యాసునికాలముననే దాని కర్థవిప్రతిపత్తులను గలుగఁజేసిరి. అందుచేతనే స్పష్టార్థబోధకరములగు భృగువల్లీశాకల్యమైత్రేయ బ్రాహ్మణ వాక్యములఁ ముమ్మందు గ్రహించి వేదాంతము లన్నియు బ్రహ్మవబోధకములని మొదటి నాల్గుసూత్రము లచే స్థిరపఱచి యీ ముఖ్యార్థము నితరోపనిషత్తుల యందు సమన్వయము చేయుచు నెక్కుడు సందిగ్ధార్థములు గల ఛాందోగ్యముయొక్క విచారణమునకై నీక్షత్యధికరణము వ్యాసమహర్షి రచించెను. ద్వాదశవర్ష కాలము గురు సన్నిధియందు శాస్త్రాధ్యయనము చేసివచ్చిన యనూచాన మ్మానియగు పుత్రునకు సద్ధర్మోపదేశము చేయఁదలఁచి దండ్రి యగు నుద్దాలకుడు "దేనిని వినుటచే సర్వమును వినఁబడిన దగునో; దేనిని దెలిసికొనిన సర్వము దెలిసికొనఁబడిన దగునో యద్దానిని నీగురువు నడిగితివా" యని కుమారు నడిగెను. అంతఁ గుమారుఁడు 'ఇంత యద్భుతోపదేశ' ముండునా ?'

యని యాశ్చర్యవిహ్వలచేతస్కుఁడు కాఁగా శ్వేతకేతువునకు "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతంస్యా ద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" అన, వికారమును జెందుటచే ననేక నామముల వాడఁబడు చున్న కార్యరూపములగు ఘట శరావాదు లన్నియు నెట్లు మృద్వికారములో యట్లే యని సోదాహరణముగ నుద్దాలకుఁడు చెప్పెను. ఇందుచే వికారాత్మకమగు జగమున కంతకును గారణ మొకటియే యనియు నది యుపాదానకారణ మనియు నా యుపాదానకారణముఁ దెలిసినఁ దత్కార్యము లన్నియుఁ దెలియుననియుఁగూడ నుద్దాలకుని ప్రశ్నభాగముగఁ దేలు చున్నది. అత్యంతశ్రద్ధచే గుర్వనుగ్రహమును సంపాదించిన తన కీ విషయము గురువు చెప్పలేనందున వారికిఁగూడ నీ విష యము దెలియనట్లు నిశ్చయించి తండ్రినే యుపదేశింపుమని సవినయముగఁ బ్రార్థింప "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మేవా ద్వితీయమ్" అని యుద్దాలకుఁడు పలికెను. జగత్తునకుఁ బూర్వము సత్తనునది యొకటియే యున్నదనియు నయ్యది స్వగత సజాతీయ విజాతీయ భేదరహిత మనియు దీనియర్థము.

ఇచట సచ్ఛబ్దమునకు వ్యాసునికంటెఁ బూర్వులు బహుభంగుల నర్థకల్పనమును జేసిరి. వారలలోఁ బ్రధాన మల్లుఁడగు సాంఖ్యుఁడు సచ్ఛబ్దమునకుఁ బ్రధానమని యర్థము చెప్పెను. ఇట్టియర్థముల నిరసించుటకు "ఈక్షతే ర్నాశబ్దమ్" అను నీక్షత్యధికరణప్రథమసూత్రము వ్యాసులవారిచే రచిం

పఁబడెను. 'సత్' అను శబ్దముచేఁ బ్రధానము చెప్పఁబడ లేదు. "త దైక్షత బహు స్యాం ప్రజాయేయ" అని ముందు 'ఐక్షత' అని చేతనబోధకశబ్దము వినఁబడుటచేత నని సూత్రార్థము. ప్రధానము కేవలము జడమగుటచే నీక్షత్యాదిచైతన్య విశిష్టమగు సత్తు ప్రధానము గానేరదని యభిప్రాయము. "బహు స్యామ్"అని సంకల్పించి యాసత్తే తేజోఽబన్నములు మూఁడు నొకదానినుండి వేఱొకటియయి "హంతాఽహ మిమా స్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామ రూపే వ్యాకరవాణి" నే నీ తేజోఽబన్నములు మూఁడు నయితిని ఈ జీవస్వరూపముచేఁ బ్రవేశించి నామరూపాత్మకమగు వికారముగ భాసింపఁగలనని యాసత్తే సంకల్పించెనని వినఁ బడుచున్నది. ఇందుచేఁ గార్యరూపమగు జగత్తునకుఁ బూర్వ ముండిన సత్తు చైతన్యాత్మకమనియు సదర్థబోధకమగు 'అస' ధాతువుయొక్క 'స్యామ్' అను నుత్తమపురుషైకవచనప్రయోగముచే సత్తుఒకటియే జగత్కారణమనియుఁ దానే యన్నిరూపముల భాసించుచున్నదనియు కృఞ్ ధాత్వర్థకములగు శబ్దములచట వినఁబడకపోవుటచే నిందుకు భిన్నమగు జగత్కర్తయగు విష్ణ్వాదినిమిత్తకారణము వేఱొండు లేదనియు స్పష్టమగుచున్నది. ఈక్షతిశబ్దమునకు గౌణార్థము చెప్పవలెనను పూర్వపక్షమునకు 'గౌణశ్చే న్నాత్మశబ్దాత్' అను సూత్రముచే జవాబుచెప్పిరి. "స య ఏషోఽణిమా ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వ మసి శ్వేతకేతో!" అను నిదంతయు నాత్మస్వరూపమే, ఆత్మయే యిది. 'సత్యమ్'అని దృఢతరముగా

జగత్కారణ మాత్మస్వరూపమనియు నిట్టిజగత్కారణమగు నాత్మయే నీవు అనియు శ్రుతి స్పష్టముగఁ బలికినది. "తస్య తావదేవ చిరమ్"ఇట్టి జ్ఞానమే మోక్షమను శ్రుత్యభిప్రాయ మును "తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్" అను సూత్రమున వ్యక్తకరింపఁబడినది. "స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో!" అనుచో, తత్ = పూర్వోక్తమగు చైతన్యస్వరూప మగు సత్తే, త్వం = నీవు, అసి = అయితివి, అను సహజమగు నర్థ మును ద్రోసిపుచ్చి మధ్వరాయలు 'అతత్త్వమసి' ఆ సత్తు నీవు గావని యపార్థకల్పన గావించిరి. ఇట్టి పదచ్ఛేదము నింతవఱకు వారొక్కరుమాత్రము చేసిరి. అద్వైతసిద్ధాన్త ముతో నేకీభవింపని విశిష్టాద్వైతాదీతరమతకర్తలు, బౌద్ధులు గూడ 'తత్త్వమసి' అనియే పదచ్ఛేదమును జేసిరి. ఇట్టి పాండితీనైపుణ్యము మధ్వరాయల కొక్కనికిమాత్రము దక్కి నది. ఆసేతుశీతనగమగు దేశమునం దంతయు నిట్లే చెప్పుకొను చుండిరి. మధ్వరాయలుగూడ 'భేదవ్యపదేశాచ్చ' అను సూత్రమునందలి "నచ తత్త్వమస్యహం బ్రహ్మాస్మీత్యాది శ్రుతివిరోధః" అను ప్రశ్నమును, అద్దాని సమాధానమును గమనించినచో 'తత్త్వమసి' అనియే యున్నట్లంగీకరించినట్లు స్పష్టమగుచున్నది.

కాని, శ్రుతి కర్థముమాత్రము "అతత్త్వమసి" అని వ్రాసిరి. ఇయ్యది సమయోచితపాండితీప్రకర్ష. తత్త్వమసి యొక్క గంభీరార్థమును 'సదా సోమ్య తదా సంపన్నో భవతి'

అని శ్రుతి యనుభవముచే రుజువుచేయుచున్నది. సుషుప్తి యందు నుపాధికృతములగు విశేషములు లేకపోవుటచే జీవుఁడు తనయందే లయ మగుచున్నాఁడు గనుక నాత్మస్వరూప మగు సత్పదార్థము చైతన్యమనియు నుపాధివిశేషముచేఁ బరఁగుచున్న త్వంశబ్దవాచ్యుఁ డగు జీవునికి, తచ్ఛబ్దవాచ్యమగు సత్తునకు నభేదమనియు శ్రుతి చాటుచున్నది. 'తత్త్వ మసి' అనువాక్య మందలి గంభీరమగు పరమరహస్యము ప్రథమమున మహా పండితుఁడగు శ్వేత కేతువునకుఁ గూడ నవగతము కాలేదు.

ఉదాహరణపరంపరచే నీమహాతత్త్వము నుద్దాలకుఁడు కుమారునికి హృద్గోచరము చేయుచుండెను. వినినకొలఁది యందు మునిఁగి తెప్పరిల్లలేక శ్వేత కేతువు తిరుగ 'భూయఏవ మా భగ వాన్ విజ్ఞాపయతు' ఓ భగవంతుఁడా! వేఱొకపర్యాయముప దేశింపుఁడని తొమ్మిదిపర్యాయము లుత్కంఠతోఁ దండ్రి ని బ్రార్థించెను.

సముద్రమునఁ బ్రవేశించిన నదులు ఎట్లు సముద్రముతో భిన్నమగుచున్నవో, జలమునఁ గలిసిన లవణ మెట్లభేదమునొందు చున్నదో, తేనెటీఁగలచేఁ దేఁబడిన వివిధ పుష్పరసము లెట్లు మధువునం దైక్యముఁ జెందుచున్నవో యట్లే సుషుప్తియందు లయమునుజెందు నీవే యాసత్తని యుదాహరణ పరంపరచే 'తత్త్వమసి' వాక్యమందలి యభేదార్థమును దొమ్మిది పర్యా యము లుద్దాలకుఁడుపదేశించెను. అందుచే 'తత్త్వమసి' అను వాక్యము మహావాక్యములలో నగ్రగణ్యమగుచున్నది; సర్వ

వేదాంతసారముగ నలరారుచున్నది. ఐక్యమును బోధించు నీయసందిగ్ధోదాహరణపరంపరచే తత్త్వమసి వాక్యమునకును భేదము చెప్పుటయందే శ్రుతికి తాత్పర్యముగాని ఆ 'తత్త్వమసి'కి భేదబోధయందుఁ గాదని యాలోచించువారలకు స్పష్టము కాకమానదు.

ఇదియే 'స్వాప్యయాత్' అను సూత్రార్థము. బ్రహ్మ జగత్కారణ మనుటయందే సర్వశ్రుతులకుసమన్వయము.'గతి సామాన్యాత్' అను సూత్రముచేఁ జెప్పిన యర్థమునే యితర శ్రుతులుగూడ ఘోషించుచున్నవని 'శ్రుతత్వాచ్చ' అను చివరి సూత్రమున వ్యక్తీకరించి తత్త్వమసీతి వాక్యమందలి గుర్వేకవేద్యమగు పరమరహస్యము ఈక్షత్యధికరణమున లోక కల్యాణముకొఱకు వ్యాసమహర్షి సిద్ధాన్తపఱచెను.

శ్రీః


# వైదికధర్మసంవర్ధని

సంపుటము 1]　　డిసెంబరు, 1935　　[సంచిక 12


## విష్ణుదాసుని మధ్వమతము

### ప్రస్థానత్రయముచే నెట్లు ఘటించును?

(గతసంచికతరువాయి)

౭

## భగవద్గీతలు

విష్ణుదాసమతము భగవద్గీతయందును జెప్పఁబడి యున్నదని సత్యధ్యాన తీర్థులు వ్రాసినందున నీ మత మెంతవరకు భగవద్గీతవలన నిలుచునో విచారింపవలసివచ్చినది. భగవద్గీతలు ప్రాక్ పశ్చిమ దేశముల విలసిల్లుచున్న యన్ని మతములవారిచేతను మహోత్కృష్టమగు గ్రంథముగాఁ బరిగ ణింపఁబడుచున్నది. సుమారు తొమ్మిదివందల భాషలలో భాషాంతరీకరణము చేయఁబడి 1,145 ముద్రణముల నొందినది. సాక్షాత్ భగవన్ముఖమునుండి గానరూపమున నిస్సృతమయిన మహాతత్త్వమకరంద మిందుఁ గలదని తలంపఁబడుటచేత నెల్ల రకు నీ గ్రంథము పూజ్యమగుచున్నది. ఈ గ్రంథమునకు

భగవద్గీత లను నామ మన్వర్థము. మధ్వరాయలు శ్లోకరూప మగు నొకగ్రంథముచేఁ దాను గ్రహించినరీతిని భగవద్గీతలయొక్క భావమును వ్యక్తీకరించెను. పదచ్ఛేదపదార్థోక్త్యాది లక్షణము లందుఁ గానరాకుండుటచే నద్దాని వ్యాఖ్యయని కాని భాష్యమనికాని పిలువ వీలులేదు. భగవద్గీతలు భారత మందు నొకభాగము. వేదాధికారము లేమిచేత జ్ఞానములేక సంసారక్లేశ మొందుచున్న స్త్రీశూద్రాదులకు మోక్షప్రాప్తికై బ్రహ్మరుద్రాదుల ప్రార్థన నంగీకరించి వ్యాసరూప మెత్తిన విష్ణువుచే నీభారతము రచింపఁబడెననియు నీగ్రంథము "వేదాదపి పర"మగుటచేఁ బంచమ వేదమని పిలువఁబడుచున్నదనియు మధ్వరాయలు తమగ్రంథమున కుపోద్ఘాతము వ్రాసెను. భారత మందుఁగల గౌరవము వేదమునందు వారలకు లేదు. వేదతుల్యముగా నిది పంచమవేదము గాదు. తాము వ్యాఖ్యానము చేయఁదలంచిన మూలగ్రంథమే, వేదజ్ఞానములేని స్త్రీశూద్రాదులకొరకని వారు తలంచుచుండఁ దమ వ్యాఖ్యానము తదితరులు చదువుట వారిభావమై యుండదు. "పంచమ వేద"మను సమాసమునకు వారు కర్మధారీయ విగ్రహముఁ జెప్పుదురో లేక షష్ఠీతత్పురుషగాఁ జెప్పుదురో తెలియరాకున్నది. శూద్రాదులని యాదిశబ్దముచే వేదాధికారములేని స్త్రీశూద్రేతరులును మరికొందరును అవగతమగుచున్నారు. కాని "స హి ధర్మః సుపర్యాప్తో బ్రహ్మణః పదవేదనే"యని యీ గ్రంథముఁ జదువుటవలనఁ దెలియునది. బ్రహ్మపదమని వ్రాయుటచే నీ గ్రంథము బ్రహ్మమును బోధించుచున్నది గాని విష్ణువును

బోధించుటలేదని స్పష్టమగుచున్నది. మధ్వరాయల భావాను సారముగ నీ గ్రంథము వేదములో లేని విషయములఁ జెప్పు చున్నట్లు కథఁబడుచున్నది. అట్లయినచో శిష్టపరిగ్రాహ్యము గాకపోవలసివచ్చును. మధ్వరాయలును వేదనిందఁ జేసినవాఁ డగుచున్నాఁడు.

లోకకల్యాణముకొరకు ఉపనిషదర్థమునే శ్రీకృష్ణ భగవానుఁడు అర్జునోపదేశ మిషచే ముముక్షుజనమునకు వ్యక్తీకరించెను. పార్థుఁడను వత్సమును దగ్గఱఁబెట్టుకొని సుధీజనోప యోగమునకై యద్వైత మను సర్వోపనిషత్క్షీరసారమును గోపాలుఁడు పిదికెను. అదియే భగవద్గీత. తదర్థావిష్కరణ కొరకు నుపనిషత్తులే యాధారము.

మొదటి 57 శ్లోకములయందు నధికారినిరూపణఁజేసి తరువాత 62 శ్లోకములచేఁ గృష్ణభగవానుఁడు తత్త్వోపదేశము చేసెను. జ్ఞానముచే మోక్షముకలుగును గాని కర్మచేఁ గా దనియు నయినను అర్జునుఁడున్న పరిస్థితులయందుఁ గర్మచేయక తప్పదనియు నీ యుపదేశసారము. జ్ఞానము కర్మకంటె గొప్ప దయినయెడలఁ దమ్ము నెందుకట్టి ఘోరకర్మచేయుటకు నియో గించుచున్నాఁడో గ్రహింపలేక ప్రశ్నించిన యర్జునునకుఁ గృష్ణ భగవానుఁడు చెప్పిన సందేహాపనోదకాత్మకమగు వ్యాఖ్యా నము మిగిలిన గ్రంథము. ఈ యుపదేశారంభసమయమందు శ్రీకృష్ణుఁడు భగవత్స్వరూపుఁ డను జ్ఞాన మర్జునునకు లేదు. తమ క్షేమముఁ గోరి మొదటినుండి యనేకములగు నిక్కట్టులఁ

బాపి యింతవరకు సజీవముగ నుండుటకుఁ జేయూతనిచ్చి కాపాడిన మేనమరంది యనియు నత్యంత జ్ఞానసంపన్నుఁడై కష్టసమయముల మెలఁకువతో మెలంగఁగల దిట్టయనియు యుద్ధమందాయనకుఁ గల చాతుర్యముచేఁ దనకు గురువనియు మాత్రము శ్రీకృష్ణుని నర్జునుఁడు తలంచెను. "ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహమవ్యయమ్" "తా న్యహం వేద సర్వాణి" "సంభవా మ్యాత్మమాయయా" యని శ్రీ కృష్ణుఁడు చెప్పిన పరమరహస్యమును అర్జునుఁడు విశ్వసింపనందున నాతనికి విశ్వాసజనక మగు నిజస్వరూపమును జూపి ఆబ్రహ్మస్తంబముగ నలరారుచున్న నిఖిల చరాచర ప్రపంచము తానుదప్ప మరొండు లేదని ప్రత్యక్షప్రమాణముచే సర్వసందేహనివారణముగఁ బ్రదర్శించి యద్వైతమతతత్త్వప్రతిష్ఠాపనఁ జేసెను. మొదటినుండి యుద్ధమునఁ గర్ణుని గెలువవలెననియే యర్జునుని కోరికగాని భీష్మునియోగముచే నాతఁ డర్ధరథికశ్రేణియందుఁ జేర్పఁబడుటచే 'భీష్ముఁడ స్తమించునంతవరకు యుద్ధరంగమునఁ బాదముఁబెట్ట' ననియాతఁడుచేసినప్రతినయర్జునునకుఁ దెలియదు. యుద్ధమున నర్జునుఁడు దేవదత్తమును బూరించి విల్లెక్కువెట్టి లక్ష్యమగు కర్ణుఁడు కానరానందున నెవరితో యుద్ధముచేయవలెనో తెలియక "సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత" యని శ్రీకృష్ణుని గోరెను. శ్రీకృష్ణుఁ డుభయ సేనల మధ్య రథమునిలిపి భీష్మద్రోణాదిగురు సేనానీసంయుత మై భ్రాతృపుత్రసఖిసముపేతమై మాతులకులాకులమగు కౌరవసేనను "పశ్యైతాన్ సమవేతాన్ కురూన్" అని యర్జునునకుఁ

జూపెట్టెను. అంత నర్జునుఁడు ధైర్యముఁడిగి కృపచే నశ్రుపూర్ణా
కులములగు కన్నుల నీరుఁగార్చుచు విషాదమొంది తన బాణము
నుపసంహరించి యుద్ధసంరంభము మాని ప్రజ్ఞావాదము లాడ
దొడంగెను. ఇట్టి మనస్స్థైర్యము చెడిన యర్జునునిచేఁ దనయుప
దేశసౌష్ఠవమున శ్రీకృష్ణుఁడు యుద్ధముచేయింపవలసివచ్చెను.
ఈ యర్జునమనోభూమికను గుర్తెఱిఁగినఁ గాని కృష్ణభగవానుని
యుపదేశతత్త్వమును గ్రహింప శక్యముగాదు. ఎట్టి యుప
దేశముఁ జేసినఁ దిరిగి యర్జునుఁడు యుద్ధోన్ముఖుఁడు కాఁగలఁడు?
భీష్మద్రోణాదివంద్యగురుకులమగు భీష్మద్రోణాదులు వేఱు.
తానవశ్యము అట్టివారలను జంపవలెను అని నమ్మినప్పుడా? లేక
చంపువాఁడు లేఁడు, చచ్చువాఁడును లేఁడు; శరీరములు వాని
యంతట నశించును; అన్ని శరీరములందును బ్రకాశించు నాత్మ
సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మయే యని తెలిసినపుడా?
ఈ ప్రశ్నకు జవాబే శ్రీకృష్ణభగవానునియుపదేశతాళయంత్ర
మును భేదింపఁగల కుంచిక కాఁగలదు.

౧

# గీతాతత్త్వనిర్ణయము

శ్రీ కృష్ణభగవానుఁ డర్జునున కుపదేశించిన తత్త్వమున కంతయు "నాఽసతో విద్యతేభావో నాభావో విద్యతే సతః" అనువాక్యము మూలవాక్యము. ఇదిసర్వవేదసారమై సర్వతత్త్వావతంసముగ నలరారుచున్నది. "న, అసతః, విద్యతే, భావః, న అభావః, విద్యతే, సతః" యని యీ వాక్యమునకు సహజమగు పదచ్ఛేదము. అసత్తున కునికియు, సత్తునకు లేమియుఁ దెలియఁబడుట లేదని దీనిప్రతిపదార్థము. లేమిలేనిది సత్తనియు ఉనికిలేనిది యసత్తనియు నీవాక్యమువలన సదసత్తుల లక్షణము తేలుచున్నది. అనఁగా దేశకాలములచేఁ బరిచ్ఛిన్నము కాక సర్వవ్యాపియగునది సత్తనియు, వానిచేఁ బరిచ్ఛిన్నమయి సర్వవ్యాపిగానిది యసత్తనియు భావము. ఈయర్థమునే "అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్" అను శ్లోకము చెప్పుచున్నది. పరిదృశ్యమానమగు నీజగత్తు నంతయు వ్యాపించిన పదార్థము నాశరహితమయినదనియుఁ దదితరమంతయు నశ్వరమనియు 'తు'శబ్దముచేద్యోతితమగుచున్నది. పైవాక్యమునందలి సదసచ్ఛబ్దముల కర్థము ప్రకరణముచే గ్రహించవలెను. భీష్మద్రోణాదులఁ జంపలేక బాణము నుపసంహరించిన యర్జునునకుఁ 'జచ్చినవారినిగుఱించియు బ్రతికియున్నవారినిగూర్చియుఁ బండితుఁడు విచారింపఁడు. ఇపు డున్న వా రంద రిదివర కుండక పోలేదు. ఇకముం దుండకపోరు. బాల్య యౌవన కౌమా

రాదిదశలను శరీరము పొందినట్లే ఈ శరీరమునుండి పోయిన శరీరి మరియొకశరీరము పొందుచున్నాఁడని దేహి దేహభేదమునఁజేసి దేహము నశించినను దేహి నశింపఁడని శ్రీకృష్ణుఁడు 2 అ. 11 - 15 శ్లోకముల నుపదేశించెను. ఇందుచే నవసరప్రాప్తమగు నిత్యానిత్యనిర్వచనకొరకు లేమిలేనిది సత్తనియు - ఉనికిలేని దసత్తనియు "నాసతో" యను వాక్యమును జెప్పిరి. నిత్యమగు సత్తుచేతనే సమస్తజగత్తతీత మగుచున్నదని సత్తునకు సర్వ వ్యాపకత్త్వముఁ జెప్పిరి. "అంతవంత ఇమే దేహా నిత్య స్యోక్తాః శరీరిణః, అనాశినోఽప్రమేయస్య" అని దేహము లనిత్యములు, దేహి నిత్యుఁడు, ఇంద్రియాగోచరుఁడనికూడఁ జెప్పిరి. అనిత్య మగు అసత్తు, అంతవంతమగు దేహములు నొకటేయనియు నిత్య మగు సత్తు నవినాశియగు శరీరియు నొకటేయనియు స్పష్ట మగుచున్నది. కనుక సచ్ఛబ్దముచే శరీరియగు నాత్మయు నస చ్ఛబ్దముచే దేహాదిజగత్తును గ్రహింపఁబడుచున్నది. మరియు "శరీరిణః" "యేన" అను వచనముచే ఒకఁడేయగు నాత్మ యందుఁ బ్రకాశించు శరీరము లనేకములనియు భావము తేలు చున్నది. శరీరినిత్యత్వముఁజెప్ప సచ్ఛబ్దముఁ జేబట్టుటచే "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్, ఏకమేవాఽద్వితీయమ్" అను ఛాందోగ్యమునందలి సచ్ఛబ్దబోధితమగు బ్రహ్మమునకును శరీరి కిని అభిన్నత్వము తేలుచున్నది. కనుక 'సత్, బ్రహ్మ, ఆత్మ, శరీరి' ఈశబ్దములన్నియు సర్వవ్యాపియు నిత్యమునగు నొకే వస్తువును బోధించుచుఁ బర్యాయపదము లగుచున్నవి. సర్వ వ్యాపిత్వము, అనేకత్వముఁ బరస్పరవిరుద్ధధర్మము లగుటచే

నొకేవస్తువునందు సిద్ధింపనేరవు. ఈ పరమరహస్యమును శ్రీకృష్ణభగవానుడు పై వాక్యమునం దర్జునున కుపదేశించెను.

మధ్వరాయలు 2 అ. 11 మొ॥ 15 శ్లోకములకు "నిత్య ఆత్మేత్యుక్తమ్" అనివ్రాసి "కిమాత్మైవ నిత్య ఆహోస్విత్ అన్యదపి? అన్యదపి; తత్కిమితి? ఆహ 'నాసతః' ఇతి" అనఁగా ఆత్మయొకటియే నిత్యమా? నిత్యమనునది మరొండు గలదా? యని సందేహమురాఁగా మరొండుగలదు. అది యెద్దియన సమాధానముగ "నాసతః" అనుశ్లోకము వ్రాయఁబడినట్లు నా శ్లోకమునకుఁ బ్రతీక వ్రాసిరి. అర్థాని కట్లర్థకల్పనయుఁజేసిరి. "అసతః కారణస్యఅభావో నైవవిద్యతే. 'ప్రకృతిః పురుషశ్చైవ నిత్యౌ కాలశ్చ సత్తమ' ఇతివచనాత్ "యద్దేశతోఽనంతం తన్నిత్యమేవ" యని "అవినాశి" శబ్దార్థముఁజెప్పిరి. దీనినిబట్టి "నాసతః" అను పై వాక్యమునకు "న, అసతః, విద్యతే, అభావః, న, అభావః, విద్యతే, సతః" యని పదవిభాగముఁజేసి అసచ్ఛబ్దమునకుఁ గారణమని యర్థమునుజేసి అసత్తగు కారణము, సత్తగు బ్రహ్మ ఈ రెంటికిని లేమి తెలియఁబడుటలేదని అనఁగా రెండును నిత్యములే యని రాయలు చిత్రించెను. మరియు నిచట సచ్ఛబ్దము బ్రహ్మబోధకముగ వ్రాయుచు "అసతః సదజాయత ఇతిశ్రుతేః" అని ప్రమాణమును జెప్పెను. ఈ శ్రుతి నెచటినుండి వారు గ్రహించిరో తెలియరాకున్నది. కాని ఈ శ్రుతిని దమ యర్థకల్పనకుఁ బ్రమాణముగ గ్రహించుటచే సచ్ఛబ్దబోధకమగు బ్రహ్మ కార్యమయిన సత్తునుండి పుట్టుచున్నదనియు నందుకుఁ గారణ మసత్తనియుఁ దేలుచున్నది.

కార్యము నశ్వరమగుటచే బ్రహ్మకూడ నశ్వరము కావలసి వచ్చుచున్నది. ఇది స్వవచనవ్యాఘాతమే కాక మూలచ్ఛేదమగు పాండిత్యోద్దీపక మగుచున్నది. అభావమునుండి బ్రహ్మ పుట్టినదనుటచే రాయలవారి సిద్ధాంతము బౌద్ధమతసామ్యమునొందుచున్నది. 'ప్రకృతి, అసత్తు ఆత్మ'యను మూఁడునిత్యములని తేలుచున్నవి. సర్వవ్యాపిగానిది నిత్యముకానేరదు. ప్రకృతి పరిచ్ఛిన్నము. మరియు అసత్తు నిత్యమనుటచే దేహాదిజగత్తంతయు నిత్యమని సిద్ధమగుచున్నది. దేహము నిత్యముకాదని "అంతవంత ఇమే దేహాః" అను గీతావాక్యముచేతను బ్రత్యక్షానుభవముచేతనుగూడఁ బ్రసిద్ధమగుచున్నది. "య ఏనం వేత్తిహంతారమ్" అనుశ్లోకమునకు "వ్యావహారస్తు భ్రాంత ఇత్యాహ "య ఏన మితి, కుతః ఉక్తహేతుభ్యః" నాయం హంతి న హన్యతే, నహి ప్రతిబింబస్య క్రియా, సహి బింబక్రియయైవ క్రియావాన్" అని తాత్పర్యము వ్రాసిరి. సూర్యునకు బింబము చలనము లేకయు నుపాధియగు జలము కదలుటచే సూర్యప్రతిబింబము కదలుచున్నది. బింబమునందలి చలనమువలననే ప్రతిబింబమునకుఁ జలన మెంతమాత్రము ఘటింపదు. ఉపాధులగు జలములయందలిచలనముచే సూర్యప్రతిబింబమునందుఁజలనము కలుగును. బింబితుఁడగు సూర్యుని కచటఁ జలనము లేదుగదా! కావున బింబక్రియవలనఁ బ్రతిబింబమునకుఁ జలనము సంభవించునని చెప్పుట యవివేకవిలసితము.

'ధ్యాయతీవ లేలాయతీవ' అను శ్రుతి యుపాధియొక్క చలనముచేఁ బ్రతిబింబమునందుఁ జలనము భాసించు

చున్నదను నాశయముతోఁ బరఁగుచున్నది కాని బింబచలనముచేఁ బ్రతిబింబమునకుఁ జలనము కలుగునని చెప్పుటకుఁ గాదు. ఏదియెట్లున్నను, ఇంథలివిశేష మేమన: 'వ్యవహారమంతయు భ్రాంతి' యని మధ్వారాయలు నిర్వచించెను. భ్రాంతివ్యవహారము సత్య మెంతమాత్రము కాదుగదా! కావున నీ వ్యవహారము భ్రాంతిమూలక మని నిర్వచించి మధ్వారాయలకు గాని తన్మతము ననుసరించు విష్ణుదాసునకుఁగాని జగత్సత్యత్వ మెంతమాత్రమును ఘటింప నేరదు. సత్యరూప మన్నదో ముందుఁ బ్రదర్శింపఁబడును.

---

౬

## "సత్" స్వరూపము

'నాసతో విద్యతే భావః' అను శ్లోకమున వినవచ్చుచున్న 'సత్, అసత్' అనువానియొక్క స్వరూప మెట్టిది? సత్తు కానిదంతయు నసత్తగుటవలన సత్ స్వరూపమును ముందుఁగాఁ దెలియనగును. సచ్ఛబ్దము దేహిపరముగాను, అసచ్ఛబ్దము దేహపరముగాను బై వాక్యమున వాడఁబడినట్లు చెప్పియున్నాము. "అంతవంత ఇమే దేహాః" అను వాక్యముచే దేహము లన్నియు ననిత్యములని తేలుచున్నది. 'నాసతో విద్యతే భావః' అనుటచే నసత్తున కునికియే లేదని తేలుచున్నది. ఈ రెండు వాక్యములు నేకార్థబోధకములుగావు. పరిత్య

క్షముగ దేహములు నశించుట చూచుచున్నారము. దేహము లనిత్యము లను నీ యనుభవమును "అన్తవన్త" యను గీతముచే ముందుగాఁ జెప్పి దేహము లనిత్యములే కాక కొంత కాలమైనను నియ్యవి లేక యసత్యములే యగుచున్నవను పరమరహస్యమును "అంతవంతః" అను గీతముచేఁ గృష్ణభగ వానుఁడు బోధించుచున్నాఁడు. "అస్తీతి, సత్" అను వృత్తిచే సత్తనః నశింపక నిత్యముగా నుండునదని భావము. సచ్ఛబ్ద నిర్వచనముచేఁ గూడ నీ యర్థమే సుస్పష్టమగుచుండ విరుద్ధార్థ మగు నసదర్థ మీ సచ్ఛబ్దార్థ మెట్లగునో శబ్దార్థకోవిదులు గ్రహింతురుగాక!

ఇఁక నసత్తగు నీ దేహమున కునికి లేనియెడల నెట్లు మనకుఁ బ్రత్యక్షముగఁ గన్పడుచున్నది? మఱియు 'దేహి'అను శబ్దముచే నాత్మ దేహమం దున్నటులు వినఁబడుచున్నదిగదా! సర్వవ్యాపియగు నాత్మ పరిచ్ఛిన్నమగు నీ దేహమం దెట్లు ప్రవేశించినది? లేక సర్వవ్యాపియగు నాత్మమీఁదనే యీ దేహము పడుచున్నదా? అను సందేహములు గలుగుచున్నవి. పరమార్థము నాలోచించినచో నీ దేహమున కునికి లేదు. అనఁగా జగత్తనునది సత్యముకాదు. రజ్జువును భ్రమతోఁ జూచి నపుడు సర్పజ్ఞానమే కలదు. భ్రమ యున్నంతకాలము సర్పమే యని రజ్జువును దలంచుటచే భయకంపనాదివికారములు గలు గును. అంతమాత్రమున నచట నున్నది సర్ప మని చెప్ప వీలు కాదుగదా! అచట రజ్జువుమాత్రమే కలదని తప్పక యంగీక రింపవలయును. అచట నొకవిధమున రజ్జువు సర్పమునకుఁ

గారణ మగుచున్నది. ఈ యర్థమున సర్పము రజ్జువువలనఁ బుట్టినదని చెప్పినఁ జెప్పనొప్పును. అంతమాత్రముచే సర్పము నిజముగాదు.

బ్రహ్మముదప్ప వేఱొండుకాదు, అవిద్యచే నయ్యది జగత్తుగ భాసించుచున్నది. ఇట్టి భాసన మాభాసయైనను వ్యవహారమున సత్యముగఁ బరిగణింపఁబడి లోకవ్యవహారము జరుగుచున్నది. ఈవిధముగ బ్రహ్మము జగత్తునకుఁ గారణమనియు బ్రహ్మమువలన జగత్తు పుట్టినదనియుఁ గూడఁ జెప్పవచ్చును. "యతోవా ఇమాని భూతాని" అనుశ్రుతిని జర్చించునపు డీవిషయము చర్చింపఁబడినది. ఇదియే యద్వైతపరమతత్త్వము. ఇయ్యదియే శ్రీకృష్ణభగవానుని యుపదేశ మున్న దనుకొనిన కాలమందుఁగూడఁ బ్రకాశించుచున్న పరమాత్మ దేహమందుఁ గూడఁ బ్రకాశించుటయం దాశ్చర్యమేమియు లేదు. దేహమునందుఁ బ్రకాశించుచున్న తేజము పరమాత్మకంటె భిన్నమని తలంచినఁ బైతత్త్వమును గ్రహించుట సాధ్యముకాదు. అంతయు నావరించియున్న యాకాశములో బహువికారములగు ఘటగృహాదుల నేర్పరించినపు డా యాకాశమే యీపాత్రలయందు గృహములయందుఁగూడఁ గానఁబడుచున్నది. ఈ పాత్రములను, గృహములను దీసిన నాకాశముమాత్రము మార్పునొందక కల్పితవిభాగము పోయి యొకటిగానే యున్నది. వ్యవహారములో మాత్రము ఘటాకాశము గృహాకాశ మనఁ బరఁగుచున్నది. కాని యివ్వి భిన్నములగునాకాశములని తలంపము గదా! అటులనే సర్వవ్యాపియగు పరమాత్మ దేహమునందుఁ

గూడఁ బ్రకాశించుచు నుపలబ్ధికొరకు హృత్పుండరీకమున వెదకఁబడుచున్నాఁడు. దహరాధికరణమున నీవిషయమును బాదరాయణుఁడు చర్చించియున్నాఁడు.

'సత్, అసత్' అను పదములు తత్త్వవేత్తలు వాడినట్లు శ్రీకృష్ణుఁడు చెప్పెను. వారల కీపదము లెచ్చటినుండి వచ్చినవి? "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమేవాద్వితీయమ్" అను ఛాందోగ్య శ్రుత్యంతమునం దీపదములు తొలుత వాడఁబడినవి. జగత్తునకుఁ బూర్వము స్వగత సజాతీయ విజాతీయ భేదరహితమగు ఒక సత్తుమాత్ర ముండెనని శ్రుతి చెప్పుచున్నది. ఇంద్రియాగోచరమును సత్స్వరూపమునగు దేహికిమాత్ర మునికి యున్నట్లు శ్రీకృష్ణుఁ డుపదేశించెను. కనుక పై శ్రుతియందలి సత్తు 'నాసతో విద్యతే' అను గీతయందలి సత్తు నొకటియే యనియు నాయారెండు నొకేపదార్థమును బోధించుచున్నవనియు స్పష్టమగుచున్నది. అనఁగా శ్రుతిబోధితములగు, సత్స్వరూపమగు బ్రహ్మమును శ్రీకృష్ణోపదిష్టమగు సత్స్వరూపమైన దేహియు తనయాత్మయు నొకఁడేయని తేలుచున్నది. శ్రుతి యుత్తరవాక్యముచే నీయర్థమునే దృఢపరచుచున్నది. "తద్ధైక ఆహుః, అసదేవాగ్ర ఆసీత్, ఏకమేవాఽద్వితీయమ్, తస్మా దసతః సజ్జాయత," అని జగత్తునకుఁ బూర్వము అసత్తే యున్నట్లును అద్దానికి భేదము లేదనియు నట్టి యసత్తువలన సత్తు పుట్టినదనియుఁ గొందఱు చెప్పుచున్నారని యర్థము. ఇట్లు పూర్వపక్షమును శ్రుతి బోధింప 'ఉత స్త్వేవం స్యాత్' ఈ పూర్వపక్ష మెట్లయ్యెని? అనఁగాఁ బూర్వపక్షము సరికాదని

త్రోసివేయుచు "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్, ఏకమేవా ఉద్వితీయమ్" జగత్తునకుఁ బూర్వము సర్వభేదరహితమగు సత్తే గలదనియు సర్వసందేహనిరాసపురస్సరమగు దృఢతర తత్త్వమును ఛాందోగ్యము సిద్ధాంతించుచున్నది. కనుక శ్రీకృష్ణోపదేశమందలి సత్స్వరూపమగు దేహి యొక్కఁడును సర్వవ్యాపియు నింద్రియాగోచరుఁడునగు ఈదేహి ఛాందోగ్యమందుఁ జెప్పఁబడినసత్యరూపమగు బ్రహ్మముకంటె భిన్నుఁడు గాఁడని సువ్యక్తమగుచున్నది. "అణోరణీయాన్ మహతో మహీయాన్" అను నాత్మపరిమాణబోధకవాక్యమువలన నద్దానికి సర్వవ్యాపిత్వమే తెలియవచ్చుచున్నది. సూక్ష్మతమమగు దానికంటె సూక్ష్మమని చెప్పుటలో సర్వేంద్రియాగోచరమై యనుభవైకజ్ఞేయమగునాత్మయొక్క యుపలబ్ధియందుఁగల కష్టము నభ్యాసకునకుఁ దెలియఁ జెప్పుటయందే శ్రుతికిఁ దాత్పర్యముగాని 'మహతో మహీయాన్' అను సర్వవ్యాపిత్వమునకు భిన్నమగు వేఱొక పరిమాణమును జెప్పుటయం దెంతమాత్రము తాత్పర్యముగాదని స్పష్టమగుచున్నది.

## ౧౦
# అసత్ స్వరూపము

"నాసతో విద్యతే భావః" అను గీతమునందీ యస
చ్ఛబ్దనిర్వచనముగూడఁ జేయఁబడినది. ఈ యసచ్ఛబ్ద మెచ్చటి
నుండి గ్రహింపఁబడినదని విచారింపవలయును. సచ్ఛబ్దము చెప్పఁ
బడిన ఛాందోగ్యమునందే యసచ్ఛబ్దముగూడఁ జెప్పఁబడినది
గాని యీ యసచ్ఛబ్దమునకు అభావమున శూన్యమును బౌద్ధైక
దేశులగు మాధ్యమికులసిద్ధాంత మర్థముగా వర్ణింపఁబడినది.
"తద్ధైక ఆహుః, అస దేవేద మగ్ర ఆసీ దేక మేవాద్వితీయమ్,
తస్మాదసతస్సజ్జాయ తేకుత స్తు ఖలుసోమ్యైవంస్యాదితిహోవాచ
కథమసతస్సజ్జాయేత చేతి" అని. పై శూన్యవాదము శ్రుతిచే
ఖండింపఁబడినది. అనేకార్థకములగు శబ్దములకు నన్ని చోటుల
యందు నొకేయర్థమును జెప్పక ప్రకరణములఁబట్టి యర్థమును
నిర్ణయింపవలయునని శాస్త్రసమయము. ప్రకృతమున గీత
యందలి యసచ్ఛబ్దమునకుఁ బ్రకరణవశమున దేహము లను
నర్థమునే గ్రహింపవలయునుగాని శ్రుతియందుఁ జెప్పఁబడిన
శూన్యమర్థము గ్రహింపఁగూడదు. ఆకారణముచే నిచటి యస
చ్ఛబ్దము శ్రుతియందలియసచ్ఛబ్దమని యెంతమాత్రము చెప్ప
వీలులేదు. కావునఁ బ్రకరణవశమున సచ్ఛబ్దమునకు దేహి
యనియు అసచ్ఛబ్దమునకు దేహమనియు నర్థమును గ్రహింప
వలయునని చెప్పియున్నారము. దేహియన నీదేహమునుజూచు

వాఁడు. దేహికంటె దేహము భిన్నము. దేహి చూచువాఁడు, దేహము చూడఁబడునదియును. దేహినే[ద్రష్ట]యనియు దేహము దృశ్యమనియుఁగూడ వ్యవహరింతురు. ద్రష్టనుజూచువాఁడు వేఱొకఁ డుండుటకు వీలులేదు గావున ద్రష్ట దృశ్య మెన్నఁటికిని గానేరఁడు. అట్లగుచో ననవస్థాదోషము గలుగును. ద్రష్ట దృశ్యముకంటె భిన్నమగుటచే ద్రష్టగానిదంతయు దృశ్యమే యగుచుండును. జ్ఞానమునకు సాధనములగు పంచేంద్రియములు మనస్సుకూడ దృశ్యములే యగుచున్నవి. ద్రష్టకు మఱియొకఁడు లేకుండుటచే ద్రష్టయొకఁడు, దృశ్యము లనేకములు నగుచున్నవి. ఇట్టి దృశ్యబాహుళ్యమునందుముందుఁగా ద్రష్టకుఁ గనుపడునది దేహము. అందువలన గీతాచార్యుఁడు దేహమును దొలుత దృశ్యముగాఁ జెప్పినాఁడు. ఇట్లు చెప్పుటచే దృశ్యములగు సర్వములను జెప్పినట్లే యయినది. ఈదేహముపోయినను గోరినపుడు మాత్రము మరియొక దేహము రాఁగలదని చెప్పుటకై "వాసాంసి జీర్ణాని" అను నన్వర్థమగుశ్రుతిగీతమును గీతాచార్యులుదాహరించిరి. కనుక నూతనశరీరము ద్రష్టయొక్క యిచ్ఛాధీనమగునపుడ ద్దానినిగూర్చి విచారింపఁబనిలేదు. ద్రష్ట భిన్నము దృశ్యమను నర్థమునే "యతో వా ఇమాని భూతాని" అను శ్రుతి బోధించుచున్నది. ఎదుట పరిదృశ్యమానములగుభూతము లన్నియు ననఁగా జగమంతయు ద్రష్టయగు బ్రహ్మముకంటె భిన్నమనియే ఈ శ్రుతివలనఁ దేలుచున్నదిగదా !

భూతములు అవ్యక్తమగునాదియు వ్యక్తమగు స్థితియు అవ్యక్తమగు నాశమును గలిగియున్నట్లు శ్రీకృష్ణభగవానుఁడు

జెప్పెను. అనఁగాఁ బరిదృశ్యమాన మగు నీ భూతప్రపంచ మంతయుఁ బుట్టకపూర్వ మెచటనుండెనో నశించినపు డెచట లీన మగునో తెలియరాకున్నదని యర్థము. అనఁగా జగత్తుయొక్క స్వరూప మిపుడు దృష్టము. పుట్టకపూర్వ మదృష్టము. ముందు నష్టమగునదియని చెప్పనొప్పు. ఇందుచే జగత్తు అదృష్టదృష్ట ప్రణష్టస్వరూప మని తేలినది. ఇట్లు చెప్పుటచే నీ జగము రజ్జుగతసర్పతుల్యమని తేలినది. భ్రమచే రజ్జువునందుఁగన్పడు సర్పము, భ్రమగలుగుటకుఁ బూర్వము అదృష్టము. భ్రమసమయమున దృష్టము, భ్రమ నశించినచో నష్టము నగుచున్నది. కనుక నీసర్పము అదృష్ట దృష్ట ప్రణష్టస్వరూప మగుచున్నది. కాని యీసర్పము దృష్టమగునపుడుగూడ నాభాస మాత్రమేగాని నిజముగా లేదు. ఈరజ్జుగతసర్పము భ్రాంతి మూలకమేగాని నిజముగా లేదని యెల్లరకుఁ దెలిసినవిషయమే గదా! అటులే జగత్తుగూడ భ్రాంతిమాత్రమేకాని నిజముగా లేదను పరమరహస్యమునే "నాసతో విద్యతే భావః" అను గీతముచేఁ గృష్ణభగవాను లుపదేశించిరి.

---

## ౧౧
## సాంఖ్యయోగములు

"ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు" యను శ్లోకముచే శ్రీ కృష్ణభగవానుఁ డర్జునునకుఁ జేసిన యుపదేశము సాంఖ్యమని యోగమని రెండు తెఱంగుల నొప్పు

చున్నది. ఈ సాంఖ్యయోగములకును కపిల పతంజలికృతము లగు సాంఖ్యయోగశాస్త్రములకును సంబంధములేదు. శ్రీకృష్ణుం డుపదేశించిన సాంఖ్యయోగములయందలి విషయములు కాపిలపాతంజలశాస్త్రముల కత్యంతభిన్నములు. వ్యాసమహర్షి కాపిల పాతంజల మతములను "ఈక్షతే ర్నాశబ్దమ్" "ఏతేన యోగః ప్రత్యుక్తః" ఇత్యాదిసూత్రములచేఁ ద్రోసిపుచ్చెను. భగవద్గీతయందలి 2 అ. 11-38 శ్లోకమువరకును మోక్ష సాధనమగు జ్ఞానోపదేశమును శ్రీకృష్ణుఁడు చేసి యిట్టి సాంఖ్య నిశ్చయము నీకుఁ జెప్పితిననియు నిఁకముందు యోగనిశ్చయ మును జెప్పుచున్నాననియు నర్జునునకుఁ జెప్పెను. అట్టి యోగ తత్త్వమును దెలిసికొనినయెడలఁ గర్మబంధమునుండి ముక్తి గూడఁ గలుగునని తెలియఁజేసెను. కనుక నాత్మజ్ఞానము సాంఖ్యమనియుఁ గర్మలయందలి కౌశలము యోగమనియు శ్రీకృష్ణభగవానుని తాత్పర్యము. ప్రస్తావవశమున నీ సాంఖ్య మర్జునునికొఱకుఁ దిరిగి చెప్పఁబడుటచే నీ శాస్త్రము భారతాంతర్గతమయినను నూతనముగఁ జెప్పఁబడినదిగాదు. "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ, జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్" "ఇమం వివ స్వతేయోగమ్" అను శ్లోకమునం దవ్యయమగు నీ సాంఖ్యమును దాను సర్గాదియందు వివస్వంతునకుఁజెప్పినట్లును, వివస్వంతుఁడు మనువునకును మనువు తనపుత్రునకుఁ జెప్పినట్లును జ్ఞానాత్మక మగు నీసాంఖ్యముయొక్క వంశకథాప్రస్తావముఁజేసెను. కనుక నిది కేవలముసృష్ట్యాదియందు భగవన్ముఖనిస్సృతమయి తిరిగి

భారతమునందు వ్యాసగ్రథితమయిన పరమపవిత్రమగు తత్త్వ మగుచున్నది. భోగైశ్వర్యప్రసక్తి చేతనులగు వ్యవసాయాత్మిక యగుబుద్ధిగలవారలకు సమాధియందుజిత్తము నిలుచుటశక్యము కాదు గనుక నందుకు సాధనముగ సంగవిసర్జనపూర్వకమగు కర్మయోగము విధింపఁబడినది. ఈ కర్మయోగము ఫలాభిసంధితోఁ గూడుటచేతను ఫలాభిసంధి లేకుండుటచేతను రెండు విధము లగుచున్నది. ఫలహేతువుచే ననుష్ఠింపఁబడు కర్మ వాంఛితార్థముల నిచ్చినను సంగవిహీనమగు కర్మకంటె జాల మడుంగులు తక్కువయి జ్ఞానసాధనము గాకపోవుచున్నది. సిద్ధ్యసిద్ధులయందు సమభావముఁగలిగి యోగస్థుఁడగువానిచే ననుష్ఠింపఁబడు కర్మ జన్మబంధవినిర్ముక్తికిఁ గారణమయి మోక్షైక సాధన మగుచున్నది. పూర్వవాసనావాసిత మగు నంతఃకరణ మోహాత్మకమగు కాలుష్యము పోయి విశుద్ధ మయినపుడే వైరాగ్యముఁ జెందును. అట్టి దోషములను గషాయముఁబట్టి మాలిన్యమును గ్రిందికిఁ ద్రోసి సర్వవిశుద్ధమగు నంతఃకరణ యను సువర్ణము నిచ్చు మూస కర్మకాండతప్ప మరొండు లేదు. ఫల మెప్పుడును దోషభూయిష్ఠము గనుక నంతఃకరణ శుద్ధికి ఫలలిప్సలేకుండుట అత్యంతమవసరమగుచున్నది. అందు వలననే "మా కర్మఫలహేతు ర్భూః" యని శ్రీకృష్ణుఁడుపదేశించెను. కేవలేశ్వరార్పణబుద్ధిచే ననుష్ఠింపఁబడు కర్మయే యనామయమగు సద్గతికిఁ గారణముకాఁగలదు. ఇట్టిచిత్తశుద్ధి కలుగ నంతవరకును గర్మ వదలవీలులేదు. ప్రకృతిసిద్ధములగు గుణములు మనుజునిచే నెల్లపుడును గర్మచేయించుచునే యుండును.

కనుక కర్మచేయక క్షణకాలముగూడ మనుజుఁ డుండలేఁడు. కర్మలు ప్రారంభింపకుండుటచే నైష్కర్మ్యము నొందఁగోరుట యసంభవము. గుణత్రయముచే నెంతవరకు మనుజుఁడు చలింపఁబడునో యంతవరకుఁ గర్మచేయక తప్పదు. జ్ఞాని వీనిచేఁ జలింపఁబడఁడు కనుక వానికి కర్మతో నవసరము లేదు. కర్మయోగముకంటె సాంఖ్యము శ్రేష్ఠమయినను నట్టియోగ్యత రాజ్యాభిలాషచే యుద్ధముచేయవచ్చి భయకంపితుఁడై వెనుఁదీసిన యర్జునునియందుఁ గానరాకుండుటచే "కర్మణ్యేవా ఽధికారస్తే మా ఫలేషు కదాచన" ఫలమందుఁ గోరిక మాని ముందుఁ గర్మచేయుమని కృష్ణుఁ డుపదేశించెను.

ఈతీరున యోగమునకు స్వతఃఫలములేక సాంఖ్యమునకు సాధనమయి దానివెంటనే చెప్పఁబడుటచేత యోగము సాంఖ్యమున కంగమగుచున్నది. ఈ యోగ సాంఖ్యముల కొరకు బ్రహ్మచర్యాద్యాశ్రమచతుష్టయ మేర్పడినది. బ్రహ్మచర్యము కేవలవిద్యాభ్యాసముకొరకే కేర్పడినది. తదనంతరము వివాహేచ్ఛ యున్నయెడల సమావర్తనచేసి గుర్వాజ్ఞ నొంది గృహస్థాశ్రమముఁ బ్రవేశింపవలెను. వివాహేచ్ఛ లేనిచో జ్ఞానోదయపర్యంతము నైష్ఠిక బ్రహ్మచర్యముననే యుండవలయును. కర్మాచరణకు ముఖ్యమయిన యాశ్రమము గార్హస్థ్యము. ఈ యాశ్రమమునఁ జేయు కర్మ ముఖ్యముగ నిత్యనైమిత్తికాత్మకమయి యగ్నిపురస్సరముగనుండును. దానితోఁ బాటు ఉపాసనగూడ నుండును. గృహస్థాశ్రమమునందుఁ జేయఁబడిన కర్మోపాసనలచే లబ్ధమగు చిత్తశుద్ధిని బూర్తి

సేయుటకు వానప్రస్థ మేర్పడినది. అచటఁ గర్మకంటె నుపాసనా భాగ మెక్కువ గలదు. అగ్నిసాక్షిగఁ జేయఁబడునది కర్మ యని తలంచు వాడఁబడిన యుపాసనకూడఁ గర్మలో నంతర్భాగమే గాని తద్భిన్నముగాదు. వానప్రస్థమున సంపూర్ణ వైరాగ్యమునొంది జ్ఞానసంపాదనార్థమగు సంన్యాస మను నాల్గవ యాశ్రమముఁజేరి సర్వధర్మములను బరిత్యజించి బ్రహ్మజ్ఞానైక శరణ్యుఁడై తత్సాక్షాత్కారము నొందును. భక్తి యుపాసనాంగమ్ముగాని వేరొక యోగము గాదు. శ్రీకృష్ణునిచేఁ బూర్వమునుండి "ద్వివిధా నిష్ఠా" రెండునిష్ఠలు మాత్రమే చెప్పఁబడినట్లు గీతలు చెప్పుచున్నవి. గురుశాస్త్రములయందలి విశ్వాసము శ్రద్ధ. హృదయమునందలివిశ్వాసము భక్తి. అది స్వాత్మతత్త్వానుసంధాన మయిన నుపాసనాంగమయి కర్మ యగును. స్వస్వరూపానుసంధానమయిన, జ్ఞానమే యగును.

మధ్వరాయలు సాంఖ్యమును బంచరాత్రమని చెప్పెను. ఇందుకుఁ గారణ మయ్యది వేదములతో నేకార్థక మగుటయే యనియు వ్రాసెను. వేదములతో నేకార్థక మయినను బంచరాత్రమునకు "వేదా దపి పరమ్" అని వేదములకంటెఁ బరత్వము ను వారే చెప్పుచు వేదములకంటె నెక్కుడు ప్రమాణముగఁ బరిగణించుచున్నారు.



# ౧౨

# మాయావాదము

అద్వైతమతమును దన్మతప్రవర్తకులను బుద్ధిపురస్సరముగ నిందించుటకు మధ్వారాయలు తదనుయాయులును జేసిన సాధనములలో నీ మాయావాదనామకల్పనము ప్రథమసాధనము.

గీతయందు శ్రీకృష్ణుఁడు 16 వ అధ్యాయమున లోకమునందు భూతసృష్టిః దైవము ఆసుర మని రెండువిధములుగ నున్నదని చెప్పి యాసురసృష్టికిఁ జెందినవారు ప్రవృత్తినివృత్తి శౌచాచారసత్యముల గుర్తెఱుఁగక జగత్తు అసత్యము, అనీశ్వరము, కేవలకామ హైతుకమని తలంచును. నష్టమగు బుద్ధ్యాత్మలు గలిగి జగమున కహితమగు నుగ్రకర్మలఁ జేయుదురని యాసుర భావమును 7, 8, 9, గీతములయందు వర్ణించిరి. జగత్తు అసత్యమని యద్వైతులు చెప్పుచున్నారు. శ్రీ కృష్ణుఁడుదాహరించిన పై యాసురసంపత్తియంతయు లోకాయతికుల మతతత్త్వమనియు శ్రీ శంకర భగవత్పాదులు తమభాష్య గ్రంథమున స్పష్టముగా వ్రాసియున్నారు. అద్వైతులు జగత్తు అసత్యమని చెప్పుచున్నారు గనుక వారు రాక్షసులనియు వారిమతప్రవర్తకు లగు శంకరభగవత్పాదులకు గీత 16 వ అధ్యాయమునందలి 19 వ శ్లోకములోఁ జెప్పఁబడిన శిక్ష యనఁగ "క్రూరులగునట్టి నరాధములను నిరంతరము నశుభములగు నాసురయోనులందుఁ బడవేయుచున్నా"నను శిక్షను వేయవలెననియు సత్యధ్యానతీర్థులు వ్రాసిరి. ఇది సాహసమో లేక దిట్ట

తనమో లేక మఱియెద్దియో చెప్పలేకున్నారము. ఎంత యుచ్ఛృంఖలవృత్తితో సంచరింపఁగలవారలకుఁ గూడ ద్వైతా ద్వైతమతానుయాయులందు పరస్పరవిరోధజనకములగు నిట్టి వ్రాఁతలు గడు హేయము లగుచున్నవి గదా! తీర్థులవారి రథ మితరమతదూషణలయందు నల్లేరుపైఁ బారినట్లు బారుచున్నది. కాని స్వమతస్థాపనయందు నిమ్నదేశమునుండి యున్నతస్థల మున కెక్కుదానివలె వెనుకంజవేయుచున్నది.

కార్యమగు జగత్తునకుఁ గారణము నన్వేషించుటయందుఁ గల యభిప్రాయభేదములచే నిన్నిదర్శనములు బయలువెడలినవి. జగత్తు కార్యమని మధ్వారాయలుగూడ నొప్పుకొనియున్నాఁడు. కార్యకారణములకుఁ గల సంబంధమును జెప్పుటయే వాద మని శాస్త్రవ్యవహారము. పరమాణురూపమగు కారణమువలన నూతనమగు నొక జగద్రూపకార్య మారంభమగునని చెప్పు నైయాయికు లారంభవాదులు; ప్రధానము పరిణామము నొందుటచే జగత్తు గలిగెనని చెప్పు సాంఖ్యులు పరిణామ వాదులు; సృష్టికిఁ బూర్వ మేమియు లేక యభావమునుండియే జగత్తు పుట్టినదని చెప్పు మాధ్యమికులు శూన్యవాదులు. జగ త్సృష్టికీశ్వరుఁడు తాటస్థ్యము నుపపాదించి కారణమగుచున్నాఁ డని చెప్పు పాశుపతులు తటస్థేశ్వరవాదులు. పంచరాత్రమున నీశ్వరుఁడు జగత్కర్తయని ప్రతిపాదింపఁబడెను. కేవలకర్తృత్వో పాదనచే నయ్యది యభిమానవాదముగా నొప్పునేమొ? బ్రహ్మము దక్క వేఱొకండు లేదని శ్రుతి చెప్పుచుండుటవలన నట్టి హేయోపాదేయరహితమగు బ్రహ్మము అవిద్యచే సర్ప

రూపముగా వివర్తించినరజ్జువవలె జగద్రూపమున భాసించు చున్న దను బ్రహ్మవాదులు వివర్తవాదులు. ఇట్లనేకములు గలవు. ఇట్లే నిరపేక్షితమగు మాయ ఈ జగత్తునకుఁ గారణ మనినచో నయ్యది మాయావాద మగును. అట్లెవ్వరు నంగీక రింపలేదుగదా! ఈ వివర్తవాదమునకు ముఖ్యమగునామము బ్రహ్మవాదమని సాంఖ్యాదివాదులకు సులభముగఁ దెలియఁ జెప్పుటకు నీ వాదమునకు సత్కారణవాదమనియు, బ్రహ్మ కారణవాదమనియు వివర్తవాదమనియు వ్యవహారమును శిష్టులు చేసియున్నారు. ఇయ్యవి కేవలయుక్తిప్రయుక్తముగఁ జెప్పఁ బడిన వాదములు.

ఇంక "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" మొదలగు ఛాందోగ్యశ్రుతివలన సద్వాదము అసద్వాదమని రెండువిధము లగు వాదములు తెలియుచున్నవి. సృష్టికిఁ బూర్వము సత్తు మాత్రముగలదు, అదియే జగత్కారణమనునది సద్వాదము. సృష్టికిఁ బూర్వము అసత్తు మాత్రముగలదు, అయ్యదియే జగ త్కారణ మనునది యసద్వాదము. ఈ యసచ్ఛబ్దమునకు, సద్భిన్నమనియు నభావమనియుఁ బర్యుదాసప్రసజ్యప్రతిషే ధములవలన రెండర్థములు గలుగుచున్నవి. సద్భిన్నము వేఱొక పదార్థమైనఁ గావచ్చును, లేక యేమియు లేకపోవచ్చును. ఇందు మొదటియర్థమును సాంఖ్యాదు లాశ్రయించి సద్భిన్నమగు వేఱొక ప్రధానాదులను జగత్కారణముగఁ జెప్పిరి. రెండవ యర్థమును బౌద్ధైకదేశులగు మాధ్యమికు లాశ్రయించి శూ న్యమే జగత్కారణమని చెప్పిరి. సద్భిన్నమగు వేఱొక పదా

ర్థమును గారణముగ నంగీకరించువారలలోఁగూడ సత్కార్య వాదులనియు నసత్కార్యవాదులనియు నొకవిభాగముగలదు. సత్కార్యవాదు లనఁ గార్యోత్పత్తికిఁబూర్వమే కార్యము కారణాత్మగనుండి యనంతరము కారణసమావేశముచే నభివ్యక్తమగు నను వాదము. ఇద్దానిని సాంఖ్యు లాశ్రయించిరి. కారణమున నంతము ముందులేని కార్యము నూతనముగఁ గారణసామగ్రిచేఁ గలుగుననునది యసత్కార్యవాదము. ఇద్దానిని నైయాయికు లాశ్రయించిరి. పైనిఁ జెప్పఁబడిన యసద్వాదమే "కుతస్తుఖలు సోమ్యైవం స్యా దితిహోవాచ, కథమసతః సజ్జాయే తేతి" అను ఛాందోగ్యశ్రుతిచే నిరసింపఁబడినది. ఈ యర్థమే "అసన్నేవ స భవతి, అస ద్బ్రహ్మేతి వేద చేత్, అస్తి బ్రహ్మేతి చే ద్వేద సంత మేనం విదుః" అను తైత్తిరీయశ్రుతిచేఁ గూడ ననువదింపఁబడుచున్నది. తైత్తిరీయ ఛాందోగ్యస్థాపితమగు సద్వాదమే యద్వైతవాదప్రస్థానము. వారి వాదమును గేవల మాయావాద మని వారు చెప్పుకోలేదు. వారే కాదు, వారితో సమకాలికులగువారుగాని, వారికంటెఁ బూర్వులగు వారుగాని యీ వాదము నుపనిషద్వాదమనియు బ్రహ్మవాద మనియు వ్యవహరించిరే గాని మాయావాదమని యొక్కరును బేర్కొనలేదు. మతాంతరములతో సామ్యమును సూచించుటకు మధ్వాచార్యులచే రచింపఁబడిన పదినిబంధనలు గల యొక చిన్నగ్రంథము (దశప్రకరణములు)న మాత్రి మీ మాయావాదపదము వాడఁబడినది. మాయాశబ్దమును జెప్పి నంతనే బ్రహ్మవాదము మాయావాదమగుచో మాయాశబ్ద

ము\ను దఱచుగా వాడిన, భగవద్గీత గూడ మాయావాద ప్రతిపాదకగ్రంథ మగును. భగవద్గీతలయందలి—

"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్।
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా॥
(గీ. 4-67)

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరంతి తే॥
(గీ. 7-14)

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః।
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః॥
(గీ. 7-15)

నాహం ప్రకాశే స్సర్వస్య యోగమాయాసమావృతః।
మూఢోఽయం నాభిజానాతి లోకోఽయ మజ మవ్యయమ్॥
(గీ. 7-25)

భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥
(గీ. 18-61)

ఈ మొదలగు స్థలములయందుఁ దా నవ్యయుఁడు నిర్వికారుఁడయ్యుఁ దనమాయచేఁ గృష్ణాద్యవతారములను క్షీరశయనాదులను బొందుచున్నాననియు నయ్యవి తన యథార్థరూపములు కావనియు నీమాయ నతిక్రమించినవాఁడే తనరూపమును దెలియఁగలఁడనియు, అనగాఁ దన్నుఁ దెలియుటచేతనే యీమాయను దాఁటఁగలవాఁ డగుచున్నాఁడనియుశ్రీకృష్ణభగవానుఁడు స్పష్టముగఁ జెప్పెను. కనుక మాయ యనః మానుషబుద్ధి కతీత

మగు నొక యనిర్వాచ్య మని తెలియవలయును. మాయా శబ్దమున కీయర్థము లోకమున స్పష్టముగ వ్యవహరింపఁబడు చునే యున్నది.

ఇందువలన శ్రీకృష్ణభగవానుఁడే యీ జగద్వ్యవహార మునకు మాయ కారణమని చెప్పినట్లు సుస్పష్టమగుచున్నది.

ఇయ్యది యంతయు సత్య మను మధ్వాచార్యతీర్థుల మతమే వైదికమగుచో నీ శ్రీకృష్ణభగవానులు గీతలచే బోధించిన మత మాసురమే గావలయునుగదా! శ్రీభగవద్గీ తాభిప్రాయము ననువదించుచు షణ్మతస్థాపనాచార్యబిరు దాంకితులును బండితలోకైకవంద్యులు నగు శ్రీవిద్యాశంకర భగవత్పాదులవారు చెప్పినవాక్యములు వీరికిఁ గంటకములగుటఁ జూడ నద్వైతనిందకొఱకు మధుసూదనునివాక్యములకుఁగూడ నప్రామాణ్యమును గల్పింప సంసిద్ధులని సువ్యక్తమగుచున్నది. ఛాందోగ్యమందలి ప్రజాపతీంద్రవైరోచన సంవాదము స్మృతిపథము నలంకరించుచున్నది. మధుసూదనుఁడగు శ్రీకృష్ణునిబోధయందును దదనువాదకములగు శ్రీవిద్యాశంకర భగవత్పాదుల వాక్యములయందును వీరికి (మధ్వులకు) ననూయపొడముట సహజమే యైయున్నదిగదా!

# ౧౩

# విష్ణుస్వరూపము

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" "యతోవా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాదివాక్యములచే బ్రహ్మము జిజ్ఞాస్యమని తెలినందునఁ దత్ప్రతిపాదకములగు తైత్తిరీయ ఛాందోగ్యాద్యుపనిషదవలోకనముచేతనే జిజ్ఞాసువు కృతకృత్యతఁబడయఁగలడు. ఇచట మధ్వరాయలు "బ్రహ్మశబ్దశ్చ విష్ణావేవ' యని బ్రహ్మశబ్దమును విష్ణుపరముగఁ జతిరించినందున విష్ణ్వావిష్కరణకము లగు గ్రంథములే గతినిగల్పించఁగలవు. ఇట్టి శంకను బురస్కరించుకొని యుపనిషత్తులు విష్ణుబోధకములు గావనియుఁ దెలియుటం జేసియే "సర్వకర్తా ఆగమోదితః" సర్వకర్తయగు విష్ణు వాగమములచేఁ దెలియనగునని రాయలు వ్రాసెను. అందుచే ఆగమశబ్దము విచారణీయ మగుచున్నది. ఆగమశబ్దము శ్రుతి స్మృతి పురాణేతిహాస భిన్నమగు నొక తంత్ర కదంబమున రూఢిగ వాడఁబడుచున్నది. అట్టి తంత్రములు బహుసంఖ్యాకములు. ఈ రూఢ్యర్థమును గుర్తెరిఁగియే "ఋగాద్యా భారతం చైవ పాంచరాత్ర మథాఖిలం, మూలరామాయణం చైవ పురాణం చైతదాత్మకం, యేచానుయాయినస్తేషాం సర్వే తేచ సదాగమాః, దురాగమాస్తదన్యే యే తైర్నజ్ఞేయో జనార్దనః" అనిజనార్దనబోధకములగు పై గ్రంథపంచకమునే సదాగమములుగ గ్రహించి మిగిలిన వానిని దురాగమములుగ రాయలు త్రోసిపుచ్చెను.

కనుక విష్ణుస్వరూపనిరూపణ మీ గ్రంథపంచకముచేతనే చేయఁ
బడుచున్నటుల రాయల సిద్ధాంతము. ఈ యభిప్రాయ
స్థాపనము నించుక విచారింతము. విష్ణు బోధకత్వము
ప్రామాణ్యలక్షణముగఁ జెప్పంబడుటచేఁ దద్బోధకములుగాని
వేదములు, దశోపనిషత్తులు దురాగమములు గావలసివచ్చు
చున్నవి. భగవద్గీతలోని 700 శ్లోకములలో "ఆదిత్యానా
మహం విష్ణుః" అని యొకచోటమాత్రము విష్ణుశబ్దము వినఁ
బడుచున్నది. అటులనే బ్రహ్మైకబోధకములగు బ్రహ్మ
సూత్రములు దురాగమములు భారతము వేదానధికారులగు
స్త్రీశూద్రాదులకుఁ బ్రమాణము. మూలరామాయణము
కింపురుషలోకప్రసిద్ధము. పురాణము లన్నియు గ్రాహ్య
ములు గానేరవు. పాంచరాత్రములు మాత్రము రాయ
లకుఁ బరమప్రమాణముగ మిగిలినది. అందువలననే పాంచ
రాత్రములను "వేదాదపి పరమ్" అని వ్రాసిరి. కాని యింత
ప్రమాణగ్రంథమగు పాంచరాత్రములను సర్వమూలమున
రాయలు వ్రాయకుండుటకుఁ గారణ మన్వేషణీయము. అపౌ
రుషేయములగు ఋగాదివేదములకుఁ బురాణేతిహాసాదులతో
సామ్యముఁ గల్పించుటచే రాయలవైదికప్రామాణ్యము అపూర్వ
ముగ గానఁబడుచున్నది.

మధ్వరాయలు తనగ్రంథమున నెచటను విష్ణుస్వరూప
విచారణ చేయలేదు. 10వ ప్రకరణమున '(1) జగత్తు సత్యము
గాన విష్ణువు గొప్పవాఁడు. (2) వేదములో జీవబ్రహ్మభేద
బోధకవాక్యములు లేవు గాన విష్ణువు గొప్పవాఁడు' అని

సూత్రప్రాయముగ వాకుచ్చె. "విజ్ఞేయం పరమం బ్రహ్మ జ్ఞాపికా పరమా శ్రుతిః" పరబ్రహ్మనే శ్రుతి జ్ఞాపకముచేయు చున్నదని వ్రాసినను "తత్త్వమసీ"తి నవకృత్వముగా జీవబ్రహ్మ భేదమునే శ్రుతి బోధించుటచే విష్ణువుయొక్క సర్వోత్తమత్వ మందే సర్వాగమముల తాత్పర్యమని పేర్కొనెను. ఈవాక్య ములయందుఁ గనఁబడుచున్న హేతుహేతుమద్భావ మెట్లు సిద్ధించునో తెలియరాకున్నది. సహజశోభితమగు భేదబుద్ధిని జెప్పుట యజ్ఞాతజ్ఞాపకము లగు వేదముల పని గాదు.

ఉపాసనాసౌలభ్యముకొఱకు బ్రహ్మను సగుణముగ ననేకస్థలముల వర్ణించిరని "వ్యాస స్తత్తత్పురాణేషు తత్తద్రూ పత యోచివాన్" అను శిష్టోక్తివలనఁ దెలియుచున్నది. వివిధ పురాణప్రేరితమగు వివిధదేవతలను బ్రహ్మగా నుపాసించి తల్లబ్ధమగు జ్ఞానముచే ముక్తిని బడయవచ్చును. కాని బ్రహ్మ యాదేవత గానేరదు. ఉపాసనలు కేవలమనోవృత్తిమాత్రము లయినను గర్మాచరణసహితము లయినను, శాస్త్రచోదిత మగు నొక యాలంబనము గ్రహించి యనన్యవృత్తివిక్షిప్త మగు సమానచిత్తవృత్తిచే ననుష్ఠింపఁబడినపుడు చిత్తశుద్ధిని కలుగఁజేసి పరమతత్త్వావబోధకు సహాయకము లగుచుండుటచే సుబోధకము లగుచున్నవి. కనుక "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతీ" త్యాది శ్రుతివాక్యోపబృంహితమగు బ్రహ్మైక్య స్వరూప మోక్షతత్త్వమున కుపకారములేగాని, యపకార ములు గావు. విశ్వరూపత్వసాక్షిరశయనత్వాద్యవస్థాంతరము నొందు విష్ణు వుపాసనాకాండలోఁ జేరును. అందుకే వీరిక నీర్వ

లేదు. అధికారభేదముచే నుపాసనలుగూడ మారుచుండును.

ఈ యుపాసనాతత్త్వమునే 12 న అధ్యాయమున శ్రీకృష్ణుఁ డుపదేశించెను. అక్షరము ననిర్దేశ్యము నవ్యక్తము నచలమునైన కూటస్థబ్రహ్మను దెలిసికొనువారికిఁ దదవాప్తియే గలుగునని కంఠోక్తిగఁ బలికెను. ఇదియే పరమాద్వైతతత్త్వము. అట్టిభావము దేహాభిమానుల కధికతరక్లేశసంయుత మగుటంజేసి ధ్యానయోగముచే నుపాసించువారలకును మృత్యు, సంసారసాగరసముద్ధరణచేసెద ననియుఁ జెప్పెను. అందును శక్తిలేనివారలకుఁ బూర్వాపూర్వ తారతమ్యముగ నభ్యాసయోగము భగవద్ధర్మక్రియాచరణ ఫలవిరహితమగు స్వకర్త్యానుష్ఠానములగు జ్ఞాననిష్ఠాసాధకములగు మార్గములగతి చూపబెట్టెను. విష్ణుపి ట్లుపాస్యుఁడగుటంజేసి బ్రహ్మముగానేరఁడు. క్షీరసాగరశయనుఁడగు విష్ణువు కరచరణాదివిశిష్టుఁడైన శరీరియే గావలెను. విశ్వరూపము వెంటనే సంహరింపఁబడెను కనుక విశ్వరూపము నిత్యము గాదనియుఁగూడ సుస్పష్టము.

శ్రీః

# ద్వైతాద్వైతసిద్ధాన్తపరిష్కారపద్ధతి

శ్రీ పాంచజన్యపత్త్రిక 25-9-35 తేది సంచికలో వెలు
వడిన బ్రహ్మశ్రీ హరి నాగభూషణశాస్త్రిగారి వ్యాసమున
జదివితిని. అందు 3వ పుటలో 52 మొదలు 55వ పంక్తివరకుఁ
గొన్ని సందర్భములలో శ్రీ కల్యాణానంద భారతీమహన్తా
చార్యస్వాములవారు "పై సవాలు వేయవలసినదే" అని యంగీక
రించియేయున్నారు. కాని తగినసందర్భములు లేకయే శ్రీ
స్వాములవారు 'ఢీకోలు' ప్రసంగముఁజేయ నారంభించి రని
భ్రమించి, ఈ వ్యాసావళిరచన కుపక్రమించిరి. తగినసందర్భము
లున్నవని నేను వ్రాసియుంటిని. నే వ్రాసిన దానిలో
సందియమున్న, నావ్యాసములోఁ బేర్కొనఁబడిన న్యాయవాది
మిత్త్రులలో నెవ్వరికైన వ్రాసి తెలిసికొనియుండవలసినది. ఏ
సందర్భములలో, ఏయాశయములతో, ఎట్టి యధికారముతో
స్మార్త గృహస్థ విద్వాంసులు శ్రీ మధ్వస్వాములవారితో
వాదింపఁబ్రయత్నించిరో, అంతకంటె నావశ్యకమైన సందర్భ
ములలో జగద్గురుపదవికి నియతమగు నధికారముతో లోకోప
కారకరమగు నాశయముతో శ్రీస్వాములవారు స్వమతరక్షణా
కార్యమునకుం బూనిరని నిశ్చయించుకొనుట యిప్పటికైన
మంచిదని నామనవి. 20-6-35 తేది సభలో నీవిషయమును
గూర్చిన తీర్మానముపసంహృతమైనపుడు నేను జయధ్వాన
ముఁ జేసితిననుట వాస్తవముకాదు. అధ్యక్షులు తీర్మానమున

కనుకూలురుగ నుండిరనుటయు నెగ్గుటకు సిద్ధముగనున్నదను టయు నట్టిదియే. "మనలో మనము కలహించుట ఏల?"యని తీర్మానము నుపసంహరించుకొనినందున, కొందరు సభ్యులు సంతసమును వెలిబుచ్చియుండవచ్చును.

## వేదాంతశ్రవణము - అధికారులు.

గృహస్థులు వేదాంతశ్రవణమునకు గౌణాధికారులే యను శ్రీ శంకరభగవత్పాదులవారి సిద్ధాంతమునే నేనను వదించితిని. "ఉపరతి ర్నామ విహితానాం కర్మణాం విధినాపరిత్యాగః" అని నిర్వచించి, "సాధనచతుష్టయసంపత్త్యభావేపిగృహస్థానామాత్మవిచారే క్రియమాణే సతి తేన ప్రత్యవాయో నాస్తి" అని సిద్ధాంతముఁజేయుటలో గృహస్థులు సుతరాం వేదాంత శ్రవణమే చేయరాదు. సంన్యసించిననే వేదాంత పుస్తకములను స్పృశించుట కధికారము కలుగును అను లోకాపవాదమునునిరసించిరి (ఆత్మానాత్మవివేకః). "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రభాష్యమునగాని, వివేక చూడామణ్యాదిగ్రంథములయందుఁగాని, ఇందుకు విరోధించు శ్రీశంకరవాక్యములు కానరావు. కావున శ్రీశంకరమతము ననుసరించిమాత్రము, గృహస్థులు వేదాన్తశ్రవణమునందు గౌణాధికారులేగాని ముఖ్యాధికారు లెంతమాత్రము కారు. "తీవ్రముముక్షువులు, గాఢవైరాగ్యసంపన్నులు, సత్త్వగుణ ప్రధానులు, శమదమాదివంతులు, విక్షేపరహితులు"నగువారికి గార్హస్థ్యమందు పనియేలేదు. 'బ్రాహ్మణో నిర్వేద మాయా

న్నాస్త్యకృతః కృతేన" అను మొదలగు శ్రుతులవలన నట్టివారు బ్రాహ్మణులగుదురేని సర్వకర్మసంన్యాసమునందే యధికృతులై యుందురు. క్షత్త్రియాదులగుదురేని సంన్యాసాధికారము లేనివార లగుటచే లోకసంగ్రహకారులై ప్రవర్తించవలసి యుందురు. మన కిక్కడ బ్రాహ్మణగృహస్థులంగూర్చియే పరామర్శ. వారికి వేదాంతశ్రవణమునందు గౌణాధికారమే కలదని శ్రీ శంకరభగవత్పాదులవారి సిద్ధాంతము.

## గృహస్థవిద్వాంసులు.

బ్రాహ్మణగృహస్థులు విద్వాంసులై, స్వధర్మానుష్ఠానపరులై స్వాధికారానుగుణముగ శాస్త్రీయజ్ఞానము నార్జించి, తమశిష్యులకు నట్టిధర్మములను, జ్ఞానము నుపదేశించువారెందరో ఈ భారతావనిఁ గలరు. వారందరు నాకుఁ బూజ్యులే. అట్టివారిని నే నెన్నఁడును నిందించియుండలేదు.

"గృహస్థులయ్యు విద్వత్సంన్యాసులుగ భాసించువారును గలరు" అనువాక్యమే అనన్వితమని నా యభిప్రాయము. గృహస్థులు స్వాశ్రమోచిత నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానపరులై కర్మఫలమును బరమేశ్వరార్పణము సేయువారు. ఇట్టివారిని "స సంన్యాసీ చ యోగీ చ" అను గీతావాక్యములో శ్రీకృష్ణులుస్తుతించిరని శ్రీశంకరులు సిద్ధాన్తముచేసియున్నారు. విద్వత్సంన్యాసులనఁగ: "యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః, ఆత్మన్యేవచ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే" "సర్వ

కర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ, నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్" అను గీతావాక్యప్రమాణము ననుసరించి సర్వకర్మములను విధిపూర్వకముగ త్యాగము చేసినవారలని శ్రీశంకరులు గీతాభాష్యమున స్పష్టపరచియుండిరి. కావున నీవాక్యమందలి రెండుశబ్దములకు సామానాధికరణ్యమే కుదురదని చెప్పవలయును. కాని అట్టివా రున్నారని శ్రీ నాగభూషణశాస్త్రిగారు స్వానుభవపూర్వకముగ వ్రాయునప్పుడు నేనట్టివారియస్తిత్వమును శంకించుట సాహసమే యగును. ఇందుకు సంతుష్టుండను.

## ద్వైతాద్వైతములు.

ద్వైతాద్వైతములలో నెయ్యది యద్వైతముముముక్షువులకు మోక్షైకాన్తసాధనముగ గ్రహింపఁదగినది ? అను విషయములో వాదవిడంబనమేగాని శ్రీనాగభూషణశాస్త్రిగారును నామతము నే యంగీకరించినట్లు కన్పించుచున్నారు. 'అద్వైతమే పరమార్థము; ద్వైతము ఉపాసనార్థము కల్పితము' అని వారిసిద్ధాన్తమే. బ్రహ్మాద్వైతాత్మజ్ఞానమే సద్యోముక్తిహేతువనియు, నయ్యదియే మోక్షమున కేకాన్తసాధనమనియు "జ్ఞాత్వా తం మృత్యుమత్యేతి నాన్యః పంథా విముక్తయే" "నాన్యః పంథా విద్యతేఽయనాయ" ఇత్యాదిశ్రుతివాక్యములు స్పష్టపరచుచున్నవి. ద్వైతోపాస్తి సగుణబ్రహ్మోపాసనము చేయువానికి అనగ 'పరోక్షః పరమేశ్వరః ప్రాప్యః' అని యుపాసించువానికి

కార్యబ్రహ్మలోకప్రాప్తి కలదు. ఇట్టి కార్యబ్రహ్మలోక
ప్రాప్తినే సగుణముక్తియని యౌపచారికముగ నందురు. వాస్త
వముచే నది ముక్తి కాదు. కార్యబ్రహ్మలోకము నయిత
మితరద్వైతప్రపంచమంతటివలెనే నశ్వరము. "ఆబ్రహ్మభువనా
ల్లోకాః పునరావర్తినోఽర్జున" అను గీతావాక్యప్రమా
ణము ననుసరించి బ్రహ్మలోకము నశ్వర మనక తప్పదు.
అయినచో బ్రహ్మలోకగతులకు పునరావృత్తి లేదని "అనా
వృత్తిః శబ్దాత్" అను సూత్రమున పరిష్కృతమైనది కదా, యని
యనవచ్చును. కాని "అన్తవత్త్వేఽపి త్వైశ్వర్యస్య" అను శ్రీశంకర
వాక్యమువలన కార్యబ్రహ్మలోకప్రాప్తియే ముక్తి కాదనియు
తత్ప్రాప్తిరూపైశ్వర్యము నన్తవంతమేయనియు స్పష్టపడుచున్నది.
'కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పర మభిధానాత్' అను
సూత్రముచే నక్కడ సమ్యగ్దర్శనవంతుఁడగు బ్రహ్మచే నుప
దేశింపఁబడిన మహావాక్యార్థజ్ఞానపురస్సరమగు సమ్యగ్దర్శన
ముచే ముక్తి కలుగునని వివరింపఁబడినది. "తేషాం సగుణవిద్యా
ఫలక్షయేఽపి, నిరవగ్రహేశ్వరానుగ్రహల్లబ్ధాత్మజ్ఞానాన్ముక్తిః"
అను రత్నప్రభావాక్య మీ విషయమును స్పష్టపరచుచున్నది.
ఇట్లు కలిగిన ముక్తి క్రమముక్తి యనఁబడును. అదియు సగుణ
బ్రహ్మోపాసనా ఫలము కాదు.

### బ్రహ్మోపదిష్టాద్వితీయాత్మజ్ఞానఫలము.

దేహావసానమునకుఁ బూర్వ మార్జింపఁబడిన యద్వితీయ

బ్రహ్మాత్మత్వజ్ఞానము సద్యోముక్తిహేతువు. ఇందు పునర్దేహప్రాప్తియే లేదు.

సగుణబ్రహ్మోపాసనముచే దివ్యదేహప్రాప్తియు కార్యబ్రహ్మలోకగతియు కలుగును. ఆలోకము, తల్లోకానుభవమునకై నిర్మితమగు దేహము నశ్వరములే.

కావున ద్వైతనిష్ఠ, సగుణబ్రహ్మోపాసనము, అద్వైతి ముముక్షువులకు మోక్షైకాన్తసాధనము కాదు. పారంపర్య సాధనము కాకతప్పదు. సన్ధ్యావందనాదినిర్వికల్పకసమాధ్యనుష్ఠానాంతవిహితవిధికలాపమంతయు చిత్తశుద్ధిజ్ఞానోదయ కారణమగుటచే సాంపచారికముగ పారంపర్యముగం మోక్షహేతువే గనుక ముముక్షుగ్రాహ్యమన్నట్లు ద్వైతము ముముక్షుగ్రాహ్యమనుటలో విప్రతిపత్తిలేదు. ద్వైతాద్వైతమతస్థులకు వాదహేతువే లేదని సాధింపఁబూని ద్వైతము గూడ వైదికమే యగుటచే ముముక్షుగ్రాహ్యమనియు, అటులని శ్రీశంకరులే యంగీకరించిరనియు వ్రాయుట శ్రీశంకరమతవిరుద్ధము. ఈ వాక్యములో "గూడ" అను రెండక్షరములఁ దీసివైచి ద్వైతమతస్థులును వాదించుచున్నారు.

పునరావృత్తిరహిత బ్రహ్మలోకప్రాప్తి నిచ్చినందున సగుణబ్రహ్మోపాసనము మోక్షైకాన్తసాధనమందుమేని, "పునరావృత్తిరహితశాశ్వతబ్రహ్మలోకే నిత్యనివాససిద్ధ్యర్థం

అను సంకల్పపూర్వకముగఁ జేయఁబడు కన్యాదానము గూడ మోక్షైకాన్తసాధనమనవలసివచ్చునేమో ? బ్రహ్మలోకము నకుఁ జేరినవారికి పునరావృత్తి రాహిత్య ఫల మిచ్చునది యద్వితీయబ్రహ్మాత్మజ్ఞానమేగాని మరియొండు కాదు.

కావున అద్వైతమే పరమార్థము. అదియే అద్వైతి ముముక్షువులకు గ్రాహ్యము.

చెఱకుపల్లి బుచ్చిరామయ్య

ఓం

# I

జగద్గురు శ్రీ కళ్యాణానంద భారతీమహాంతాచార్యస్వాము లవారు వైదికధర్మసంవర్ధనీసభాపక్షమున "మధ్వమతవిధ్వంసి" యను శీర్షిక క్రింద తే 1—10—36 మొదలు 10—10—36 వఱకు మహోపన్యాస పరంపరను గావింప ననుగ్రహించి యున్నారు. వీరు గావించిన మొదటియుపన్యాసమునందు "ద్వైతము, విశిష్టాద్వైతము" అనునవి మతనామము లగుటకు నన ర్హములనియు, నాయా మతముల స్వరూప విచారముచే నీ విషయము తెలియనగుననియు సెలవిచ్చియుండిరి.

సత్యధ్యానతీర్థులు తమ సివిల్ కేసు గ్రంథమునందు వాదియగు విష్ణుదాసాచార్యులమతము "ఆస్తిక వైదికమనియు వైదికమత"మనియు తమబిరుదము లో "వైదిక వైష్ణవ ప్రతిష్ఠాపనాచార్యుల"మని వ్రాసియుండెను. [illegible] మధ్వాచార్యులు చెప్పిన ద్వైతము విష్ణుదాసునిమతమనియు నద్దియే వైదికమతమనియు వ్రాసిరి. కానిమధ్వాచార్యుల మతమునకు మాధ్వమతమనియే నామముండినట్లు యుక్తిమల్లికా గ్రంథకర్తయగు వాదిరాజును దద్వ్యాఖ్యాతయును వ్రాసియుండిరి.

శ్రీస్వాములవారు మతమునకు సిద్ధాంతము విరోధపరిహారము సాధనము ఫలము నుండవలయుననియు సత్యధ్యానతీర్థులు సివిల్ కేసునందు బ్రహ్మాండప్రమాణముగా గ్రహించిన,

1. వేదములు, వేదాన్తసిద్ధాన్తములును బ్రహ్మసూత్రములు మఱియు భగవద్గీతయును

2. సమస్తజగత్తు నిజమైనది,

3. విష్ణువు సర్వోత్తముఁడు సర్వకర్తా,

4. పరమాత్మ జీవునికంటె భిన్నుడు,

5. పరమాత్మ జీవునికంటె భిన్నుడను జ్ఞానమే మోక్ష సాధనము, అను విషయములు మధ్వాచార్యునిచేఁ జెప్పబడలేదనియు, మధ్వాచార్యులు తన మతమునకు ప్రత్యక్షానుమానాగమములు ప్రమాణములని తనదశప్రకరణములందు వివరించి యుండెననియు బ్రమేయమైన సిద్ధాన్తసాధ్య ఫలములను,

1. హరిపరతమము, జగత్సత్యము, జీవులు ఉచ్చనీచ భావములతోఁ గూడిన వారలై పరస్పరము భిన్నులు, మోక్షము నైజసుఖానుభవము, భక్తితత్సాధనము అని చెప్పియుండె ననియు సెలవిచ్చియున్నారు.

సత్యధ్యానతీర్థులు మధ్వాచార్యప్రతిపాదిత మతమునకు భిన్నముగా జెప్పుటయేగాక మధ్వాచార్యులు ప్రమాణములుగా గ్రహించిన భారతపంచరాత్ర మూల రామాయణాదులను బ్రమాణములుగా స్మరించియైన నుండలేదనియు, ప్రతిపాదిత మత ధర్మములుగాఁ దలచిన

1. బ్రహ్మ సకలధర్మరహితుఁడు

2. జగత్తు మిథ్య

3. జీవుడు బ్రహ్మకంటె వేఱుకాఁడు

4. జీవబ్రహ్మైక్యజ్ఞానము మోక్షసాధనము

అనువానిని జూచి వానికి ప్రతిగా దన ప్రమాణప్రమేయము లను గల్పించుకొననేగాని యయ్యది మధ్వమతమగునో కాదో యని విచారణ్మైనన జేసియుండలేదనియు సెలవిచ్చియుండిరి.

## II

శ్రీవారు తమ ద్వితీయోపన్యాసమునందు:—మన మతమునకు శ్రౌతమతమనియు, స్మార్తమతమనియు నామములు గలవనియు మాధ్వులయొక్క మతమునకు మధ్వ మతమనియే నామమనియు జెప్పిరి. శ్రౌతమతమున గర్మకాండమునకు జైమినీయసూత్రములును, జ్ఞానకాండభాగమునకు బ్రహ్మసూత్రములును ముఖ్యములగు ప్రమాణములై యున్నవి. అనగా గర్మకాండమునకు జైమిని సూత్రములును బ్రాహ్మణములును గల్పసూత్రములును, జ్ఞానకాండమునకు బ్రహ్మసూత్రములు ఉపనిషత్తులు, దదర్థబోధకములగు భగవద్గీతలును, ప్రమాణములు. కావున వేదమే మన మతమునకు సర్వవిధముల ప్రమాణము.

మధ్వాచార్యులు తన మతమునకు బ్రత్యక్షము అను-మానము ఆగమము ప్రమాణములని చెప్పుచు నాగమమున నిరుక్తమగు శబ్దము నొకచోటను వేరొకచోట ఋగ్యజుస్సామాథర్వభారతపంచరాత్రమూలరామాయణ ప్రభృతులనియు జెప్పియుండెను. కాని బ్రహ్మసూత్రముల నాతడు గ్రహించియుండలేదు. శ్రీవారు తమ మతమునకు ప్రమాణగ్రంథముల నిచ్చుట యందు మధ్వాచార్యులకంటె భిన్నముగా వర్తించి యుండెను.

మధ్వాచార్యులు భారతము వేదమంతు లేని విషయములతో నొప్పుచు స్త్రీ శూద్రాదుల కొఱకు రచింపఁ బడెనని యొక చోటను, వేఱొకచ్చోట "వేదాదపివరం చక్రే పంచమం వేద ముత్తమం" అనియు జెప్పెను.

ఇఁక బంచరాత్రమైనను వీరికి ముఖ్యములగు సాత్త్విక మూలములు గావు. శంఖచక్ర తాపనము మాత్రమే వీరద్దాని నుండి గ్రహించుచున్నారు.

వేదానధికారులగు స్త్రీ శూద్రాదుల కొఱకు ప్రవర్తింపఁ బడిన భారత పంచరాత్రములు పురాణములనే ముఖ్య ప్రమాణములుగా గ్రహించుటచే మధ్వాచార్యులకెట్టిదైనని స్వాభిలషితాభిప్రాయ మొండి యుండవచ్చునని యూహింపవ నొప్పును.

ఇంతియ కాదు వేదానధికారులగు స్త్రీ శూద్రాదుల కుద్దేశింపఁబడినవని నిర్వచింపఁ బడిన భారత పంచరాత్రముల కంటె వేదములు నికృష్టప్రమాణములని చెప్పి మధ్వాచార్యులు వేదప్రమాణ మించుకేనియు నుత్కృష్టప్రజ్ఞకు దోషము గదా!

కావున మధ్వ సర్వవిధములఁ బ్రహ్మద్వేషియగు నవైదికుఁడే.

# III

# ప్రమాణ లక్షణ ఖండనము.

శ్రీ స్వామివారు తమ మూఁడవ యుపన్యాస మందీ క్రింది రీతిని ప్రమాణ లక్షణమును ఖండించి యుండిరి.

మధ్వాచార్యులు అద్వైతమతమును జయించుటకు శ్రం గగిపిపోయి యున్నట పరాభూతుండై తా స్వీయముగ నొక మతమును లేవదీయ నెంచి గ్రంథరచనమునకు బూనుకొని, తా నితని దశప్రకరణములను రచించినట్లు తెలియుచున్నది. వీనిలో ప్రమాణ లక్షణము మొదటిది. ఈ గ్రంథాదియందు "ప్రమాణానాం స్వలక్షణమ్" అని యతడే చెప్పియుండె. ఈ "స్వలక్షణము" అను శబ్దము మొదలి స్వశబ్ద స్వారస్యము ఏమై యుండునో ప్రాజ్ఞు లూహింతురు గాక; బహుశః "సు + అల క్షణము" అని చెప్పనచ్చునేమో!

ప్రమాణలక్షణమునందు దొలుత "యథార్థం ప్రమాణం, తద్ద్వివిధం కేవల మనుప్రమాణం చ. యథార్థజ్ఞానం కేవలము" అని చెప్పియుండెను. దీనిని బాగుగా గమనించిన సామాన్యమగు యథార్థము విశేషమగు కేవలము యొక్క లక్షణమందు చెప్పబడుటచే సామాన్య విశేషములకు సాంకర్యము ఘటించినది. తర్క-సంగ్రహమునందు స్మృతికిసంస్కారమాత్ర జన్యం జ్ఞానమ్స్మృతి అని లక్షణముచెప్పి తద్భిన్నమగు జ్ఞానమనుభవమనియు, నయ్యది యథార్థాయథార్థ భేదములచే ద్వివిధమనియు యథార్థజ్ఞానమన్న నున్నదాని నున్నట్లు దెలిసికొనుటయనియు నయథార్థజ్ఞానమన లేనిదాని నున్నట్లు (శుక్తి రజతజ్ఞానము) తెలిసికొనుటయనియు, నందు యథార్థజ్ఞానము ప్రత్యక్షానుమిత్యుపమితి శబ్ద భేదములచే నాల్గువిధములనియు వానికి ప్రత్యక్షానుమానోపమాన శబ్దములు ప్రమాణములని యు చక్కగా నిర్వచింపబడియెను. మధ్వాచార్యులన్ననో సం

దర్భ శుద్ధిలేని వాక్యములతో స్వలక్షణములను రచియించియుండెను. ఇతడు కేవలము ప్రత్యక్ష + అనుమాన + శబ్దములచే నాలుగు విధములని చెప్పెను. ఉపనిషద్భాగము పరిపూర్ణమైనను అదృష్టపూర్వమై మధ్యకపోలకల్పితమైయున్నది. అనుప్రమాణ లక్షణమునందు "నిర్దోషార్థేంద్రియసన్నికర్షః ప్రత్యక్షమ్" అని చెప్పియుండెను. సన్నికర్షజ్ఞానము కాదు గదా! "నిర్దోషోపపత్తి రనుమానమ్" అని యనుమాన లక్షణమును నిర్వచించి, శాస్త్రమునందు తాత్పర్యనిర్ణాయక లింగములని ప్రసిద్ధిజెందినయుపక్రమోపసంహారాదులను. మీమాంసీయ దర్శనమునందు "శ్రుతిలింగవాక్యప్రకరణస్థానసమాఖ్యానాం పారదౌర్బల్య మర్థవిప్రకర్షాత్" అను సూత్రమును దోష వశముచే కలత్రగోత్రముగా గ్రహించి తదేక దేశములతో "ఉపక్రమోపసంహార తదైక రూపాభ్యాసాపూర్వతా ఫలార్థ వాదాశ్చ ఉపపత్తి విశేషాః, తథా నిర్దోషోపపత్తయో లింగాని, సమాఖ్యావాక్య ప్రకరణ స్థానాని లింగ విశేషాః" అని యుక్తి పత్తి విశేషముల నిర్వచించెను. ఇది యంతయు బ్రహ్మాండము మునుండి గ్రహించెనట! సుప్రసిద్ధమగు తర్కమునందు స్వలక్షణములు లేకపోవుటచే నిట్టి కుతర్కమును సృష్టించవలసి వచ్చెను కాబోలు!

ఆగమ లక్షణము "నిర్దోషః శబ్ద ఆగమః" అని చెప్పి దానిని గురించి మరేమియు చెప్పక మిన్నకుండెను. దీనినిబట్టి ఇతనికి ఆప్తవాక్యత్వ రీతినైన వేదమునందు ప్రామాణ్యమున్నట్లు కాన్పింపదు. కనుక స్వకపోలకల్పిత వాక్యములే సిద్ధి

ప్రమాణము లగుటచే మధ్వాయే తన మతము అవైదికమని చెప్పి నట్లూహింపవచ్చును.

ఈ ప్రమాణలక్షణమును బుష్కలముగా బరీక్షింపగా నియ్యది యున్మత్తప్రలాపమువలె నున్నది. జగన్మిథ్యయను నద్వైతివాదమును దిరస్కరింపవలయునను నభినివేశముచే—"ప్రత్యక్షాగమాది భిర్జగత్సత్యత్వాత్, ఆత్మనోఽపి దృశ్యత్వాత్, శుక్తి రజతాదేర నిర్వచనీయత్వా భావాత్" అను మొదలగు పంక్తులను జయించుటయందే తన బుద్ధి ప్రసరించి యుండుటచే నిట్టి స్వలక్షణము లను రచియించెనని

తోచుచున్నది.

# IV

శ్రీనాగు తమ నాలుగవ యుపన్యాసమునందు "కథాలక్షణ, ఉపాధిఖండన, మాయాఖండన ప్రపంచ మిథ్యాత్వానుమాన ఖండనములను గ్రంథములయొక్క యాభాసతను బ్రదర్శించియుండిరి.

మధ్వాచార్యులు కథా లక్షణమునందు దన మతమునకు బ్రమాణగ్రంథములుగ బుగ్యజుస్సామాథర్వణములను మూల రామాయణ భారతపంచరాత్రములను గ్రహించి యుండెను. వేదానధికారులగు స్త్రీశూద్రాదులకు నుద్దేశింపబడిన భారత పంచరాత్రములను వీరు ప్రమాణముగా గ్రహించుటచే వీరి యొక్క వైదికత్వ మేపాటిదో యందఱకు దెలియు చున్నది. ఇక మూలరామాయణమను గ్రంథ మేదియో తెలియబడదు.

జైమిని మహర్షియొక్క సూత్రములను మన్వాది స్మృతులను ప్రమాణములుగ గ్రహింపక స్వప్నుడనే సిరియొక్క వ్యాసాది కర్తృత్వము మతిభ్రాంతి స్పష్టమగుచున్నది. కాని, మధ్వులలో సూద్రులున్నచో వారికొరకైన భారతపంచరాత్రములు గ్రహింపబడినవని చెప్పవచ్చును. మాధ్వులలో చాతుర్వర్ణ్యవ్యవస్థ యున్నట్లు తెలియబడదు. ఈకారణమున నాయనగారి సీరు చాతుర్వర్ణ్యబాహ్యాంతరయ్యాభ్యుతులుగా రని స్పష్టముగ నుండవచ్చును.

మధ్వరాయలు తన ప్రమాణలక్షణమును రచించిన పిమ్మట సర్వత్ర పరాహతుడై మధ్వమతస్థులయొక్క లక్షణమును దన మతమునకు ప్రమాణగ్రంథములను వాదమునందలి భేదములను దెలియజేయు నీకథా లక్షణమును రచించెనని తోచుచున్నది. ఏలయన — మధ్వమతస్థుల కుపదేశించిన ముఖ్యమగు లక్షణములలో విష్ణుభక్తిముఖ్యమని మధ్వరాయలు "విష్ణుభక్తిర్హి సర్వేషాం సద్గుణానాం స్వలక్షణమ్" అని చెప్పె. ఇచట గూడ స్వలక్షణమున బూర్వోక్తార్థమునే గ్రహించవలెను!

వేదాంతులు "జగన్మిథ్యా, దృశ్యత్వాత్, శుక్తిరూప్యవత్" అని చెప్పుచుండ నీమధ్వరాయలు "నక్కను గొట్టి నక్క" యను రీతిని తన ప్రపంచమిథ్యాత్వానుమానఖండనమందు "జగత్ సత్యం దృశ్యత్వాత్, ఆత్మవత్, ఆత్మనోఽపి దృశ్యత్వాత్, అని యనుమాన రచన సేసియుండెను. కాని యాత్మ స్వరూపమును గూర్చి విప్రతిపత్తులు పెక్కులున్నవను విషయము మధ్వకు దెలియదు కాబోలు! ఆత్మయే దృశ్యమగుచో ప్రమాణగ్రంథము యొక్కగాని గురువులయొక్కగాని

యవసరమే లేకపోయెడినిగదా! చార్వాకుని కొక్కనికి మాత్రమే దేహమే యాత్మ యగుటచే నాత్మ దృశ్యమగు చున్నది. కావచ్చును. మధ్వానుగంతలకును నాచార్యులేయగుటచే చార్వాకులవలె వీరికి కూడ నాత్మ దృశ్యమై యాత్మ విషయమై ప్రమాణప్రమేయ విషయము లెవ్వియు ననవసరము లేకుండ నుండును. కాని వీరు వేదాంతుల మతమునుజూచి ప్రమాణగ్రంథములను ప్రమేయములను ప్రస్తావన చేసియుండిరి గాని వాస్తవమున వీరు చార్వాకుని జ్యేష్ఠభ్రాతలేయని తోచుచున్నది. లేనిచో "ఆత్మనోఽపి దృశ్యత్వాత్" అను దృష్టాంతమును మధ్వరాయ లుదాహరింపక పోయియుండును.

కల్పితమగు నుపాధివశమున జీవేశభానము గల్గుచున్నదని వేదాంతులు చెప్పుచుండ నుపాధిసత్యమేయనియు నక్క-తమున జీవేశభేదము సత్యమనియు మధ్వరాయలు ప్రతికూలముగ రచియించి "శుక్తిరజతాదేర నిర్వచనీయత్వాభావాత్" అను హేతువును ప్రతిపాదించియుండె. కాని యనిర్వచనీయత్వమన నెద్దియో దీని వలన నతనికి దెలియదని స్పష్ట మగుచున్నది.

పూర్వాఖండనమున మధ్వరాయలు "ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ" అను భగవద్గీతయందలి గీతము నుదాహరించి జీవాత్మలకు భేదమును స్థాపింప యత్నించె. కాని రెండవ యధ్యాయములోని "అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదంతతమ్" అను శ్లోకము నితడు చూచినట్లయిన

గాన్పింపదు. ఏలయన — అంతట వ్యాపించిన పదార్థ మొక్క
టియే కావలయునుగాని రెండు కావని చెప్పుటను గ్రహింప
గలరు. ఈ అవినాశితు అను శ్రుతమును జూచినవారు ద్వా
విమౌ అనునది వ్యవహారమునందలి స్థితి ననువదించుచు జెప్పిన
దని సులభముగా గ్రహింపగలరు. పరసిద్ధాన్తఖండనోద్యోగాం
ధుడగుటచే మధ్వరాయలు దీనిని గ్రహింపలేకపోయెను.

# V

శ్రీవారు ఐదవ యుపన్యాసమునందు దశప్రకరణము
లందు మిగిలిన ప్రకరణములను ఖండించియుండిరి.

మధ్వరాయలు ప్రతిమనుజుడును తన కుతర్కమును
నిందించుచుండ దన మతముయొక్క తత్త్వముల విమర్శించు
టకు నీతత్త్వసంఖ్యానతత్త్వవివేకములను రచించెను. వీనిలో
నొకే విషయము చెప్పబడియుండె. అందు "లక్ష్మి దుఃఖము
లేనిది. తదన్యులు దుఃఖ సంస్పృష్టులు. దుఃఖము కలవారు
ముక్తికి యోగ్యులనియు, ముక్తి కయోగ్యులని రెండువిధము
లుగ నున్నారు. ముక్తి కయోగ్యులగువారు సృతిసంస్థితుల
నియు, అతమోగులనియు రెండువిధములు. తమోగులు
మర్త్యులు. సృతిసంస్థితులు దైత్యరక్షః పిశాచాదులు" అని
చెప్పబడియుండెను. ఈవిభాగము గీతలలో బదునారవ
యధ్యాయమునందున్న జీవకోటివిభాగముతోగాని మన్వా
దులయొక్క జీవకోటివిభాగముతోగాని సరిపోదు. సంతత
నరకము సంతతముక్తి యను సిద్ధాన్తములు మహాత్ముదీయ

ద్వైతమతములతో నీ మధ్వమతమునకుగల బాంధవ్యమును జాటుచున్నవి.

మధ్వరాయలకు దృశ్యమైనదేగాని సత్యముకాదు. (జగత్సత్యం దృశ్యత్వాత్) కాని తన తత్త్వములందు లక్ష్మీ నిత్యముక్తురాలు. దదితరులు దుఃఖ సంస్పృష్టులను విషయము దృశ్యము కాకపోవుటచే వానికి అసత్యత్వము ఘటించునని మధ్వ తలచియుండలేదు. జైమిని తన "విరోధేత్వ నపేక్ష్యంస్యాత్, అసతిహ్యనుమానం" అను సూత్రమునందును, బాదరాయణుడు "స్మృత్యనవకాశదోష ప్రసంగాదితిచేన్నాన్య స్మృత్యనవకాశదోష ప్రసంగాత్" అను సూత్రమునందును శ్రుత్యనుగృహీతమగు స్మృతియే ప్రమాణమని చెప్పియుండిరి. ఈ గ్రంథములు శ్రుతివిరుద్ధములు గావున సర్వదా హేయములు.

మధ్వరాయలు తత్త్వోద్యోతమునందు జీవేశ్వరభేదమును జగత్సత్యత్వమును విష్ణుసత్యత్వమును గురించి చెప్పెను. "విశ్వం సత్యం" అను శ్రుతి జగత్తుయొక్క సత్యత్వమును జెప్పునని భ్రాంతిపడెను కాని విశ్వశబ్దము జగత్పరముగాదు, బ్రహ్మపరము. జగత్తును సత్యమని ప్రత్యక్షముగా గ్రహించుచున్నాము గావున జగత్తుసత్యమని మధ్వరాయలు చెప్పెను. కాని విష్ణువు ప్రత్యక్షముకాడు. కావున నాతనికి మిథ్యాత్వదోషము గలుగునని యాతడు దలంచినట్లు దోషము.

"జీవేశ్వరులకు భేదము సిద్ధింపదు. జగత్తు సత్యము. కావున విష్ణువు గొప్పవాడు" అను నీ మధ్వరాయల యనుమానమునుజూచి విబుధలోకము సంతసించునుగాక.

మధ్వరాయలు తన విష్ణుతత్త్వవినిర్ణయమునందు సర్వాగమములకు విష్ణువునందు దాత్పర్యమనియు "అన్వేదురాగమానామ మైర్ణ్ణజ్ఞేయో జనార్దనః" అనియు జెప్పెను. వేదములందలి జగన్మిథ్యాత్వ జీవేశ్వరాభేదప్రతిపాదక వాక్యములన్నియు బ్రత్యక్షానుమాన విరుద్ధములు గావున వానిని గ్రహింపరాదని మధ్వరాయలు చెప్పెను. అటులనే ప్రత్యక్షానుమానములవలన జీవేశ్వరభేదము, జడేశ్వరభేదము, జీవజడభేదము, జడజడభేదము, జీవజీవభేదము నను నైదు రకములగు భేదము సిద్ధించుచున్నదని చెప్పెను. ప్రత్యక్షానుమాన విరుద్ధములు గాని వేదవాక్యములు ప్రమాణములు గావని చెప్పు మధ్వరాయలు వైదికుడన హాస్యాస్పదముగాదా!

కర్మనిర్ణయమునందు గర్మయన నేదియో వివరింపకయే, యెన్ని కర్మలయినను విష్ణుధ్యానమునకు సరిగావనియు విష్ణుప్రసాదము లేనిచో మోక్షము సిద్ధింపదనియు జెప్పెను.

## VI

శ్రీవాదు తన యాఱవ యుపన్యాసమునందు మధ్వరాయలు రచించిన బ్రహ్మసూత్రవృత్తిని ఖండించి యుండెను.

లోకమునందు బ్రస్థానత్రయమే వ్యాప్తియందుండుట చేతను దన ప్రకరణముల నెవ్వరును విశ్వసింపకుండుటచే తను ఖిన్నుడై మధ్వరాయలు స్వమతవ్యాప్తికొఱకు యుపాయము నాలోచించి బ్రహ్మసూత్రవృత్తి మొదలగు గ్రంథ

ములను వ్రాసెను. తన గ్రంథములకు పూర్వము బ్రహ్మ సూత్రములకు నిరువదియొక కువ్యాఖ్యానములను ఖండించి బ్రహ్మసూత్రమునకు వ్యాఖ్యానమును వ్రాసినట్లు మధ్వ లోక ప్రవాదమును లేవదీసిరి. ఇయ్యదికల్ల. బ్రహ్మసూత్ర ముల నధికరణ న్యాయముచే వ్యాఖ్యచేయవలయును. మధ్వ భాష్యమున నధికరణ రచనయే లేదు. ఇరువదియొక కువ్యా ఖ్యానములను ద్రోసివేసినవాడు ఒక్క మతమునైన నుపన్య సించి త్రోసివేసినట్లు గాన్పింపదు. శంకరభాష్యమును ఖం డింపదలచినవాడు వారి సిద్ధాన్తములను పూర్వపక్షముగా గ్రహించి సుస్పష్టముగా ఖండింపవలయుగదా! కాని మధ్వ యట్లుచేయలేదు. దీనిని బట్టి మధ్వరాయలచే రచిం పబడిన బ్రహ్మసూత్రవృత్తిని జూచినవారు ఏకవింశతి కుభా ష్యదూషితమైన సూత్రముల కాతడు భాష్యము రచించెనని చెప్పువాక్య మున్మత్తప్రలపితమని గ్రహింపగలరు. మధ్వ వృత్తికి భాష్యలక్షణమే లేదు. బాదరాయణ సూత్రములకు మూలములగు శ్రుతులనుగ్రహింపక పురాణములలోని వాక్య ముల నుదాహరించెను 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అనుసూత్ర మునకును, "జన్మాద్యస్యయతః" అను సూత్రమునకును మూల భూతమగు "యతోవాఇమానిభూతాని" అను తైత్తిరీయ శ్రుతిని దెలిసియుండియు "జన్మాద్యస్యయతః" అను సూత్ర ముక్రింద—

"ఉత్పత్తిస్థితిసంహారానియతిర్జ్ఞానమావృతిః ।
బంధమోక్షౌచపురుషాత్ యస్మాత్సహరిరేకరాట్ ॥"

అను స్కాందవచనము నుదాహరించి పిమ్మట "యతో వా ఇమాని" అను శ్రుతిసందర్భమును నుదాహరించెను. అటులనైనను సంహారశబ్దముచే యుప్రతీతిని గలుగజేయుఁగా.

అథాతో బ్రహ్మజిజ్ఞాసా యను సూత్రసందర్భమున 'బ్రహ్మశబ్దశ్చ విష్ణావేవ' యని మధ్వాచార్యులు చెప్పెను అనగా "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రమందలి బ్రహ్మశబ్దమునకు విష్ణువనియే తాత్పర్యమని యభిప్రాయముగదా !

"జన్మాద్యస్యయతః" అను సూత్రముచే బ్రహ్మకు లక్షణము నిర్వచింపబడి బ్రహ్మశబ్దమునకు వెలియనగు యర్థాంతరములు త్రోసివేయబడుచుండ, భృగువల్లియందు వినబడని విష్ణుశబ్దము బ్రహ్మశబ్దమునకు పర్యాయపదమెట్లగును? భృగువల్లియందు జగజ్జన్మాదికారణము బ్రహ్మమని తటస్థలక్షణముగను ఆనందము స్వరూపలక్షణముగను నుపదేశింపబడియున్నది. కనుక తటస్థస్వరూపలక్షణములచే బ్రహ్మ జిజ్ఞాస్యమని బ్రహ్మజిజ్ఞాసస్వయమని యుపదేశింపబడుచున్నది. అందు విష్ణువుయొక్కగాని శివునియొక్కగాని వేఱొకదాని యొక్కగాని ప్రసక్తి యించుకంతయు గానరాదు. అట్టి విషయమున "బ్రహ్మశబ్దశ్చ విష్ణావేవ" అనియు "విష్ణురేవ విజిజ్ఞాస్యః సర్వకర్తాఽఽగమోదితః" అనియు, వెలువడు మాధ్వసూక్తులు శ్రుతిస్మృతి ప్రమాణవిరుద్ధములై యున్మత్త ప్రలాపము లెట్లుగాకుండును? ఎచ్చటనైన నొక ప్రకరణమున విష్ణుశబ్దము వినబడి యచట బ్రహ్మలక్షణము వినవచ్చినచో నావిష్ణుశబ్దము బ్రహ్మపరమని చెప్పనొప్పునేమో గాని సర్వవేదాంతముల

కును బరమ తాత్పర్యమగు బ్రహ్మమును బురాణములందు వర్ణింపబడిన విష్ణువని రూఢిగ బల్కుట హాస్యాస్పదము. ఇట్టి కువ్యాఖ్యానముచే నిరువదియొక వ్యాఖ్యానముల యొక్క దోషము పరిహృతమయ్యెనట! ఆహా!! ఏమి యీ యున్మత్తప్రలాపము!!! ఈ మధ్వులకు ప్రలాపతుండ మునకు నష్టులేదుగదా!

"శాస్త్రయోనిత్వాత్" అను సూత్రము బ్రహ్మ సర్వజ్ఞుడగు జ్ఞానస్వరూపుడనుటకు బుట్టినది. దీనికి ఋగ్వేదాది సర్వశాస్త్రములకు బ్రహ్మ కారణమని "అస్యమహతోభూతస్య నిశ్వసితమే తద్యదృగ్వేదః........" అను శ్రుతి మూలముగా గ్రహించి శంకరులవారు వేఱొక యర్థమునుగూడ చెప్పియుండిరి. మధ్వరాయలీ రెండవ యర్థమును గ్రహింపలేక, శంకరభాష్యము తప్పని చెప్పుచు వారి యర్థమును ఖండింపకుండ దాటుట వీరియొక్క దొంగతనమును నశక్తదుర్జనత్వమును దెలుపుచున్నది.

బ్రహ్మసూత్రములందు బరమపవిత్రములుగా నెన్నబడుచున్న మొదటి మూడుసూత్రములకు నీతీరున యసందర్భములతో జిత్రించిన యీ మధ్వయొక్క వ్యాఖ్యాశోభ యెట్లు నెలుంగుచున్నదో యొకపరి ప్రాజ్ఞులు తిలకింపుడు?

# VII

శ్రీవారు తమ సప్తమోపన్యాసమునందు మధ్వరాయలచే రచింపబడిన గీతావృత్తియందలి యాభాసతను వెల్లడి చేసియుండిరి.

భగవద్గీతయందలి యొకటవ యధ్యాయ ముపోద్ఘాత మగను, రెండవ యధ్యాయము మూలగ్రంథముగను మిగిలిన పదునా అధ్యాయములు తద్వ్యాఖ్యానములుగను నలరారుచున్నవి.

రెండవ యధ్యాయములో—

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయో రపి దృష్టోఽన్తస్త్వ నయో స్తత్వ దర్శిభిః॥"

అనునది గీతయందలి ప్రధానతమమగు గీతము. రెండవ యధ్యాయములో బాగుగా విచారింపవలసిన గీతములగు "అవినాశితు తద్విద్ధియేన సర్వమిదంతతమ్ । వినాశమవ్యయస్యాస్య నకశ్చిత్కర్తుమర్హతి" యనుదానికిని,—

నత్వేవాహంజాతునాసం నత్వం నేమే జనాధిపాః।
నచైవ నభవిష్యామః సర్వేవయమతః పరమ్ ॥

అనుదానికిని మధ్వారాయలు సరియగు వ్యాఖ్యానము చేయలేదు. ఏలయన— "యేన సర్వమిదంతతం" అనునది జీవనానాత్వము నంగీకరించు తన సిద్ధాన్తమునకు భంగమును గలిగించును. కనుక ముఖ్యములగు నీశ్లోకములను వదలి వ్యావహారిక భేదానువాదక ములగు "ద్వావిమౌ పురుషౌ లోకే" అను మొదలగు గీతములనే తన ప్రకరణములందుదాహరించి యుండెను. అంతియగాని తత్త్వమును బోధించు గీతముల నాతడు గ్రహింపలేదు.

రైరి. దానంజేసి జయతీర్థుడు వాదావళియను గ్రంథమున్వ్రాసె వ్యాసతీర్థుడు భేదోజ్జీవనమను గ్రంథమును వ్రాసి యెట్లో కాలగి మును గడపిరి.

ఈ స్వతంత్రగ్రంథములు కూడ మధ్వమతమునకు గౌర వమును సంపాదింపవాయెను. దానంజేసి యధునాతనుడగు వ్యాసతీర్థుడు స్వీయమతమును వదలి యెద్దియోని యొక తీరున జగత్సత్యత్వజీవేశ్వర భేదములను నిర్వహింపవలయునని గంగేశ తర్కము నాశ్రయించి న్యాయామృతమనుదానిని రచియించె. ఇయ్యది మధ్వమతమునకు బుష్కల మరణమని ప్రాజ్ఞులు గ్రహింపగలరు. మధ్వదశప్రకరణములు బ్రహ్మసూత్రవృత్తి గీతావృత్తి మొదలగు గ్రంథములు త్రోసివేయబడిగంగేశ తర్కము శరణుపొందబడినది.

గంగేశోపాధ్యాయ తర్కమన్ననో కేవలన్యాయము గాదు. కేవల వైశేషికమునుగాదు. ఉభయ సాంకర్యరూప మగు నూతన మార్గము. అయ్యదియే ప్రకృతమున తర్కమని యందఱచే నభ్యసింపబడుచున్నది. గంగేశోపాధ్యాయతర్క మును తమ కాధారముగా గైకొనుటచే నీవ్యాసతీర్థుడు మొ దలగు మాధ్వులు ఈశ్వర తాటస్థ్యమును బరమాణు కారణవాద మును ప్రధానముగా జేసికొనవలయునుగదా! దానంజేసి విష్ణు కర్తృత్వము ప్రకృతియొక్క యుపాదాన కారణత్వమును సర్వ విధముల ద్యజించినవారలే యగుచున్నారు. కావున వీరలు మధ్వమతమునుండి ప్రచ్యుతి జెందినవారని సుస్పష్టముగ జె ప్పవచ్చును. ఇక మధ్వమతమున వీరికి మిగిలిన దేమనగా—

విష్ణునామము, తప్తచక్రాద్యంకనము. గోపీచందనలిప్తముద్రా
ధారణము, యేకాదశీశ్రాద్ధవర్జనము; ద్వాదశీపారణము అను
నవియే తావన్మాత్రముచే వీరిని మధ్వలనిన ననవచ్చును. కాని
వీరిది మధ్వమత సిద్ధాన్త మెంతమాత్రముగాదు. పోనీ, గంగే
శోపాధ్యాయ తర్కమేల యుపాదేయము కాదందుమా, గుణ
పరిభాషయు బరిమాణుకారణ వాదమును న్యాయోక్తములును
దుర్యుక్తియుక్తములును, వేదవిరుద్ధములును, శిష్టాపరిగృహీత
ములు నగుటచే సర్వదా హేయములని బ్రహ్మసూత్రకారులచే
శాసింపబడినది. కావున గంగేశోపాధ్యాయుని తర్కమునా
శ్రయించిన మధ్వలకు "భక్షితేఽపి లశునే న రోగశాంతి"
యను లోకోక్తి ననుసరించి వైదికత్వము కల్లయే యగుటచే నీ
మధ్వలు అవైదికులే యగుచున్నారు.

# IX

శ్రీవారు తమ తొమ్మిదవ యుపన్యాసమునందు
పంచరాత్రమును గురించి మధ్వచరిత్రమును గుఱిం
చియు బోధించియుండిరి.

మధ్వాచార్యులు తన మతమునకు పంచరాత్రము ముఖ్య
ప్రమాణమని "వేదపంచరాత్రయోరైక్యాభిప్రాయేణ పంచ
రాత్రస్యైవ ప్రామాణ్యముక్తమ్"అని చెప్పియున్నాడు. పాంచ
రాత్రతంత్రము ననుసరించి విధింపబడిన ప్రతిష్ఠాకల్పమునందు వై
దికమంత్రము లుండవు. అయ్యది కేవలము తాంత్రికమే. పంచ

రాత్రము వేదానధికారుల నుద్దేశించి వ్రాయబడిన దనుటకు నిది బలవత్తరమగు ప్రమాణము. దానిని బ్రమాణముగా గ్రహించినవారు అవైదికులని వేఱ చెప్పనలయునా ?

పంచరాత్రమైనను శ్రీవైష్ణవులకేపున్కలమగు ప్రమాణము. మధ్వాచారమున కయ్యది యొంతమాత్రము ప్రమాణము గానేరదు. అది చక్రతాపనమునకు మాత్రము వీరికి గొంత ప్రమాణము కానోపునేమో? కాని యందును నైను ముద్రలు కాల్చుకొనుటకు నాధారము లేదు. గోపీ ముద్రలకే గతి గన్పడును. దీనివలన "భక్షితేపిలశునేనరోగశ్శాంతిః" అనునది వీరిపట్ల పట్టును. మధ్వుల సిద్ధాన్తమునకుసందేమియు నాధారము లేదు. సాంఖ్యయోగన్యాయవైశేషిక దర్శనానుయాయులందఱును భిన్నభిన్నములగు సిద్ధాన్తములు గలవారైనను వారియాచరణము మాత్రము వైదికాచరణము. మధ్వులన్ననో వైదికాచారములను వీడిరి. వేదవిరుద్ధమగు కొన్ని యాచారములను గల్పించుకొనిరి. వీరికిక వైదికత్వము సిద్ధించుటెట్లు? పంచరాత్రమంతయు నద్వైతసిద్ధాన్తమే యున్నది. దానియందు జీవబ్రహ్మల యేకత్వము, జగన్మిథ్యాత్వము బ్రహ్మసత్యత్వము మున్నగు విషయములు సంపూర్ణముగ జెప్పబడినవి. కనుక "కాకమాంసంశునోచ్ఛిష్టం స్వల్పం తదపిదుర్లభమ్" అను తీరున బంచరాత్రము మధ్వులకు నేరీతినైన ప్రమాణముగాక యేకారణము చేతనో నెవ్వరో గాల్చిన గాల్పులకు నొకింత గతియగుచున్నది.

# మధ్వాచార్య చరిత్ర

మధ్వాచార్యచరితము సౌరపురాణమున వర్ణితమైయున్నది. అందు వితంతువగు బ్రాహ్మణస్త్రీయందు బాపియగు వేఱొక బ్రాహ్మణునిచే జన్మ నందెననియు గురువును వంచించి విద్యాభ్యాసమొనర్చి గురువునకు యథార్థము తెలియబడగా గురు శాపహతుడాయెననియు, దెలియుచున్నది. ఆ శాపమువలన మధ్వాచార్యునికి వేదాంత సిద్ధాన్తములకు బూర్వపక్షమేగాని సిద్ధాన్తము తెలియకుండెనని యంనగలదు. మధ్వాచార్యుని గ్రంథములను జూచిన వారు ఆతడా పూర్వపక్షములనైన సరిగా గ్రహింపలేదని తెలిసికొనగలరు. "యాదృశీభావనాయత్రసిద్ధిర్భవతి తాదృశీ" అన్నట్లు మధ్వాచార్యులు ఇట్టిదౌర్భాగ్య జన్మభావితాంతరంగుడై తోకతెగిన నక్కవలె తాజెడి యితరులనుగూడ జెఱచి వారలనందఱ నిహపరములకు దూరులుగాజేసెను.

కర్ణాపిధాయ, తచ్ఛ్రుత్వా శాంతం పాపం శ్రీరీర్యతామ్॥
కథాపిఖలుపాపానాం అలమశ్రేయసే యతః॥
శాంతం పాపం, శాంతం పాపం, శాంతం పాపమ్॥

ఓం తత్సత్.

